# శుకసప్తతి

పాలవేకరి కదిరీపతి ప్రణీతము

పరిష్కర్త

డా॥ బి. రామరాజు




ప్రచురణ

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

కళాభవన్ - సైఫాబాదు

హైదరాబాదు 4

# తొలిపలుకు

ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమీ తెలుగు భాషలోని ప్రాచీన సాహిత్యము అందరికి అందుబాటులో నుండునట్లుగా ముద్రించి ప్రకటించవలెనని నిశ్చయించినది. చాలాకాలము క్రింద ప్రాచీనాంధ్ర గ్రంథములు ముద్రితమై, నేడు పాఠకులకు సరసమైన ధరకు లభించుటలేదు. ఈలోటు తీర్చవలెనని అకాడమి ఉద్దేశము—

అట్టి గ్రంథములలో ప్రబోధచంద్రోదయము వరాహపురాణములను సాహిత్యఅకాడమీ ఇటీవల ముద్రించి ప్రకటించినది. ప్రస్తుతము పాలవేకరి కదిరీపతి రచించిన శుకసప్తతి ముద్రించి అకాడమీ ఆంధ్రమహాజనుల కందించుచున్నది.

ఈ గ్రంథమునకు సంపాదకత్వము వహించిన డాక్టర్. బి. రామరాజు గారికి అకాడమీ పక్షాన ధన్యవాదములు.

హైద్రాబాదు.
20-1-1979.

దేవులపల్లి రామానుజరావు.
కార్యదర్శి.

# విషయసూచిక


| | | |
|---|---|---|
| చిలుక పలుకులు | | xxxxviii |
| **ప్రథమాశ్వాసము** | | **1-118** |
| కృత్యాది | | 1-22 |
| కథా ప్రారంభము | | 22-36 |
| 1. రాత్రి | | 36-41 |
| 2. రాత్రి | మొదటి కథ | 41-50 |
| 3. రాత్రి | | 50-55 |
| 4. రాత్రి | రెండవ కథ | 55-71 |
| 5. రాత్రి | | 72-75 |
| 6. రాత్రి | | 75-78 |
| 7. రాత్రి | మూఁడవ కథ | 79-95 |
| 8. రాత్రి | [illegible] | 95-106 |
| 9. రాత్రి | | 106-110 |
| 10. రాత్రి | అయిదవ కథ | 110-118 |
| **ద్వితీయాశ్వాసము** | | **119-239** |
| 11. రాత్రి | ఆఱవ కథ | 119-130 |
| 12. రాత్రి | ఏడవ కథ | 130-139 |
| 13. రాత్రి | ఎనిమిదవ కథ | 139-147 |
| 14. రాత్రి | తొమ్మిదవ కథ | 147-158 |
| 15. రాత్రి | పదియవ కథ | 158-165 |
| 16. రాత్రి | పదునొకండవ కథ | 165-171 |
| 17. రాత్రి | | 171-178 |

| | | | |
|---|---|---|---|
| 18. రాత్రి | | | 178-182 |
| 19. రాత్రి | పన్రెండవ కథ | | 182-188 |
| 20. రాత్రి | పదుమూఁడవ కథ | | 188-197 |
| 21. రాత్రి | పదునాలుగవ కథ | | 197-219 |
| 22. రాత్రి | పదునైదవ కథ | | 219-228 |
| 23. రాత్రి | పదాఱవ కథ | | 229-239 |
| **తృతీయాశ్వాసము** | | | **240-369** |
| 24. రాత్రి | పదునేడవ కథ | | 240-250 |
| 25. రాత్రి | | | 251-254 |
| 26. రాత్రి | | | 255-261 |
| 27. రాత్రి | పదునెనిమిదవ కథ | | 261-272 |
| 28. రాత్రి | పందొమ్మిదవ కథ | | 273-285 |
| 29. రాత్రి | ఇరువదియవ కథ | | 286-288 |
| 30. రాత్రి | | మొదటి యుపకథ | 288-297 |
| 31. రాత్రి | | రెండవ యుపకథ | 297-303 |
| 32. రాత్రి | | మూఁడవ యుపకథ | 303-308 |
| 33. రాత్రి | | నాలుగవ యుపకథ | 308-315 |
| 34. రాత్రి | | అయిదవ యుపకథ | 315-326 |
| 35. రాత్రి | | ఆఱవ యుపకథ | 326-335 |
| 36. రాత్రి | | ఏడవ యుపకథ | 335-342 |
| 37. రాత్రి | | ఎనిమిదవ యుపకథ | 343-350 |
| 38. రాత్రి | | | 350-355 |
| 439. రాత్రి | | | 356-360 |
| 0. రాత్రి | | | 361-365 |
| 41. రాత్రి | | | 365-368 |

42. రాత్రి తొమ్మిదవ యుపకథ 368-382

**చతుర్థాశ్వాసము 370-440**

43. రాత్రి 382-387

44. రాత్రి ఇరువదియొకటవ కథ 387-390

45. రాత్రి ఇరువదిరెండవ కథ 390-398

46 రాత్రి ఇరువదిమూఁడవ కథ 398-406

47. రాత్రి 406-414

48. రాత్రి 414-416

49. రాత్రి ఇరువదినాలుగవ కథ 416-421

50. రాత్రి ఇరువదియైదవ కథ 421-428

51. రాత్రి ఇరువదియాఱవ కథ 428-432

52. రాత్రి ఇరువదియేడవ కథ 432-435

53. రాత్రి 435-440

**అనుబంధము - సవరణలు** i - iv

# చిలుక పలుకులు

మనసుకు అనుభూతి బుద్ధికి ఊహ తోడై అభివ్యక్తికి శక్తి చాలిననాడే కవిత్వమూ కథా పుట్టి ఉంటవి. కవిత్వం ముందా కథ ముందా అంటే కవిత్వమే ముందు పుట్టి ఉంటుందనుకోవచ్చు. శ్రోత లేకున్నా పుట్టగలిగేది కవిత్వం శ్రోత ఉంటేనే పుట్టేవి కథ - కనుక ఈరెంటిలో పుట్టుక విషయమై కవిత్వానికి సిరి, కథకు చుక్క. కవిత్వం ఆదం; కథ హవ్వా. కాని ప్రచారంలో అభివృద్ధిలో కథకే కోటికి పడగ. ఏదేశంలో ఏజాతిలో కవిత్వం ముందుగా పుట్టిఉంటుంది అనే విషయమై వాదోపవాదాలు అంతగా లేవు. కాని కథావిషయమై చాలా ఉన్నవి. ముందు పుట్టిన చెవులకంటె వెనుక పుట్టిన కొమ్ములు వాడి అన్నట్లు కథయొక్క పుట్టుక వ్యాప్తి ప్రసారప్రచారాల గురించి 19వ శతాబ్దం మధ్య భాగంనుండే ఈవాదోపవాదాలు ప్రారంభమైనవి. గ్రిమ్ సోదరులు ఇండో యూరోపియన్ భాషాకథలు అత్యంతప్రాచీనమైన వన్నారు. మాక్సుముల్లర్, బెన్ఫే, కాస్కిన్ ప్రభృతులు కథలకు కాణాచి భారతదేశమని భావిస్తే అండ్రూలాంగ్ గ్రీసుదేశమని భావించినాడు. ఇ.పి.టైలర్ భిన్నదేశాల్లో సమానంగా ఆలోచించే వాళ్ళు ఉండవచ్చును కనుక ఒకేతీరు కథలు భిన్నదేశాల్లో ఏకకాలంలో గాని భిన్న కాలాల్లో గాని పుట్టవచ్చు నన్నాడు. ఈ వాదోపవాదాల కేమిగాని మన వేదాల్లోనే కథాబీజా లుండటంవలన, ఉపనిషత్తుల్లో చక్కటి కథలే ఉండటంవలన ప్రపంచ కథావాఙ్మయరంగంలో భారతదేశానికి అగ్రస్థాన మున్నదని గర్వించవచ్చు.

కథలు రెండు తీరులు; 1. లిఖితసాహిత్యానికి సంబంధించినవి, 2. మౌఖిక (జానపద) సాహిత్యానికి సంబంధించినవి. రెండింటి లక్షణాలు వేరు వేరైనా లిఖితసాహిత్యానికి చెందిన కొన్ని కథలు జానపదుల చెవి కెక్కినట్లే మౌఖికసాహిత్యానికి చెందిన కథలు కూడ రచయితల చేతుల్లో పడినవి. ఈ విధంగా చాలా ప్రాచీనకాలంనుండే ఈ రెండు సంప్రదాయాలు వేరువేరుగా ఉంటున్నా ఒకదాని ప్రభావం మరొకదానిపై ఉండనే ఉన్నది.

భారతీయలౌకికసంస్కృతవాఙ్మయంలో అత్యంతప్రాచీనమైన కథా సంగ్రహం మన సాతవాహనుల కాలంలో ఉండిన గుణాఢ్యుని బృహత్కథ. అది పైశాచీప్రాకృతంలో ఉండేదట. కాని చాలాకాలం క్రిందనే అది కాలగర్భంలో కలిసి పోయింది. దాని ప్రశస్తిని బాణభట్టు "సముద్దీపితకందర్పా కృతగౌరీ ప్రసాధనా, హరలీలేవ నో కస్య విస్మయాయ బృహత్కథా" అని తన హర్ష చరితంలోను, దండిమహాకవి ''భూతభాషామయీం ప్రాహురద్భుతార్థాం బృహత్కథామ్''అని తన కావ్యాదర్శంలోను, సుబంధుడు''బృహత్కథాలంబైరివ సాలభంజికా నివహైః'' అని తన వాసవదత్తలోను, త్రివిక్రమభట్టు ''ధనుషేవ గుణాఢ్యేన నిఃశేషో రంజితో జనః'' అని తన నలచంపువులోను, ధనంజయుడు ''రామాయణాది చ విభావ్య బృహత్కథాం చ'' అని తన దశరూపకం లోను, గోవర్ధనాచార్యుడు ''శ్రీరామాయణబృహత్కథానాం కవీన్ నమస్కుర్మః, త్రిస్రోతా ఇవ సరసా సరస్వతీ స్ఫురతి యైర్భిన్నా, అతిదీర్ఘజీవి దోషాత్ వ్యాసేన యశోఽపహారితం హన్త, కైర్నోచ్యేత గుణాఢ్యః స ఏవ జన్మాన్తరాపన్నః'' అని తన ఆర్యాసప్తశతిలోను గొప్పగా చాటినారు. కంబోడియా 9వశో శతాబ్దానికి చెందిన ఒక శిలాశాసనంలో

''పారదస్థిరకల్యాణో గుణాఢ్యః ప్రాకృతప్రియః,
అనీతిర్యో విశాలాక్షః శూరో న్యకృతభీమకః.''

అని గుణాఢ్యుని గూర్చి ఉన్నది.

ఇంత ప్రశస్తి కెక్కిన గుణాఢ్యుని బృహత్కథ పద్యమయమో గద్య మయమో ఇదమిత్థంగా తెలియదు. కాశ్మీరానువాదాన్ని బట్టి పద్యమయంగా ఉండే దని అనుమానించటానికి వీలున్నా దండి కావ్యాదర్శాన్ని బట్టి గద్యమయమనే తోచుతున్నది. తరువాత కాలాన సంస్కృతంలో వెలువడిన సంగ్రహబృహత్కథ లన్నీ పద్యకృతులే. సంగ్రహబృహత్కథల్లో మొదటిది బుధస్వామి రచించిన బృహత్కథాశ్లోకసంగ్రహం, రెండోది క్షేమేంద్రుడు రచించిన బృహత్కథా మంజరి, మూడోది సోమదేవుడు రచించిన కథాసరిత్సాగరం.

బృహత్కథ తరువాత పేర్కొదగినది అవదానశతకం. ఇందులో సాహస కార్యాలను వర్ణించే నూరు కథ లున్నవి. ఇది మూడో శతాబ్దం మధ్యలో చీనా

భాషలోనికి అనూదితం కావటంచేత అంతకు పూర్వమే రచింపబడినట్లు భావించాలె. అటుతరువాత ఎన్నదగినది ఆర్యశూరుని జాతకమాల. ఇందులో బోధిసత్త్వుని జీవితానికి సంబంధించిన గాథ లున్నవి. నాలుగో శతాబ్దంలో వెలువడిన ఈకృతి ఐదో శతాబ్దం పూర్వభాగంలో చీనాభాషలోనికి అనూదితమైనది. ప్రపంచ భాషలన్నింటిలోనికి అనువదింపబడిన విష్ణుశర్మకృత పంచతంత్రం ఐదో శతాబ్దానికి చెందిన దంటారు. నారాయణకవికృతహితోపదేశం పంచతంత్రాన్ని అనుసరించినదే. ఈ రెండింటిలో ఉన్న పశుపక్ష్యాదుల కట్టుకథలు శిల్పాని కెక్కటం వీటి ప్రాచుర్యానికి కారణం. పంచతంత్రం ఆరో శతాబ్దం నాటికే పహ్లవీభాషలోనికి అనువదింపబడినది. ఈకథలకు మూలం కథాసరిత్సాగరమే. భారతీయభాష లన్నింటిలో అనువదింపబడిన బేతాళపంచవింశతి 25కథల సంపుటం ఎప్పటి రచనమో సరిగా తెలియదు. దీని మూలాలు బృహత్కథా మంజరీ, కథాసరిత్సాగరాల్లో ఉన్నవి. శివదాసు, జంభలదత్తు, వల్లభదేవుడు, పేరుతెలియని మరోకవి రచించిన వేరువేరు బేతాళపంచవింశతికలు సంస్కృతంలో ఉన్నవి. 32 కథల సంగ్రహమైన సింహాసనద్వాత్రింశిక కూడ క్షేమంకరుని పేరుతోను, వరరుచి పేరుతోను రెండు రచనలుగా కానవస్తున్నది. దీనికే దక్షిణభారతంలో విక్రమార్కచరిత్రమని పేరు. శివదాసుని శాలివాహన కథలోను, ఆనందుని మాధవానలకథలోను, జైనకథాకావ్యమైన పంచదండచ్ఛత్ర ప్రబంధంలోను, విక్రమాదిత్యుని వీరోచితగాథ లున్నవి. బల్లాలసేనుని (16వ శతాబ్దం) భోజప్రబంధం అప్రామాణికకథాసంగ్రహ మంటారు. బేతాళ పంచవింశతి రచించిన శివదాసు కథార్ణవమనే 32 కథల సంగ్రహ మొకటి కూర్చినాడు. ఇందులో ధూర్తుల కథలూ, దొంగలకథలూ ఉన్నవి. విద్యాపతి రచించిన పురుషపరీక్ష 44 కథల సంగ్రహం. ప్రబంధచింతామణి ప్రబంధ కోశములలో మనోహరమైన కథ లున్నవి. ఇవి 14వ శతాబ్దపు రచనలు.

భారతదేశంలో పుట్టిన మరో మనోహరమైన కథల సంగ్రహం శుక సప్తతి. ఇందులో చిలుక 70 రాత్రుల్లో చెప్పిన 70 కథలున్నవి. వీటిలో అధిక భాగం శృంగారకథలు. శుకసప్తతి రచన ఎప్పుడు జరిగిందో సరిగా తెలియదు కాని హేమచంద్రుడు (1088-1172) దీని ప్రస్తావన చేయటంవలన ఇది పదో శతాబ్దానికి ముందే రచింపబడి ఉంటుందని భావించవచ్చు. సంస్కృతంలో

శుకసప్తతికి మూడు తీరుల పాఠాలున్నాయట. ఒకటి చింతామణిభట్టకృతమైన విపుల గ్రంథం కావ్యశైలీవిలసితం. రెండోది పేరుతెలియని శ్వేతాంబర జైనుని రచనం సంక్షిప్తమూ సాధారణమూ ఐన గ్రంథం మూడోది పురుషోత్తమదేవుని పుత్రుడైన దేవదత్తుని రచన. ఈమూడింటికీ మూలం అత్యంతప్రాచీనమైన ప్రాకృత శుకసప్తతి కథా సంగ్రహం ఏదో ఉండవలెనని పరిశోధకుల ఊహ. పంచతంత్రం వలెనే శుక సప్తతి కూడా శతాబ్దాలకు పూర్వమే విదేశాల్లో ప్రచారం పొందింది. 14వ శతాబ్ది పూర్వార్ధం నాటికే రెండుసార్లు 18వ శతాబ్దంలో మరోసారి పారసీభాష లోనికి అనూదిత మైనదట. 15వ శతాబ్దంలో తుర్కీభాషలోనికి వెళ్ళింది. పార్సీ నుండి ఇందులోని చాలా కథలు పాశ్చాత్యభాషల్లోనికి ప్రవేశించినట్లు ఏ.బి. కీతు, మాడభూషి కృష్ణమాచార్యుల కథనం. ఇరాన్ దేశంలోనేకాక భారతదేశంలో కూడ దీని పారసీ అనువాదం ఒకటి జరిగినది. అక్బరుచక్రవర్తి మంత్రియైన అబుల్‌ఫజల్ కూడ ఒక పారసీ అనువాదం చేసినాడట. అబ్దుల్లా ఖుతుబ్షా కాలపు గవ్వాసీకవి, 19వ శతాబ్దంలో సయ్యద్ హైదర్‌బక్ష్ అనేవాడూ ఉర్దూ భాషలోనికి అనువదించినారట శుకసప్తతి భారతీయభాష లన్నింటిలోనికీ అనువదింపబడినట్లున్నది.

కెళది బసవప్పI నాయకుని(1697-1780)వద్ద మంత్రిగా ఉండిన శరజా నాగప్పయ్య భామినీషట్పదుల్లో శుకసప్తతిని కన్నడంలోనికి అనువదించినాడు. దానిని శ్రీ. కె. వెంకటరాయాచార్యులుగారు సంపాదించి ప్రకటించినారు. ఆ గ్రంథానికి "శుకసప్తతియ ఎరడు ముఖగళు" అనే మున్నుడి వ్రాసిన సా. శి. మరుళయ్యగారు శుకసప్తతికి ఉత్తరభారతపాఠం దక్షిణభారతపాఠం వేరువేరుగా ఉన్నాయనీ, ఉత్తరభారతపాఠం శృంగారశుకసప్తతి అనీ దక్షిణ భారతపాఠం వేదాంతశుకసప్తతి లేదా దినాలాపనికా శుకసప్తతి అనీ, ఈ రెండింటిలో చిలుక చెప్పిన డెబ్బది కథలే ఉన్నా ఈరెండిటికీ సామ్యంకంటె వైషమ్యమే ఎక్కువనీ పేర్కొన్నారు. ఈరెండు తీరుల శుకసప్తతుల మంచి సెబ్బరలూ ఈవిధంగా బేరీజు వేసినారు.

శృంగారశుకసప్తతిలో అన్నీ 1. చిన్న చిన్నకథలు 2. వీనిలోకామశృంగారమే ఎక్కువ. 3. చమత్కారప్రదర్శనానికి ప్రాధాన్యం ఉన్నది. 4. ఒకటో రెండో తప్ప తక్కిన కథలన్నీ కవి స్వకపోలకల్పితాలు 5. ఇది బుద్ధిప్రధానకృతి

6.ఇందులో చెప్పేది మంచి నీతియే కాని ఆచరణం భిన్నం7.దీని అవతారిక ఈ విధంగా ఉంటుంది :- హరిదత్తుడనే శ్రేష్ఠికి మదనవినోదుడనే కొడుకు. వాడు కామచారి. తన కొడుకు కుమార్గవర్తనుడైనందుకు హరిదత్తుడు దుఃఖిస్తుంటే ఒకనాడు అతని స్నేహితుడు త్రివిక్రముడనే బ్రాహ్మణుడు తనవద్ద ఉన్న చిలుకనూ దానిపత్ని గోరువంకనూ ఆసెట్టి కిచ్చి వీటిమూలంగా నీకు మేలు కలుగుతుందంటాడు. సెట్టి ఆపిట్టలను సాకే భారం మదనవినోదునికి అప్పగిస్తాడు. ఒకనాడాచిలుక మదనవినోదునికి తండ్రిమాట వినక చెడిపోయిన ఒకానొక యువకుని వృత్తాంతం చెప్పి ధర్మవ్యాధుని ఉపదేశంచేత వాడేవిధంగా సన్మార్గానికి వచ్చిందీ - ఆకథంతా వినిపిస్తుంది. మదనవినోదుడు బుద్ధి తెచ్చుకొని తన భార్య ప్రభావతిని ఏలుకుంటూ తల్లిదండ్రుల సేవ చేస్తూ వ్యాపారంలో బాగా అభివృద్ధి సాధిస్తాడు. ఒకసారి వ్యాపారార్థమై దేశాంతరం పోతూ మదనవినోదుడు ఆపిట్టలను ప్రభావతికి అప్పగిస్తాడు. ప్రభావతి కొన్నాళ్ళు విప్రలంభాన్ని సహించినా స్వైరిణీజనప్రేరణంతో పరపురుషసంగమానికి బయలుదేరుతుంది. అది గమనించిన గోరువంక హితోపదేశం చేస్తుంది. ప్రభావతి కోపంతో ఆగోరువంకను చంపటానికి ప్రయత్నిస్తే అది తప్పించుకొని ఎగిరిపోతుంది. ఇదంతా గమనిస్తున్న చిలుక తనకూ అదే గతి పడుతుందనే భయంతో, ప్రత్యక్షంగా హితోపదేశం చేయక, ఆమెను ప్రోత్సహిస్తున్నట్లే మాటలపందిరి అల్లి సమస్యలో శాస్త్రిలో చెప్పి వాటిని తానే విడదీసి శృంగారకథలు చెప్పుతూ తెల్లవారజేస్తుంది. ఈవిధంగా డెబ్బది రాత్రులూ వింతవింత కథలు చెప్పి ప్రభావతిని కాలు జార నీయకుండా కాపాడుతుంది. ఈలోగా ప్రభావతి భర్త మదనసేనుడు దేశాంతరం నుండి తిరిగి వస్తాడు. 8.ఇందులో చిలుక చెప్పిన చాలాకథలు నీతిబాహ్యమైనవే. కామప్రచోదనానికి కావలసిన ఆహారం వీటిలో పుష్కలంగా ఉన్నది. ఈ కథలన్నీ డెకెమరాన్ కథలవంటివే.

ఇక వేదాంతశుకసప్తతిలోని కథలు 1. దీర్ఘమైనవి 2. వీనిలో ధార్మిక ప్రేమ సాక్షాత్కరిస్తుంది. 3. దైవీప్రేమ ప్రదర్శితమైనది. 4. ఇందులోనివి చాలావరకు పురాణాల్లోని పుణ్యకథలు 5. ఇది ధర్మప్రధానమైన కావ్యం 6. ఇందులో చెప్పేదీ చేసేదీ ఒకటే. 7 దీని అవతారిక పురాణపద్ధతిలో ఈవిధంగా ఉంటుంది;- ఇంద్రుడు సుఖంగా రాజ్యం చేస్తూ ఒకనాడు తత్త్వసారం తెలుసుకొనే

కుతూహలంతో నారదుణ్ణి ప్రశ్నిస్తాడు. తత్త్వసారమెరిగినవాడు చెప్పగలవాడు. శుక మహర్షి ఒక్కడే అని నారదుడంటాడు. ఆసభలో ఉన్న అగ్ని ఆమాటను కాదంటాడు. సత్యం పరీక్షించటానికై అగ్నిదేవుడు వహ్నిరాజుగా, ఇంద్రుడు దేవదాసు అనే భృత్యుడుగా, శచీదేవి ఆభృత్యుని పత్నిగా భూలోకంలో అవతరిస్తారు వసిష్ఠుని ఆదేశం ప్రకారం శుకమహర్షి శుకంగా అవతరిస్తాడు వహ్నిరాజు దేవదాసు భార్యను మోహించి ఆమెభర్త దేవదాసును ఒక నెపంతో సప్తసముద్రాల కావల చంద్రికాగిరిలో ఉండే విష్ణుపూజార్థం పంపిస్తాడు. శుభంగా పోయి జయప్రదంగా తిరిగి రమ్మని చిలుక దేవదాసుకు తన ఈకలు ఇస్తుంది. దేవదాసు పోగానే వహ్నిరాజు దేవదాసుభార్యను అనుభవించటానికి యత్నిస్తాడు. ఆప్రయత్నం అరికట్టటానికై చిలుక వహ్నిరాజుకు డెబ్బదిరాత్రులూ పుణ్యకథలు చెప్పి తెల్లవారజేస్తుంది. ఇంతలో దేవదాసు తిరిగి వస్తాడు. 8. చిలుక చెప్పిన కథలన్నింటా పతివ్రతాధర్మా లున్నవి. ఆకథలు కూడా కళాత్మకంగా సాగినవి. నీతిబోధ హితమితంగా అభివ్యక్తమైనది. ఈకథలు వినోదాత్మకాలే కాక ధార్మికములు కూడ.

శ్రీ మరుళయ్యగారు ఈవేదాంతశుకసప్తతి కథల్లోని గొప్పతనాన్ని చాలా విపులంగా 1970 'అర్పణ' పత్రికలో వివరించినారు. కన్నడంలో శరజా నాగప్పయ్య శుకసప్తతితోపాటు చిక్కుపాధ్యాయ (17వ శతాబ్దం నాల్గవపాదం) రచించిన శుకసప్తతీ, ముమ్మడి కృష్ణరాజు (1820 ప్రాంతం) రచించిన శుకసప్తతీ, టి. సుబ్రాయశాస్త్రి రచించిన శుకసప్తతీ ఉన్నవట. ఈశుకసప్తతులన్నీ దాక్షిణాత్యపాఠమైన వేదాంతశుకసప్తతికి అనువాదాలు లేదా అనుసరణలు. వేదాంతశుకసప్తతిని కన్నడిగలు రాజనీతి శుకసప్తతి అంటారు కూడ. రాజుకు నీతి ఉపదేశం చేయటం మూలంగా ఈపేరు వచ్చిఉంటుంది. ఐతే ఇటీవల శృంగార శుకసప్తతి కూడ కన్నడంలో వెలువడింది. ఇది వచనంలో ఉన్నది; రచయిత శ్రీ జోగగారు.

శ్రీ మరుళయ్యగారు పేర్కొన్న దాక్షిణాత్య వేదాంత శుకసప్తతి లిఖితప్రతులు మద్రాసు తంజావూరు తిరుపతి ప్రాచ్యపుస్తకభాండాగారాల్లో ఉన్నవి. దీనిని మోతీలాల్ బనార్సీదాస్ ప్రకటించినట్లు మరుళయ్యగారు పేర్కొన్నారు. కాని అది వేదాంత శుకసప్తతి కాదు. మోతీలాల్ బనార్సీదాస్ ప్రకటించినది (1959)

శృంగార శుకసప్తతి. చౌఖంబావారు కూడ ఈశృంగారశుకసప్తతినే ప్రకటించినారు (1966). దీనికి రమాకాంత త్రిపాఠి సంస్కృతంలోను హిందీలోను వ్యాఖ్యానాలు సంతరించినారు. ఈశృంగారశుకసప్తతి గద్యమయం. ప్రస్తావవశాత్తు అక్కడక్కడా వచ్చే సంస్కృతప్రాకృతశ్లోకాలు మాత్రం స్వల్పంగ ఉన్నవి. దీర్ఘమైన పుణ్యకథలతో ఉన్నదనే దాక్షిణాత్య వేదాంత శుకసప్తతి అనుష్టుప్పుల్లో సాగినట్లున్నది.

మద్రాసు ప్రా. పు. భాండాగారం (xxi సంపుటం డి. నెం. 12212) ప్రతిలోని అవతారికాభాగం ఈవిధంగా ఉన్నది.

సుధర్మాయాం పురా రాజన్ మహేంద్రో దేవతాగణైః ।
ఇమం ప్రశ్నం తదాపృచ్ఛన్నారదం దేవసన్నిధౌ ॥

పరతత్త్వార్థవిల్లోకే తథా తత్ప్రతిబోధకః ।
అస్తి చేత్ పరమం గుహ్యం యథా వక్తుమిహార్హసి ॥

నారదః:-

శుక ఏవోభయం వేత్తి నాన్యం వేద్మి శచీపతే ।
స్వయం తత్త్వార్థవిద్వక్తా పరస్మై బోధితుం క్షమః ॥

తద్వచస్తత్సభామధ్యే వహ్నిః శ్రుత్వా తదాऽబ్రవీత్ ।
స్వయం వేత్తి విరాగీ చ న వక్తా పరబోధకః॥

సర్వ(స్వయం)విత్తత్త్వవిల్లోకే న పరేషాం విచక్షణః ।
సంవాదః సుమహానాసీత్ ఉభయోర్దేవసన్నిధౌ॥

తిరోహితే దేవగణే సేంద్రే విస్మయమాగతే ।
వహ్నిర్భూమండలే రాజా జాతః క్షత్రకులోత్తమే॥

నారదస్సర్వ మాచష్టే శుకాయామితతేజసే ।
తత్ప్రతిబోధార్థ మాచష్టే శుకః షాధజ్ఞమందిరే॥

శుకో భూత్వా పరీక్షార్థం స్వర్ణపంజరమావిశత్ ।
శృణు రాజన్ కథా మేతాం పవిత్రాం పాపనాశినీమ్॥

పురాతనీం పురాణోక్తాం శుకోక్తాం వచ్మి భూభుజే ।
అస్తి భూమండలే రాజా సర్వశాస్త్రార్థత త్త్వవిత్॥

సర్వజ్ఞః కుశలో దక్షో నీతిశాస్త్రార్థపారగః ।
సదా విద్వజ్జనా సేవీ యాయజూకో మహామతిః॥

విష్ణుప్రియకథా సేవీ విష్ణుధ్యానపరాయణః ।
శస్త్రాస్త్రకుశలో ధన్వీ రాజధర్మపరాయణః॥

దుష్టనిగ్రహవా న్నిత్యం శిష్టపాలనకృ త్తథా ।
పరస్త్రీషు పరస్వేషు అంధవత్ పంగువత్ దృఢః॥

ప్రాతః స్నాయీ నిత్యహోమీ భక్తః శివముకుందయోః ।
పరమండలభేత్తా చ పరమర్మప్రభేదనః॥

షడ్గుణేషు ప్రయోక్తా చ తత్సిద్ధిమనుపాలయన్ ।
ప్రాలేయాద్రిసమో ధై ర్యే ధర్మాధర్మసమో నృపః॥

ఏకపత్నీవ్రతో నిత్యం సర్వదా సత్యసంగరః ।
ఏవం పాలయతః పృథ్వీం తస్యాసీత్ భృత్యపుంగవః॥

స్వామికార్యహితాసక్తః సభార్యః ఖడ్గముద్వహన్ ।
ప్రత్యహం రాజసన్మానీ యుద్ధే చాప్యనివర్తితః॥

భృత్యధర్మరతో నిత్యం రాజసేవాపరాయణః ।
నిత్యం రాజ్ఞాప్యనుజ్ఞాతో భుంక్తేన్నం దేవతార్పితమ్॥

ఉత్తిష్ఠే రాజ్ఞి నమ్రస్సన్ తస్మిన్నిచేతి దూరగః ।
భ్రూసంజ్ఞయా తథా కర్మ కుర్వన్నైవ ప్రత్యహం శుచిః॥

అర్ధరాత్రం గృహం గచ్ఛే త్తేన గచ్ఛేత్యనుజ్ఞయా ।
శుక స్తిష్ఠతి తద్గేహే తేన భృత్యేన పోషితః॥

అతీతానాగతాన్ సమ్యక్ వేత్తి జ్ఞానప్రభావతః।
స్వామినం ప్రత్యహం శిక్షన్ గురుః శిష్యం యథా ద్విజః॥

ప్రత్యహం ప్రాతరుత్థాయ పంజరస్థం శుకం సదా।
కరిష్యద్రాజకార్యాణి కుర్వన్ తద్వచనం సదా॥

రాజానం రాజపత్నీం చ గామర్వంతం గురుఘృణిం
నత్వా కృతీ సుఖీ భూయాత్పరివ్రాజం జనార్దనమ్॥

చందనం రోచనం హేమ మృదంగం దర్పణం మణిం
గురుమగ్నిం తథా సూర్యం ప్రాతః పశ్యేత్ ప్రయత్నతః॥

ఇతి విజ్ఞాప్య తస్యాశు రాజద్వార ముపాగతః।
రాజానం ప్రణిపత్యాథ తద్వాక్యమనుపాలయన్॥

తేన యద్యత్సమాదిష్టం కుర్యా త్తత్తత్సమాహితః।
ఏవం వై వర్తమానస్య వత్సరా ద్వాదశా యయుః॥

రాజాఽసౌ చారపురుషైః వేత్తి జానపదోదితం
ప్రతిసంధ్యం స్వరాష్ట్రస్య దూతాన్ సమ్యఙ్నియోజయత్॥

తై ర్వేత్తి సకలం కర్మ సదసచ్చ విచారతః।
అనాచారయుతం మర్త్యం దండయేద్ధర్మమార్గతః॥

సదాచారరతం మర్త్యం పాలయేద్బంధుమానసః।
బ్రాహ్మణం క్షత్రియం వైశ్యం శూద్రం వా పంచమం తథా॥

నారీం వా విధవాం వాపి వర్తధ్వం(?) ధర్మమార్గతః।
యోవా కోవా నరో లోకే వర్తతే ధర్మముత్సృజన్॥

మయా స దండ్యః పాపీయాన్ పుమాన్వా బంధురేవ వా
ఏవం పాలయత స్తస్య ప్రణిధిస్తే పురే తథా॥

రహః ప్రాంజలిరభ్యేత్య రాజానం ప్రాహ సర్వవిత్।
రాజన్ శృణు యథావృత్తం స్వదేశే యన్మయోదితమ్॥

పూర్వయామం సమాశ్రిత్య వినిద్రః పర్యటామ్యహం।
తావత్సమ్యగ్విధాత్రైవ యావత్సూర్యోదయో భవేత్॥

ఏకాకీ గూఢరూపేణ మౌనవ్రతపరాయణః।
గృహే గృహే ఽవలోక్యాశు ప్రత్యహం వర్తయామ్యహమ్॥

తత్ర దృష్టా మయా నారీ దేవదాసస్య వై ప్రియా।
సౌందర్యే కమలాకారా భవానీసదృశా గుణైః॥

శాస్త్రే సరస్వతీతుల్యా పతిపాదార్పితేక్షణా।
సుకేశీ స్నిగ్ధదశనా సుస్తనీ సుముఖీ సతీ॥

మధ్యే క్షామా బృహచ్ఛ్రోణీ నిమ్ననాభీ సుభాషిణీ।
సునాసా సుకపోలా చ బింబోష్ఠీ సజ్జనప్రియా॥

దీర్ఘాక్షీ శ్యామకేశా చ సుకంఠీ యౌవనే స్థితా।
సుపదోరుః సుపాణిశ్చ కలాశాస్త్రవిశారదా॥

మత్తహంసగతిః సమ్యక్ సదా విబుధభాషిణీ।
గృహకర్మరతా నిత్యం పతిభక్తిపరాయణా॥

పత్యౌ గృహాగతే సమ్యక్ పాదప్రక్షాలనాదిభిః।
నాగతే దీనవదనా క్రుద్ధే చ ప్రియవాదినీ॥

భోజనానంతరం తస్య భుంక్తే తద్భోజనార్పితం।
తదగ్రే హసతే నైవ తథా నోపవిశేత్సదా॥

నాపృచ్ఛభాషిణీ తద్వత్ తద్వాక్యం నాతివర్తసి।
పతివ్రతాసు నారీషు అగ్రే సా గణ్యతే జనైః॥

పరార్థం వా పరం మర్త్యం నాపి స్వప్నేఽపి కీర్తయేత్।
గౌరీపూజాఫలా నిత్యం హరిద్రైః కుంకుమాదిభిః॥

అలంకృత్య స్వదేహం సా సర్వదా కంచుకాన్వితా।
శుకం వా వదతే క్వాపి స్వభర్త్రా ఘోషితం ప్రియమ్॥

న దాసీ న చ భృత్యాశ్చ నాన్యస్తత్ర ప్రవర్తతే।
సర్వం తస్యాః ప్రభావేణ జలకాష్ఠాదికం చ యత్॥

తత్సర్వం సహసా ప్రాప్తం పాతివ్రత్యప్రభావతః।
న నిందేత్స్వపతిం క్వాపి నాన్యం పశ్యేత్పరం నరమ్॥

నాటతే పరవేశ్మాని న మిథ్యాభాషణం వదేత్।
న దేహల్యాం న పాదేన నైకాంతేన సదా వసేత్॥

న నిష్ఠురం నాన్యపరం నానృతం చ ప్రభాషతే।
ఏవంప్రభావా సా నారీ తావకేఽత్ర పురే వసేత్॥

శుభం వా హ్యశుభం వాపి యద్యద్దృష్టం మయా శ్రుతం।
తత్సర్వం బ్రూయతే తుభ్యం కోపం మా కర్తుమర్హసి॥

ఘ్రాణైః పశ్యంతి పశవః శాస్త్రైః పశ్యంతి భూసురాః।
చారైః పశ్యంతి రాజానః చక్షుర్భ్యామితరే జనాః॥

యద్దృష్టం గూఢపురుషైః సదసచ్చ యథా శ్రుతం।
తత్సర్వం స్వామినే వాచ్యం అన్యథా పాతకీ భవేత్॥

అతో మయాఽపి తత్సర్వముక్తం దృష్టమవంచనాత్।
ఇతి బ్రువతి చారేఽస్మిన్ గతేఽథ స మహీపతిః॥

విచారం పరమం చక్రే చింతాలోలితమస్తకః।
ఉపాయో ऽత్ర మయా కార్యః కామార్తేన బలీయసా॥

భృత్యం వా హన్మి తత్పత్నీం రమామి పరమార్థతః।
పుత్రం వా భ్రాతరం పత్నీం మాతరం పితరం చ వా॥

యం వా కం వా నృపో హంతి భృత్యాదీన్ కిము ఖల్వితి।
భూషణాని బహూన్యద్య గంధవస్త్రాదికాని చ॥

దత్వా తస్యై ప్రియం కుర్యాం కార్యసిద్ధిర్న చాన్యథా।
కార్యార్థినః కుతో గర్వో గర్వాత్కార్యం వినశ్యతి॥

ఏవం చేచ్ఛంకితో భృత్యః శంకయా కార్యనాశనం।
అహం సమర్థః సర్వేషాం భృత్యానాం ధనసంపదామ్॥

బ్రహ్మక్షత్రవిశాం రాజా శాస్తా ధర్మేషు శిక్షకః।
భృత్యాన్ కతిపయానద్య నియోక్ష్యే సర్వకర్మసు॥

దేవదాసం సమాహూయ దత్వా చ బహుశో ధనం।
ఉదకార్ణవమాసాద్య మద్వాక్య మనుపాలయన్॥

చంద్రికాగిరిమాశ్రిత్య స్థిత్వా తత్రైవ సర్వదా।
విష్ణుం బ్రహ్మణ్యదేవేశం నత్వా స్తుత్వా జగద్గురుమ్॥

సప్తత్యా దివసైః కార్యం సాధయాశు మమాజ్ఞయా।
చంద్రికాగిరిమధ్యస్థం గృహీత్వా నాయకం మణిమ్॥

పునరాగచ్ఛ భద్రం తే మత్సమీపమశంకితః।
ఇతి నిశ్చిత్య మనసా పరేద్యుః ప్రాతరేవ హి॥

ఆనయామాస తం భృత్యం దత్వా బహుధనం తథా।
భృత్యాధీనమిదం రాజ్యం భృత్యాధీన మిదం జగత్॥

భృత్యాధీనా ఇయం లక్ష్మీః భృత్యాధీనమిదం వపుః ।
ఇత్యుక్త్వా సహసోత్థాయ సమాలింగ్య స్వయం ముదా ॥

గృహీత్వా పాణినా పాణిం రహస్య మిద మబ్రవీత్।
ఉదకార్ణవమాసాద్య మద్వాక్య మనుపాలయన్ ॥

చంద్రికాగిరిమాగత్య స్థిత్వా తత్రైవ సర్వదా ।
విష్ణుం బ్రహ్మణ్యదేవేశం నత్వా స్తుత్వా జగద్గురుమ్ ॥

సప్తత్యా దివసైః కార్యం సాధయాశు మమాజ్ఞయా ।
చంద్రికాగిరిమధ్యస్థం గృహీత్వా నాయకం మణిమ్ ॥

పునరాగచ్ఛ భద్రం తే మత్సమీపమశంకితః ।
ఏవ ముక్త్వా తు తం భృత్యం తూష్ణీమాస్తే మహీపతిః ॥

దేవదాస స్తథేత్యుక్త్వా స్వగృహం పునరావిశత్ ।
కథయామాస తత్సర్వం స భార్యాయై శుకాయ హి ॥

శుక స్తత్సర్వమాకర్ణ్య రాజానం కామచారిణం ।
హృది సర్వమవష్టభ్య దేవదాసమథాబ్రవీత్ ॥

జానే త్వాం చ రాజానం కామార్తం చారవాక్యతః ।
రాజానో వంచితాస్సర్వే పరదారైర్ధనాదిభిః ॥

రాజ్ఞా యదుక్తం తత్సర్వం త్వయా కార్యమశంకయా ।
లవణేక్షుసురాసర్పిదధిక్షీరోదకార్ణవాః ॥

సముద్రే సప్తమే వత్స చంద్రికాగిరిరస్తి హి ।
తం గత్వా విష్ణుమభ్యర్చ్య నత్వా స్తుత్వా ప్రసాద్య చ ॥

సప్తత్యా దివసైః కార్యం త్వయా నిరశనేన హి ।
నమో నారాయణాయేతి మంత్రరాజమనుస్మరన్ ॥

దినాంతే భగవాన్విష్ణుః ప్రత్యక్షస్తవ జాయతే ।
మణిం దాస్యతి మోక్షం చ సాత్ర కార్యా విచారణా ॥

మద్దేహస్థమిదం రోమం బద్ధ్వా స్వోదరదేశతః।
తారయిష్యసి వేగేన సముద్రాన్ సప్త మానతః॥

గరుడేన యథా విష్ణుః హంసేనేవ చతుర్ముఖః।
వృషభేన యథా శంభుః శీఘ్రం గచ్ఛే త్తథా భవాన్॥

తావదేషా ప్రియా సాధ్వీ యావదాగమనం పునః।
చరిష్యతి హి కల్యాణీ బ్రహ్మచర్యవ్రతాదికమ్॥

అఖండదీపమాదాయ రాత్రౌ నిద్రాపరాఙ్ముఖీ।
కర్మణా మనసా వాచా భర్తృశ్రేయోపనుత్తయే ॥

గౌరీపూజాఽనయా కార్యా కల్పోక్తవిధినా పునః ।
విఘ్నాస్తత్ర భవిష్యంతి ధర్మఘాన్ఋతశీలినః ॥

తదాయత్తాశ్చ తే విఘ్నాః నవిఘ్నేభ్యో విభీష్యతః ।
గచ్ఛ శీఘ్రమలం గోష్ఠ్యా రాజాజ్ఞా బలవత్తరా ॥

రాజాజ్ఞా పితరౌ లోకే రాజాజ్ఞా సర్వదేవతాః ।
రాజాజ్ఞా పుత్రమిత్రాణి భృత్యైః కార్యా విశేషతః ॥

ఏవముక్తస్తదా తేన త్రిః పరిక్రమ్య పక్షిణం ।
గతో ముహూర్తమాత్రేణ యత్రాస్తే చంద్రికాగిరిః

శుకోక్తం సాధయామాస రాజకార్య మతంద్రితః ।
తత్పత్నీ తేన మార్గేణ ప్రత్యహం శుకచోదితా ॥

గౌరీపూజాపరా నిత్యం మౌనవ్రతపరాయణా ।
ధ్యాయంతీ నిర్మలం దేవం దయాలుం భక్తవత్సలమ్ ॥

**—: ఇతి శుకసప్తతికథాసు పీఠికావతరణమ్ :—**

దీని ముగింపు ఈతీరుగా ఉన్నది.

కరాగ్రేణ శుకం స్పృష్ట్వా వసిష్ఠో వాక్యమబ్రవీత్।
కథానాం పూర్వముక్తానాం మధ్యే కాం వేదసమ్మితామ్॥

యః శృణోతి నరో లోకే స ముక్తః పరమం పదమ్।
ప్రథమం మునివైరాగ్యం ద్వితీయం సాహసం ప్రియాః॥

శ్రీశైలస్యైవ మాహాత్మ్యం తృతీయం పరికీర్తితం।
చతుర్థం రజకీగాథా విప్రస్యైవ తు పంచమమ్॥

పితాపుత్రస్య సంవాదం షష్ఠం చ పరికీర్తితం।
సప్తమం శూద్రమాహాత్మ్యం సాగరం చాష్టమం తథా॥

దేవస్వామీతి నవమం దశమం బ్రహ్మరాక్షసం।
ఏకాదశం మృత్యురూపం వారుణం ద్వాదశం తథా॥

ద్రాక్షారామేశ్వరం చైవ కథాం సుందోపసుందయోః।
స్త్రీజాతకం తథా ప్రోక్తం షోడశం తు శకుంతలా॥

కలాశాస్త్రం సప్తదశ మనసూయాకథా తథా।
త్రయోవింశద్బంధనం చ దేశభేదాస్తతః పరమ్॥

కృతఘ్నం పంచవింశత్యా రత్నలక్షణకం తథా।
త్రింశద్వేదవతీగాథా ఉక్తా పరమశోభనా॥

పాతివ్రత్యం తతః పశ్చాత్ వేశ్యామాహాత్మ్యమేవ చ।
త్రయస్త్రింశద్యమపురం తతస్తులసిసంభవః॥

దీర్ఘధ్వజ ఇతి ఖ్యాతం కార్తికస్య శుభావహం।
వైశాఖమాఘమాహాత్మ్యం గయామాహాత్మ్యమేవ చ॥

కాశీమాహాత్మ్యకం చైవ ప్రయాగాఖ్యమనంతరం।
చిదంబరం తతః పశ్చాత్ సాముద్రికమతః పరమ్॥

శ్వేతోపాఖ్యానకం చైవ తతస్త్వేకాదశీవ్రతం।
రజస్వలాకథా చైవ శ్రాద్ధవిస్తారమేవ చ॥

ద్రవ్యశుద్ధిస్తతః పశ్చాదాశౌచం తదనంతరం।
తతో వర్ణాశ్రమాచారో గృహధర్మాస్తతః పరమ్॥

పురాణశ్రవణం చైవ సర్వేషామనుకీర్తితం।
వంధ్యాస్నానం తతః పశ్చాత్ ధనార్జనమనంతరమ్॥

పుత్రగోపాలకం నామ వ్రతం పుత్రప్రదాయకం।
గోపాలప్రతిమాదానమద్భుతాశ్చ తతః పరమ్ ॥

దానప్రకరణం చైవ వ్యవహారస్తతః పరమ్ ।
ప్రాయశ్చిత్తం తతః ప్రోక్తం రోగాశ్చైవ తతః క్రమాత్ ॥

యుగధర్మాస్తతః పశ్చాత్ ప్రయత్నేన ప్రకీర్తితాః ।
పితాపుత్రస్య సంవాదో భృగోర్వారుణకం తథా ॥

జ్ఞానోపదేశనం నామ కథా బ్రహ్మోపదేశనం।
తత్త్వబోధస్తతః పశ్చాత్ సన్న్యాసస్తదనంతరమ్॥

యతిధర్మాస్తథా ప్రోక్తా వ్యాసపూజా తతః పరం।
యోగమార్గస్తతః పశ్చాత్ కథానాం సంహతిస్తథా॥

ఏతాసాం శ్రవణాద్వాపి పఠనాద్వా విశాంపతే।
సర్వపాపవినిర్ముక్తః స యాతి పరమం పదమ్॥

వంధ్యా నియమపూర్వేణ పూజయిత్వాథ పుస్తకం।
ఆరభ్య నియమాన్నిత్యం కథాం వా ద్వయమేవ వా॥

శుకం స్వర్ణమయం కృత్వా పూజయిత్వా దినే దినే।
శ్రుత్వా నియమపూర్వేణ దినాంతే దానమాచరేత్॥

వంధ్యా పుత్రమవాప్నోతి రోగీ రోగాత్ ప్రముచ్యతే।
అధనో ధనసంపన్నః సకామీ కామమాప్నుయాత్॥

*　　　　*　　　　*

య ఇదం శృణుయాన్నిత్యం వాచయేద్వా సమాహితః।
సర్వపాపవినిర్ముక్తః ప్రపేదే వైష్ణవం పదమ్॥

-: ఇతి శుకసప్తతికథాసు సప్తతిదినాలాపనికా :-

పై శ్లోకాల్లో 19-22, 27-29 కథల పేర్లు తెలిపే శ్లోకాలు పోయి నట్లున్నవి.

మల్లాది సూర్యనారాయణశాస్త్రిగారు తమ సంస్కృతవాఙ్మయచరిత్ర ద్వితీయసంపుటంలో శుకసప్తతిగూర్చి ఈవిధంగా వ్రాసినారు.

"ఇది యొక, చిత్రమైన కథాకావ్యము. ఇందు నీతిమార్గ ముపదేశించు డెబ్బది కథలు గలవు. నందభూపాలుని పుత్రుడగు వినయకందర్పుడు తన సేవకుడైన దేవదాసును చంద్రికాగిరికి కార్యార్థము పంపించి అందగత్తెయగు నతని భార్యతో గ్రీడింప యత్నించి ప్రభావతియను పేరు గల యాతన్వి యింటికి నిరంతరము రాత్రికాలమున వెళ్ళుచుండ దేవదాసు పెంచిన చిలుక ప్రతిదిన మొక్కొక్క నీతికథ చెప్పుచు నతని నింటికి బంపివేయుచుండును. ఇట్లు డెబ్బది దినములు చెప్పిన కథలే శుకసప్తతి యనుపేర వెలయుచున్నవి. ఆకథలు - మునివైరాగ్యము, స్త్రీసాహసము, శ్రీశైలమాహాత్మ్యము, రజకీగాథ, విప్రకథ, పితాపుత్రసంవాదము, శూద్రమాహాత్మ్యము మొదలగునవి. ఇందలి ప్రతి కథయు చివరకు నీతిబోధక మగును. ఇందలి జ్ఞానోపదేశ బ్రహ్మోపదేశ యతిధర్మ

యోగమార్గాములగు కడపటి కథలు విజ్ఞానదాయకములై యెట్టి దుర్మతినైన సన్మార్గమునకు ద్రిప్పజాలియున్నవి తుదకు రాజు ప్రభావతిని చెఱచకుండ శుక మామె శీలము కాపాడి రాజునకు హితము గఱపుటయే యిందలి పరమార్థము. ఒకనాడు రాజు వచ్చి ప్రభావతి యర్పించిన యున్నతాసనముపై గూర్చుండి యుండ ఒక పిల్లి తన్ను దినవచ్చి యాపని సాధ్యము గాక క్రింద మూలుగుచుండుట తెలిసి దాని నుద్దేశించి యన్యాపదేశముగా చిలుక యిట్లు పలికెను.

కిం త్వం రోదిషి మార్జార, న చారిర్న చ తస్కరః ।
నందభూపకుమారోఽయం, పరనారీసహోదరః॥

ఈమాటలు విని వినయకందర్పుడు మౌనముతో తన యింటికి పోయెను. ఇట్టి నీతిచేతనే కాక భాషచే గూడ నిది హృద్యముగా నున్నది.''

మల్లాదివారి పైవ్రాతలో మొదటి పంక్తులు మద్రాసు కేటలాగులోని సమాచారానికి సంగ్రహరూపం, చివరి పంక్తులు (ఒకనాడు రాజు వచ్చి ... నుండి) తంజావూరు కేటలాగు సంపుటి VII పుట 3214 నెంబరు 4202 శుకసప్తతిని వర్ణించే ముగింపు వాక్యాలతో సంవదిస్తున్నవి. మద్రాసు తంజావూరు కేటలాగుల్లో శుకసప్తతి ప్రతులను వర్ణించే ఆద్యంతభాగాలనుండి ఉద్ధరించిన పంక్తులకు పోలికలే లేవు. కనుక శుకసప్తతి శృంగారశుకసప్తతి, వేదాంతశుకసప్తతి అనే రెండు తీరుల పాఠాలతో ఉన్నా వీనిలో కూడ అనేకుల రచనలు అనేక తీరులుగా సాగినట్లు భావించవలసి ఉంటుంది.

ఇక శృంగారశుకసప్తతి సంగతి చూతాము. మోతీలాల్ బనార్సీదాస్ ప్రకటించినది (1959) వావిళ్ళభారతం సైజులో 153 పుటల పుస్తకం. ఇందులో కేవలం మూలకథలే ఉన్నవి. చౌఖంబావారి ప్రచురణం (1966) క్రౌన్ సైజులో 258 పుటల గ్రంథం. దీనికి హిందీలోను సంస్కృతంలోను వ్యాఖ్యానా లున్నవి. రెండింటిలోను మూలం మాత్రం ఒకటే.

ఆరంభశ్లోకం ఈవిధంగా ఉన్నది.

ప్రణమ్య శారదాం దేవీం దివ్యవిజ్ఞానశాలినీమ్ ।
వచ్మి చేతోవినోదార్థముద్ధారం కీరసమ్మతేః ॥

గ్రంథావతారికాసంగ్రహం దిగువ పొందుపరుస్తున్నాను. చంద్రపురమనే నగరానికి విక్రమసేనుడు రాజు. ఆనగరంలోనే హరిదత్తుడనే శ్రేష్ఠి ఆయన భార్య శృంగారసుందరి కాపుర మున్నారు. వారి కుమారుడు మదనవినోదుడు. ఆతని భార్య ప్రభావతి సోమదత్తశ్రేష్ఠి కూతురు. మదనవినోదుడు ద్యూతమృగయామద్యాదివ్యసనాల పాలై చెడిపోతుంటే తలిదండ్రులు దుఃఖిస్తారు. వాళ్ళ దుఃఖం చూచి మిత్రుడైన త్రివిక్రముడనే బ్రాహ్మణుడు తన యింటినుండి చిలుకనూ గోరువంకనూ తెచ్చి హరిదత్తుని కిచ్చి "సపత్నీకమైన ఈశుకాన్ని పుత్రనిర్విశేషంగా సాకుకో. అందుమూలంగా నీ దుఃఖం తొలగిపోతుంది" అంటాడు హరిదత్తు డాశుకాన్ని కొడుక్కు అప్పగిస్తాడు. మదనవినోదుడు దాన్ని తన శయనమందిరంలోని స్వర్ణపంజరంలో పెట్టి పోషిస్తుంటాడు. ఒకనా డాశుకం రహస్యంగా మదనవినోదునితో "నీమూలంగా నీతలిదండ్రులు కంటికీ మంటికీ ఏకధారగా ఏడుస్తున్నారు. ఆపాపం తాకి నీవు కూడా దేవశర్మవతు పతనమై పోతావు'' అంటుంది. మదనవినోదుడు కుతూహలంతో ఆదెట్టి కథ అని అడుగుతాడు. శుకం ఆదేవశర్మ తల్లిదండ్రుల మాట వినక యిల్లు విడిచిపోయి గంగాతీరాన తపస్సు చేసి తన కోపపు చూపులతో కొంగలను బుగ్గి చేసి అదే ధీమాతో భిక్షకు పోయి నారాయణద్విజుని భార్యచే పరాభూతుడై ధర్మవ్యాధునిచే ప్రబోధితుడై జ్ఞానోదయం కలిగి ఇంటికి పోయి స్వకులధర్మాన్ని అనుసరిస్తూ తలిదండ్రుల సెలవు తీసికొని వ్యాపారార్థం దేశాంతరం వెళ్ళిన కథ చెప్పుతుంది. మదనసేనుని భార్య ప్రభావతి కొన్నాళ్ళు పతివియోగదుఃఖంతో కాలం గడిపినా స్వైరిణులైన సఖీజనం ఉపదేశం మూలంగా గుణచంద్రుడనే పరపురుషసంగమానికి ఉద్యుక్తురాలౌతుంది. ఒకరాత్రి ప్రభావతి సింగారించుకొని గుణచంద్రుని చెంతకు పోబోతుంటే గోరువంక పోవద్దని భయపెడుతుంది. ప్రభావతి గోరువంకను మెడ నులిమి చంపటానికి ఉద్యమిస్తే అది ఎగిరిపోతుంది. ఆమె కాసేపు ఉండి ఇష్టదేవతకు నమస్కరించి తాంబూలం వేసుకొని మరల పోవటానికి సన్నాహం చేస్తుంటే శుకం ప్రభావతిని ఎక్కడికి పోతున్నావు అని

అడుగుతుంది. ప్రభావతి నిజం చెప్పుతుంది. అప్పు డాశుకం ఆటువంటి పని కులస్త్రీలకు తగదనీ ఒకవేళ ఆటువంటి పని చేసినప్పుడు ఏదైనా సంకటం కలిగితే తప్పించుకోగలిగే బుద్ధికుశలత నీకుంటే పో లేకపోతే అవమానం పాలౌతావు అని ఉదాహరణంగా ఒకకథ వినిపిస్తుంది.

భీమనామకరాజు పాలించే చంద్రావతీపురంలో మోహనశ్రేష్ఠి కొడుకు సుధనుడనేవాడు హరిదత్తుని భార్య లక్ష్మిని కామిస్తాడు. కాని ఆమె అంగీకరించదు. వాడు మాసోపవాసినియైన పూర్ణ అనేదానికి బాగా ధనం ఇచ్చి రాయబారం నడుపుతాడు. పూర్ణ తన చాటూక్తులతో లక్ష్మిని ఒప్పించి తన యింటికి తీసుకపోతుంది. తీరా పోతే సుధనుడు ఇతర కార్యవ్యగ్రుడై సమయానికి పూర్ణ యింటికి రాలేకపోతాడు. కామాతురయైన లక్ష్మి మరొకణ్ణి పట్టుక రమ్మంటది. మూఢురాలైన పూర్ణ వెదకి వెదకి లక్ష్మి మొగడైన హరిదత్తుణ్ణే పట్టుక వస్తది. అప్పుడు లక్ష్మి ఏమి సమాధానం చెప్పాలె? ఎట్లా తప్పించుకోవాలె? నీవు గాని నీసఖులు గాని చెప్పండి అని శుకం అడిగితే ప్రభావతి తమకు తెలియదనీ చిలుకనే చెప్పవలసిందని కోరుతది. సమాధానంగా చిలుక ''నీవు ఎక్కడికీ వెళ్ళకుండా ఉంటే చెప్పుతా'' నంటుంది. ప్రభావతి వల్లమాలిన కుతూహలంతో అందు కంగీకరిస్తుంది. అప్పుడు చిలుక తాను వేసిన కటికముడిని ఈవిధంగా విప్పుతది. 'లక్ష్మి ఆ వచ్చినవాడు తన భర్తే అని తెలుసుకొని వాని జుట్టు పట్టి ''ఇన్నాళ్ళూ నీవొక్కతెవే నాకు ప్రియురాలవని కల్లబొల్లి మాటలు చెప్పి ఈదొంగ నాటకా లాడుతున్నావా? నిన్ను పరీక్షించటానికే నేను ఈ యెత్తు ఎత్తినాను" అని కోపిస్తుంది. హరిదత్తుడు బతిమాలి ఎంతో కష్టపడి అనునయించి లక్ష్మిని ఇంటికి తీసుకపోతాడు'.

ఈకథ విన్న ప్రభావతీ ఆమె సఖులూ భయవిస్మయాలతో అట్లాగే నిద్దురపోతారు. ఈవిధంగా మొదటిరాత్రి గడచి పోతుంది. శుకం ఇదే తీరుగా డెబ్బై దినాలు డెబ్బై కథలు వినిపిస్తుంది. ఈలోగా దేశాంతరగతుడైన మదనవినోదుడు స్వగృహం చేరవస్తాడు. ప్రభావతి కామం కంచికి పోతుంది. ఈవిధంగా చిలుక ప్రభావతి శీలాన్ని పరిరక్షిస్తుంది. శృంగారశుకసప్తతిలో చిలుక చెప్పే కథలు మూడువంతులు శృంగారకథలే, ఒకవంతు మాత్రం ఇతరనీతికథలు అద్భుతకథలు.

తెలుగులో పాలవేకరి కదిరీపతిరాజు వ్రాసిన శుకసప్తతి పైన పేర్కొన్న శృంగారశుకసప్తతి వంటిదే. కదిరీపతి గురించీ ఆతని శుకసప్తతి గురించీ తరువాత తెలుసుకొందాము. సంస్కృతంలోను ఫారసీలోనూ కన్నడంలోనూ ఉత్తరభారత, దక్షిణభారత– పాఠాలతోడి శృంగారశుకసప్తతులూ వేదాంత శుకసప్తతులూ చాలామంది రచయితలు చేపట్టి వేరువేరు కృతులు వెలయించినట్లు ముందుగా మనవి చేసినాను. శృంగారశుకసప్తతివంటి పద్యకృతి తెలుగులో వెలయించినది ఒక్క కదిరీపతిరాజే. వేదాంతశుకసప్తతి అనే పేరుతో కాకపోయినా చిలుక చెప్పిన పుణ్యకథలు తెలుగులో లేక పోలేదు. చిలుక చెప్పిన పుణ్యకథలే పతివ్రతాచరిత్రము పేరుతో (Madras Govt Oriental Manuscripts Series No 60, 1958) పేరు తెలియని కవి యెవరో ద్విపదల్లో మనోహరమైన శైలీవిన్యాసంతో కథాకథనంతో జాతివార్తలతో సామెతలు నానుడులతో గొప్పగా వ్రాసినాడు. భాషాశైలినిబట్టి ఈరచయిత అనంతర ప్రబంధయుగానికి చెందినవాడని భావించవచ్చు. దీనికి మున్నుడి కూర్చిన శ్రీ. టి. చంద్రశేఖరన్‌గారు ఈ గ్రంథం గురించి ఈవిధంగా తెలిపినారు.

''మదరాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమున నీపతివ్రతా చరిత్రమునకు రెండు మూలప్రతు లున్నవి. అవి. డి. నెం. 1104, 1105 లలో వర్ణితములు. అందు మొదటిది కాగితపుఁ బ్రతి. రెండవది తాళపత్రప్రతి. కాగితపుఁ బ్రతియందు నెడనెడ బ్రౌనుదొరగారి యాంగ్ల వివృతు లున్నవి. గ్రంథపాఠ ముభయప్రతులందు సమానము. పతివ్రతాచరిత్రము పాతివ్రత్యప్రభావమును ప్రకటించు ప్రశస్తద్విపదకృతి. ఇందు ముప్పదిరెండు కథ లున్నట్లు తెలియవచ్చుచున్నది. కాని మూలప్రతులయందుఁ బదునొకండు కథలు లుప్తము లగుటచే నిరువదియొక్క కథలు మాత్రము ప్రకటింపఁబడెను''—

దీని విషయసూచిక ఈవిధంగా ఉన్నది.

1. అవతారిక 2. పుష్పదంతుని కథ 3. చంద్రప్రతాపుని కథ 4. అరుంధతీదేవి కథ 5. సావిత్రి కథ 6. కరాగ్రే కంకణం అన్నకథ 7. శయ్యాగానం అనిన వనిత కథ 8. పతి యనుమతి గాంచిన సతి కథ 9. తెల్లవారకుండ శపించిన సాధ్వి కథ 10. ఘూనవల్లి కథ 11. విధివిధాతల కథ

12. సులోచన కథ 13. కాళి గుడిలో సతి పతిని వరించిన కథ 14. కలభాషిణి కథ 15. బుద్ధికర్మముల కథ 16. రాజశేఖరుని కథ 17. కొండగుమ్మడి కాయల కథ 18. నీ ఎబ్బిచూపునకు కొంగను గానన్న కథ 19. గంధర్వకన్య కథ 20. లోపాముద్ర కథ 21. కేయూరబాహుని కథ 22. శుకగాంధర్వ కథ 23. కిరాతసతి కథ 24. ద్రౌపదీదేవి పూర్వజన్మ కథ. ఇందులో అవతారిక తీసివేసినా 23. కథ లౌతున్నవి. మున్నుడిలో 21 కథ లన్నా రెందుకో ।.

పై శీర్షికలనుబట్టి ఈకథలు చాలావరకు కథాసరిత్సాగరం, భోజరాజీయం, సింహాసనద్వాత్రింశిక, కేయూరబాహు చరిత్ర. మార్కండేయపురాణం వంటి పూర్వగ్రంథాల్లోని వని తెలుస్తున్నది. జానపదుల్లో ప్రచారంలో ఉన్న కథలు గూడ కొన్ని ఇందులో ఉన్నవి. వేదాంతశుకసప్తతిలోని కథలు ఇందులో లేకున్నా ఉద్దేశమూ ఎత్తుగడా దానిని పోలినవే.

పరమేశ్వరుడు పార్వతికి చెప్పిన ఈకథలు నైమిశారణ్యంలో సూతుడు శౌనకాదిమునీశ్వరులకు వినిపిస్తాడు. ఇందులో మొదటిది పుష్పదంతుని కథ. ఇదివరకెవ్వరికీ తెలియనటువంటి అపూర్వకథలని శివుడు పార్వతికి ఏకాంతంగా వినిపిస్తుండగా పుష్పదంతుడు వాయువువలె ప్రవేశించి తుమ్మెదగా మారి ఆకథలు విని వచ్చి తన భార్య జయకు చెప్పుతాడు. పార్వతి కీసంగతి తెలిసి కోపంతో పుష్పదంతుని రాక్షసుడవు కమ్మని శపిస్తుంది. పార్వతిని అనునయించటానికి ప్రయత్నించిన పుష్పదంతుని స్నేహితుడు మహానందుడు కూడ ఆమె కోపానికి గురియై మనుష్యుడుగా రత్నగుప్తుడనే పేరుతో పుడుతాడు. ఆరాక్షసునివలన ఈ మనుష్యుడు మొత్తం ఏడులక్షల కథలు విని భూలోకంలో ప్రచారంచేసిన తరువాత వాళ్ళిద్దరికీ పూర్వస్థితి కలుగుతుందని పార్వతి శాపమోక్షణం ప్రసాదిస్తుంది. మహానందుడు రత్నగుప్తుడుగా జన్మించి ఆకథలన్నీ రాక్షసుడు చెప్పుతుంటే విని భూర్జపత్రాల మీద వ్రాసుకొంటాడు. ఆపత్రాలకట్టను తలక్రింద పెట్టుకొని ఒకనాడు అడవిలో అతడు గాఢనిద్రలో ఉండగా అవి చెల్లాచెదరై పోతవి. పోయినవి పోగా ఒక లక్షకథలు మాత్రం శకాధిపునికి లభిస్తవి. క్షేమేంద్రుడనే ముని వాటిని రాజుకు వినిపిస్తాడు; వాటిని సంస్కృతీకరిస్తాడు. తక్కిన ఆరు లక్షల కథలు గరుడ గంధర్వ సాధ్య విద్యాధర నాగలోకాల్లో వ్యాపిస్తవి.

రత్నగుప్తుని శాపం తీరిపోతుంది. ఈ సమాచారమంతా కథాసరిత్సాగరం అవతారికలోనిదే.

పార్వతికి పరమశివుడు వినిపించిన కథలు ఎట్టివని మునులడిగితే సూతుడు వరుసగా ఆకథలు వినిపిస్తాడు. అందులో మొదటిది చంద్రప్రతాపుని కథ. ఈ కథలోనే చిలుక జన్మప్రసక్తి ఉన్నది. చంద్రప్రతాపుడు చంద్రావతి యేలిక. విక్రమకేసరి ఉజ్జయిని రాజు. వీళ్ళిద్దరి మధ్యన యుద్ధం జరుగుతుంది. చంద్రప్రతాపుని మంత్రి సుకీర్తి విక్రమకేసరి గదాఘాతానికి దశాదముని ఆశ్రమ ప్రాంతంలో పడిపోయి అజ్ఞ లేకుండా అక్కడి ఫలాలారగించి మునిశిష్యుని శాపంమూలంగా శుకమై పుట్టి శాల్మలీవనంలో శుకగణాలకు రాజౌతాడు. ఒకనాడు వేటకానికి ఈచిలుక పట్టుబడుతుంది. వేటకాడు ఇంద్రావతీపురంలో ధనదత్తుడనే వైశ్యునికి ఈచిలుకను అమ్ముతాడు. చిలుక తన మాటకారితనంతో ధనదత్తునికి లక్షలధనం కూర్చుతుంది. ధనదత్తుని కొడుకు కుబేరదత్తుడు వేశ్యాలంపటుడై చెడిపోతాడు. అతని భార్య పుష్పమంజరి గొప్ప అందగత్తె ఐనా వాడామె ముఖం చూడడు. కొడుకును మంచి మార్గానికి తేవలసిందని ధనదత్తుడు చిలుకను కోరితే అది ఒక ఉపాయం పన్ని రాజుపత్నిమిషతో పుష్పమంజరినే కుబేరదత్తునికి తార్చి ఆసంసారాన్ని చక్కదిద్దుతుంది. నాటినుండి కుబేరదత్తుడు అన్ని వ్యసనాలు మానుకొని ఇంటిపట్టున ఉంటాడు. ఇట్లుండగా ఒకనాడు ఆనగరం రాజు మదనసేనుడు సాయంకాలం వాహ్యాళికి పోయి మేడమీద తిరుగుతున్న పుష్పమంజరిని చూచి మోహవశుడై తన దూతికాజనాన్ని సంప్రదిస్తాడు. ఒక గడిదేరిన దూతిక కుబేరదత్తుడు కనుక పదిదినాలపాటు నగరంలో లేకుండా పోతే పుష్పమంజరిని లోబరచుకొని ప్రభువుకు కానుక పెడుతానంటుంది. మదనసేనుడు ఒక ఉపాయం పన్ని నవరత్నాల కోసం కుబేరదత్తుణ్ణి మణిద్వీపానికి పంపుతాడు. కుబేరదత్తుడు తన భార్య యోగక్షేమాలను చిలుకకు అప్పగించి భద్రమని చెప్పి పోతాడు. పుష్పమంజరి విరహంతో ఉండగా రాజుగారి దూతిక వచ్చి ఆమెను మదనసేనరాజు వలచిన వార్త వినిపించి అతని కోరిక తీర్చుమంటుంది. అప్పు డాపుష్పమంజరి,

''మధురవాణివి గాన మధురవాక్యముల
నధిక చాతురి మీఱ నాడితి విపుడు

కులకాంతలకు మాకుఁ గూడునె యిట్టి
పలువ సేతలు రాజు పాటి దప్పినను
పాములు తరిమి పైఁబడిన వారాశి
యే మేరఁదప్పిన యేమనఁ గలము
మా కన్నిటికిఁ గర్త మాయిలువేల్పు
శ్రీకరఫణితి రాచిలుక మాయింట
నున్న రాచిలుక సెల్వోసఁగిన వత్తు
నిన్నేల వలదన్న నేను రా వెఱతు''

అని సాయంకాలంవరకు కాలయాపనం చేసి సంధ్యాసమయాన ఆచిలుకకు ఉన్నదున్నట్లుగా చెప్పుతుంది. అప్పు డాచిలుక,

''కల్ల లాడక మది కలది కలట్టె
పల్లవాధర నీవు పలుకుటవలన
నిను చాల మెచ్చితి నీవు దూతికయు
నెనసి యీనిల్వోకొల్వో లేల చేసెదరు
పోవలసిన వెన్క పోదురు గాని
యీవేళఁ గూర్చుండు డించుక సేపు
కలికి రాజానతి గాదనరాదు
కలకంఠులకు నేడుగడ గదా విభుఁడు
పతిఁ బాసి వేఱొక్క పతిఁ జేరు టెల్ల
సతుల కర్హమె యిది జాతిధర్మంబె
వనిత యెన్నడు పతివ్రతల సత్కథలు
వినినదానవు గాదు వినదు దూతికయు
నే నొకకథ మీకు నెఱిగింతు నిపుడు
వీనుల విందుగా విందురు గాక''

అని అరుంధతీదేవి కథలాదిగా దినం ఒకటి చొప్పున పతివ్రతల కథలు వినిపించి పుష్పమంజరి శీలాన్ని కాపాడుతుంది. ఇది అసమగ్రం కనుక కథలు ముగిసేనాటికి కుబేరదత్తుడు తిరిగి వస్తాడని మనం ఊహించవచ్చు. శృంగార శుకసప్తతి వంటిదే ఈకథల ఎత్తుగడ. ఐతే ఇవన్నీ పతివ్రతల కథలు; పుణ్యకథలు. శృంగారశుకసప్తతిలో చిలుక ప్రభావతిని ఆపినట్లే ఇందులో చిలుక పుష్పమంజరిని ఆపుతుంది

ప్రాచీనసంస్కృతప్రాకృతభాషల్లోని కథావాఙ్మయం దాదాపు అంతా తెలుగులోనికి వచ్చినది. తెలుగులో వెనుకటి కవులు పద్యకావ్యాలుగా ద్విపదకృతులుగా సంతరిస్తే తరువాతి రచయితలు వచనంలో వ్రాసినారు. గ్రాంధికవచనంలోనూ వ్యావహారికవచనంలోనూ ఈకథలు వచ్చినవి. కేతన దశకుమారచరిత్రము, వెన్నెలకంటి అన్నయ షోడశకుమారచరిత్ర, జక్కన విక్రమార్కచరిత్ర, కొఱవిగోపరాజు సింహాసనద్వాత్రింశిక, అనంతామాత్యుని భోజరాజీయము, ఎఱ్ఱన సకలనీతికథానిధానము, దూబగుంట నారాయణ, భానయ్య, బైచరాజు వెంకటనాథుల పంచతంత్రములు, అయ్యలరాజు రామభద్రుని సకలకథాసారసంగ్రహము, చింతలపూడి యెల్లన విష్ణుమాయానాటకము, పాలవేకరి కదిరీపతి శుకసప్తతి, అయ్యలరాజు నారాయణామాత్యుని హంసవింశతి మొదలైనవి తెలుగులో వెలసిన పద్యకథాకావ్యాలు. వీటిలో కొన్ని అనువాదాలు కొన్ని అనుసరణలు మరికొన్ని స్వతంత్రాలని మన విమర్శకుల అభిప్రాయం. తెలుగులో పద్యంలోకంటె గద్యంలోనే ఎక్కువ కథావాఙ్మయం వెలువడినట్లున్నది. కథాసరిత్సాగరం, కాంభోజరాజుకథలు, కాశీమజిలీకథలు, కీరబహత్తరి కథలు, కూనపాండ్యరాయనికథ. గోల్కొండ పాదుషాల కథలు, గోవ్యాఘ్రచరిత్ర, చాక్దర్వేష కథలు, చిత్తూరు రాజుల కథలు, చిలుక చెప్పిన కథలు, తాతాచార్ల కథలు, తిమ్మరుసు కథలు, తెనాలి రామలింగని కథలు, తోతీనామా కథలు, దక్కను పూర్వకథలు, దిలారామ కథలు, నిజమగు కాశీమజిలీ కథలు, పంచతంత్రకథలు, పరమానందయ్య శిష్యుల కథలు, పలుకని పద్మాక్షి కథలు, బత్తీసు పుత్తి కథలు, భట్టివిక్రమార్కుల కథలు. బుద్ధుని పూర్వకథలు భేతాళ పంచవింశతి కథలు, భోజకాళిదాసుకథలు, భోజరాజీయము, మదనకామరాజు కథలు, మర్యాదరామన్నకథలు, రాజహంసి చెప్పిన రమణీయగాథలు, రామేశ్వర

మజిలీకథలు, రేమక్క పగటిచుక్క కథలు, విక్రమార్కుని కథలు, విజయనగరరాజుల కథలు, సహస్రశిరచ్ఛేద అపూర్వచింతామణి, సారంగధర కథలు, హంసవింశతి కథలు, హితోపదేశ కథలు మొదలైనవి గ్రాంథికవచనంలోను వ్యావహారికవచనంలోను వచ్చినవి. తంజావూరు, చెన్నపురి కాకినాడ, తిరుపతి, హైదరాబాదు ప్రాచ్యపుస్తకభాండాగారాల్లో కథావాఙ్మయానికి సంబంధించిన పద్యగద్యకృతు లనేకం అముద్రితాలుగా మూలుగుతున్నవి.

శుకసప్తతికథలు వచనంగా చాలామంది వ్రాసినట్లున్నారు. కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు ప్రకటించిన ఆంధ్రవాఙ్మయసూచిలో (పుట-207) 1. శుకసప్తతికథలు- వచనము- వెంకట సుబ్బాశాస్త్రి 2. శుకసప్తతికథలు- వచనము- ఎస్. వీరరాఘవయ్య;అనుబంధంలో (పుట-42) 3. శుకసప్తతికథలు- హసబ్నీస్ వాసుదేవరావు; విషయవిభాగంలో (పుట-348) 4. శుకపంచవింశతి కథలు 5. శుకసప్తతికథలు 6. శృంగారశుకవింశతికథలు ముద్రితాలుగా పేర్కొబడినవి. అముద్రితగ్రంథాల పట్టికలో (పుట-1) ఆంధ్రసాహిత్య పరిషత్పుస్తకభాండాగారంలో 1. చిలుకచెప్పిన కథలు అనే అసమగ్రవచనగ్రంథం ఉన్నట్లు, (పుటలు 19-20) చెన్నపురి ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారంలో 2. కీరబహత్తరికథలు 3. తోతీనామా కథలు అముద్రితాలుగా ఉన్నట్లు పేర్కొబడినవి. ముద్రితాలుగా పేర్కొబడినవన్నీ 1929 సంవత్సరానికి పూర్వం ముద్రితమైనవే. ఈనాడా గ్రంథాలు లభించవు. ఇటీవల Bookmans- Madrasవారు మద్రాసు ప్రాచ్యపుస్తకభాండాగారంలోని 'చిలుక చెప్పిన కథలు' శ్రీ బులుసు వెంకటరమణయ్యగారు పరిష్కరించగా గిడుగు సీతాపతిగారి ఉపోద్ఘాతంతో''చిలుక చెప్పింది"అనే పేరుతో 1955లో ప్రకటించినారు. ఇందులో పాతకాలపు చక్కని వ్యావహారిక శైలిలో మనోహరమైన 52 కథలున్నవి. ఈకథలు మన దేశంనుండి అరేబియాకో పర్షియాకో పోయి మరల మన దేశానికి వచ్చినట్లున్నవి. ఇందులోని పేర్లూ వాతావరణమూ హిందూమహమ్మదీయ వాతావరణపు కలగాపులగంగా ఉన్నవి. కథావతరణం చెప్పే అవతారిక కొలది మార్పులతో శృంగారశుకసప్తతిని పోలినటువంటిదే. ఇందులో విదేశవాణిజ్యానికి పోయిన మయిమూన్ అనే వర్తకుని భార్య కుజస్తాకు చిలుక కథలు చెప్పి శీలరక్షణం చేస్తుంది. కాలిబాట పుస్తకవిక్రేతలూ రైలుబండి సంచారకపుస్తక

విక్రేతలూ తీరుతీరుల "శుకసప్తతి కథలు" అమ్ముతున్నారు. ఏపుస్తకంతోనూ దెబ్బై కథలు లేవు. అన్నింటా పంచపాండవులు మంచం కోళ్ళవలె ముగ్గురే. కథలూ కథావతరణములూ మసి పూసిన మారేడు కాయలే.

తెలుగులో మొదటిసారిగా శుకసప్తతి శృంగారకథలు చేపట్టి పద్యప్రబంధంగా వ్రాసినవాడు పాలవేకరి కదిరీపతిరాజు దీని కథావతరణం ఈవిధంగా ఉన్నది.

ఒకనాడు ధర్మరాజు ఇంద్రప్రస్థంలో కొలువుదీరి తమ కులగురువు ధౌమ్యునితో భామల చిత్తం బ్రహ్మకు గూడ తెలియదంటారు అవైన మేమిటో చెప్పండి అని అడిగితే ధౌమ్యుడు పూర్వం మహాదేవుడు పార్వతికి చెప్పిన ప్రకారం వినిపిస్తాడు. పద్మావతీపురాన్ని చిత్రభానుడనే రాజు ఏలుతుంటాడు. ఆయన సముఖానికి ఒక ఎరుకత వచ్చి దారికట్టులూ మొనకట్టులూ వశీకరణపు బదనికలు కానుక పెడుతుంది. రాజుగారు కుతూహలంతో నీవు చూచిన సమస్త ప్రదేశాల్లోని అందగత్తెల్లో అందరికంటె ఎవ్వరు మిన్న అని అడిగతే ఆపట్టణం లోనే ఉన్న మదనసేనుడనే వర్తకుని భార్య ప్రభావతి అందచందాలు అతిలోకంగా పొగడి చిత్రభానునికి మదనజ్వరం ఎక్కించి బహుమతు లందుకొని వెళ్ళిపోతుంది. చిత్తజాయత్తుడైన చిత్రభానుడు నాటినుండి కంచం విడిచి మంచం పడుతాడు. రాజుగారి సేవికల్లో నెరజాణ పల్లవి ప్రభావతిని తార్చటానికి రాయబారం నెరపుతుంది. ప్రభావతి అత్తమామలు సుమతీహరదత్తులతోను పనిపాటలవాళ్ళతోను మచ్చికగా ఉంటూ పల్లవి మెలమెల్లగా వజ్రంవంటి ప్రభావతి మనస్సును మైనంవలె మార్చగలుగుతుంది. ఇంతలో విధివశాత్తు మదనసేనునికి అతిదూరపు ఓడబేరం తగులుతుంది. అతడు తల్లిదండ్రులకు మ్రొక్కి పెంపుడు చిలుకకూ ముద్దులభార్య ప్రభావతికీ చెప్పి ప్రయాణమై పోతాడు. కొలది దినాల భర్తృవిరహం తరువాత పల్లవి ప్రబోధలతో కోరికలు ఈరికలెత్తిన ప్రభావతి ఒకనాటి రాత్రి బాగా అలంకరించుకొనీ ఊడిగపు బుడుతను వెంటబెట్టుకొనీ అభిసరించటానికి ఉద్యుక్తురాలౌతుంది. బయలుదేరే ముందు ఎందుకైనా మంచిదని ప్రాణపదమైన పెంపుడు చిలుకకు మనసులోని కోరిక చెప్పుతుంది. చిలుక కటకటపడి ప్రభావతిని ఈసడించి హితబోధ వేస్తుంది. ప్రభావతి కనుల్లో ఎరుపుజీరలు సందడిస్తవి. చిలుక సామమార్గం అవలంబించి

కుంతివలె వర్తించవలె గాని అహల్యవలె వర్తించి దూరుపడవద్దనీ అందులో రాజుల పొందు కత్తివాదరవంటిదనీ హితం బోధిస్తుంది. ఇంతలో తెల్లవారుతుంది. ప్రభావతి ఆనాటికి తన మనస్సు ఉగ్గబట్టి మరుసటిదినం మళ్ళా సిద్ధమౌతుంది. ఆరెండోనాటి రాత్రినుండి చిలుక మనోహరమైన కథలు చెప్పుతూ మాటల పందిరులు అల్లుతూ మదనసేనుడు దేశాంతరంనుండి తిరిగివచ్చేదాకా ప్రభావతిని తప్పటడుగు వేయనీయకుండా కాపాడుతుంది. తెలుగు శుకసప్తతి అసమగ్రంగా లభించింది కనుక యాభైమూడో రాత్రికే మదనసేనుడు తిరిగివచ్చినట్లు ఇందులో ఉన్నది కాని నిజానికి అతడు 70 నాటి రాత్రికి తిరిగివచ్చిఉండాలె. ఈ కథల సంఖ్యలు ముద్రాపకులు చేర్చినవే కాని కవి ప్రణాళికలోనివి కావు. 70 నాటి రాత్రికి మదనసేనుడు తిరిగిరావటంతో తాను వేసుకున్న పథకం పారనందుకు చిత్రభానుడు గుక్కిళ్ళు మింగుతూ మరునాడు మదనసేనుని ఎరుకతో ఆచిలుకను పట్టి తెప్పించి ఏకాంతంగా నువ్వు ఏఋషీశ్వరుని అంశంతో పుట్టినావు ? అని అడుగుతాడు. అప్పుడాచిలుక తాను పూర్వభవంలో శుకమహర్షినని చెప్పుతుంది. అంతకుపూర్వం రాత్రి చిలుక రంభానలకూబరులు ప్రభావతీమదనసేనులుగా జన్మించిన కథ చెప్పుతది. అంతకంటె పూర్వం రాత్రి శాపకారణంగా వైశ్వానరుడు సుబలాచిత్రసేనరాజదంపతులకు చిత్రభానుడనే కొడుకుగా పుట్టిన కథ వినిపిస్తది. ఇదంతా గమనిస్తే కదిరీపతి కథావతారాన్ని వేదాంత శుకసప్తతిని మనస్సులో పెట్టుకొనీ కథలను శృంగారశుకసప్తతిని మనసులో పెట్టుకొనీ కొంత సొంత కల్పనం చేసీ తెలుగు శుకసప్తతికి రూపురేకలు దిద్దినా డనిపిస్తుంది. వేదాంతశుకసప్తతిలో శుకమహర్షి శుకంగాను అగ్నిదేవుడు వహ్నిరాజుగాను ఇంద్రుడు దేవదాసుగాను శచీదేవి దేవదాసు భార్యగాను జన్మిస్తారు. కదిరీపతి శుకమహర్షిని శుకంగాను, అగ్నిదేవుణ్ణి చిత్రభానుడుగాను, అవతరింపజేసినా రంభానలకూబరులను ప్రభావతీమదనసేనులుగా అవతరింప జేస్తాడు. ప్రభావతీమనశ్చాంచల్య కలంకానికి ఆమె పూర్వజన్మలోని రంభాత్వా కారణం కావచ్చు.

పాలవేకరి కదిరీపతి చంద్రవంశక్షత్రియుడు, - అచ్యుతగోత్రుడు, కదిరి నరసింహస్వామి భక్తుడు, కదురరాజు కదురమ్మల పుత్రుడు, కరెమాణిక్యరాజు పౌత్రుడు. కృత్యాదిలో వర్ణించబడిన వీళ్ళ వంశావతారం ఈవిధంగా ఉంటుంది.

I పెద బౌబళరాజు

|

II నారపరాజు

( ఈతనికి తొమ్మండుగురు కొడుకులు అందులో ఒకడు )

|

III బౌబళరాజు ( భార్య బాలమ్మ )

|

IV కరె మాణిక్యరాజు

(ఈతనికి నల్గురు భార్యలు 1లచ్చమ్మ 2రాచమ్మ 3రంగమ్మ 4భద్రమ్మ)

|

V(1) వసంతరాజు V(2) రామరాజు V(3) నారపరాజు V(4) కదురరాజు (భార్య కదురమ్మ)

VIA రఘునాథరాజు

VI BI కదిరీపతి(భార్య వెంకటాంబ) కృతికర్త VI B2 వెంకటాద్రి

కదిరీపతి జాతిమాత్రక్షత్రియుడే కాదు, కత్తి పట్టి రాజ్యచక్రం త్రిప్పనేర్చినవాడు తనపూర్వుల వంశక్రమాన్ని వారి ప్రాభవాన్ని కృత్యాదిలో విపులంగా వర్ణించినాడు ఈతని పూర్వుల్లో మొదటి చారిత్రకపురుషుడు పాలవేకరి పెద బౌబళరాజు. ఈతడు తాడిగోళ్ళపురధాముడట. ఈతని నాటినుండి వీళ్ళకు పాలవేకరితో పాటు తాడిగోళ్ళ గృహనామం కూడ చెల్లుతున్నది. ఈ పెదబౌబళరాజు రాయదత్తాశ్వవారణరత్న నవరత్నహారాంబరుడు ( I-23 ). ఈరాయలు విద్యానగరాన్ని ఏలిన అచ్యుతదేవరాయలో ( 1530 - 1542 ) లేక సదాశివ దేవరాయలో (1543 - 1576) సరిగా తెలియదు గాని సదాశివదేవరాయల పక్షాన విజయనగర సామ్రాజ్యాన్ని దుర్నిరీక్ష్యతేజంతో పాలించిన అళియరామరాయలు సాగించిన జైత్రయాత్రల్లో పెదబౌబళరాజు పాల్గొన్నాడు. "అళెరామరాజేంద్రబలవద్రిపులఁ ద్రుంచు కలని కేధీరుండు కర్త యయ్యె" (I-23) అనటం చేత పెదబౌబళరాజు అళియరామరాయలకు సమకాలీనుడని నిశ్చయంగా చెప్పవచ్చు. ఇంకా అతడు "కదెరాకమున తెర్క మొదలుగా గల్గిన"

(I-23) బహురాజ్యాలు ఏలినాడు. "రాయదత్త హనుమన్నాగారిచిహ్నధుర్య" డైనాడు (I-24). కదిరి నరసింహస్వామికి క్రోడుగల్లు మొదలైన గ్రామాలు, భోగమంటపాలు, ధూపదీపనైవేద్యాలు, కట్టాణిముత్యాల గట్టి చౌకట్లజోడు, అరుదైన నవరత్నహారాలు, అఖండదీపజ్యోతులు, ప్రసూనార్చనలు మొదలైన కైంకర్యాలు చేసినాడు (I – 25). అతని కొడుకు II నారపరాజు కూడ మహావైభవంగా రాజ్యం ఏలి కీర్తి గాంచినవాడే. నారపరాజుకు తొమ్మిదిమంది కొడుకులట. వాళ్ళ పేర్లేమిటో ఈ కావ్యంలో లేవు గాని అందులో ఒకడు III ఔబళరాజు రాజ్యం చేసినాడు. ఈతడు అనేక సప్తసంతానాలు ప్రతిష్ఠించినాడు. ఈతని భార్య బాలమ్మ. వీరి సంతానమే కరెమాణిక్యరాజు. ఈ కరెమాణిక్యరాజు రామదేవరాయల సరిగద్దె ఒడ్డోలగం ఉన్నవాడు (I – 39). ఈరామదేవరాయలు అరవీటి తిరుమలదేవరాయల కొడుకు కావచ్చు. తిరుమలదేవరాయలు విజయనగర సామ్రాజ్యాన్ని మూడు ప్రాంతాలుగా విభజించి, తెలుగు ప్రాంతాన్ని పెనుగొండ రాజధానిగా పెద్దకొడుకు శ్రీరంగదేవరాయలకూ, కన్నడ ప్రాంతాన్ని శ్రీరంగపట్టణం రాజధానిగా రెండోకొడుకు రామదేవరాయలకూ, తమిళ ప్రాంతాన్ని చంద్రగిరి రాజధానిగా మూడో కొడుకు వెంకటపతిదేవరాయలకూ అప్పగించి సామ్రాజ్యపాలనం చేసినాడు కనుక కన్నడప్రాంతాలపై ఆధిపత్యం నెరపిన రామదేవరాయల (1618 – 1630) కొలువులో సరిగద్దె ఎక్కినవాడే కరెమాణిక్యరాజని భావించవచ్చు. కరెమాణిక్యరాజు కీర్తిప్రాభవాలు ఈవిధంగా వర్ణింపబడినవి.

సీ॥ తాళి చౌకటి కుంచె కాళాంజి చామర
ద్వయము ముత్తెపుఁ దురావాహనము ఫి
రంగి కత్తి మొదలౌ రామరాయక్షమా
వరదత్త బిరుదాంకవార మంది
కదనభూతలభయంకరకరాగ్రసమగ్ర
కరవాలహతరిపూత్కరుఁ డనంగఁ
దాడిగోళ్ళన్వయోదధినిశాకాంతుండు
కరియమాణిక్యభూకాంతుఁ డలరు

నభయదా నార్థనత వినుతావనీశ
పాకభిల్లోచ నానందబాష్పకణము
ర ందబంధురపాదారవిందుఁ డగుచుఁ
జక్రవాళావృతాచలచక్రమునను. (I - 41)

కరెమాణిక్యరాజుకు 1లచ్చమ్మ 2రాచమ్మ 3రంగమ్మ 4భద్రమ్మ అని నల్గురు భార్యలు. వీళ్ళవలన వసంతరాజు రామరాజు నారపరాజు కదురరాజు అని నల్గురు కొడుకులు పుట్టినారు. ఐతే ఈనల్గురు ఏయే భార్యలకు పుట్టినారో ఈకావ్యంలో చెప్పలేదు. కవి క్రమాలంకారాన్ని పాటించి ఉంటాడని ఊహిస్తే అక్రమం కాదనుకొంటాను. ఈనల్గురిలో రెండోవాడైన రామరాజు చంద్రగిరిరాజైన శ్రీరంగరాయల (1642 - 1649) చేత మత్స్యమకరధ్వజచిహ్నా లందుకొన్నవాడు.(I - 49) ఈచిహ్నాలు మధుర తిరుమలనాయకునికీ, చెంజి వరదప్పనాయకునికీ చెందినవనీ వాళ్ళు శ్రీరంగరాయలమీద తిరుగుబాటు లేవదీస్తే తాడిగోళ్ళ రామరాజు సహాయంతో తిరుగుబాటు అణచి వాళ్ళ బిరుదులే రామరాజుకు శ్రీరంగరాయలు ఇచ్చిఉంటాడని నేలటూరి వెంకటరమణయ్యగారి అభిప్రాయం. (వాఙ్మయవ్యాసమంజరి- ఆంధ్రసారస్వతపరిషత్తు ప్రచురణం 1967). ఈరామరాజు కొడుకు రఘునాథరాజు తండ్రిగారికి రాజ్యపాలనంలో బాసటగా ఉన్నాడు. పై సోదరచతుష్కంలో నాల్గోవాడు కదురరాజు. కదురరాజు భార్య కదురమ్మ. వీళ్ళకు ఇద్దరు కొడుకులు, పెద్దవాడు కదిరీపతి, శుకసప్తతి గ్రంథకర్త; చిన్నవాడు వెంకటాద్రి. కదురమ్మ ఎవరింటి ఆడుబిడ్డో ఆమె తలిదండ్రు లెవరో కవి చెప్పనే లేదు. కదిరీపతి భార్య వెంకటమ్మ ఎవరింటి బిడ్డో తెలియదు.

కదిరీపతి రెండో పెదనాయనగారైన రామరాజు చంద్రగిరి శ్రీరంగరాయల (1642 - 1649) కాలంవాడు కనుకా, రామరాజు కొడుకు రఘునాథరాజు తండ్రిగారికి రాజ్యపాలనంలో బాసటగా ఉన్నాడని చెప్పినాడు కనుకా, పెదనాయనగారి కొడుకైన రఘునాథరాజుకంటె కొంచెం చిన్నవాడైనా కదిరీపతి కూడ 17వ శతాబ్దం ఉత్తరార్థంలో ఉండి శుకసప్తతి రచించి ఉంటాడని మనం భావించవచ్చు. నిడుదవోలు వెంకటరావుగారు, నేలటూరి వెంకటరమణయ్యగారు

ఆరుద్రగారు, రత్నాకరం శంకరనారాయణరాజుగారు (కర్ణాటక ఆంధ్రసాహిత్య చరిత్ర 1976) కదిరీపతి 17వ శతాబ్దం ఉత్తరార్ధంవాడనే తీర్మానించినారు. నిడుదవోలువారు,నేలటూరివారు చారిత్రకాధారాలతో కదిరీపతి 1660 ప్రాంతంలో ఉన్నాడని చెప్పినారు. కదిరీపతి కాలంగురించి ఇంతకంటె ఎక్కువగా చెప్పకోవలసిం దేమీ లేదు.

కదిరీపతి తన వంశంలో మొదటి ప్రసిద్ధపురుషుడైన పెదఔబళరాజును తాడిగోళ్ళ పురధాముడని అభివర్ణించినాడు. ఈతాడిగోళ్ళ ఎక్కడిది ? కదిరీపతి కదిరిరాజ్యపాలకుడనీ ఆరాజ్యం నెల్లూరు సీమలోనిదనీ వీరేశలింగంపంతులుగా రన్నారు. పంతులుగారి కాలంనాటికి శుకసప్తతి కృత్యాదిపద్యాలు లభించ లేదు. శుకసప్తతి ప్రథమముద్రణం పీఠికాకారులు కొచ్చెర్లకోట రామచంద్ర వెంకటకృష్ణారావుగారు తాడిగోళ్ళ కడపమండలంలోని దన్నారు. ద్వితీయ ముద్రణం పీఠికలో కొత్తపల్లి సూర్యారావుగారు కడపమండలం శాసనాల్లో కానవచ్చే తాడిగొట్ల తాడిగోళ్ళ కావచ్చు అన్నారు. కాని నేలటూరి వెంకట రమణయ్యగారు తాడిగొట్ల-తాడిగోళ్ళ వేరువేరనీ తాడిగోళ్ళ మొరసరాజ్యం లోనిదనీ ఈనాటి కన్నడదేశంలోని తెలుగుప్రాంతమైన కోలారుమండలం శ్రీనివాసపురం తాలూకాలోనిదనీ శాసనాధారాలతో ప్రమాణీకరించినారు. ఆ చుట్టుపట్ల గ్రామాల్లో తాడిగోళ్ళరాజు లిచ్చిన అనేకదానశాసనాలు అందులో వచ్చే రాజుల పేర్లన్నీ వారు చారిత్రకంగా నిరూపించినారు. వెంకటరమణయ్యగారు కదిరీపతి కులంగురించి శంకించినారు. కంఠోక్తిగా కదిరీపతి తాను అచ్యుత గోత్రుడననీ చంద్రవంశక్షత్రియుడననీ చెప్పకున్నా వెంకటరమణయ్యగారికి మాత్రం సందేహమే. తాడిగోళ్ళవాళ్ళంతా నాయకశబ్దవాచ్యులు కావటమూ, మహామండలేశ్వరులమని చెప్పకోకపోవటమూ వీరి సందేహానికి కారణం. నాటి దేశపు కావలికాండ్రైన కమ్మ, బలిజ, ముత్తరాసి వారంతా నాయకబిరుదాలు ధరించినారే కాని క్షత్రియు లెవ్వరూ ధరించలేదని నేలటూరివారి వాదం. కదిరీపతి స్వయంగా తాను క్షత్రియుడనని చెప్పకొంటే, ఇన్నాళ్ళ తరువాత కాదని మనం అభ్యూహ్యత్వానికి పాలుపడటం సమంజసం కాదనుకుంటాను. పట్టినవాడు పరక అంటే గట్టున ఉన్నవాడు జెల్ల అన్న సామెతగా ఉన్న దీవ్యవహారం.

కదిరీపతి తన వంశం పూర్వులు చంద్రుడు, బుధుడు, పురూరవుడు, ఆయువు, నహుషుడు, యయాతి, యదువులను చెప్పి

ఉ॥ ఆరసికావతంసకుల మాత్మసముద్భవ హేతుభూతమై
ధీరతఁ బాలవెల్లి జగతిం దగెఁ దన్మహిమం బపారగం
భీరఘనాఘసంభరణభీమబలప్రతిభాప్తిఁ గాంతు నం
చారయఁ బాలవేకరికులాఖ్య వహించె నుదంచితోన్నతిన్. (I-20)

ఉ॥ ఆమహితాన్వవాయవసుధాధిపు లచ్యుతగోత్రపాత్రు లు
ద్దామభుజాపరాక్రమవిదారితఘోరమదారివీరులై
భూమి ధరించి రాన్నృపుల భూతి మహోన్నతి నేలె భోగసు
త్రాముఁడు తాడిగోళ్ళపురధాముఁడు శ్రీపెదబొబ్బరాజ దిలన్ (1-21)

అని పేర్కొనటంచేత వీళ్ళ యింటిపేరు మొదట పాలవేకరివారనీ పెదబొబ్బరాజు తాడిగోళ్ళపురధాము డైనప్పటినుండి తాడిగోళ్ళవారైనారనీ భావించవచ్చు. ఆశ్వాసాంతగద్య లన్నింటిలోనూ ఈ రెండుతీర్ల ఇంటిపేర్లు ఉన్నవి. కనుక తాడిగోళ్ళవలె పాలవేకరి కూడ గ్రామనామం ఐయుంటుంది. తాడిగోళ్ళ కోలారు మండలం లోనిదైతే పాలవేకరి ఏమండలంలోనిదో తెలియదు. ఈరాజులు పాలవేకరిలో ఉండినా తాడిగోళ్ళలో ఉండినా, మరెక్కడికైనా మారినా వీళ్ళ ఇలువేలుపు మాత్రం కదిరి నరసింహస్వామి అనంతపురం మండలంవాడు. కదిరిరాజ్యం అనంతపురం మండలంలోని దక్షిణభాగంనుండి మైసూరురాజ్యంలోని శివసముద్రంవరకు వ్యాపించి ఉండేదనీ అది నాడు విజయనగరసామ్రాజ్యంలోని నాయంకర రాజ్యమనీ హోసూరునుండి శ్రీ K. S. కోదండరామయ్యగారు నాకు వ్రాసినారు. పెదబొబ్బరాజు ఏలిన "కదెరాకమున తెర్కణ మొదలుగా గల్గిన" (1-23) రాజ్యంగురించి కూడా కోదండరామయ్యగారు నా సందేహం తీర్చినారు. తెర్కణ అనేది తెరకణాంబె అనే గ్రామానికి రూపాంతరమనీ తెరకణాంబె గుండ్లుపేట తాలుకాలో ఉన్నదనీ, గుండ్లునది కావేరికి ఉపనదిఅనీ అక్కడ త్రికదంబేశ్వరీ ఆలయమున్నదనీ, తెరకణాంబెకు హ్రస్వరూపం 'తెర్కణ'

పద్యంలో ఇముడగలిగిందనీ, ఆకము పాకము దేశపర్యాయవాచకాలనీ కదెరాక మనగా కదిరిదేశం, కదిరిరాజ్యమనీ శ్రీ కోదండరామయ్యగారి వక్కాణ. కోలారు జిల్లాలోని శ్రీనివాసపురం, శిడ్లఘట్ట, బాగేపల్లి తాలూకాల్లో తాడిగోళ్ళ రాజుల పేర్లతో అనేకగ్రామా లున్నాయనీ అక్కడ శాసనాలు కూడ ఉన్నాయనీ శ్రీకోదండరామయ్యగారు తెలిపినారు.

కదిరీపతి విద్వత్కవిరక్షణానుసంధాయకుడు, స్వయంగా గొప్ప కవి. అతని కున్న సాహిత్యాధికారం ఈపద్యం తెలుపుతున్నది.

సీ. కావ్యనైపుణీ శబ్దగౌరవ ప్రాగల్భ్య
మర్థావనాసక్తి యతిశయోక్తి
నాటకాలంకారనయమార్గసాంగత్య
సాహిత్యసౌహిత్యసరసముద్ర
సకలప్రబంధవాసన సువాక్ప్రౌఢిమా
న్వితచతుర్విధసత్కవిత్వధాటి
లక్ష్యలక్షణగుణశ్లాఘ్యతాపటిమంబు
నైఘంటికపదానునయనిరూఢి
గనిన నీకు నసాధ్యంబె గణుతి సేయ
ధాత్రి శుకసప్తతి యొనర్పఁ దాడిగోళ్ళ
ఘనకులకలాప కదురేంద్రు కదురభూప
చెలఁగి వాక్ప్రౌఢిచేఁ గృతి సేయు మవని. (I-78)

ఇంత సాహిత్యాధికారం ఉన్నవాడు కనుకనే కదిరీపతి శుకసప్తతి రచనకు పూనుకున్నాడు. శుకసప్తతిని తెలుగు కథాకావ్యాల్లో మేలుబంతిగా రూపొందించినాడు. ఇందులోని వస్తువు కొందరికి రుచించకపోవచ్చు. కాని ఆవస్తువును కళాత్మకంగా దిద్దితీర్చటంలో కదిరీపతి కృతకృత్యుడైనాడని అందరూ ఒప్పుకుంటారు. రంకుకథలు చేపట్టటంలో కదిరీపతి ఉద్దేశం అవినీతిని ప్రచారం చేయటం కాదు. లోకసామాన్యంగా సంసారపక్షంగా ఉండేవాళ్ళకు కూడ పరిస్థితుల ప్రభావంచేత మనసు నిలుకడ తప్పితే ఆటువంటివాళ్ళను

జారిపోనీయకుండా చేయవలె ననేదే కదిరీపతి ప్రయత్నం. ఈకథలు చెప్పి ప్రభావతిని డెబ్బై దినాలు నిలువరించి అపమార్గంనుండి కాపాడటమే దీని ఫలశ్రుతి అని తెలుసుకుంటే నీత్యుపదేశానికే కదిరీపతి శృంగారకథలు వాడుకున్నాడని భావించవచ్చు. ప్రథమాశ్వాసంలోని 156, 157, 158, 159 పద్యాల్లోను చతుర్థాశ్వాసం 303 పద్యంలోను ప్రభావతికి చిలుక చేసిన నీత్యుపదేశమే కదిరీపతి ఆశయం. తన మానాన తానుండిన ప్రభావతిని ఆకర్షించటానికి ప్రయత్నించిన చిత్రభానునికి కూడ గ్రంథాంత పద్యాల్లో నీతిని ఉపదేశించటం జరిగింది. కేవలం ధర్మపన్నాలే వల్లించక, బూతులతో నీతులూ కలిపి, కాంతాసమ్మితంగా, సహృదయహృదయరంజకంగా, శృంగారకథలు రచించటమే రాజసపు కవి చేయగల పని అనుకున్నాడు కదిరీపతిరాజు. విమర్శకులు ఒక రచన చదివేటప్పుడు ఆరచయిత కాలంనాటి అభిరుచులనూ సాంఘికపరిస్థితులనూ మరచిపోకూడదు. తన కాలంనాటి సమాజపు అభిరుచులనూ, మానవాత్మ ఏయే మార్గాల్లో ఏతీరుగా స్పందిస్తుందో వాటిని కదిరీపతి చక్కగా చిత్రించినాడు. మానవుల చిత్తవృత్తులు వివిధరీతుల్లో స్పందిస్తవి. ధర్మార్థకామమోక్షాలనే నాలుగు పురుషార్థాలూ సంసారులకు ఉపాదేయాలే. అర్థకామాలను ధర్మమోక్షాలకు భంగం కలుగకుండా భజించటమే వ్యక్తికి సమాజానికి శ్రేయస్కరం. బూతుకథలు చేపట్టినా కదిరీపతి ఆసత్యాన్నే నిరూపించినాడు. సహృదయులు శుకసప్తతి కథలను ఈ విధంగానే ఆస్వాదించాలె. ప్రాచీనతెలుగుకవులు చాలామంది చేయని పని కదిరీపతి మరొకటి చేసినాడు. కవితాకళకు ఏమాత్రం లోపం రానీయకుండా నాటి సాంఘికచరిత్రకు శుకసప్తతిలో అద్దం పట్టినాడు. కులాలు వృత్తులు, ఆచారవ్యవహారాలు, వేషభూషలు, కట్టు, బొట్టు, విశ్వాసాలు, వినోదాలు, వ్రతాలు, తిరునాళ్ళు, పండుగలు, పబ్బాలు, రంకు, బొంకు, మోసము, నీతి, అవినీతి, దానాలు, ధర్మాలు–అన్నిటినీ మించి వివిధమానవుల చిత్తవృత్తులను– ఈవిధంగా తన కాలంనాటి ఎన్నో విషయాలను కథాగమనానికి ఆఘాతం కలుగకుండా అభివర్ణించినాడు. ఆంధ్రుల సాంఘికచరిత్ర నిర్మాణదక్షులైన సురవరం ప్రతాపరెడ్డిగారు శుకసప్తతిలోని ఎన్నో విషయాలు తమ గ్రంథంలో ఉట్టంకించినారు. అయ్యలరాజు నారాయణామాత్యుడు ఈబాటలో ఇంకో అడుగు ముందుకు వేసినా అతని హంసవింశతి ఒక విజ్ఞానసర్వస్వం వంటిదైనా కథా

కథనంలో శుకసప్తతి ముందు వెలవెలబోయి కుంటుతుంది. తెలుగు కథాకావ్యాల్లో కథాకథనంలో శుకసప్తతిదే అగ్రతాంబూలం.

సంస్కృతంలో శృంగారశుకసప్తతి వేదాంతశుకసప్తతి అని రెండుతీరుల కథలున్నట్లు ముందుగా మనవి చేసినాను. కదిరీపతి వ్రాసిన తెలుగు శుకసప్తతికి సంస్కృతంలోని శృంగారశుకసప్తతి కొంతవరకు ఆధారం. సంస్కృతం శృంగారశుకసప్తతి వేదాంతశుకసప్తతి రెండింటిలోను శుకం డెబ్బైరాత్రులు డెబ్బైకథలు వినిపిస్తది. కదిరీపతి కావ్యం అసమగ్రం. ఇందులో 58 రాత్రుల్లో చెప్పిన 27 ప్రధానకథలు 9 ఉపకథలు మాత్రమే ఉన్నవి. సాహిత్య చరిత్రకారులూ విమర్శకులూ శుకసప్తతి అంటే డెబ్బైరాత్రుల కథలని కొందరూ డెబ్బై కథలని కొందరూ ఊహించినారు. సంస్కృతం విషయంలో మాత్రం డెబ్బైరాత్రులు డెబ్బైకథలు సంఖ్య చెల్లుతుంది కాని తెలుగు శుకసప్తతిలో డెబ్బైరాత్రులూ లేవు డెబ్బైకథలూ లేవు. ఐతే రచయిత సప్తతి సంఖ్య ఎందుకు చేర్చినట్లు? కదిరీపతి 70కథలు వ్రాయకపోయినా 70రాత్రులు శుకంతో కథలు చెప్పించి ఉంటాడు. ఆతడు గ్రంథం సమగ్రంగా వ్రాసినా వ్రాయకున్నా ఆతని ప్రణాళిక మాత్రం 70రాత్రులు చిలుకచేత కథలు చెప్పించటమనేది తథ్యం. అందుకు ఈపద్యాలు ప్రమాణం.

క॥ అది యెట్టు లనిన విను నె
మ్మది చెలఁగ న్నీవిభుండు మమతన్ మఱి డె
బ్బది నాళ్ళనాఁటి కిలు సే
రుదునని వ్రాకుచ్చి చను చెఱుంగవె మగువా! (iv-308)

ఉ॥ నేఁ డతఁ డిల్లుఁ జేరు రమణీ వెస డెబ్బది నాళ్ళు సెల్లె నీ
పోఁడిమి నీవెదుర్కొని విభుం గని మ్రొక్కి రహస్యలీల నీ
వేడుక లుప్పతిల్లఁ దనువిందొనరించి ప్రియంబునన్ రతి
క్రీడలఁ దేలవమ్మ సుచరిత్రలు నిన్ననయంబు మెచ్చఁగన్. (IV-305)

కనుక కదిరీపతి డెబ్బదినాళ్ళ ఈకథలు చెప్పించినాడని భావించాలె. శుకసప్తతి ఏనాటికైనా సమగ్రంగా లభిస్తే అందులో డెబ్బైరాత్రుల కథలే ఉంటవి గాని డెబ్బైకథలు మాత్రం ఉండవు. ఎందుకంటే కదిరీపతి ప్రణాళిక ఒక్కొక్కరాత్రికి ఒక్కొక్క కథ అని లేదు. మొదటిరాత్రి కథే లేదు. రెండోరాత్రి ప్రారంభమైన మొదటికథ మూడోరాత్రి

కూడ సాగుతుంది. రెండోకథ 4,5,6,రాత్రులూ, మూడోకథ 7రాత్రి, నాల్గోకథ 8,9రాత్రులూ, ఐదోకథ 10రాత్రి, ఆరోకథ 11రాత్రి, ఏడోకథ 12రాత్రి, ఎనిమిదోకథ 13రాత్రి, తొమ్మిదోకథ 14రాత్రి, పదోకథ 15రాత్రి, పదకొండో కథ 16,17,18రాత్రులూ, పన్నెండోకథ 19రాత్రి, పదమూడోకథ 20రాత్రి, పద్నాలుగోకథ 21రాత్రి, పదియేనోకథ 22రాత్రి, పదారోకథ 23రాత్రి, పదేడోకథ 24,25,26రాత్రులూ, పద్దెనిమిదోకథ 27రాత్రి, పందొమ్మిదోకథ 28రాత్రి, ఇరువయోకథా అందులో వచ్చే ఉపకథలూ 29నుండి 43రాత్రులూ, ఇరువైయొకటోకథ 44రాత్రి, ఇరువైరెండోకథ 45 రాత్రి ఇరువైమూడోకథ 46 47,48రాత్రులూ, ఇరువైనాలుగోకథ 49రాత్రి, ఇరువైయైదోకథ 50రాత్రి, ఇరువైయారోకథ 51రాత్రి, ఇరువైయేడోకథా ప్రధానకథలోని చివరిభాగం అనగా ప్రభావతీ శుక చిత్రభానుల జన్మాదికాలు 52,53రాత్రులూ సాగినవి. నిజంగా చివరివి 52,53రాత్రులు కావు. ఇవి 69,70 రాత్రులు కావాలె. చతుర్థాశ్వాసం ప్రారంభంలో కొంత గ్రంథపాతం జరిగినది. అందువలన పదేనురాత్రుల కథలు ఎగిరిపోయినవి.

కదిరీపతి శుకసప్తతిలో చెప్పిన కథల్లో కొన్నింటికి మూలాలు సంస్కృతః శృంగార శుకసప్తతిలో ఉన్నవి. తెలుగుకథలకు మూలాలైన సంస్కృతం కథలు చౌఖంబావారి 1966 ముద్రణం ఆధారంగా పేర్కొంటున్నాను.

| తెలుగుకథ సంఖ్య | సంస్కృతంకథ సంఖ్య |
|---|---|
| 5 | 1 |
| 6 | 2 |
| 7 | 3 |
| 8 | 16 |
| 10 | 14 |
| 11 | 42,43,44 |
| 12 | 10 |
| 13 | 69 |
| 14 | 19 |

| | | |
|---|---|---|
| 15 | | 11 |
| 16 | | 32 |
| 20 | | 5 |
| 20లో ఉపకథ-1 | | 6 |
| 20 | -2 | 8 |
| 20 | -9 | 9 |

ఈ విధంగా తెలుగు కథల్లో పదేనింటికి సంస్కృతంలో మూలాలు లభిస్తున్నవి. వీనిలో గూడ కథల్లో వచ్చే పాత్రల పేర్లు కొన్నింట తెలుగులో వేరుగాను సంస్కృతంలో వేరుగాను ఉన్నవి. సంస్కృతం కథల్లోని సంఘటనలు మాత్రమే కదిరీపతికి ఆధారం గాని తుచ తప్పని అనువాదం మాత్రం కాదు. నిజం విచారిస్తే తెలుగు శుకసప్తతికి సంస్కృతం శుకసప్తతికీ హస్తి మశకాంతరం భేదం ఉన్నది. రామాయణాన్ని కట్టె కొట్టె తెచ్చె అని మూడు మాటల్లో చెప్పినట్లున్నవి సంస్కృతం కథలు. అవి వట్టి అస్థిపంజరాలు. ఆ అస్థిపంజరాలకు జీవం పోసి అవయవసౌభాగ్యమూ తగిన లావణ్యమూ నింపి వయ్యారి నడకలు నడిపించినాడు కదిరీపతి. కదిరీపతి వ్రాసిన మరికొన్ని కథలకు మూలాలు పంచతంత్రంలోను భట్టివిక్రమార్కుల కథల్లోను జానపదగాథల్లోను కథాసరిత్సాగరంలోను కనబడుతవి. సంస్కృతంలో చాలా చిన్నగా నిర్జీవంగా ఉన్న కథలను పెంచి ఎంతో చమత్కారవంతంగా మనోహరంగా తెలుగు కథలు వ్రాసినాడు కదిరీపతి. స్థాలీపులాకంగా ఒక్క ఉదాహరణం గమనించండి. సంస్కృతం శృంగార శుకసప్తతిలో 6౹వ కథ ఈ విధంగా ఉన్నది.

అన్యదా ప్రభావతీ శుకం పృచ్ఛతి. శుకః ప్రాహ -

కురు జారం విశాలాక్షి విజారం కురుషే యది।
యథా వేజికయా పూర్వమర్ధస్నాతే పతౌ కృతమ్॥

అస్తి స్థానం కలాస్థానం నామ. తత్రైకో వణిక్సుతః తస్య భార్యా చ వేజికా నామాతివల్లభా. అన్యదా చ తం భర్తారం స్నాపయంతీ ఉపపతిం పూర్వకృతసంకేతం పథి గచ్ఛంతం దృష్ట్వా నాత్ర పానీయం ప్రచురమితి

మిషాంతరం కృత్వా పానీయానయనవ్యాజాత్ గృహాన్నిర్గతా జారేణ సాకం బహుకాలం చ స్థితా. తతోఽర్ధస్నాతం పతిం ముక్త్వా తథా స్థితా కిముత్తరం కరోత్వితి ప్రశ్నః.

ఉత్తరమ్- శుకః- తతః సా జారేణ భుక్తా స్వపతివంచనం విచింత్యాత్మానం కూపే చిక్షేప. తతః కోలాహలః సంవృత్తః. కూపే కాపి వరాకీ పతితాస్తీతి ప్రవాదః సంజాతః. తేన తత్పతిస్తద్వచనం శ్రుత్వా వ్యచింతయత్- నూనం సా మత్పత్నీ కూపే పతితా భవిష్యతి- ఇతి ద్రుతం గత్వా అవలోకయామాస. తతస్తాం కూపాదాకృష్యానీయామానయత్.

ఇతి కథాం శ్రుత్వా ప్రభావతీ సుప్తా.

-: ఇతి శుకసప్తతౌ ఏకోనసప్తతితమో కథా :-

ఇంత చిన్నకథను తీసుకొని కదిరీపతి 45 గద్యపద్యాల్లో 13వ కథగా (పుటలు 188-197) ఎంతో మనోహరంగా మలచినాడు.

కదిరీపతి కథాకథనకౌశలంతోపాటు జాతీయమైన తెలుగునుడికారం గల ప్రతిభాశాలి కవి; సంస్కృతాంధ్రాలు గట్టిగా చదువుకున్నవాడు. తనకు చేతనైనా శబ్దాడంబరానికీ, దీర్ఘసమాసకల్పనలకూ,శబ్దాలంకారాలకూ అంతగా ప్రలోభపడక తెలుగు నుడికారానికీ పలుకుబళ్ళకూ ప్రాణవంతమైన జాతీయాలకూ విశిష్టశబ్దప్రయోగాలకూ ప్రాధాన్యం ఇచ్చినాడు. ఒకటిరెండు చోట్ల శ్రీనాథుడు పెద్దన సూరన రామరాజభూషణుడు తెనాలిరామకృష్ణుడు సంకుసాలనృసింహకవి వంటి పూర్వాంధ్రమహాకవుల ఎత్తుగడలు కనపడినా కదిరీపతి మౌలికంగా తన మార్గం తానే ఏర్పరచుకొన్న స్వతంత్రకవి. మన సాహిత్యంలో కదిరీపతిని అనుకరించటంలోనూ, అనుసరించటంలోనూ కృతకృత్యుడైనవాడు ఒక్క అయ్యలరాజు నారాయణామాత్యుడే. స్వతంత్రకావ్యనిర్మాణదక్షత ఉన్నా కదిరీపతి అడుగుజాడల్లో నడచి మెప్పు పొందటం నారాయణామాత్యునికి కదిరీపతి పైన ఉన్న అభిమానమే కారణం. ఆయాజాతి స్త్రీపురుషుల మనస్తత్వాలూ వేషభాషలూ చేష్టలూ సహజంగా వర్ణించి చిత్రించి శృంగారహాస్యాది రసభావాలు పోషించటంలోనూ, సమకాలీన సాంఘికవాతావరణం ప్రతిబింబించే సమాజచిత్రణం చేయటంలోనూ తెలుగుకవుల్లో కదిరీపతికి అగ్రతాంబూలం ఇవ్వాలె.

శుకసప్తతిలో నెరసులుగా కనపడేవి కదిరీపతి పొరపాటులో, తాళపత్రగ్రంథాలు వ్రాసుకొన్నవారి చేతలో, పూర్వపరిష్కర్తలూ ముద్రాపకులూ చేసినవో, తెలియరాదు. అందుకే నా పరిష్కరణంలో నేను చేసిన సవరణలన్నీ బ్రాకెట్లలో ఇచ్చి పూర్వముద్రణం పాఠాలన్నీ అథోజ్ఞాపికల్లో ఇచ్చినాను.

శుకసప్తతి ప్రథమముద్రణం 1909లో జరిగింది. సర్వస్వతీపత్రికాధిపతులైన కొచ్చెర్లకోట రామచంద్ర వెంకటకృష్ణారావుగారు పుదుక్కోట సంస్థానంనుండి సంపాదించిన తాళపత్రగ్రంథం ఆధారంగాను, మద్రాసు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారంలోని సి. పి. బ్రౌను వ్రాయించిన ప్రతులాధారంగాను 21 పెద్దకథలతో 9 ఉపకథలతో ప్రకటించినారు. అసమగ్రంగా లభించటంచేత దానికి ప్రథమభాగం అని పేరు పెట్టినారు. తరువాత రెండు ముద్రణల్లోను అట్లాగే ఉన్నది.తమ పీఠికలో వారు సి.పి.బ్రౌనుగారి మాటలుగా ఉల్లేఖించినవాటిని పొందుపరుస్తున్నాను.

"This Sukasaptati or Tales of Parrot in Telugu, being a series of amorous Tales. Twenty in number, the book not having been completed, this is very rare and merit Pubication, as abounding in common colloquial expressions.

This edition was prepared under my direction in the year 1831."

గ్రంథాంతంలో బ్రౌనుగారు వ్రాసుకొన్నారన్న మాటలు.

SUKASAPTATI

A Series of Telugu Stories illustrating the various dialects of the Telugu language. This valuable work is very rare indeed and I never met with a

Perfect copy. The present one has been collected with five manuscripts procured with difficulty in various parts of this peninsula. Had it been composed in times when Telugu learning was patronized, it would have been better preserved; but the compositions of a dark age however valuable are seldom preserved with any care.

This book "The Seventy Tales of Parrot" has the same title with the well known Sanscrit composition of which, however, it is not a translation but an imitation. The work seems incomplete, the author not having finished the whole, it is petfect as far as it goes. (Thus there are not in fact 'Seventy' Tales)

The descrepancies in the various manuscripts of the book are very great indeed, whole lines being substituted one for another. It will therefore be very difficult to select a pure text.

The Hamsavimsati is a work of the same description and the close resemblance in many passages shows that one must have been borrowed from the other.

Since writing the foregoing reamarks I have persuaded Zulluri Appayya a very eminent Telugu scholar to revise and correct the work. He has done this very carefully and successfully. He considers it to be superior in style and good taste to the Hamsavimsati which, however, contains a greater

variety of words and technical phrases. He objects however very justly to the title of the work and proposed to say THIRTY tales of the parrot not the SEVENTY tales, for the book was never completed.

I have since obtained another manuscript (1889) which contains some additional passages.

శుకసప్తతి రెండోముద్రణం (1935) వావిళ్ళవారిది. కొచ్చెర్లకోటవారి ప్రథమముద్రణ పీఠికతోపాటు కొత్తపల్లిసూర్యారావుగారి ద్వితీయముద్రణపీఠిక కూడ ఉన్నది. ప్రథమముద్రణం కూడ కొచ్చెర్లకోటవారికి సిద్ధం చేయించినది కొత్తపల్లివారే. ద్వితీయముద్రణం నాటికి కొత్తపల్లివారు మానవల్లి రామకృష్ణకవిగారు సంపాదించిన 80 కృత్యాదిపద్యాలు ఇందులో చేర్చగలిగినారు. కదిరీపతి దేశకాలాలగురించీ అతని కవిత్వం గురించీ చర్చించినారు.

శుకసప్తతి మూడో ముద్రణం (1951) కూడ వావిళ్ళవారిదే. ఇందులో వావిళ్ళ వెంకటేశ్వరులుగారి 'ప్రకాశకవిజ్ఞప్తి', నిడుదవోలు వెంకటరావుగారి "పాలవేకరి కదిరీపతి కాలము" అనే వ్యాసం, సురవరం ప్రతాపరెడ్డిగారి 'ఉపోద్ఘాతము' ప్రథమద్వితీయముద్రణాల పీఠికలు, గ్రంథాంతంలో అనుబంధంగా అపూర్వపదాలకు అర్థాలు, శిథిలపద్యపూరణాలు ఉన్నవి. మొదటి రెండింటికంటె మూడో ముద్రణంలో మరికొన్ని కథలు చేరినవి. మొదటిసారిగా ఇదమిత్థంగా నిడుదవోలువారు కదిరీపతి కాలనిర్ణయం చేసినారు. సురవరం ప్రతాపరెడ్డిగారి ఉపోద్ఘాతం అమూల్యమైనది. అందులో కవికాలము, రంకుబొంకుల ముచ్చట, (ఇతరభాషల్లోని బూతుకథలు) శుకసప్తతి కథలకు మూలం, శుకసప్తతిలోని విశిష్టతలు (శైలి, నుడికారం, హాస్యరసం, లోకానుభవం, స్వాభావికవర్ణనలు) సాంఘికచరిత్ర తృతీయముద్రణం విశేషాలు ప్రతాపరెడ్డిగారు చాలా విపులంగా చెప్పినారు. అంతకుపూర్వం పండితులంతా శుకసప్తతి అంటే చిలుకచెప్పిన డెబ్బై కథ లనుకున్నారు. కాని ప్రతాపరెడ్డిగారే మొదటిసారిగా చిలుక చెప్పిన డెబ్బైరాత్రుల కథలని సోపపత్తికంగా నిరూపించినారు. కదిరి తాలూకా పాతర్లపల్లె గ్రామవాస్తవ్యులు అంబటి రమణప్పశ్రేష్ఠిగారి వద్ద శివశంకరర్థం

పిళ్ళెగారు సేకరించిన కృత్యాదిపద్యాలు రెడ్డిగారు సంపాదించి మూడో ముద్రణం మరికొంత మేలురం చేసినారు. కదిరీపతి ప్రయోగించిన కొన్ని మాండలికాలకు పారసీ అరబ్బీ పదాలకు నుడికారాలకు నిఘంటువుల కెక్కని పదాలకు అనుబంధంలో అర్థవివరణలు కూర్చి రెడ్డిగారు పాఠకలోకానికి మహోపకారం చేసినారు కథాసరిత్సాగరం రెండోలంబకం నాలుగో తరంగంలోని లోహజంఘుని కథకూ శుకసప్తతిలో 17వకథకూ, ఐదో తరంగంలోని పరివ్రాజిక కథకూ శుకసప్తతిలో ఆరోకథకూ, ఐదో తరంగంలోని శక్తిమతి కథకూ శుకసప్తతిలోని 14వ కథకూ, పోలిక లున్నాయని ఇంకా ఇటలీదేశస్థుడైన బొకాషియో వ్రాసిన 'డెకారమన్' కథల్లో ఒకదానికీ శుకసప్తతికథల్లో ఒకదానికీ పోలిక లున్నాయనీ రెడ్డిగారే గుర్తించినారు. నామీది దయతో సంస్కృతం శుకసప్తతి ఒక్కటీ వారు చూడలేదు గాని కదిరీపతి శుకసప్తతిగురించి చెప్పవలసినదంతా రెడ్డిగారే చెప్పినారు.

ఒక దశాబ్దంగా శుకసప్తతి ప్రతులు లభించటం లేదు. దానిని మరల ముద్రిస్తే బాగుంటుందని నేను ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారికి సూచించగా వారు దయతో నా సూచనను ఆమోదించటమే కాక దాని పరిష్కరణకార్యం కూడ నాకే అప్పగించినారు. అప్పుడు నేను ఒకటికి రెండుసార్లు శుకసప్తతి మూడో ముద్రణం చదివినాను. అందులో అనేక గణ యతి ప్రాస భంగాలూ, అన్వయం కాని పద్యాలూ, అర్థం కాని మాటలూ ఉన్నట్లు అనిపించింది. ఇంకొక్కసారి తాళపత్రగ్రంథాలు చూస్తే బాగుండు ననిపించి మద్రాసు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారంలో పండితులుగా ఉంటున్న మిత్రులు శ్రీ తీర్థం శ్రీధరమూర్తిగారికి వ్రాసినాను. వారు ప్రథమాశ్వాసం 141వ పద్యం ఒక్కటి మాత్రం తమవద్ద ఉన్న రెండో ముద్రణంలో సవరించుకొన్నది వ్రాసి పంపినారు. అప్పుడు నేను అకాడమీ కార్యదర్శులు శ్రీ దేవులపల్లి రామానుజరావుగారిని మద్రాసునుండి పాఠాంతరాలు తెప్పించ వలసిందిగా కోరినాను. వారి ఆమోదంతో మిత్రులు డాక్టర్ డి. చిన్నికృష్ణయ్యగారిని పాఠాంతరాలు ఎత్తి వ్రాసి పంపవలసిందిగా కోరినాను. మద్రాసు ప్రాచ్యపుస్తకభాండాగారంలో ఉన్న D. 888, D 886, D. 887 కాగితపు ప్రతులు చూచి శ్రీ చిన్నికృష్ణయ్యగారు పాఠాంతరాలు వ్రాసి పంపినారు. ఈముందు ప్రతుల్లోను కృత్యాదిపద్యాలు లేవు. D888, D886 ప్రతుల పాఠాలు

సంపదిస్తున్నవి. D. 887లోనే ఎక్కువ పాఠాలు దొరికినవి. ఐతే అందులో చతుర్థాశ్వాసం లేదు. అసమగ్రంగా ఉన్నా చతుర్థాశ్వాసం పాఠాలకోసం D. 886 ఆధారమైనది. మద్రాసునుండి వచ్చిన పాఠాంతరాలు ఎక్కువ భాగం అథోజ్ఞాపికలకు పనికివచ్చేవే గాని పాఠపరిష్కారానికి అనగా మూలంగా చేర్చుకోవటానికి పనికివచ్చేవి చాలా తక్కువ.

ఈ సాధనసామగ్రితో శుకసప్తతి పరిష్కరణకు పూనుకున్నాను. శుకసప్తతి మూడుసార్లు ముద్రింపబడినా ముక్కాకలు దీరిన పండితులు చూచినా నూర్లకొలది తప్పులు ఉండటానికి కారణం కదిరీపతి కథాకథనకౌశలమే అనుకున్నాను. తాళపత్రగ్రంథాలు వ్రాసినవారూ ముద్రణకోసం పరిష్కరించిన వారూ అందరూ కదిరీపతి చెప్పే కథల మాయాజాలంలో పడిపోయినారు. చెవులే కాదు కండ్లు గూడ అప్పగించినట్లున్నారు. కదిరీపతి కథలు చదువుతుంటే అన్వయంగురించి కాని యతిప్రాసలగురించి కాని అర్థావగతి గురించి కాని మనసు పోనేపోదు. కదిరీపతి తీర్చిదిద్దిన పాత్రలమీదనో రంకాడబోయి బొంకనేర్చినవారి మీదనో చిలుక అల్లే మాటలపందిరిమీదనో లేకపోతే కదిరీపతి ప్రయోగించిన పలుకుబడులమీదనో హాస్యోక్తులమీదనో దృష్టిపోతుంది. నాపని కూడ అంతే ఐనది. మనసు ప్రమేయం లేకుండా కేవలం కండ్లతోనే చదివితే అందులోని లోపాలు కొన్ని స్ఫురించినవి. ప్రెస్‌కాపీ సిద్ధం చేసేటప్పుడు కొన్ని, మొదటి సారి ప్రూఫులు చూచినప్పుడు కొన్ని, రెండోసారి ప్రూఫులు చూచినప్పుడు మరికొన్ని తోచినవి. మద్రాసునుండి వచ్చిన పాఠాల్లో 34మాత్రం గ్రంథం ముఖ్యపాఠంలో చేర్చి పూర్వముద్రణపాఠాలను అథోజ్ఞాపికల్లో చేర్చినాను. వట్టి పాఠాంతరాలను అథోజ్ఞాపికల్లోనే ఉంచినాను. నేను చేసిన 180 సవరణలను (   ) బ్రాకెట్లలో ఉంచి గ్రంథభాగంలో చేర్చి పూర్వముద్రణపాఠాలను అథోజ్ఞాపికల్లో పెట్టినాను. కదిరీపతి నిరంకుశంగా ప్రయోగించిన పదాల జోలికి గాని ప్రాణవంతంగా ఉండే వ్యావహారికపు పలుకుబళ్ళ సుద్దికిగాని నేను పోనే లేదు. అవి అట్లాగే ఉండటం మంచిదనుకున్నాను. పూర్వముద్రణంలో అథోజ్ఞాపికల్లో ఇచ్చిన అధికపద్యాలు యథాతథంగా ఉంచినాను. మద్రాసు వ్రాతప్రతుల్లో కానరాని గద్యపద్యాల సమాచారం మాత్రం తెలిపినాను. పూర్వముద్రణల్లో కథల సంఖ్య తప్పుగా ఉన్నది. 22వకథ తరువాత 36వ కథ అనీ దాని తరువాత వెంటనే 53వ కథ అనీ అటుతరువాత 89వ కథ అనీ ఇదేవిధంగా 42 వరకూ సంఖ్య

సాగిపోయినది ఈసంఖ్యలు సవరించినాను. బదరీపతి రాత్రుల సంఖ్యను దృష్టిలో పెట్టుకున్నాడనే భావంతో రాత్రులసంఖ్యలు సూచించినాను. ఇందులో 68రాత్రుల్లో చెప్పిన 27 పెద్దకథలు 9ఉపకథలు ఒక ఉపకథలోని ఉపకథ ఉన్నట్లు తెలిసింది. తృతీయముద్రణంలో ఇరువైయొకటో కథ 403-408పుటల్లో ఉన్నదే మరల 438-444 పుటల్లో కొన్ని అధికపద్యాలతో ప్రత్యక్షమైనది. ఈకథ ప్రస్తుతముద్రణం 387-390 పుటల్లో ఉన్నది. చెప్పిన కథే మరల చెప్పటం అనవసరమని భావించి పునరావృతమైన ఆకథను తొలగించినాను. అందులోని అధికపద్యాలను నా సవరణలతో ఇక్కడ పొందుపరుస్తున్నాను.

ప్రస్తుతముద్రణం పుట 388లో 93వ పద్యం తరువాత వచ్చే పద్యాలు.

సీ॥ రేయి దాల్చిన విరుల్ వ్రేలుకొప్పున జాఱ
  నగుమోము జిగి మించ నదికి నరుగు
వుక్కిటిపీడె మబ్బురపు నీటు ఘటింప
  కులుకు నెన్నడలతో గుడికి నరుగు
పయ్యెద వీడ గుబ్బల నిగ్గు గనుపట్ట
  నెమ్మితోఁ జుట్టము లిండ్ల కరుగు
పావడపై వ్రాఁతపని చీర రాణింప
  కొమరుతో వనభోజనముల కరుగు
నరుగుచో మంచి మగవాఁ డెదురను పడగ
వనిత తగ వాని నటు బిగాబగలఁ జూచు
సోగ కడకంటి నెఱవాఁడి సొంపుఁ దళుకు
బెళుకు చూపుల నయ్యిందుబింబవదన.

తే॥ ఇంట నేతెంచు చుట్టంపు బెమ్మెకాంద్ర
తరచుగాఁ బిల్చి చేరఁ దస్సరులు బలికి
తన్మనంబుల రాగకందళము లునిచి
యతిథియాతతమున వాడ నడలు పడతి.

సీ॥ దూతిక పట్ల నెంతో మైత్రి వాటించి
దాసికి మనసిచ్చి తగులు నెఱపి
సఖి యెడాటమున నిచ్చకముగా వర్తించి
[1](ధాత్రిని) గూడి మంతనము లాడి
ప్రాతివేశిని దన ప్రాణంబుగాఁ జూచి
లెంకలతోడ మాలిమి యొనర్చి
[2](శిల్పిని హృదికి) మచ్చిక బుట్ట నడపించి
తనకుఁ దా సాహాయ్యమును భజించి
యశ్రీకామాతులసుతాదులైన బంధు
గంధసింధురగమనల గారవించి
యేయుపాయంబులను గోర్కె యెనయ [3](లేని)
తన మహాంతఃపురాధివాసనకుఁ గనలు.

1. ధాత్రియు(పూ) 2. శిల్పినీరుదికి(పూ) 3. నేని(పూ)

సీ॥ తనివి దీఱఁగ నందతనయుతో రతికేళి
బెనఁగి గొల్లి గుబ్బెతల మనువు
చంద్రునంతటి నిండుజాణ కౌఁగిటఁ జొక్కి
తమిఁ గడతేర్చిన తార బ్రదుకు
[1](నేవగనైన) దేవేంద్రు నన్యుని గూడి
కాంక్షఁ జెందు నహల్య కాపురంబు
శివుఁగూడి తనివిఁ గాంచినయట్టి దారుకా
వనమౌనికాంతల వర్తనంబు
మెచ్చు గాక మఱేమి యీ మేనియందు
ననుభవించని సౌఖ్య మేలనుచు వనిత
యింటిలో నుండి చావడి నెవ్వరైన
సరసరీతి ప్రబంధముల్ చదివిరేని.

1. నేమగమిని(పూ)

ఉ॥ ఏవురతోడఁ గూడి రమియించగ భాగ్యముఁ జేసెఁ గావునన్
[1](ద్రోవది) మెచ్చవచ్చునని తొయ్యలి సంతసమందు నంతలో
[2](నౌ విభు లామృగాక్షికి) నిజాధిపుతోడ సుఖంబు గల్గ దీ
చ్ఛావిధి చేయు జారజనసంగతి గాకని యెంచు నిచ్చలున్.

1. ద్రౌపది(పూ) 2 నావిభుఁడా మృగాక్షికి(పూ)

95పద్యం తరువాత వచ్చే పద్యాలు.

తే. గున్నయేనుంగు మదరేఖ గూడినట్లు
తావి యామని [1](కెనసిన)దారి ధవళ
కరుఁడు పదియాఱు కళలతోఁ గదియు కరణి
వాఁడు నానాట నిండుజవ్వనముఁ గాంచె.

1. కెనసి(పూ)

తే. అపుడు జారగవేషణాయత్తమైన
లోలహృదయంబు వాని యుద్వేలకాంతి
కవయవో లక్ష్య దేహంబు గాంచి నిలిచి
తిమ్మటలు బట్టు బదలికల్ దీర్చుకొనియె.

సీ మునుపటివలె నుండఁజనదుగా యిఁక నొక్క
చెలిఁ బెం-డ్లియాడంగవలదె యనుచు
నితని కిత్తరిఁ బెండ్లి యేటికి యింక భో
గము చెల్వ లున్నారు గద యటంచు
పఱచులేవారి చిత్తరము బావించి చూ
డఁగ క్రొత్తకోడెకాఁ డౌట యనుచు (?)
వెఱవ నేటికి నట్టి విద్యల చవి యెఱుం
గఁడు గాని చొరఁబారఁగలఁ డటంచు

నొంటిపాటునఁ బలికి యాయువిద యమ్మ
చెల్ల! యీమాట లెవ్వరి చెవులఁ బడెనొ
యనుచు నాలుగు దిక్కుల నరసి చేరి
వాని నెమ్మది నాక వింతవలపు నెఱపు.

నాకు అర్థం కాని చోట్ల, సవరింపరాని చోట్ల బ్రాకెట్లలో ప్రశ్నార్థకాలుంచి విడిచినాను. ఎన్నడైనా ఎక్కడైనా శుకసప్తతి సమగ్రప్రతి దొరికిననాడు 70రాత్రుల కథలతో మేలైన పాఠాలతో దీనికి మెరుగులు దిద్దుకోవచ్చు. మొదటి మూడాశ్వాసాల శైలీకవిత్వమూ ఒకతీరుగా ఉన్నవి. నాల్గోఆశ్వాసం మరొక శైలితో ఉన్నది. కనుక నాల్గో ఆశ్వాసంలో మరొకరిచేయి పడిందేమో అని నా శంక.

శుకసప్తతిని పరిష్కరించే అవకాశం కల్పించిన ఆంధ్రప్రదేశసాహిత్య అకాడమీ అధికారులకూ, మద్రాసు వ్రాతప్రతులతో పోల్చిచూడటం మంచిదని సలహా యిచ్చిన మిత్రులు శ్రీతీర్థం శ్రీధరమూర్తిగారికీ, వ్రాతప్రతుల పారాంతరాలు సమకూర్చిన మిత్రులు డాక్టర్ చిన్నికృష్ణయ్యగారికీ, కన్నడంలోని శుకసప్తతుల సమాచారం అందించి ఆయాగ్రంథాలు సేకరించి పంపిన బెంగుళూరు యూనివర్సిటీ ఆంధ్రోపన్యాసకులు శ్రీరత్నాకరం శంకనారాయణరాజుగారికీ, కదిరీపతి పేర్కొన్న ప్రదేశాలగూర్చిన నా శంకలు తీర్చిన శ్రీహోసూరు K. S. కోదండరామయ్యగారికీ, ప్రెస్‌కాపీ వ్రాసి పరిష్కరణంలో నాకు తోడ్పడి ప్రూఫులు దిద్దిన శ్రీ.వల్లపురెడ్డి బుచ్చారెడ్డిగారికీ కృతజ్ఞుడను. పాఠకులు ముందుగా సవరణల పట్టిక చూడవలెనని ప్రార్థన.

కాళయుక్తి, మకరసంక్రాంతి — బి. రామరాజు

14-1-1979

శ్రీరస్తు

# శుకసప్తతి

## ప్రథమాశ్వాసము

### కృత్యాది

శ్రీకమలాక్షియై మెలఁగు సీత తటిద్రుచి నొంద లక్ష్మణ
శ్రీకరబాహుదండమునఁ జేర్చు ధనుర్లత యింద్రచాపశో
భాకృతిఁ దాల్ప మేరుశిఖరాశ్రయ నీరదలీల సింహపీ
ఠీకమనీయుఁడౌ జయపటిష్ఠుని శ్రీరఘురాము నెన్నెదన్ 1

మ. వరవామాంకమృగేంద్రపీఠి నెలమి న్వర్తించి ప్రాంచత్కృపా
కరవీక్షాంకురచంద్రిక న్సకలలోకశ్రేణి నీడేర్చుచున్
వరసౌభాగ్యధురీణయౌ జనకరాడ్వంశాబ్ధిజాత న్నవ
ర్ణరుచిస్ఫూర్తిసమేత సీతఁ ద్రిజగన్మాతం బ్రశంసించెదన్. 2

మ. మును శేషత్వముఁ బారతంత్ర్య మహిమంబుం దాల్చి లక్ష్మీప్రియుం
గని సేవించి యతండ రాముఁడయి జోకన్ ధాత్రి నుండంగ నిం
పున శేషత్వముఁ బారతంత్ర్యమహిమంబుం దాల్చి సేవించి మిం
చిన శ్రీలక్ష్మణదేవు నాత్మఁ దలఁతున్ శ్రీవాక్ప్రభావాప్తికిన్ 3

మ. సిరు లొప్పంగ రఘూద్వహుండు సుజనక్షేమంకరోద్వృత్తిమై
నరుదార న్మణిభద్రపీఠమునఁ గొల్వై యున్నచో ఛత్రచా
మరముల్ ప్రేమ వహించి చిత్త మలరింపం జాలి భక్తాళి బం
ధురపాపౌఘభయఘ్నులౌ భరతశత్రుఘ్నుల్ ననుం బ్రోవుతన్. 4

సీ. పరిపక్వసహకారఫలమా సముద్దండ
మహనీయమార్తాండమండలంబు
తూలికాఘటితకందుకమా నభశ్చుంబి
దృఢతరద్రోణధాత్రీధరంబు
క్రీడానివాసమా కృతశాంబరీభయం
కరనక్రవరగర్భగహ్వరంబు
బళిర యీ లీల యని సురల్ ప్రస్తుతింప
నంరి శ్రీరామచంద్ర పాదారవింద
వందనానంద రససుధాస్పందహృదయుఁ
డగు సుధీమంతు హనుమంతు నభినుతింతు. 5

క. వాణి న్వీణాపుస్తక
పాణిన్ శుకవాణి విపులభాసురపులిన
శ్రోణి న్నలభిన్మణిజి
ద్వేణిం గమలభవురాణి వినుతింతు మదిన్. 6

ఉ. ముద్దులు గుల్కు శైలసుత ముందఱ శైశవలీల నాడుచో
నొద్దిక నున్న తండ్రి తల యూఁచ జటామకుటాబ్జరేఖపై
నిద్దపు నబ్జమోహమున నెమ్మిఁ గరాగ్రము సాఁచు వేలుపుం
బెద్ద గణేశుఁ గొల్తు మదభీప్సిత కావ్యకళానిరూఢికిన్. 7

మ. కవితాకన్యకల న్సువర్ణసదలంకారప్రయుక్తిన్ యథా
ర్హవరప్రాప్తి నమర్చి కీర్తినిధులై యాచంద్రతారార్కమై
భువి వర్ధిల్లఁగఁ జేయు పుణ్యుల మదిం బూజింతు వల్మీకసం
భవులన్ వ్యాసులఁ గాళిదాసముఖుల న్మత్కావ్యసంసిద్ధికిన్. 8

తే. ధృతి దురాచారమతి నేకదృష్టి వలన
బహుపదార్థపరిజ్ఞానపటిమ లేక
కర్ణకటువుగ వదరెడు కాకవులను
గాకవు లటంచు నెంచి తృణీకరింతు. 9

వ. ఇవ్విధంబున నిష్టదేవతానమస్కృతియును సకలసుకవిజనపురస్కృతియును గావించి సమంచితసకలరసానుబంధబంధురంబగు నొక్క మహాప్రబంధంబు నకళంకరాకానిశాకరకరనికరానర్గళగళితసుధారసధారామాధురీధురీణవాగ్ధోరణీనిబంధనంబుగఁ జెప్పం బూనియున్న సమయంబున నొక్కనాఁటి శుభావహగరీయంబైన విభావరీతుర్యయామంబున. 10

సీ. మరకతంబుల యొప్పు మై నుప్పతిల నొప్పు
గోమువాఁ డెలనవ్వు మోమువాఁడు
వనజాతముల బింక మెనయు కన్గవ పొంక
మమరువాఁ డొక వింత కౌమరు వాఁడు
చికిలి క్రొంబగడంపు జిగిగుంపు రవణంపు
మోవివాఁ డెనలేని ఠీవివాఁడు
మిసిమి బంగరు చేల పసమించు కటి లీలఁ
జెలఁగు వాఁడు శుభాప్తి మెలఁగు వాఁడు
దివ్యకోదండశరకాండధృతకరాబ్జ
యుగమువాఁ డెన్నరాని సోయగమువాఁడు
జానకీలక్ష్మణుల తోడ స్వామి రాముఁ
డెలమిఁ గలలోన నా చెంత నిలిచె నంత. 11

క. కని విస్మయసమ్మోదము
లెనయ న్భయభక్తియుక్తహృదయుఁడ నగుచున్
వినయస్థితి నల్ల జగ
జ్జనకున కే నతు లొనర్చి సంప్రీతుఁడనై 12

క. ఉన్నతశీ నన్నుఁ జూచి ప్ర
సన్మానసుఁడై సుధారససదృశమృదువా
క్యోన్నతి శుకసప్తతి కృతి
చెన్నలర మదర్పణంబు సేయు కుమారా! 13

క. ఈవిధమున మా యనుమతిఁ
గావించితివేని సకలకవిబుధజనసం

జీవనమై నీ వంశము
పావనమై వెలయు మత్కృపానుహిమాప్తిన్. 14

వ. అని యద్దేవుం డానతిచ్చిన మహాప్రసాదం బని యంగీకరించి యత్యంత భయభక్తికరక్రమనమ్రశిరస్కుండనై సాష్టాంగనమస్కృతులు గావించి యానందబాష్పంబులుచిలుకఁ బులకాంకితగాత్రుండనై మేలుకాంచి యమందకందళితానందనిష్యందహృదయారవిందుండనై ప్రభాకరప్రభావిభాసురంబగు ప్రభాతంబున సౌశీల్యాదిమాంగల్యహేతుకాల్యకరణీయంబులు నిర్వర్తించి నిరంతరనితాంతతంతన్యమానకాంతికాంతదంతురితద్వారబంధసందానితగంధసింధురకరానీతశాతకుంభకుంభసంభృతాంభోవిజృంభమాణ ధారాభిషిక్తాంభోజవాసినీసంవాసితంబును నిశాత్యంతాసమానవాసవాసమాగతరోలంబకదంబవిలంబమానప్రసూనమాలికాలలితనానాసూనవర్ణనీయవర్ణవిచిత్రచిత్రాంబరవితానవిద్యోతమానంబును బృందావనాళిందకళిందనందనీనందనోద్యానపల్లవసుందరీసందోహానందవిహరమాణముకుందక్రీడావిలాసచిత్రితభిత్తిప్రభాభాసితంబును వినూత్నరత్నకంబళాస్తరణోపరిభాగవిన్యస్తప్రశస్తనిస్తులగాంగేయవిస్తీర్ణోదీర్ణసూర్యపుటోపధానశయ్యారమణీయంబును నటనటీగాయనగాయనీనాట్యసంగీతసందర్శనాకర్ణనోత్కంఠాయాతపురందరపురసుందరీసందోహవిభ్రాంతికృత్సాలభంజికాపుంజరంజితవలభీప్రదేశప్రభూషితంబును వేదవేదాంగాద్యనేకశాస్త్రరహస్యవిజ్ఞానధురీణవిపశ్చిన్మౌహూర్తికసుకవిగాయకమంత్రిపురోహితవిలసితంబును భరతమతంగదత్తిలకోహలాంజనేయ శార్ఙ్గదేవమతాదివివిధభరతశాస్త్రవిశారదకుశీలవలలితంబును గమలరాగోపలఫలకాయమానచూతనూతనపల్లవోల్లసితతోరణాలంకృతంబును హేమవాలుకాచూర్ణరంగవల్లీవిరాజమానప్రాంగణదేశదేదీప్యమానంబును సమంచితానవరతాగురుధూపవాసనావాసితంబునై విరాజిల్లు నాస్థానభవనరాజంబు వందిమాగధబృందంబు లందందకైవారంబు సేయం బ్రవేశించి బంధుహితామాత్యసామంతజనంబు లభ్యర్ణప్రదేశంబున వసియింపఁ బేరోలగంబున నుండి సముద్భటవీరభటరాహూత సంఘంబుల కొల్వుఁ గైకొని భూసురాశీర్వాదభాసురమంత్రాక్షతంబు లుత్తమాంగంబునన్ ధరియించి విద్వజ్జనంబులకు నమస్కరించి స్వప్నప్రకారంబు విన్నవించిన విన నవధరించి వార లిట్లనిరి. నీలనీరదశ్యామాకృతియగు రఘుపతి

ధనుర్బాణపాణియై మ్రోలనిల్చుటం జేసి దిగ్విజయంబును సకలజగన్మాత యగు సీత సందర్శనంబు వలన నిరంతరసంపత్పరంపరావాప్తియును నిజాగ్రజన్మసేవాశుభలక్షణుండగు లక్ష్మణవిలోకనంబు కతన గురు భక్తియును గలుగు నీ స్వప్నంబు వివిధశోభనప్రయత్నంబులు దెలుపు చున్నయది. నీ యట్టి కృతార్థున కిట్టి మహత్త్వంబు లబ్బుట యాశ్చర్యంబే? మహావంశసంభవుండవు ధైర్యస్థైర్యశౌర్యౌదార్యగాంభీర్యలతాలవాలంబగు భవద్వంశావతారం బభివర్ణించెద మాకర్ణింపుము. 15

తే. సారమై శౌరికేళికాసారమైన
పాలమున్నీటి వలన సంభవము నొందెఁ
గువలయామోదకారియై కుటిలచక్ర
హారియై సత్కళాధారియైన రాజు. 16

క. ఆ యమృతాంశుఁడు త్రిజగ
ద్గేయుండగు రౌహిణేయుఁ గిల్బిషహరణో
పాయున్ సంశ్రితనికరవి
ధేయు న్బుధనామధేయు ధీయుతుఁ గాంచెన్. 17

క. ఆతనికిఁ గల్గెఁ బురూరవుఁ
డతఁ డాయువుఁ గాంచె నహుషుఁ డా పుణ్యునకున్
సుతుఁ డతఁడు గనియెఁ దనయుం
దతవిభవోన్నతి యయాతిఁ దద్వంశమునన్. 18

మ. భువనాధారవిహారియైన హరి యాపుణ్యాత్ము నామంబుచే
భువి భాసిల్లు కులంబునన్ హరిహరాంభోజాసను ల్మెచ్చ సం
భవుఁడై ధాత్రి నరాతిజాతిభయకంపం బెల్ల వారించి సం
స్తవనీయుండన నొప్పె నాతఁడు యదుక్ష్మాభర్త పొల్చు న్మహిన్. 19

ఉ. ఆరసికావతంసకుల మాత్మసముద్భవహేతుభూతమై
ధీరతఁ బాలవెల్లి జగతిం దగెఁ దన్మహిమం బపారగం
భీరఘనాఘసంభరణభీమబలప్రతిభాప్తిఁ గాంతు నం
చారయఁ బాలవేకరికులాఖ్య వహించె నుదంచితోన్నతిన్. 20

ఉ. ఆమహితాన్వవాయవసుధాధిపు లచ్యుతగోత్రపాత్రు లు
ద్దామభుజాపరాక్రమవిదారితఘోరమదారివీరులై
భూమి భరించి రాన్నృపుల భూతిమహోన్నతి నేలె భోగసు
త్రాముఁడు తాడిగోళ్ళపురధాముఁడు శ్రీ పెదయౌబళుం డిలన్. 21

సీ. తనమాట శకయుగంధరలాటనృపవరు
ల్వినయోక్తిఁ గడు గారవించి మెలఁగఁ
దనకీర్తి దశదిగంతరపూర్తి నేవేళ
నిండారు పండువెన్నెలలు గాయఁ
దనధాటి రిపుమహీధవకోటి కద్రిగ
హ్వరకుటీరములఁ గాఁపుర మమర్పఁ
దనదాన మర్థిలోకనిదాన మనఁ గర్ణ
ఖచరామరాగవైఖరులఁ బొసఁగఁ
దనమహోగ్రప్రతాప ముద్దండచండ
భానుమండలి నారయ సౌభాగ్యవిభవ
రాజ్యలక్ష్మీసహాయుఁడై ప్రబలె రూప
భావజనిభుండు పెద్దయౌబళవిభుండు. 22

సీ. రాయదత్తాశ్వవారణరత్నవరరత్న
హారాంబరంబు లేయధిపుఁ డందె
నళిరామరాజేంద్రబలవద్రిపులఁ ద్రుంచు
కలని కేధీరుండు కర్తయయ్యెఁ
కదెరాకమునతెరక- [1]( మొదలుగా గల్గిన)
బహురాజ్యమే శౌర్యమహితుఁ డేలె

1 మొదలు గల్గు (పూ)

గురుదేవతాపాదరసరసీరుహార్చనా
పరత నేనిపుణుండు ప్రౌఢి గాంచె
నతఁడు వెలయు సమగ్రమహాహవోగ్ర
సప్తతి సహస్ర చాపభృత్సైన్యజితమ
[1] (దారిసత్కీర్తి సాంద్రుండు) తాడిగోళ్ళ
జలధిచంద్రుండు పెద్దయౌబళవిభుండు. 23

మ. నరచక్రేశుల నెంచి చూడ హనుమన్నాగారిచిహ్నధ్వజులై
పరబాణాసనచాతురిం గనిరి తత్ప్రాగల్భ్య మెంతంచుఁ దా
నరచక్రేశత రాయదత్తహనుమన్నాగారిచిహ్నధ్వజుఁడై
పరబాణాసనచాతురిం దనరె నోబక్షోణిపాలుం డిలన్. 24

సీ. క్రోడుగల్మొదలైన గురుతరగ్రామము
ల్మహిమఁ జెన్నగు భోగమండపములు
సరస గుబాళించు వరధూపవాసన
ల్వివిధరాజాన్ననివేదనములు
కట్టాణిముత్యాల గట్టి చౌకట్లు జో
డరుదైన నవరత్నహారలతలు
కడుదీప్తి మెఱయు నఖండదీపజ్యోతు
లనుపమసుప్రసూనార్చనములు

మొదలుగాఁ గల్గు కైంకర్యముల నమర్చె
శ్రీకరుండైన ఖాద్రి నృసింహమూర్తి
కెనయఁ బ్రహ్లాదుఁ డితఁడో యనఁగ భక్తి
గలిగి పెదయౌబళేంద్రుఁడు వెలయ జగతి. 25

క. ఆ పెద్దయోబనృపతికిఁ
గోపకసద్భాస్వదంశుకుముదీభవదా
ఘోపాంసమదవదరి
క్ష్మాపాలకుఁడైన నారశౌరి జనించెన్. 26

1. ధాహితెంగాగనుద్రుండు (పూ)

సీ. సత్కలానిధియైన జైవాతృకుఁడు రాజ
చక్రపాలకమైత్రి సలుపఁ డనుచు
జీవనం బొసఁగి రక్షింపఁ జాలు ఘనుండు
చంచలాత్మకత గద్దించు ననుచుఁ
దా భోగియై యనంతాభిధానుఁడు జగ
త్ప్రాణాపహారియై పరఁగు ననుచు
హంసాభిదైవతఖ్యాతజగన్మిత్రుఁ
డురుపుణ్యజనవృద్ధి కోర్వఁ డనుచు
జలజరిపు మేఘశేషసూర్యుల హసించి
కాంచె సతచక్రభరణ మార్జించె ధైర్య
మవనిఁ బాలించె సిర్జించె నరిజనాళి
నారసద్గుణహారి శ్రీ నారశౌరి. 27

చ. నలనిభుఁడైన యోబవిభు నారనృపాలుని యోలగంబునం
గలిత సుగంధమాల్యవసనంబులతో నెలవైన వక్కలా
కులె యొక రాయమన్నెదొరకుం దగఁ బెండ్లికిఁ జాలు నన్నచోఁ
దెలియఁగఁ దద్వదాన్యత నుతింప ఫణీంద్రునకైన శక్యమే. 28

సీ. తొలఁగినగతి సూడుదొరల ననాయాస
వర్ధితదుఃఖాశ్రు వర్షములకుఁ
గొలిచిన సరిమన్నె గురిపేరు లొనరించు
వరదానధారాప్రవాహములకు
నాశ్రయించిన భూసురాగ్రేసరులు సేయఁ
దొడరిన సవనాగ్నిధూమములకు
నిడిన సత్రముల నభీష్టమృష్టాన్నభో
జనజనజయజయశబ్దములకుఁ
దడిసి వరదలఁ బడియుండి కుడిచి బెగ్గ
డిలఁగ నేమిటి కిందని తెలిసి దాఁటి
యేడు వార్ధులు గడవెళ్ళ నీఁదె నౌర!
నారవిభుని యశఃకాంత నడత వింత. 29

క. మేరుగిరిధైర్యనిధి యా
నారనృపాలకుఁడు గనియె నయమార్గగుణో
దారుల వరవీరయశో
హారులఁ దొమ్మండ్రు సుతుల నతులితమతులన్. 30

క. ఆరమణీయయశోవి
స్తారులలో వినుతిఁ గాంచె సకలధరిత్రీ
భూరితరభారవహనో
దారభుజప్రబలుఁ డోబధరణిపుఁ డవనిన్. 31

సీ. వరదానవాగ్వైభవముల నీడనవచ్చుఁ
గర్ణుతో శేషదృక్కర్ణుతోడ
నంగసౌందర్యశౌర్యముల జోడనవచ్చు
మారుతో గిరిజాకుమారుతోడ
సులలితైశ్వర్యబుద్ధుల సాటి యనవచ్చు
భవునితోఁ గమలసంభవునితోడ
కలితసాహిత్యకీర్తుల సరియనవచ్చు
భోజుతో నిర్జితాంభోజుతోడ
ననుచుఁ దను గీర్తనమొనర్ప ననుపమాన
మాన[1](సౌజన్య సుగుణ) సన్మానదాన
ధర్మగుణముల శోభిల్లు తాడిగోళ్ళ
నారనరపాలు నోబళనాయకుండు. 32

చ. వననిధి మేటిదానమున వారిధికన్న ఘనంబు పెద్ద జీ
వనధిపయోధరంబులకు వాఃపతి బాఋ సముద్రవారివా
హనమకరేంద్రసైంధవుల కబ్జుఁడు మిక్కుటమాపగాధిరా
ద్వనధరపాశభృజ్జలజవైరుల తెక్కువ యోబళుం డిలన్. 33

1, నిధియైన నింద్ర (పూ)

సీ. ఘనములై ముక్తిసాధనములై మౌనిపా
        వనములై పొలుపొందు వనము లలర
శ్రుతులై పదార్థసంగతులై విలసదలం
        కృతులై విరాజిల్లు కృతులు దనర
మురువులై మున్నీటిహరువులై చూడ న
        చ్చెరువులై వెలయు బల్చెఱువు లొనర
నయములై మణిహేమమయము లై యుత్సవా
        లయములై మను సురాలయము లమర
ధరఁ బ్రతిష్ఠించి వెలసె సంగరధరోగ్ర
బహళహళహళనిభకోపగహనదహన
భీమరిపుభూమివిభుమనోభీకరుండు
నారభూవరు నౌబళనాయకుండు. 34

క. ఆవసుధాధిపు పట్టపు
దేవులలో సకలజలనిధిప్రావృతగో
త్రావలయదీనరక్షా
ప్రావీణ్యకళాప్తిఁ గాంచె బాలమ ధాత్రిన్. 35

సీ. మగనికి సకలసంపదలు గల్గ మెలంగి
        కమలయై నెగడె నీ కంబుకంఠి
ప్రజల సత్పుత్రుల పగిదిఁ గన్గొని యన్న
        పూర్ణయై తనరె నీ పువ్వుఁబోఁడి
యోర్పుగల్గి యొకింతయును గోప మెఱుఁగక
        ధాత్రియై వెలసె నీ తరళనయన
సుచరిత్రధర్మ మెచ్చోఁ బాయ కల యరుం
        ధతియై రహించె నీ నలిననయన
యనుచుఁ దనతోడి సతులెల్ల నభినుతింపఁ
బరఁగుఁ బరమపతివ్రతాభరణ మగుచుఁ
దాకిగోళ్ళౌబళక్షమాధవుని రాణి
భవ్యసద్గుణనికురుంబ బాలమాంబ 36

క. ఆరమణీమణివలనన్
గారవమున నోలవిభుఁడు గనియెఁ గుమారున్
ధీరుని నవమన్మథశ్రృం
గారునిఁ గరెమాణికేంద్రుఁ గరుణాసాంద్రున్. 37

మ. కరె మాణిక్యనృపాలుకీర్త్యుదధికిం గంజారితారాసము
త్కరము ల్ఫేనము లింద్రదంతి జలనాగం బీశతాలాంకని
ర్ఝరమౌన్యావళి నీరుపాపగమి భాస్వద్రత్నసాన్వాది భూ
ధరము ల్రత్నము లబ్జజాండములు మత్స్యాండంబు లయ్యెన్ ధరన్. 38

సీ. ఏవదాన్యుఁడు రామదేవరాయల సరి
గద్దియ నొడ్డోలగమున నుండె
నేమనుజాధీశుఁ డితరనృపాలరా
జ్యస్థాపనాచార్యుఁడై చెలంగె
నేపరాక్రమవంతుఁ డెదిరిన శత్రుభూ
పాలుర నడవుల పాలుపఱిచె
నే మహామహుఁడు శ్రీరామనామధ్యాన
నిష్ఠాగరిష్ఠప్రతిష్ఠ గాంచె
నతఁడు చతురబ్ధివలయితకుతలభార
భరణవిభవప్రచురబాహుబలవిహారి
తాడిగోళ్ళాబళనృపాలతనయమౌళి
నీతిగిష్పతి కరియమాణిక్యనృపతి. 39

క. అల కరెమాణిక్యేంద్రుని
బలుధాటికి నల్కి యవనపతు లందఱు న
వ్వలయాచల పశ్చాత్స్థలి
నిలువఁగఁ బాశ్చాత్యు లనెడు నియతి ఘటిల్లెన్. 40

. తాళి చౌకళి కుంచె కాళాంజి చామర
ద్వయము ముత్తెపుఁ దుథావాఘానము ఫి

రంగి కత్తి మొదలౌ రామరాయక్షమా
వరదత్త బిరుదాంకవార మంది
కదనభూతలభయంకరకరాగ్రసమగ్ర
కరవాలహతరిపూత్కారుఁ డనంగఁ
దాడిగోళ్ళన్వయోదధినిశాకాంతుండు
కరియమాణిక్యభూకాంతుఁ డలరు
నభయదానార్థనతవినుతావనీశ
పాకభిల్లోచనానందబాష్పకణము
రందబంధురపాదారవిందుఁ డగుచుఁ
జక్రవాళావృతాచలచక్రమునను. 41

క. ఆ కరెమాణికరాయ
క్ష్మాకాంతుని కాంత లమితకమనీయశుభ
శ్రీకాంతలు సంపత్స
ద్మాకాంతలు నల్గు రెన్నఁ దనరుదు రెలమిన్. 42

తే. అందు లచ్చమ్మ లచ్చమ్మయగు గుణమున
వలపురాచమ్మ రాచమ్మ కలిమి కెలన
ధృతకురంగమ్మ రంగమ్మ పతిహితమున
నా సుభద్రమ్మ భద్రమ్మ యాదరమున. 43

శా. శ్రీకృద్ధికరెమాణికేంద్రుఁ డినధౌరేయుండు తేజోఘనుం
డాకాంతామణులందుఁ గాంచెను వసంతాధీశు రామాధిపుం
బాకారిప్రతిమానవైభవయుతు న్నారప్రభు న్నారదా
శ్రీకంఠాభయశోవిశాలుఁ గమరోర్వీపాలు లీలాంగజున్. 44

క. అం దగ్రజుండు వెలయుఁ బు
రందరభోగాఢ్యుఁ డమలరమణీయయశః
కందళజితముక్తాహరి
చందనమందారుఁ డన వసంతేంద్రుఁ డిలన్. 45

చ. సమరదిలీపుఁడై తగు వసంతనృపాలుని కీర్తిశౌర్యముల్
సమరసధర్మమార్గణవిశాలవితీర్ణిమ నంటి జంటగాఁ
గమలభవాచ్ఛభానుకరకాంతిత యెంతని పంతగించె నా
క్రమకలధౌతభూధరవికస్వరరూపము లేపు మీఱఁగన్. 46

క. ఆధన్యున కనుసంభవుఁ
డై ధాత్రి భరించి భీకరాకృతి రిపురా
డ్భూధరసంఘాతేంద్రా
ణీధవుఁ డన రామమేదినీధవుఁ డలరున్. 47

మ. సమరక్షోణిని రామభూవిభుఁడు భాస్వల్లీల ఖండింపఁ ద
ద్విమతాధీశ్వరకంధరక్షతటినీవేగాహతిక్షుబ్ధవా
ర్ధిమహారావచరత్తటిద్రుశకముల్ ద్విపక్షమాపాలనా
ర్థము గట్టించిన తోరణంబు లనఁగా రంజిల్లు నల్దిక్కులన్. 48

తే. ధాత్రి తనకీర్తి రంజిల్లు తాదిగోళ్ళ
రామభూపతి శ్రీరంగరాయదత్త
మత్స్యమకరధ్వజాఢ్యుఁడై మధురధర్మ
భరణత రహించు రతిమనోహరుని కరణి. 49

సీ. తన గుణలతికాకదంబకంబునకు లో
కాలోకనగ ముపఘ్నంబు గాఁగఁ
దన శౌర్యచండభానుని కరాతిధరాధి
నాథులు ఘూకసంతతులు గాఁగఁ
దన దానసంతానమునకు శుభ్రాంశుధా
మములు భాస్వత్ప్రసూనములు గాఁగఁ
దన కీర్తిబాలకు వనజజాండకటాహ
మెల్లప్పటికి బొమ్మరిల్లు గాఁగఁ
బరఁగు రణరంగరంగదభంగజవతు
రంగసారంగయోధశతాంగధుతప

రాగపరిభూతభీతారిరాజచయుఁడు
తాడిగోళ్ళపురీరామధరణివిభుఁడు. 50

మ. ధర రామక్షితిపాలు సెల్వున వసంతత్యాగకాలంబునన్
వరమాణిక్యపు రాసులెల్ల భటవిద్వద్యాచకుల్ వచ్చి యం
దఱు నొక్కుమ్మడిఁ గొల్లలాడి కొనిపోఁ దచ్ఛేషముం దా నిజో
దరమం దుంచుక రత్నగర్భయను బ్రోద్యత్సంజ్ఞచే మించదే. 51

క. ధామనిధితేజుఁడగు నా
రామనృపాలకుఁడు శరపరాభూతమహా
భీమరిపుస్తోమవపుః
స్థేముని రఘునాథవిభునిఁ జెల్వుగఁ గాంచెన్. 52

సీ. తన సదాచారంబు తన సదాచారంబు
సరణి నానాఘనోత్సవ మొనర్పఁ
దన శుభాలోకంబు తనశుభాలోక మ
ట్లతిలోకబాంధవోన్నతి ఘటింపఁ
దన కలావిభవంబు తన కలావిభవంబు
మాడ్కిని సర్వజ్ఞమౌళి నెనయఁ
దన సన్నిధానంబు తన సన్నిధాన మ
ట్లనవద్యతరనిరంజనత వెలుఁగఁ

బరఁగు యుద్ధధరిత్రీద్ధపటుపటహవి
జృంభణార్భటీదళితదిక్సింధురాళి
కుంభముక్తౌఘగుంభితకువలయుండు
రామభూపాలు రఘునాథభూమివిభుఁడు. 53

చ. నరనుతమూర్తియైన రఘునాథనృపాలుని కీర్తిసంఘ మా
హరిశరజన్మహంసభవహారివిలాసము తత్ప్రదాన మా
హరిశరజన్మహంసభవహారివిలాసము తత్ప్రతాప మా
హరిశరజన్మహంసభవహారివిలాసము ధాత్రి నెన్నఁగన్. 54

ఉ. ఆరఘునాథభూమివిభుఁ డంబరభూజసమీభపత్త్రన
ద్ధారవకీర్తియై కొలువఁ గంసహరాంశభవుండు రామధా
త్రీరమణుం డనేకజగతీపరిపాలతఁ బూనె సద్గుణా
వారణలీల సర్వజనవర్ణితదానకళాకలాపుఁడై. 55

క. ఆరామశౌరి తమ్ముఁడు
నారనృపాలకుఁడు వెలసె నక్షత్రశర
ద్ధారాధరతారావర
హారామరతరుహిమాచలాంచద్యశుఁడై. 56

మ. ఆరిపద్మంబులచే మహోత్పలకళోద్యద్వృద్ధి చిత్తంబులం
బరమాహ్లాదముఁ జెందవచ్చు మదిలో భావించి రేఱేఁడు భా
స్కరతేజుండగు నారభూవిభుని సచ్ఛత్రాకృతిం దాల్చి తా
నరిపద్మంబుల మైత్రి గన్గొనియె నాత్మాలోకమాత్రంబునన్. 57

సీ. సురసరిత్పురహరస్థిరశరద్ఘనవయ
శ్శరనిధిచ్ఛవికనచ్చటులకీర్తి
ఘనరటత్పటహనిస్వనవినిర్దళితశా
త్రవపురప్రకటవప్రనికరుండు
రణవిఖండితరిపుప్రభుగళస్రవదసృ
క్తరసప్రకరపూరితపయోధి
సలిలభృజ్జలజభిజ్జలధికల్పకవిక
ర్తనసుతస్తవనీయదానయుతుఁడు
మన్నెమాత్రుండె నిజపాదమంజుకటక
ఘటితపటురత్నపటలవిస్ఫుటవిదృశ్య
మానమత్తారిరాజన్యమస్తకుండు
నారభూపాలుఁ డమితసన్నహనబలుఁడు 58

శా. ఆపృథ్వీపతి సోదరుండు కమరక్ష్మాధీశవర్యుండు యో
షాపంచాస్త్రుఁ డనంతభూషణవిశేషస్ఫూర్తియుం బ్రాప్తల

క్ష్మాపాలత్వముఁ గల్గి సజ్జనగణశ్రేయస్కరోద్యోగుఁడై
దీపించున్ శివకేశవాంశజుఁ డనన్ దివ్యప్రభావోన్నతిన్. 59

సీ. పద్మాప్తపద్మాప్తపద్మాప్తతుల్యుఁ డే
ఘనుఁడు సంపత్కృపాకలితరుచుల
హరిణాంకహరిణాంకహరిణాంకసముఁ డే ర
సానాయకుఁడు బలైశ్వర్యకళల
హరిరాజ హరిరాజ హరిరాజనిభుఁ డే నృ
పాలుండు శౌర్యోక్తిభక్తిరతుల
మకరాంకమకరాంకమకరాంకసదృశుఁ డే
ఘనుఁడు దానాకారగౌరవముల
నతఁడు గుణధాముఁ డభిరాముఁ డర్కధాముఁ
డమితజయభీముఁ డుద్దాముఁ డరివిరాముఁ
డతులవైభవసుత్రాముఁ డనఁగ భద్ర
నాముఁ దలరారుఁ గదురభూనాయకుండు. 60

క. సంగరజయుఁడగు కదురనృ
పుంగవు వాక్కీర్తులలరె భూస్థలి హరజూ
టాంగనటద్గాంగరటఁ
ద్భంగాభంగోత్థనినదధవళద్యుతులన్. 61

చ. హరనరవాహవహ్నిహరు లాకదురేంద్రుని కీర్తిదానశౌ
ర్యరసకృపావిశేషముల కల్కి కృశించి కురూపియై సదా
మొరయుచుఁ జాల నల్లనయి భూమిధరంబున మూలఁజట్ల సా
గరమున విశ్రమింప నొదుగం దిరుగంబడియుండఁ జూడరే! 62

క. ఆమహిమాఢ్యునకుఁ బురం
ధ్రీమణియగు కదురమాంబ దీనావనయై
శ్రీమెఱయ మహిని వర్ధిలు
తామరసాక్షునకు వార్ధితనయ యనంగన్. 63

సీ. తా రత్నగర్భాభిధానయయ్యును విభు
నప్పుల జాయి మోయంగఁ జేసెఁ
దాఁ గల్మి యొసఁగెడు తరుణి యయ్యును నిజ
ప్రాణేశుఁ బసులకాపరిగఁ జేసెఁ
దా జనకజయయ్యు ధవునిఁ గారడవిలో
జనకవియోగాప్తి నెనయఁ జేసెఁ
దా హైమవతియయ్యుఁ దనమనోనాథునిఁ
బునుకపేరులు దాల్చుకొనఁగఁ జేసె

నని ధరాదేవి నిందిర నవనికన్య
నచలజాతను నిరసించి యాత్మపతికిఁ
గీర్తితాభీష్టవైభవస్ఫూర్తి లొసఁగు
వదనజితపూర్ణశశిబింబ కదురమాంబ. 64

తె. పరమగుణశాలి కదురనృపాలమౌళి
కదురమాంబికయందు శృంగారనిధుల
నందనులఁ గాంచెఁ గదురభూనాథు నిన్ను
వేంకటాగ్రణి నతిదానవిబుధమణిని. 65

చ. ఇననిభ తాడిగోళ్ళ కదురేంద్రుని శ్రీకదురావనీశ! నీ
యనుజుని వేంకటక్షితివరాగ్రణి నెన్నఁ దరంబె ధాత్రిపై
ననయముఁ దత్ప్రతాపజలజాప్తునిచే వలయాద్రిరాడ్విలం
ఘన మగు శత్రుభూభుజులు గాంతురు సత్పథసౌఖ్యసంపదల్. 66

సీ. అనిమిషావాస సంప్రాప్తిఁ జెందని వారి
కనిమిషావాససంప్రాప్తి యొసఁగె

విషధరస్థలి నుండ వెగటైన వారికి
విషధరస్థలి నుండ [1](వెగటు) మాన్పె
స్వస్థానవిహరణాసహ్యులౌ వారికి
స్వస్థానవిహరణాసహ్య ముడిపెఁ
దతమహాబిలం [2](పదస్థితి) లేని వారికిఁ
దతమహాబిలపదస్థితి గడించె
నౌర తొలుదొల్త డాసి యొమ్మదిమి గదిమి
చించి చెండాడి గాసిఁ జేసినది యయ్యొ
విమతతతిపట్ల కదురభూపతుని వేంక
టాద్రిగణి కరాసి యెంత దయాంబురాశి. 67

చ. సరసతఁ దాడిగోళ్ళపురశాసనుఁడై తగు వేంకటప్రభుం
డరివిజయప్రయాణసమయానకనాదవిధూతతారకాం
బరమున కాత్మఖడ్గహరమర్దితశాత్రవహస్తిమస్తకో
ద్ధురుచిరమౌక్తికప్రతతి తారల పెక్కు ఘటించు నిచ్చలున్. 68

సీ. నవనవాగతశీతపవనవారమహోగ్ర
దవలవావళి చేత దర్పు ముడిగి
తలతలావృతసుకోకిలకులాననగళ
త్కలకలారభటిచేఁ గడుఁ గలంగి
ప్రసవసారసితసారసరసాశనమత్త
భసలసాధ్వసముచే భంగ మంది
స్మరశరాసనసముద్ధురశరాకులమన
స్సరసరాగముచేత శయ్య నొరగి
ధరణి నెఱిఁగింతు రీరీతిఁ దాడిగోళ్ళ
కదురవిభు వేంకటేంద్రుని కదనధాటి
కలికి దుర్గమకాననస్థలులఁ బడిన
యాత్మనాథులపైఁ దమి నహితసతులు. 69

1 వెఱఁగు (పూ) 2 పదస్థలి (పూ)

ఉ. శ్రీనిధి తాడిగోళ్ళకదిరీపతిరాయని వేంకటక్షమా
జాని జయప్రయాణపటుసంభ్రమసంభృతభూరిభేరికా
ధ్వాన మమర్త్యలోకవనితాజనము ల్విని నూతనప్రియా
నూనసుఖోన్నతుల్ గలుగునో యని యెంతురు సమ్మదంబునన్. 70

ఉ. ఆయనుజుం డఖండ విభవాఢ్యుఁ డమందముదం బొనర్ప నా
రాయణపుణ్యమూర్తివయి రంజిలి తీవు శుభైకశాశ్వత
శ్రీయుత తాడిగోళ్ళ కదిరీపతినాయక వేంకటాంబ య
త్యాయతకీర్తిపూరితదిగంతర పట్టపుదేవివై తగన్. 71

చ. అమితయశఃపయోధి కదురాధిపు శ్రీకదురక్షితీంద్ర చి
త్రము విను మొక్కవార్త సమగస్థలి దుర్మదవద్విరోధిరా
ట్సమదభవద్భయంకరభుజప్రవిభాసికరాసి సంహతి
న్విమతుల కంఠరక్తము స్రవించి ద్రవించు మనంబు రంభకున్. 72

సీ. మేఘంబు లేని క్రొమ్మెఱుంగులు కుముదారి
లేని యెండలు వార్ధి లేని బాడ
బములు సురాద్రిలేని మణిసానువు లర
ణ్యములేని దావానలములు కొలను
లేని కెందమ్ములు మ్రానులేని చివుళ్ళు
గనిలేని కెంపులు మనసిజారి
లేని కన్మంటలై లీల నిండెను ధరా
స్థలి నౌర యుష్మత్ప్రతాపరుచులు
దహనసహకారకారాజదర్పహరణ
రణమహాభీమ భీమాబ్జరమ్యకీర్తి
కీర్తితాలోక లోకైకకీర్తనీయ
ఘనగుణకలాప కదురేంద్రు కదురభూప! 73

క. తతరణమున నీ విమత
క్షితినాథు లనంతధనముఁ జెందరె భయసం

యుతులై నతులై హితులై
గతకల్మష తాడిగోళ్ళ కదురనృపాలా! 74

చ. అమృతము శీతభానుగత మన్నది కాదు తృణస్థితం బటం
చమలమతి న్వచింతురు మహాత్ములు కాదనిరేని నీ రిపుల్
రమణఁ దదాప్తిమాత్రమున రక్షితులై మనుటెట్లు ధాత్రి భూ
రిమహిత తాడిగోళ్ళ కడిరీపతినాయక లోకపాలకా! 75

సీ. తన పేరురంబు ద్రొక్కినవాఁడు సిగ్గుచే
సరిగాక తలలెత్త వెఱవ లేదొ
తన తలఁ దన్ని నిల్చినవాఁడు సామ్యంబుఁ
జెందలేక కృశత్వ మందలేదొ
తన వాలుజడల నుండు నది దీటుపరాక
బెట్టుగాఁ బెను మొఱ్ఱ వెట్టలేదొ
తను మోచి తిరుగఁ జొచ్చినది తుల్యము గాక
ఘనభయంబునఁ బారి గఱవలేదొ
తాను సరిచనఁ దలఁచి నీధవళకీర్తి
కెనయఁగా లేక సగమయ్యె నీశుఁ డతఁడు
వసుధ సర్వజ్ఞుఁడెట్లు సర్వజ్ఞమౌళి
కంజశరరూప కదురేంద్రు కదురభూప! 76

క. ధర్మగుణకలితమార్గణు
లర్మిలి నీచర్య లెంచ నలరితి వౌరా
ధర్మగుణ కలితమార్గణ
నిర్మథితవిపక్ష కదురనృపహర్యక్షా! 77

సీ. కావ్యనైపుణి శబ్దగౌరవప్రాగల్భ్య
మర్థావనాసక్తి యతిశయోక్తి
నాటకాలంకారనయమార్గసాంగత్య
సాహిత్యసౌహిత్యసరసముద్ర

సకలప్రబంధవాసనసువాక్ప్రౌఢిమా
న్వితచతుర్విధసత్కవిత్వధాటి
లక్ష్యలక్షణగుణశ్లాఘ్యతాపటిమంబు
నైఘంటికపదానునయనిరూఢి
గనిన నీకు నసాధ్యంబె గణుతి సేయ
ధాత్రి శుకసప్తతి యొనర్పఁ దాడిగోళ్ళ
ఘనకులకలాప కదురేంద్రు కదురభూప
చెలఁగి వాక్ప్రౌఢిచేఁ గృతి సేయు మనని.

వ. అని విద్వజ్జనంబు లానతిచ్చిన నేను నమందానందరసభరభరితహృద
యారవిందుండనై. 79

క. కుంభిన్యాత్మభవాకుచ
కుంభపరిరంభణాత్తకుంకుమపంకో
జ్జృంభితసంకుమదాగురు
శుంభద్వక్షునకు భానుసుతరక్షునకున్. 80

క. బంధురదశకంధరగ
ర్వేంధనజిద్గంధవాహహితునకుఁ జటుద
ర్పాంధకహరబంధునకుఁ గ
బంధాసురనిబిడతిమిరభాస్వంతునకున్. 81

క. చండద్యుతినిభమణిమయ
కుండలున కజాండభాండకోదండకళా
మండలపండితదనుజా
ఖండలఖండనసమర్థఘనకాండునకున్. 82

క. భర్గేష్వాసనదళనా
నర్గళదృఢబాహువీర్యునకుఁ బూర్వవచో
మార్గచరిష్ణుమునీశ్వం
వర్గప్రణుతానివార్యపరచర్యునకున్. 83

క. షడ్వదనజనకసుమనో
రాడ్వినుతచరిత్రునకును రాజద్గాత్ర
త్విడ్విజితాదిత్యునకు వి
రాడ్విగ్రహధామునకును రఘురామునకున్. 84

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నా యొనర్పం బూనిన శుకసప్తతి యను మహాప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన. 85

## -: కథాప్రారంభము :-

క. వెలయు నలఘుప్రభావో
జ్జ్వలుఁ డింద్రప్రస్థపురి నసామాన్యమహః
కలితదృఢబాహుబలని
ర్దళితాహితరాజు ధర్మరాజు ధరిత్రిన్. 86

చ. అతఁ డొకనాఁడు నిండుకొలువై బలవైరిమహోన్నతి న్మరు
త్సుతుఁడుఁ గిరీటి మాద్రితనుజు ల్తనదండన యుండి కొల్వ రా
జతతికిరీటకోటివిలసన్మణిమంజులదీప్తిపుంజరం
జితచరణుండు ధర్మజుఁడు చెంత వసించిన ధౌమ్యు నిట్లనెన్. 87

క. తెలివిగల భూసురుండవు
కులగురుడవు మాకు మౌనికుంజర ![1] (యిట)మీ
యలఘుమతి నొక్క కార్యము
తెలియ న్వివరింపవే సుధీజనతిలకా ! 88

ఉ. భామల చిత్తము ల్దెలియ బ్రహ్మకునైన వశంబు గాదు త
త్కామితయత్నము ల్దలఁప ధాత్రి విచిత్రము లెంద్రు కావున
న్నామది యేతదీయకథనంబు[2] వినం గడఁగె న్మహీసుర
గ్రామణి ! యానతిమ్మనుచు రాజవిడౌజునితోడ వేడుకన్. 89

1. వినుమీ (పూ)
2. నెఱుంగుట కిచ్చగించెడిన్, తామసమింతలేక నెఱుఁగం దగఁ దెల్పుము భూసురోత్తమా ! వ. అనియు పాండవేయుండు అతివినయగంభీర మధుర భాషణంబుల ధౌమ్యు నుద్దేశించి యానతిం ధనిన.

వ. అప్పు డాధౌమ్యమహర్షివర్యుండు నిరవధికకుతూహలధుర్యుండై (న ధర్మజున
కి)ట్లనియె. స్త్రీజనంబుల చిత్తంబులు లోకాతీతదుర్వృత్తంబులు తదీయకృత
సాహసకార్యంబు లనివార్యంబు లగుట నిక్కువం బిందులకు నొక్క యితి
హాసంబు గలదు. తొల్లి మహాదేవుండు పార్వతీవరారోహ కతిరహస్యంబున
నాన తిచ్చిన తెఱం గెఱింగించెద సావధానుండవై యాకర్ణింపు మని
యిట్లనియె. 90

సీ. సౌధాగ్రతలకేళిజాగ్రన్మృగేక్షణా
స్ఫుటదృశ్యమానేంద్రపురవరంబు
జగతీదదృక్షభౌజగవర్గనిర్గమ
ద్వారాయితస్వచ్ఛవారిఖే
మబ్జినీకాంతకుద్ధాంతిభవత్త్వాంత
సంతతోదారకాసారవార
మిందిరాసుతభవ్యమందురానీకర
మ్యామోదకారణారామసీమ
యంద మగు మేరుమందరాహార్యమధ్య
తలమహీమండలమున నుద్దామభీమ
మేదురోద్భటభటసింహనాదచలిత
దిగ్గజవరంబు పద్మావతీపురంబు. 91

క. ఆనగరి న్విభవపతి
భానగరిపుఁ డైన చిత్రభానుం డేలు
న్మానక మృదకరదమరుస
మానకరవ మరుల గిరుల యఱుతం జేర్పన్. 92

మ కలలో నైనను బల్కఁ బొంకఁడు సమగ్రక్రోధమోధారిరా
డ్బలముం గన్గొని చీకికిం గొనఁడు దుష్పాండిత్యము త్నేరఁడు
జ్వాలదుజ్జృంభకుటాంగవైఖరుల తేప న్మార్గికిం దర్పుఁడై
ఫలదం బొప్పడుఁ జిత్రభానుఁ డతఁ డేతన్మాత్రుండే చూడఁగన్. 93

వ. [1]వెండియు నన్నరేశ్వరుండు 94

సీ. చంద్రమతీనాథు చందాన నలునివై
ఖరిఁ బురుకుత్సుని గతిఁ బురూర
వునిమాడ్కి సగరులాగునఁ గార్తవీర్యుని
యనువున గయునట్టు లంబరీషు
పొలుపున శశిబిందువలె నంగుపోలికఁ
బృథుని భాతి మరుత్తురీతి భరతు
కరణి సుహోత్రుని హరువున రఘులీల
రామునిక్రియ భగీరథునిఠేవ
శిబితెఱంగున మాంధాతచెలువమున య
యాతి[2](జోక) దిలీపు మర్యాద రంతి
సరణిఁ బాలించి యలరు నాచక్రవాళ
వసుమతీచక్ర మమ్మహీవల్లభుండు. 95

మ. అకలంకప్రతిభాప్రతాపవిభవుం డారాజకంఠీరవుం
డొకనాఁ డంతిపురి స్సువర్ణవలభి ప్రోన్మీలమై కెంపుమా
నికపుం బొమ్మల నొప్పు పెండ్లి చవికె న్నీలంపు జాగద్దియం
బికవాణీనికరంబు గొల్వ సుముఖాప్తి న్నిండుకొ ల్వుండఁగన్. 96

క. ఇఱుకు వలిగుబ్బచన్నుల
యెఱుకుం జవరా లొకర్తె "యెఱుకోయవ్వా
యెఱుకో" యని తనచందం
బెఱుకపడంగా హజార మెలమిం గదిసెన్. 97

వ. అప్పు డప్పడంతుక తెఱం గమ్మహీంద్రుండు పరిచారికాజనంబుల వలన విని,
విన నవధరించి సమ్ముఖమ్మునకు రావించిన 98

1. అష్టావధానంబున నుండి యన్నరేశ్వరుండు
2. రీతి(పూ)

సీ. సవరనిపని వన్నె అవిక పిక్కటిలంగఁ
గులుకు పొలుబ్బు గుబ్బలు చెలంగ
ముంజేతులను ముఖాంబుజమున నొకవింత
పొలుపు దెల్పెడు పచ్చబొట్టు లెసఁగఁ
గులుమాఁపు పయ్యెంట చెఱఁగులో నిడుకొన్న
ముద్దుఁ బల్కుల చిన్నిబుడుతఁ దమరఁ
దరతరంబులనుండి తనయింట వెలయు పు
త్తడి[1] పైఁడి బుట్ట మస్తమున వెలుఁగ
బొమలసందున నామంబు భూతిపూఁత
నెన్నొసఁటఁ బుక్కిట విడెంబు కన్నుఁ గొనలఁ
గాటుక రహింప వచ్చి యా ఘాతలేంద్రు
చరణముల కోరగా మ్రొక్కి చక్కనిల్చి. ౯౯

క. ఇది దారికట్టు మొనక
ట్టిది కాంతావశ్యకరణ మిది నీ మది కిం
పొదవించు నో నరేశ్వర !
పదిలం బని తెల్పి కొన్ని బదనిక లొసఁగెన్. 100

క. తలఁపున నిది గారడ మని
తలఁపకు మాసింగఁ దల్లతటిగొండ దరిన్
దలమోచి తెచ్చినవి యివి
తల నుంచుము పసిఁడి తాయెతల నుంచి నృపా ! 101

వ. అని[2] విన్నవించిన యమ్మత్తకాశినీకరాంబురుహదత్తం బగు నయ్యుత్తమ దివ్యౌషధత్రయంబు రయంబునం గ్రహించి కరుణావలోకనపరుండై ప్రియ వినయగంభీరభాషణంబుల నిట్టులనియె. 102

1. బుట్టి తనదు మస్తమున వెలుఁగ 2, ఝొసంగిన

శా. ఏయేభూములు[1] చూచినావె కొరవంజీ రూపలావణ్యరే
ఖాయుక్తిం దగు కొమ్మ లెందుఁ గల రీక్ష్మామండలిన్ హావభా
వాయత్తైకవిలాసవైఖరుల [2]మే లందెవ్వరిం జెందు న
య్యాయావార్తలు దెల్పవే మది కమందానంద[3]ముం జెందఁగన్. 103

వ. అనిన విని యితండు చతుర్విధనాయికానాయకుండును బహువిధశృంగార శేఖరుండును సకలకలాధురంధరుఁడు నగునని తన మనంబున వితర్కించు కొని యతని కిట్లనియె. 104

సీ. కల్కిచిల్కల పోల్కిఁ గనుపట్టు శృంగార
నటన గుల్కెడు తూర్పునాఁటి చెలులఁ
బులుగడిగిన ముత్యములఁ బోలి గరగరి
కలు వహించిన పాండ్యకమలముఖులఁ
జిత్రరేఖలఁ దారసిలు చక్కఁదనమునఁ
రాజించు కన్నడరాజ్యసతులఁ
బగడంపు జిగి సొంపు తగు తనుద్యుతి పెంపు
నలరెడు యవనశీతాంశుముఖులఁ
గుందనంపు సలాకల యంద మొందు
నంధ్రకన్యల నిదిగాక యంగవంగ
కుకురుసౌవీరసౌరాష్ట్రకోకకుచల
వింత లన్నియుఁ గనుఁగొంటి విను నరేంద్ర ! 105

తే. దేవ! నవఖండమండల శ్రీవిజృంభ
మాణ మగు నివ్వసుధఁ గల్గు మానవతుల
వరుస నందఱఁ గనుఁగొంటి వారిలోన
రేఖ గల యొక్క చెలి నేర్పరింతు వినుము. 106

---

1. జొచ్చినావె, తిర్గినావె 2. మే లి దెవ్వరిం జెందునో, యాయా
3. మొందం దగన్, మింపొందఁగన్

ఉ. ఆ నగరీవతంసమున[1]నే తగువైశ్యుఁ డొకండు శాశ్వత
శ్రీనిధిగేహుఁడై మదనసేనుఁ డనం గలఁ డద్భుతైకశో
భానవమోహనాకృతి ప్రభావతి వాని పురంధ్రి యొప్పు నో
మానవతీమనోజ! యసమానవయఃపరిపాకవైఖరిన్. 107

ఉ. దాని ఘనాఘనద్యుతివితానకనద్ఘనకేశపాశమున్
దాని లసద్బిసప్రసవధాళధళీచకితేక్షణంబులున్
దాని సుగంధగంధిలసుధారసబంధురమందహాసము
ల్మానవనాథ! మెచ్చుటకు మర్త్యు లమర్త్యులు నైన శక్తులే. 108

క. ఆ మృదులోరువిలాసం
బా మోహనముఖవికాస మాదరహాసం
బామెడ యానడ యాజడ
యామేని మెఱుంగు రంగు నలవియె పొగడన్. 109

సీ. ఘుగఘుగవాసింపఁ బొసఁగు పుత్తడిబొమ్మ
మాటాడ నేర్చిన మణిశలాక
కలికిచేఁతల నొప్పు కమ్మక్రొవ్విరిబంతి
తగు జీవకళల చిత్తరువు ప్రతిమ
గమనశృంగారంబు గనుపట్టు లతకూన
కల దొలంగని తొలకరి మెఱుంగు
కరచరణాంగసంగతి గన్న శశిరేఖ
హావభావములఁ జెన్నలరు సరసి
యగునని గణింప వినుతింప [2]నలవిగాదు
దాని చరణాబ్జనఖరేఖ[3]తోను బోలఁ
గలరె యీలోకమున నున్న కాంతలెల్ల
విను మహీనాథ! [4]యేమని విన్నవింతు. 110

1. నెంతయు, కేతగు 2 నలవిగాని 3. నైన 4. ఘుఁక నేమి

క. ఒకపాటి పేదసంసా
రికిఁ దగ దమ్ముద్దుగుమ్మ రిపురాణ్మణిమ
స్తకమకుటఘటితనవర
త్నకళాచకచకితచరణునకుఁ గాక నృపా! 111

క. అని విన్నవించినంతనె
మనమున సుప్పొంగి వైశ్యమచిరాసపమో
హనరూపరేఖవిభవము
విని విస్మయమంది మోహవిహ్వలమతియై. 112

తే. ఎఱుక వగలాఁడి కోరిన వెల్ల నొసఁగి
ప్రియవచోవైభవమ్ము గాన్పింపఁ బనిచి
కొలువు చాలించి బోటిక ల్గొలువ నంతి
పురి నొకానొక మణిసౌధమున వసించె. 113

ఉ. అంతట నవ్వణిగ్వరుని యంగనపైఁ దమిహెచ్చి యమ్మహీ
కాంతపురందరుండు రతికాంతధనుర్లతికావిముక్తదు
ర్దాంతశరాళికి న్మదమరాళికిఁ జండతరాళి కెంతయుం
జింతిలి వేదనావశవిశీర్ణమతి న్విరహార్తి నొందుచున్. 114

సీ. చెక్కిటఁ జేయి సేర్చి చింతాకులాత్ముఁడై
వనిత నేక్రియఁ దెత్తునని తలంచు
నిట్టూర్పు[1]నిగిడించి నేఁ డయో శుకపికా
ర్భటి కోర్వఁ జేనంచుఁ బలవరించుఁ
దనలోన తానేమొ తలయూఁచుకొని [2]మెచ్చుఁ
గలవరించుచు బయ ల్గౌఁగిలించుఁ
జిత్తరువున నున్న చెలువంపుఁ బ్రతిమ న
ల్లదె ప్రభావతి యంచు మదిఁ దలంచు

1. నిగిడించి బెట్టుగా శుకపికార్భటుల కోర్వగలేక 2. మెచ్చి

నించువిలు వంచి విరితూపు లేర్పరించి
పచ్చవన్నియచిల్కబాబావజీరుఁ
దుల్ల ముల్లోలముగఁ జేయఁ దల్లడించు
రాజముఖిమీఁది బాళి నారాజమౌళి. 115

ఉ. ఎప్పుడు చూడఁ గల్గునొకొ యిందుముఖీవదనారవిందఁ? మే
నెప్పుడు విందునో తెలియ దేణవిలోచన కల్కిపల్కు? లిం
కెప్పుడు గౌఁగిలింతు నలయింతి కుచాద్రు లురంబుసోఁక? నా
కప్పుడు[1]గాదె సౌఖ్యపద మందుటలంచు మదిన్ గణించుచున్. 116

క. ఉల్లము దెగడ ధరిత్రీ
వల్లభుఁ డి ట్లున్నవేళ వనితామణులం
దెల్ల గుణంబుల కిరవగు
పల్లవియను పేరు గలుగు భామ సుబుద్ధిన్. 117

సీ. వసుమతీశ్వరుఁ డున్న దెసఁ జూచి పావడ
చెఱఁగున నెమ్మోము చెమట దుడిచి
సిగ పొందుగ నమర్చి దిన్నారి విడికెంపు
తాయెతు ల్పుట్టి కుళ్ళాయి వెట్టి
[2]చెవుల యొంటులఁ జక్క సవరించి ముక్తావి
చిత్రహారంబుల చిక్కుఁ దీర్చి
కలపం బలంది బంగరు గట్టికమ్ముల
వలిపె దుప్పటి [3]వలివాటొనర్చి
కేలుదమ్మికిఁ గపురబాగాలుఁ బండు
టాకుమడుపులు నొసఁగి లోకాభిరామ
వార్త లొకకొన్ని నొడివి [4]యప్పార్థివేంద్రుఁ
బలుదెఱంగుల నలరించి పలికె నపుడు. 118

1. రాజ్య 2. చెవులయంటుల 3. వలెవాటమర్చి 4. యప్పామునయ్యన

క. స్వామి యవధారు [1]మీమదిఁ
గామించు మనోరథంబుఁ గడతేర్చెద [2]నీం
కేమిటికిఁ జింత యన విని
భామామకరధ్వజుండు పల్లవి కనియెన్. 119

తే. వైశ్యభామిని లావణ్యవైభవంబు
విని విరహవార్ధి [3]మునుఁగు నన్మనుప నెట్టు
లంటు చేసెదొ యమ్మచ్చెకంటి ననుచు
నిచ్చక మొనర్చి యుడుగర లిచ్చి పనుప. 120

మ. చని యప్పల్లవి వైశ్యవల్లభుని భాస్వద్దివ్యగేహాంతరం
బున వర్తిల్లు ప్రభావతిం గనఁ దదంభోజాక్షి రాజావలం
బనసౌభాగ్యము గన్న ధన్యవు ననుం బాటించి యేతెఱ నే
మి నిమిత్తంబొ యటంచు నిర్మలసుధోర్మివైఖరిం బల్కెనన్. 121

క. నినుఁ జూడఁ గోరి వచ్చితి
[4]ననవుడు సంతోషమయ్యె నని [5]మణిపీఠిం
దను నిలుప రాజదూతిక
యనియెఁ బ్రభావతికి సముచితాయత్తమతిన్. 122

తే. ఎల్ల సౌభాగ్యములు గల యింటవెలసి
మిగులఁ జక్కని వారిలోఁ దగినదాన
వగుదు నీబంధుజనము నిన్నభినుతింపఁ
గాఁపురము చేసితివి మేలు కమలగంధి. 123

వ. అదియునుం గాక పురాణదంపతులగు నీ యత్తమామల సుమతీహరదత్తుల నాదరించు నీవివేకంబునకు మెచ్చితి సాక్షాన్మనోజుం డగు నీమనోహరున కనుగుణంబగు నంతరంగంబునకు సంతోషించితి గురుబుధబాంధవదాసీజనంబులం బోషించు నీ మహత్త్వంబుఁ గొనియాడ శక్యంబగునే యని వెండియు

1. నీ మది 2. నే, నేమిటికి వంత; నీ కేమిటికి వంత వలదన 3. మునిఁగితి మనుపు మెట్టు 4. ననవిని 5. మణిపీఠం, బున

సీ. గుట్టుతో సంసారి మట్టునఁ జుట్టాల
 దనియింతు వని హరదత్తుతోడ
ఘనురాల చల్లని కడుపుదానవు నీవు
 సుకృతశాలిని వంచు సుమతితోడ
మదనసేనుఁ డనంగ మఱి నీకె తగు నెంత
 చెలువుఁడ వని దాని సెట్టితోడ
విశ్వాసమున నింట వెలయు పాటెల్లఁ బూ
 నెద రంచుఁ దగిన జానిసెలతోడ
నిచ్చక మొనర్చి హితవరియేపు సూపి
చొరవ గల్పించుకొని పరిశుద్ధురాలి
[1]వలెనె తాఁ బోనిచో సారె పిలువనంపు
మచ్చిక యొనర్చె నమ్మదిమాయలాఁడి. 125

*

క. అంత నొకనాఁడు రజనీ
కాంతశిలాఘటిత వేదికామధ్యమునం
గొంత తడ వుండి తగ నే
కాంతం బగువేళ వైశ్యకామిని కనియెన్. 126

క. ఓ మధురవాణి నీమను
వేమిటనుం [2]గడమ గాక యెంతయు నొప్పెం
దామనుఁడగు వాగ్వనితా
కాముం డొకకొంత కొదవ గల్పించెఁ గదా! 127

వ. అది యెట్లంటేని 128

1. వలెను బోలేనిచోవారు తలఁపనంప 2. గొదువలేక యెంతయు వెలయం
* వ॥ అది యెట్లంటేని (పూ)

సీ. బింబోష్ఠి! నీ చంద్రబింబాననము వాని
[1](వెడఁగు)నోటను ముద్దు వెట్టఁ దగునె
కాంత! నీ సిబ్బెంపు గబ్బిగుబ్బలు వాని
పరుసుచేతుల నొత్తిపట్టఁ దగునె
యబల! నీ కనకోపమాంగవల్లరి వాని
కఱకు మే నంటంగ నొఱయఁ దగునె
రామ! నీ మధురాధరప్రవాళము వాని
వికట దంతముల కొప్పింపఁ దగునె
కొమ్మరో! కుందనపుఁ గీలుబొమ్మ కరణి
నొఱపు గలదాన వీవు వానరమువంటి
మగనితోఁ గూడి రతికేళిఁ బొగులఁ దగునె
తగదుగా ధాత యీరీతి తగులు సేయ. 129

తే. తా ననుభవింప నేరక తగిన ఘనుని
దండ నుండంగ నీక నిధానమునకు
భూచి కాచుక యున్నట్లు పువ్వుఁబోఁడి
యెట్లు సంగత మయ్యె నీ కిట్టి మగఁడు. 130

వ. ఐనను గొదువగా దిందుల కొక్క మహోపాయంబు విచారించితి వినుము

చ. వలపులతేనికి న్నవతువచ్చు విలాసము గల్గి యెల్ల వి
ద్యలఁ గల మేలిమిం దెలిసి యంగనలం గరఁగింప నేర్చి కో
ర్కులు సమకూర్పఁ జాలి కడుఁ గొండొక ప్రాయము గల్గువాని ని
స్తులతరభోగభాగ్యములు చొప్పడ నీ కొనగూర్తు మానినీ. 132

క. అతని వివరింతు విను నీ
మతికి న్నమ్మతి యొనర్చు మనరాజు జగ
ద్ధితసుప్రతాపభాస్వ
త్ప్రతిభాభానుండు చిత్రభానుం డబలా! 133

1. బెడఁగు (పూ) వెగడు నోరున; బెగడునోరున వెడఁదవోరున

సీ. భావజ్ఞమౌళి [1]ధాత్రీపరారోహావ
హస్తలైకైకబాహార్గళుండు
చల్లసిరాజు సాక్షాత్కారనవమోహ
నాంగసౌందర్యలీలాంగభవుఁడు
దాక్షిణ్యశాలి యౌదార్యధైర్యావార్య
సకలసద్గుణగణార్జవపరుండు
చేపట్టుఁ గుంచ మక్షీణరంగదభంగ
శృంగారశాస్త్రప్రసంగలోలుఁ

డమ్మహారాజదేవేంద్రుఁ డంతరంగ
మెల్ల నీ సొమ్ముగ నొనర్ప నేమి తపము
చేసితివో? నా పలు కొకింత చిత్తగించి
[2]తలఁపు నెఱవేర్చు కొనవమ్మ! కలికికొమ్మ! 134

వ. అనిన విని సంభ్రమభయవిస్మయాక్రాంతం బగు నిజస్వాంతంబునం గొంత తడవు విచారించి [3]దరస్మితవ్రీడాభరంబు లీడుజోడాడ వదనారవిందం బొకించుక వాంచి పంచశరశరప్రాయకటాక్షాంచలంబుల నొక్కించుక దాంచల్యం బంకురింప నచ్చంచలాక్షి రాజదూతి కిట్లనియె.

క. ఏ నింతనాఁటి నుండియు
మానవతులలోన మిగుల మానవతిని నై
యీనాఁటికిఁ గడచితి నిఁక
నా నోఁచిన నోము లే మొనర్పం గలవో. 136

వ. అదియునుం గాక 137

1. ధాత్రీవరారోహా వి, హారస్థలైకబాహార్గళుండు 2. వలపు 3. విస్మిత వ్రీడాభరంబులు నీడుజోడాడ.

తే. అత్తయును మామ తలవరులై మెలంగ
మగఁడు పులిపంటివాఁడు నెవ్వగ యొనర్ప
నమ్మ! యేఁ జెల్ల! యిక్కార్య మసురు బెట్టు
చాలుఁ జాలింపు మిఁక నీ ప్రసంగమనిన. 138

వ. విని తదీయవచనంబున స్వప్రయోజనావకాశం బయ్యెనని తలంచి
తదనుగుణం బగునట్లుగాఁ బల్లవి యిట్లనియె. 139

ఉ. ఎక్కడి యత్తమామలు? నిజేశ్వరుఁ డెక్కడ? వంశవర్తనం
బెక్కడ? [1]దొడ్డు కొంచె మను టెక్కడ? నో లలితాంగి! మోహము
న్నెక్కొనఁ జక్కనయ్యె నొకనిం బిగికౌఁగిటఁ జేర్చి [2]పెంపు సొం
పెక్కని దేటి ప్రాయ? మిది యెన్నఁటికిం గలుగంగ నేర్చునే. 140

సీ. మగని ప్రక్కనె యుండి తగఁ జేరి జోకొట్టి
మోసపుచ్చని దేటి ముద్దరాలు?
పసులగోడలనైన వసుధ నిచ్చెన లేక
యెక్క నేరని దేటి యెమ్మెలాఁడి?
తలవరు ల్గనుఁగొన్నఁ దప్పు నొప్పు ఘటించి
బొంక నేరని దేటి పువ్వుఁబోఁడి?
దొరలు గద్దింపఁ గల్లరివార్త నిజముగా
నిర్వహింపని దేటి నీటుకత్తె?
యత్తమామల గృహకర్త లగుచు మెలఁగు
నట్టి [3]ధూర్తుల నెల్ల నో రదిమి గదిమి
పొంచి యుపనాథుతోడఁ గ్రీడించి మించి
చక్కటికి దిద్దుకొనని దే సరసురాలు? 141

తే. ఆఁడుపుట్టునఁ బుట్టి యింతంతయైన
దిట్ట గాకున్న నది కడతేఱు టెట్లు?

---

1. దొడ్డ 2. యింపు 3. పెద్దల

బేలతనమున నీ వింత గోలవేని
మాను మోహబాల! యిఁక నిన్ని మాట లేల? 142

వ. అనినఁ బులకానుషంగం బగు నిజాంగంబు వలన నంగీకృతభావం బెఱింగింప నయ్యంగనారత్నంబునకు నంగనాచి యగు రాజదూతిక మఱియు మఱియు బోధించి చంద్రికాసక్తచకోరకంబునుం బోలె వైశ్యభామ కెదురు చూచుచున్న రాజపుంగవునకుఁ దదీయకథావృత్తాంతం బెఱిఁగింప మఱలి చను నెడ నవ్వణిగ్వరునకు దైవయోగంబున నతిదూరప్రయాణంబు సంభవించిన. 143

చ. తన యిలువేల్పులై మెలఁగు తల్లికిఁ దండ్రికి భక్తియుక్తి వం
దన మొనరించి ప్రాణసమ తం దగు పెంపుడు ముద్దుఁజిల్క నె
మ్మన మలరించి విద్యుదుపమానశుభాకృతి నా ప్రభావతిం
గనుఁగొని పోయిరాఁ దగిన కార్యముఁ దెల్ప నవీనదైన్యయై. 144

సీ. మలయుఁ[1](బో) మధురాతిమధురాధరల వాఁడి
[2](చెన్నారు) గోరు నీ చెక్కు మీఁద
నానుఁ[3](బో) రంగస్థలాబ్జగంధుల గబ్బి
మెఱుఁగు జందోయి నీ యురము మీఁద
మించుఁ[4](బో) కాంచికాచంచలాక్షుల వాఁడి
మొనపంటి గంటు నీ మోవిమీఁదఁ
జేరుఁ[5](బో) నెల్లూరు నారీమణుల కెంపు
పసమించు టడుగు నీ నొసఁటిమీఁద

నింట నుండిన నీసౌఖ్య మేల గల్గు
ననుచుఁ గన్నుల [6](నీరార్చి) యక్కుఁ జేర్చి
[7]మోవి చిగు రంత గఱచి తాంబూల మొసఁగి
పోయి రమ్మని పనిచె నప్పువ్వుఁబోఁడి. 145

1. చో (పూ) 2. చిన్నారి (పూ), 3, 4, 5. చో (పూ) 6. నూరార్చి (పూ)
7. మోవి చిగురంట నొక్కి తమ్మల మొసంగి (పూ—యతిభంగము)

క. ఈరీతి వణిగ్వల్లభుఁ
[1]డారూఢిగ నొకబేర మరిగెఁ దఱి న
వ్వారిజముఖి కంతుశరా
సారవినిర్ఘాతజాతసంతాపమతిన్. 146

చ. మునుకొని మేరమీఱు వలపుం దన ముంగల త్రోవ చూపఁగా
వెనుక రతీశ్వరుండు పదవే యని యెత్తులు వెట్ట నెమ్మదిం
బెనఁగొను లజ్జయుం బొడము భీతియుఁ దన్నరికట్ట నంతలో
నినుఁ డపరాంబుధి న్మునిఁగె నీవెతలం గనలేని కైవడిన్. 147

తే. పరమదిగ్భామినీమనోహరతరాంగ
రాగవైఖరి మఱి సాంధ్యరాగ మెసఁగెఁ
గుసుమితనవీనజాతీనికుంజరీతి
నుడుగణంబులతోఁ గూడ నొప్పె నభము. 148

క. తగ నప్పు డజాండంబున
నిగిడె న్గాఢాంధకారనిబిడమరీచుల్
జిగి కుందనంపు బరణి
న్మృగమదపంకంబుఁ గలయ నించిన కరణిన్. 149

## మొదటిరాత్రి :

వ. అప్పు డయ్యొప్పులకుప్పయగు ప్రభావతీసతి విలాసవతీరతీశ్వరుండగు నమ్మహీశ్వరునితో ననంగసంగరవాంఛాతరంగితంబై తురంగలించు తమకంబున. 150

సీ. నానావిధద్రవ్యనవ్యసంభారము
ల్గల గృహంబులకు బీగము లమర్చి
మొదవుల నన్నింటిఁ బిదికిన పా ల్గాచి
యొనరఁ దోడంటుతో నుట్టిఁ బెట్టి

1. డారయ దూరప్రయాణ

వనులు దీర్చిన తొత్తుపడుచుల [1]నిష్టాన్న
తృప్తి నొందఁగఁజేసి [2]యిడ్డ కనిచి
యుత్తమాములు సుఖాయత్తులై పవళింప
మృదుపదంబుల నొత్తి నిదుర వుచ్చి
జలక మొనరించి జిలుఁగు మేల్వలువ గట్టి
కలప మలఁది మితాహారకలనఁ దేలి
వీడియం బందుకొని యొక్క యొడిగంపు
బుడుత తన వెంట నడువ నప్పువ్వుఁబోఁడి. 151

క. తనకుం బ్రాణపదంబును
దన యనుగుం జెలియుఁ దనకు దైవం బనఁదగు
దనరు తన రాజకీరముఁ
గని యవ్వలఁ జనుట తగిన కార్యం బనుచున్. 152

తే. కనకమణిపంజరశుకాగ్రగణ్యుఁ జేరి
కోరి యాత్మీయగాథాప్రకార మెల్ల
మెల్లమెల్లన దరహాస ముల్లసిల్ల
నంతయును దెల్పెఁ జిల్క యత్యాగ్రహమున. 153

క. కటకటఁబడి పక్షద్వయ
పుటచలన మొనర్చి మిగులఁ బొగులుచు మదిలో
నిటు నటు దెలియని చింతా
కుటిలస్థితి నింతి కనియెఁ గోప మెలర్పన్. 154

క. ఓ హరిణనయన! "స్వామి
ద్రోహ మిదంబార" మనుచుఁ దొలుతనె విబుధ
వ్యూహంబు [3]పలుక వినమే?
యాహా! యీమాట [4]వినఁగ నర్హమె మాకున్. 155

---

1 మృష్టాన్న 2 తొడుసు బాసి 3 పలన వినవే 4, వినుట యర్హ, మె

ఉ. ఓ వరవైశ్యవంశకలశోదధి[1]చారుహిమాంశురేఖ! నీ
వోవనివారి ముందఱ నయో! మగనిం గడకాళ్లఁద్రోచి నేఁ
డీ వసుధేశునిం గలయ [2]నెంచితి వెట్లు? పతివ్రతామణు
ల్వావులు పుత్తురమ్మ? తలవంపులు [3]చేయుదురమ్మ జాతికిన్. 156

సీ. దశకంధరుని మోహదశ విచారించెనే
సకలజగన్మాత జనకజాత?
నహుషభూపాలు మన్నన కొప్పుకొనియెనే
స్త్రీరత్నమైన శచీపురంధ్రి?
యల సింహబలుని మాయలఁ జిక్కి చొక్కెనే
విపులసద్గుణమాన్య ద్రుపదకన్య?
శబరాధిపుని దురాశలకు లోనయ్యెనే
రతినిభాకృతి భీమరాజపుత్రి?
తొల్లిఁటి మహాపతివ్రతల్ దుర్మదాంధ
కాపురుషు లంగభవశరాఘాతవికల
చిత్తులై తమ్ముఁజేరి యాచించినపుడు
సిగ్గు వోనాడుకొని రఁటే చిగురుఁబోఁడి? 157

ఆ. ప్రాణహాని మానభంగంబు నగు నన
కెంత పనికిఁ జొచ్చితే మృగాక్షి!
జగతి నీ మనంబు "తెగువయే దేవేంద్ర
పదవి" యనెడు సుద్దిఁ బొదలఁ బోలు. 158

క. పతిభక్తి గలుగుసతికిన్
వ్రతములతో గొడవ యేల వఱలు సుకృతముల్
పతిభక్తి లేని చెనఁటికి
వ్రతములు చను వేయు యొక్క వ్యభిచారమునన్. 159

1 కల్పలతాంగి (పూ) 2 నేర్చితి 3 తెత్తురటమ్మ

వ. కావునఁ గులాంగనాతిలకంబునకుఁ గలకంఠీసముచితకృత్యంబు పాతివ్రత్యంబు నీవు వైపరీత్యంబగు [1] ప్రయోజనం బాచరించితి విట్లైన నిహపరంబులకు దూరం బగుదు వని సుభాషితంబులు పచరించిన నవ్వచనంబులు కర్ణ పుటంబులకు జిలుఁగు టంపములుకుల పోలుపు దెలుపఁ గలికి యులికిపడి రూక్షేక్షణంబుల నాశుశుక్షణికణంబులు చిలుకఁ జిలుకం గనుంగొనిన న ప్పతంగపుంగవం బక్కటా ! యిక్కురంగనయన కనంగ[2]తత్త్వంబు సం భవించె నిది సామంబునం గాని చక్కం బడ దని తలంచి లంబికావలంబన మహాయోగి చందంబునఁ గొండొక తడవు నిశ్చలధ్యానపరాయణంబై యుండి వెండియు నయ్యంగన కిట్లనియె. 160

క. వినవమ్మ భామినీమణి.
మనమున నీ కితరసంగమము ప్రియమైన
న్మను గొంతి కమలబాంధవు
నెనసియుఁ [3]బొన మెఱుఁగ నట్లనే వర్తిలుమీ. 161

తే. కాక తలవెట్టి గొని యల గౌతమాంగ
నామణి సురేంద్రు నొకనాఁడు నంటుచేసి
యాపదలఁ జెంది సకలలోకాపవాద
మొందు టెఱుఁగవె ? యట్లు గాకుండ[4]వలయు 162

క. నీ పట్టు గలుగు వాఁడై
చేపట్టుం గుంచమైన చెలువుని నొకనిం
జేపట్టి రతులఁ దేల్క
యేపట్టున రాజు [5]నిచ్చగించితి వబలా ? 163

1. ప్రయత్నం బాచరింపఁ దలఁచితివేని నట్లైన 2. శరబాధ సంభవించెనని తలంచి యిది 3. పున మెఱుఁగనట్లు నిల వర్తిలుమీ 4. మనుము 5. నిచ్చ యించితి (పూ)

సీ. రాజులు కుటిలసర్పమహోగ్రతరమూర్తు
లధరబింబము పంట నదుముటెట్లు ?
సార్వభౌములు చండశార్దూలసమచిత్తు
లించు వేడుకఁ గౌఁగిలించు టెట్లు ?
కువలయాధీశ్వరు ల్దవహుతాశనకల్పు
లండ నుప్పొంగి పరుండు టెట్లు ?
నరవరేణ్యులు భద్రకరిమదాంధమనీషు
లెనసి బంధరతాప్తిఁ బెనఁగు టెట్లు ?
చక్రవర్తులు మాననిర్వక్రవర్తు
లతులతరగాఢసురతవేళాతివేల
తాడనచపేటము లొనర్పఁ దలఁచుటెట్లు
తెలిసి కలయిక లొనగూడ మెలఁగ వమ్మ. 164

క. వారల గుణానుగుణముగ
వారక కనుగలిగి నడుచువారల కెలమిన్
శ్రీ రంజిలు జయ మొదవు ను
దారత నీ పదు నెఱింగి యలపడు మబలా ! 165

వ. ఇత్తెఱంగునఁ దత్తరంబులేక వర్తిల్లు మని విన్నవించిన 166

క. అభినవ వినీతివార్తా
విభవం బభిరామలీల వినుచున్న తఱిన్
నభము నభమైనఁ గనుఁగొని
యిభగామిని [1]నాఁటి కరిగి యిలు సేరుటయున్. 167

వ. అంత నద్ధరాకాంతుండు తదనంతరకథాక్రమం బెట్టిది యానతిమ్మనుడు 168

1. చని యోఁ బడకయిలు సేరుటకున్

తే. ఆవధరింపుము సకలరాజాధిరాజ
నతపదాంభోజుఁ డగు ధర్మనందనునకు
సరసవైదికలౌకికాచారవిహిత
హితకథారమ్యుఁ డగు ధౌమ్యుఁ డిట్టు లనియె. 169

## రెండవరాత్రి

క. ఆగుణవతి మఱునాఁ డను
[1]రాగాప్తిన్ రాత్రివేళ రమణీయకళా
భోగశుభాకృతి రతిసు
శ్రీ గులుక న్రాజసేవ సేయుట కెలమిన్. 170

చ. కలువలు కొప్పున న్నగుమొగంబునఁ గస్తురిబొట్టు పట్టుకు
చ్చెలయును జంద్రకావి బురుసాపని వల్వయు మై రహింపఁగా
నలవడు మేల్మిసుంగు పయి నంగరుచిచ్చుట లొప్ప నప్పు డా
[2]కలికి రమాకుమారు తురగంబు కదం దగఁ జేరె నంతటన్. 171

తే. చిలుక ముద్దులు చిలుక రాజీవనయన
ననునయించి వచించు నోయబల! నృపకు
లేంద్రుఁ [3]గదిసెద నని వచ్చుచే నెఱుఁగుదు
నుబికి చనఁ దగ దితిహాస మొకటి వినుము. 172

## మొదటికథ

క. అటఁగా ననఁగా నొకపుర
మొనరుం జంద్రవతి యనఁగ నుద్యోతవినూ
తనఖద్యోతనికేతన
ఘనకేతన[4]సౌధకనకకలశం బగుచున్. 173

---

1. రాగమతిన్ 2. లలన 3. గదియఁగఁ జను విధం బే నెఱుంగుదు, వెస చనకుము ఇతిహాస 4. రుచిర (పూ)

తే. అన్నగర మేలు రత్నాకరాహ్వయుండు
వికటమత్తాహితవిఘాలుఁ డొక నృపాలుఁ
డతని [1]నగరున నోడకాఁ డగుచు నొకఁడు
వెలయు వసుమంతుఁ డను గౌర చెలువు మీఱ. 174

వ వెండియు నయ్యఖండతరసంపత్కుబేరుం డగు నతండు 175

శా. ఏ యూరం దన యంగడు ల్నెఱయ నేయే బేరు లెందైన నా
త్మాయత్తైకధనంబు సంచిమొదలై యత్యార్జనం బొందఁగా
శ్రేయఃకీర్తులు సంఘటిల్లఁ దను సుశ్రీ మించఁగా నిల్పె న
య్యాయం బేర్పడఁ గోటికిం బడగ లెన్నైనం బ్రమోదంబునన్. 176

చ. వలసిన బేరము ల్తెలియ వచ్చినవారును వాదు గల్గువా
రలు మఱి గుత్తగొల్లలును రత్నపరీక్షలవారుఁ గార్యము
ల్గలిగిన యింగిలీసుల [2]ముఖంబులుఁ జెంగట నుల్లసిల్లఁగాఁ
గొలువున నుండుఁ జూపఱలకుం గనుపండువు సంఘటిల్లఁగాన్. 177

క. ఈళయు విళంగయును బం
గాళయు మొదలైన పేరు గల దీవులలో
మేలైన సరకు లాతని
కొలున దిగుమాట నిజము కలవాఁ డగుటన్. 178

తే. అతని వలన మహీదేవుఁ డచట నొక్కఁ
డలఘువిద్యాధురంధరుఁ డగు ఘనుండు
తగుఁ గళావంతుఁ డనువాఁడు తలఁప నతని
సరసవాక్ప్రౌఢి దొరలెల్ల సన్నుతింప 179

1. నగరంట నొంటికాఁ డగుచు 2. ముఖాముఖులు (పూ)

సీ. హాళి పుట్టించు నుద్యత్సుధారసధార
లుప్పతిల్ల గవిత్వ ముగ్గడించు
రక్తి గల్పించుఁ గర్ణరసాయనము గాఁగ
సమధికస్ఫూర్తి గీతములు వాడు
యిం పొనర్చు ధరాతలేశ్వరవరసభా
స్థలి సత్ప్రసంగవార్తలు [1]ఘటించు
[2]యద్భుతం బొసఁగు శబ్దార్థవైచిత్రి ని
బంధనకావ్య వైభవము నొడివు
నింతమాత్రంబె కాదు శ్రీమంతుఁడును ని
తాంతశుభవంతుఁ డగు వసుమంతుఁ డలర
దండ నొకవేళ నీతిసంధానలీల
బుద్ధు లన్నియుఁ దెల్పు నప్పుడమివేల్పు. 180

క. ఈరీతి సకలధర్మవి
చారుం డగు నతనిమాట జవదాఁటక య
గ్గార మనుచున్నఁ దన్నగ
రీరత్నం బేలునట్టి నృపవరుఁ డెలమిన్. 181

తే. మంతు కెక్కిన యవ్వసుమంతు నమున
యించి ప్రియభాషణంబుల హితవొనర్చి
జలధి కవ్వల దీవులఁ గల సమస్త
వస్తువులు బొక్కసముఁ జేర్ప వలయు ననుడు. 182

ఉ. రాజ్ఞొనరించు మన్ననకు రంజిలి యవ్వసుమంతుఁ డష్టది
గ్రాజమనోభయంకరపరాక్రముఁ డానృపుతోడ నేన య
వ్యాజత దీవి కేఁగి కల వస్తువు లన్నియుఁ దెత్తుఁ బంపు మో
రాజకులేంద్ర! యంచు సుకరంబున మున్ను వచించి పిమ్మటన్. 183

1. వచ్చించి 2. యద్భుతంబు ఘటించు నర్థవైచిత్ర్యని, బంధన

క. తన నగరుఁ జేరి సమధిక
ధనధాన్యసుపుత్రమిత్రదారాలయమం
దనమైన కాఁపురం బిది
యనువగునే విడిచి చనుట కని చింతిలుచున్. 184

ఉ. కారుమెఱుంగు రాచిలుక కస్తురిపీఁఁణ పదాఱువన్నె బం
గారము రస్తు కుప్ప తెలిగంబుర వెన్నెలలోని తేట యొ
య్యారపుఁ దెంకి యందముల కస్పిఁటికిం దగు పట్టుఁగొమ్మ సిం
గారపు దొంతియైన కులకాంత నయో! యెడఁబాయ నేర్తునే. 185

తే. అనుచు మదిలోనఁ దలపోసి యడలు నంతఁ
జెంత నాసీనుఁ డగు కలావంతుఁ డనియె
దొరల చెంగట వెనుకముందును దలంప
కార్యుఁడు వచింపఁ దగునె యే కార్యమైన? 186

క. మునుకొని తత్ప్రతికృతంబును
దన శక్తియు దేశకాలధర్మము నృపవ
ర్తనమును రాణువ సంచును
గని మాటాడంగ వలయు గద సభలోనన్. 187

వ. ఇ తెఱంగునం బ్రవర్తింపక, దైవయోగంబు వలనఁ బ్రమాదంబవి తలంపక, రాజసన్మానంబునకు నుబ్బి తబ్బిబ్బుగాఁ బచరించిన భవద్వచనం బమోఘంబు గావింపవలయుం గాక నిరర్థకం బొనరించినం గొదవ యగుం గదా? సకల జనశ్రేయస్కరంబును, స్వకీయజనజీవనాధారంబును, బహుప్రసిద్ధియునుం గలుగునట్లుగా రాజోచితకార్యంబు నిర్వహింపు మని విన్నవించిన. 188

తే సమ్మదంబున వసుమంతుఁ డుమ్మలించి
కూర్మి బంధుల నందఱఁ గుస్తరించి
గోలయుఁ బతివ్రతాధర్మశీల యగుచుఁ
బ్రాణపదమైన యిల్లాలి పజ్జఁ జేరె. 189

చ. మదిఁ వెతఁ జెంద బేడిసల మార్కొను కన్నులు నీరుబుగ్గలై
పొదలఁగ ఘర్మబిందుపరిపూర్ణతనూలత కంప మొందఁగా
మృదుమధురోక్తి తొట్రుగొన మేలు కనంబడ వెచ్చనూర్చు న
మ్మదవతి నాదరించి వసుమంతుఁడు దా నలనాఁటి వేకువన్. 190

క. పరికరముల మంకెనలును
బరిచారకు లరిది పనుల పట్టు గుడారుల్
సరిబేరులైన గౌరలు
దొరయం జన విప్రుఁ డతనితో నిట్లనియెన్. 191

క. చనుము బహుశ్రేయస్థితిఁ
గని పునరావృత్తి మహిమ గలిగి శుభాప్తిన్
మను మింకొక్కటి తెల్పెద
వినుము మదీయప్రసంగ[1]వివశాత్ముఁడవై. 192

తే. అతిరయంబున నొకకార్య మాచరించు
నతని యవివేక మఖిలాపదాస్పదంబు
తెలిసి [2]సత్కార్యభాగవర్ధిష్ణుఁడైన
ప్రాజ్ఞుఁడు కృతప్రలబ్ధసంపదలఁ బొదలు. 193

మ. అని పల్కన్ విని యేతదర్థకృతపద్యం బప్డు తాళీదళం
బున వ్రాయించి మెఱుంగుకత్తి యొఱలోఁ బొందించి తా నత్తఱిం
జని పొంతం గనియె న్మహానటజటాఝూటస్ఫురన్నిర్గళ
ద్ఘనధారాపతనప్రకంపితమహాశ్మాభాగ భాగీరథిన్. 194

వ. కని యప్పు డప్పుణ్యతరంగిణీజలంబులఁ గృతస్నానదానాద్యనుష్ఠానుండై
కృతకృత్యుం డగుచు నచ్చోటు వాసి ఝిలావృతహిరణ్మయరమ్యకభారత

---

1 విదితాత్ముఁడవై 2. సౌభాగ్యభాం

ప్రముఖబహువిధవర్షంబు లవలోకించి తత్తద్విచిత్రంబుల కాశ్చర్యంబంది యవ్వలం గడచి నడచి యనేక[1]దుర్గవర్గకాంతారమార్గంబు లతిక్రమించి చనునప్పు డప్పురోభాగంబున. 195

సీ. స్వరునిష్ఠురాఘాతసంక్షోభమున కల్కి
మైనాకుఁ డెవ్వాని మఱుఁగుఁ జొచ్చె
మునికోపనిర్ధూతఘనతరైశ్వర్యంబు
నగభేది కెవ్వాఁడు మగుడ నొసఁగె
సకలజంతువ్రాతసంరక్షణఖ్యాతి
జలధరం బెవ్వానివలనఁ జెందె
సంపత్కటాక్షలక్షణకన్య నలరించి
దనుజారి కెవ్వాఁడు ధారవోసె
నతఁడు ముంగలఁ గననయ్యె నంబుచరకు
ళీరముఖసత్వచటులసంచారజనిత
బహువిధాభ్రంకషోర్మికాభయదఘుమఘు
మారవశ్రీకరుండు రత్నాకరుండు. 196

క. అచ్ఛోటఁ గదలిరాయని
నచ్చుగ వీక్షించి కౌతుకాయత్తమతి
న్మెచ్చుకొని చేర నరిగె వి
యచ్చరజనవినుతమైన యవ్వలి దీవిన్. 197

తే. అందలి విచిత్రవేషభాషాభిరాము
లగు పరంగుల తోడి నెయ్యమునఁ జిక్కి
చొక్కి బహువత్సరంబు లచ్చో వసించి
పిదపఁ బ్రభుకార్యభారంబు మదిఁ దలంచి. 198

1. దుర్గమదుర్గవర్గ

సీ. నవవిధదివ్యరత్నంబు లేనుంగులు
 [1]గోవతేజీ ల్పచ్చికుంకుమంబు
కస్తూరి పీణెలు కట్టుజవ్వాది క
 ప్పురము పన్నీరు చెంబులు పటీర
తరుల ఖండంబు లందలపుఁ గొమ్ములు జల్లి
 సవరము ల్పాదరసంబు జాజి
కాయ యింగువ లవంగంబులు నోదపోఁ
 కలు పంచలవణము ల్గంధకంబు
కొచ్చివేఁపులు మానిసి క్రోఁతు లాది
యైన వన్నియు నోడల కనువు పఱచి
కదలి దాఁటించి చెల్లెలికట్టఁ గడచి
యంత నెఱవేఱి తనయూరి చెంతఁ జేరి. 199

తే. పటకుటీరాంగణములలో బహువిధైక
వస్తువులు కుప్ప లొనరించి వసుమతీంద్రు
చెంతఁ గానుక లిడ నెంచు నంతలోన
నంబుజవనీమనోహరుం డస్తమించె. 200

మ. వసుమంతుం డపు డంతరంగజనితవ్యామోహభారంబున
న్వెసఁ బ్రాణేశ్వరిఁ జూడఁగోరి త్రిజగద్వీరుండు మారుండు తీ
వ్రసుమాస్త్రప్రహతిన్ హళాహళి యొనర్పం దద్వియోగవ్యథా
వ్యసనాప్తి న్నిలు పోపలేక విరహవ్యాప్తి న్వగం జెందుచున్. 201

చ. అడలుచుఁ దాళరాని విరహార్తి మెయిం దురపిల్లు దాని కీ
ల్జడపస దాని జేడిస పిసాళి కనుంగవ దాని యంచరా
నడుపుల దాని [2]మోవిరుచి నాణెము దాని మెఱుంగు దాని ను
న్బెడఁగును [3]గుబ్బ చన్నుఁగవ పెంపుఁ దనూలఁత సొంపుఁ జూడమిన్.

---

1. గొప్ప తేజులు పచ్చకుంకుమంబు 2. ముద్దువదనంబును దాని మెఱుంగు మోవి 3. దాని గుబ్బకవ

వ. వెండియు 203

మ. ముకురంబు ల్నను జెప్కు లక్కలికి నెమ్మోమా మఱిం జందమా
మకు మేలై తగు గుబ్బచన్నులకు తొూమ్మా చాల దా కన్నులా
వికచాబ్జంబుల నేలు నయ్యబల నివ్వేళ న్విలోకింపకే
నకటా! [1]యెగతి సైఁచువాఁడ నని మోహాక్రాంతచేతస్కుఁడై. 204

చ. నను నెడబాయలేని యెలనాఁగ వియోగభరార్తి నిప్పుడే
యనువున నున్నదో? నిజగృహం [2]బెటు లయ్యెనొ? యొంటిపాటునం
గనఁ దగు నంచుఁ దీక్ష్ణతరఖడ్గధరుండయి గూఢసంచరనం
బున వెసఁ జేరె నంతిపురముం దను నన్యు లెఱుంగ నట్లుగాన్. 205

ఉ. ఆరసికాగ్రగణ్యుఁ డపు డయ్యవరోధవిచిత్రకేళికా
గారము సొచ్చి చొక్కటపుఁ గంకటిపై నొక మోహనాంగ శృం
గారునితోడ దీపకళిక వ్వెలుఁగ న్నిదురించుచున్న య
న్నీరజగంధిఁ జూచి యెద నెగ్గురనం గడు విస్మితాత్ముఁడై. 206

క. కనుఁగొనల నిప్పు లురలఁగఁ
గనలుచు శివశివ యిదేమి కారణ? మెటులం
గను వాఁడ? నేరితో నే
మనువాఁడం? గొఱఁత వచ్చె నని చింతిలుచున్. 207

క. కాంతల నమ్ముదురే ధీ
మంతు లిసీ సుతను [3]లతనుమాయామృగముల్
హంతలు జగజంతలు నిసు
మంతయు లోకాపవాద మరయరు మదిలోన్. 208

---

1. యెట్రియ నిల్పువాఁడ నని యాత్రాయత్తనుస్వాంతుఁడై 2. బెటు లున్నదొ 3. లతలు (పూ)

మ. నిలువెల్లం గసకంబు ముద్దుపలుకు ల్నిర్యత్సుధాభిందువు
ల్సొలపుం జూపులు చంద్రికారుచు లటంచు న్నమ్మియున్నట్టు లి
క్కలకంఠు ల్భువి సాభిమానలని వక్కాణించితిం గాని దో
షలతాదోహదలై ప్రవర్తిలుట యోజం గాన లేనైతిఁ గా. 209

వ. అని బహువిధంబుల వితర్కించి. 210

క. రెండొకటిగఁ [1]గంటిఁ గదా!
దండించుట నీతియౌఁ గదా! యని కడు ను
ద్దండతరచండమతియై
ఖండా యొఱ దుస్సివైచి కర మెత్తుటయున్. 211

తే. మునుఁ గళావంతుఁ డానతిచ్చిన సుభాషి
తము లిఖించిన చీటి దోర్దండచండ
మండలాగ్రంపు టొఱలోన మాటియుండెఁ
గాన నది నేల వ్రాలుటఁ గని యతండు. 212

క. ఇది యేమో యని కేలం
గదియించి ప్రదీప్తదీపకళిక వెలుఁగునం
జదువుచుఁ బ్రాక్తనవిద్వ
త్ప్రదనీతిశ్లోక మగుట భావించి వెసన్. 213

తే. "అతిరయంబున నొకకార్య మాచరించు
నతని యవివేక మశిలాపదాస్పదంబు
తెలిసి సత్కార్యభాగవర్తిష్ణుఁడైన
ప్రాజ్ఞుఁడు కృతప్రలబ్ధసంపదలఁ బొదలు. 214

---

1. గంటి నిఁకన్

వ. అని యిప్పిధంబునం గనన్నైనం దచ్ఛ్లోకం బరసి నిజభామామణిం దలకించిన

ఉ. మాసిన దీర్ఘవేణి కుఱుమాసిన చేలచెఱం గలంక్రియా
వాసము గాని మేను వసివాడిన ముద్దుమొగంబుఁ గాంచి య
య్యో! సరసీరుహాక్షి మదయోగభరంబున నిట్లు ఖిన్నయై
గాసి వహించి యున్నదని కంది వెస న్వసుమంతుఁ డత్తఱిన్. 216

మ. మది నొక్కించుక శాంతి నొంది యెదలో మాద్యద్విరోధివ్యథా
స్పదశౌర్యంబగు వాలు సేర్చి సతి పజ్జం జేరి నిద్రించు ని
మదనప్రాయుఁడు నన్నుఁ బోలిన జగన్మాన్యైకరేఖాంగసం
పదఁ జెన్నొందినవాఁ డిదేమొ? యనుచు న్భావించి తా నాత్మలోన్. 217

క. ఈనాఁ డయ్యెడు కార్యము
గానేరదె తే ఘటించుఁ గడు నెమ్మిని న
మ్మానధురంధరుఁ [1]డతఁ డా
స్థానస్థలమునకుఁ జనియె జలజాతముఖీ! 218

ఉ. అంత లతాంతచాపలత నంగభవుం డపు డెక్కుడించెఁ ద
త్క్రాంత ప్రభాతమయ్యె నని కాంతనిశాకరకాంతమందిరా
భ్యంతరవర్తియై తపనుఁ డస్తగిరీంద్రము పొంతఁ జేరు ప
ర్యంతము వేఁగి వేగ విహగాగ్రణి మ్రోల వసించి వేడుకన్. 219

## మూఁడవరాత్రి

క. కదమకథ నుడువు మనినం
బడఁతికి శుకలోకపట్టభద్రుఁడు తెలిపెన్
వడి నా ఘనుఁడు నిశీధిని
గడతేఱి ప్రభాత మగుటఁ గని యప్పౌశన్. 220

---

1. డు యథాస్థానంబున కేఁగె నప్పుడు

వ. యథోచితనిత్యకృత్యంబగు సత్కర్మకలాపంబు నిర్వర్తించి తదనంతరంబ.

తే. లీల రత్నాకరుండు సింహాసనము
నుండి తనుఁ బిల్వఁ బంప నమ్మండలేంద్రుఁ
జేరి నానావిధద్వీపచిత్రదేశ
వివిధవార్తాప్రసంగము ల్విన్నవించి. 222

క. తెచ్చిన సమస్తవస్తువు
లచ్చుపడ న్సమ్ముఖమున నలవడ నిడి త
న్మెచ్చి కొలువెల్లఁ బొగడఁగ
నచ్చో వివరింపఁ దొడఁగె నధిపుం డలరన్. 223

రగడ:-

దేవ యవలోకింపు మిది తెలిదీవిఁ బొడమిన పద్మరాగము
పావనం బొనరించుఁ దను వనఘాయురుచి నల పుష్యరాగము
తళుకుఁ దుమ్మెద తాళి కగునని తలఁపుమీ యీ శాపునీలము
వెలఁదులకుఁ జేర్చుక్క తుద నాదవించు మురుపగు నీ ప్రవాళము
గొప్పలగు చౌకట్లకని చేకొంటి మివె కట్టాణి పూసలు
చెప్పఁ జూపఁగ రావు మక్కాసీమ వీ గుజరీతివాసులు
ఎత్తుకెత్తు మెఱుంగు కుందన మిచ్చి తెచ్చితి మీ సిరాజులు
హత్తి వాయు మనోజవంబుల నలరు నీ సామ్రాణి తేజులు
కుఱుచలైనను నచ్చమదమునఁ గొఱలు నీ యేనుంగు గున్నలు
దొరయ నొక పరిపాటి దొరలకు దొరక వీ విడికెంపు మిన్నలు
కలువడంబులఁ గలయ వివి చొక్కంబులగు కస్తూరి వీణెలు
తెలిసి వేయివరాల విలువలు దీర్చితిమి యీ రుద్రవీణలు
నిలువు నిలివేఁడు సోగవగపెన్నెఱుల కివి సమకట్టు జల్లులు
పిలుపులను గడుఁ బ్రోదిసేయఁగఁ బెరిగినవి జవ్వాది పిల్లులు
గమ్మురని పన్నీరు తొలఁకెడుఁ గంటినే యివి గాజు పనఁటులు
చిమ్మ రేఁగెడు కప్పురపురవఁ జెందు నీ యేడాకు టనఁటులు

వహిఁ దొలంగక పెటిపైఁ జను పసిఁడి యంపంపుఁ గొయ్యలు
బహువిధమ్ములఁ జనువు నివిగో పంచవర్ణములగు శుకమ్ములు
పంచలోహపు గట్టి పనులను భద్రమైనవి యివె పిరంగులు
కంచు మించుగ నడవి మెకముల గదుము నివిగో బలుసివంగులు
అల్లనేరెడు వాగు జలముల నైనయవి యపరంజి లప్పలు
మొల్లముగ రజతాద్రి కెనయై మొనయు నీ తెలివెండి కుప్పలు
పట్టు పిడికెఁడు నెనయు జీనువు పట్టురపలివె జవిడికట్టులు
యిట్టలపు రతివేళఁ గవకిన తెనఁగు నీ బకదారి పిట్టలు
చికిలి పుత్తడి క్రొత్త హంసపులఁ జెందు నివిగో [1] సూరెపానులు
ఒకటఁ గస్తురి మెకము లుండుట కొప్పు నీ దంతంపు బోనులు
ఎనఁగ నన్నములోని విసముల నేర్పఱుచు నీ సింగిలికలు
అసమశౌర్యధురీణులకు బిరుదందు రల్లవె హారిచె యీకెలు
సొగసు పటికంబుల నమర్చిరి చూడు మీ సొగటాల చందము
పగడముల నీలముల నిరుగడ బలము లవె చదరంగమందము
గాలికన్నను వేగఁ జను చులుకనివి యివె కొల్లారు బండులు
మేలిమిగ రాహుత్తులకు నియమించినవి సింగాణి విండులు
త్రొక్కినాడు పదేసి మణుఁగులు తొలుత నీ కుంకుమపు గోనెలు
మిక్కుటపుఁ గస్తూరి వలపుల మించు పునుఁ గిడఁ దగిన పూనెలు
మలయగిరికూటమునఁ గల వీ మంచి సిరిగందంపు మ్రాఁకులు
తళుకుఁ దళుకున మించు నివె సిద్ధంపు మగతా పిడుల బాకులు
ఆనవా ల్గ్రోలుటకుఁ దగు నీ యబ్బురపు నెలతాల గిన్నెలు
పూని యుడిగ మొనర్ప నేర్తురు పొంత నీ యుడిగంపుఁ గన్నెలు
తీవి నల ఖర్జూరములఁ బురడించు నల్లవె యోత పోఁకలు
శ్రీ వెలయు గేదంగి రేకుల చెలువు గల వీ పండుటాకులు 224

క. అని గౌర పలుదెఱంగుల
వినిపించి యొసంగు వస్తువితతుల నెల్లం
గొని యెంచుకొని నృపాలుఁడు
మనమున నుప్పొంగి సబహుమాన ప్రౌఢిన్. 225

1. సూర్యపుటములు

చ. విడి గల కెంపుటారవల వింతపసు ల్గల తాళి వజ్రపుం
గడియము లున్నపాణుల చొకాటపు చౌకళి కట్టు వర్గము
ల్గడుఁ బ్రియమొప్ప నిచ్చి కుతుకస్థితి నవ్వసుమంతు నప్పు డ
య్యొడయఁడు పంప నింద్రవిభవోన్నతుఁడై యతఁ డింటి కేగినన్. 226

తే. అతని పాణిగృహీతి మోహనతరాతి
రూపవిఖ్యాతి రతి రీతి నేపుఁ జూపి
వెలయు గుణవతి తన ప్రాణవిభుని రాక
కుబ్బి సంతోషరసవార్ధి నోలలాడి. 227

సీ పసుపు నల్లు ఘటించి పైఠాణి సవరించె
జిగి మేని కొక వింతసిగ జనింపఁ
గడల రేఖ లమర్చి కాటుక దీర్చె వా
ల్గన్నుల కొక వింత కాంతి మెఱయ
నిలువు టద్దము చూచి తిలకంబు దిద్దె నె
మ్మొగమున కొక వింత ముద్దు గులుక
జవ్వాది పద నిచ్చి క్రొవ్విరు ల్ముడిచెఁ బె
న్నెఱి వేణి కొక వింత హరువు లెసఁగ

మఱియు నిలువెల్ల నొకవింత యొఱపు నెఱప
నింటఁ గల చొక్కపుసొమ్ము లెల్లఁ దాల్చి
వినయలజ్జాభయంబులు నెనయఁ బ్రాణ
నాథునకు మ్రొక్కి నిలిచె నా నళిననయన. 228

తే. అంత నతిలోక[1]చారిత్రుఁ డగు సుపుత్రుఁ
డతివినయభక్తితాత్పర్యయుతముగాఁగ
హితబుధాశ్రితగురుపురోహితుల తోడ
జనకు కడ నిల్చి సాష్టాంగవినతి సేయు 229

---

1. చాతుర్య

ఉ. ఎత్తి దృఢాంకపాళిఁ గదియించియు నిన్నటి యర్ధరాత్రి నీ
చిత్రజరూపుఁ డీ యబల చెంతఁ దమి న్నిదురించు చున్నవాఁ
డిత్తఱి నన్నుఁ జేరె భయ మించుక యేనియు లేక వీని దు
ర్వృత్తి సువృత్తు లే నెఱుఁగు టెట్టు లొకో? యని సంశయింపఁగన్.

క. కులవృద్ధు లప్పు డాతని
కళ యెఱిఁగి భవత్ప్రియాణకాలంబున నీ
కులకాంతాతిలకం బీ
యశికచ నెంచుసలియుంటుః టది యెఱుఁగవొకో? 231

తే. అంత నీశ్వరకరుణాప్తి ననుదినప్ర
వర్ధనంబైన తద్గర్భవనధి వలన
నవతరించె నితండు నీ యౌరసుండు
కనుఁగొను మటన్న సంతోషకలితుఁ డగుచు. 232

క. సతి పాతివ్రత్యంబును
సుతుని గుణాఢ్యతయుఁ దెలిసి చుట్టపువారల్
మతి సమ్మతించునట్లుగఁ
చతురుండై మెలఁగె నతఁడు సరసిజాక్షీ! 233

తే. ఇత్తెఱంగున మన సెట్టి యింటి మీఁది
బాళినైనను నినుఁజూచు బాళినైన
నింతలో వచ్చెనేని నీ వింట లెమి
కే మనుచు బొంకఁ గలవు పూర్ణేందువదన! 234

క. ఈ కథ వింటివిగద య
స్తోకమతిని దెలిసికొమ్ము సూత్రప్రాయం
బై కనుఁగొన నయ్యెడు కా
ర్యాకార్యము లని వచింప నట్టు వేఁగుటయ్యున్. 235

క. ఱెక్కలు విదిల్చి లావులు
ముక్కుకొన న్దువ్వి మోదమునఁ గంధరముల్
మిక్కిలి దిక్కు గనుంగొనఁ
గొక్కురొకో యనుచుఁ గోళ్లు కూయం దొడఁగెన్. 236

క. ముడిఁగెఁ దొగ లడఁగె ఱిక్కలు
విడిగెఁ బయోజమ్ము లుడిగె వెన్నెల లటు గ్రుం
కడిగె నెల వడిగఁ గత్తిం
గడిగె మఱుం డినుఁడు తూర్పుకడఁ బొడచు నెడన్. 237

తే. అంత నయ్యింతి యింతయుం తనఁగ రాని
వంతఁ దన యంతిపురిఁ జేరి కంతు నిశిత
కుంతహతిఁ గొంత గుంది సాయంతనాప్తి
నెంతయు దురంతవిరహసంక్రాంతి నగుచు 238

## నాలుగవరాత్రి :

సీ. మెఱుఁగంచు కమ్ములు సరసించి మితిలేని
వెల నొప్పు మణుల కమ్మలు ధరించి
సూల చేకటు లొక మూల వైచి సిరాజి
గనుపుల గళ్ళ చేకటులఁ దాల్చి
[1](యక్కదే వ్యాదుల యుజితి) బొట్టట వెట్టి
పుత్తడి మెడ నూలి బొట్టమర్చి
చిఱుత పొప్పళి రోసి సరగంచు పసరు పొ
ప్పళి కుచ్చెల చెఱంగు వలువ గట్టి
సేస కొప్పునఁ గపురంపు చిత్రకంబు
గళమునఁ గుచాద్రులను దట్కుగందవొడియు

1 యక్క చెవాధుల యుఁతు (పూ)

వలపు గులికెడు సింగార మొలుక ముద్దుఁ
జిలుక కడ నిల్పెఁ గోమటికులుకులాఁడి. 239

తే. చెంత నిటు నిల్చియున్న యక్కాంతఁ జూచి
చిలుక యొకవార్త వివరింపఁ దలఁచినపుడె
కలికి నన్నిపు డారాజతిలకుఁ గూర్చి
మిగుల నుపకార మొనరింపఁ దగు ననుండు. 240

ఉ. కాంతరో! యెట్లు కాఁ దగిన కార్యము లట్లగు ము న్గళావతీ
కాంతకు మోహనాంగు నుపకాంతుని నమ్మణిమండనక్షమా
కాంతుని నేనె కూర్చి యుపకార మొనర్చితి నే తలంప నా
క్కాంతయు నంతరాయ మగునే విధి వ్రాసిన వ్రాఁత కిమ్మహిన్. 241

వ. అది యెట్లంటేని విను మీప్రకారంబునకుం దగిన జగదసాధారణం బగు
నొక్క గాథ గలదు వివరించెద నిది సావధానంబుగా నాకర్ణింపు మని
యిట్లనియె. 242

## రెండవ కథ

క. కమలాకరమను నొక పుర
మమరు సురవ్రజనుతధ్వజాళికమరు
ద్భ్రమదభ్రచయప్రమదా
సుమదామకటాక్షజనితసూనశరంబై. 243

ఉ. ఆపురి రాజ్యలక్ష్మి కిరవై మణిమండనుఁ డేలు రూపరే
ఖాపరమన్మథుండు చతురబ్ధిపరీతధరాధురంధరా
రోపభుజార్గళుండు చతురుండు సమస్తమదాభియాతిసం
తాపకరప్రతాపుఁ డొకనాఁ డతఁ డెంతయు సంతసంబునన్. 244

క. ఒకచక్కిఁ జక్రసముకుచ
లొక దండ న్దండనాథు లొకచో శకచో

శకళింగవంగఘూర్జర
కుకురనృపు ల్గొలువ నిందు కొలువగు వేళన్. 245

ఉ. కొమ్ములు మ్రోయ మంటితమకు ల్వెస బోరుకలంగఁ బార్శ్వభా
గమ్ముల నల్లనల్ల ప్రజ గ్రమ్ముకొన న్వెస జాగిలంపు మొ
త్తమ్ములు ముంగల న్నడువ దర్ప మెలర్పఁగఁ జెంచు పాళెగాఁ
డమ్మనుజేంద్రు కొల్వునకు నచ్చెరు వందఁగ[1](వచ్చి) చెచ్చెఱన్. 246

తె. కుఱుచవగ తేఁటఁగవ మోడ్చి కోరసిగయు
గూడకొమ్ముసు మోఁకాళ్లు గూడ వంచి
కొలువుదొర లించుక హసింపఁ గువలయేంద్రు
చరణకంజమ్ములకు మ్రొక్కి చక్క నిలిచి. 247

సీ. నివ్వరిప్రాలు తేనియ పాలపండులు
కారెనుముల పెర్గు చాఱపప్పు
పునుఁగుఁ జట్టంబులు పునుఁగు కట్టు జవాజి
కమ్మకస్తురి పచ్చకప్పురంబు
నేకలంబుల కోఱ లేనుంగు కొమ్ములుఁ
బురుడు జింకలు పెనుపులుల గోళ్ళు
హరిచయాఁకలు నెమ్మిపురి జొంపములు తెల్ల
నవరము ల్జల్లులు జాగిలములు
పికిలిపిట్టలు దేగలు బెట్టుదుతలు
పట్టుజిట్టలు ఫణిఫణాభద్రకుంభి
కుంభవరదంష్ట్రిదంష్ట్రికకోటిగళిత
కలితముక్తాఫలంబులు కాన్కచేసి. 248

---

1. వచ్చె (పూ)

తే. సామి నా విన్నపము విని సారి వెడలి
యొక్క మల [1]చెంత గడెతడ వున్నఁ జాలుఁ
[2]జెండు బెండాడి మెకములం బెండు పఱిచి
దేవరకు వేడ్క పుట్టింతు దేవు నాన. 249

క. అని విన్నవింప విని య
మ్మనుజేంద్రుఁడు సబహుమానమహిమఁ బుళిందున్
బనిచి నిజాంతఃపురికిం
జని యాఖేటకవిధానసత్వరమతియై. 250

సీ. పసరుపట్టు హిజారు మిసమిస లుఱుతకా
ల్మెఱుఁగు టంగికి వింత యొఱపు సింపఁ
గాశ్మీరపంకసంకలితాంగదీధితు
ల్కప్పు దుప్పటికిఁ జెంగావు లీన
జాళువా జిగి జిగాసరిపెణల మెఱుంగు
చిలుకతాళికి నొక్క సిరి యొసంగ
సిగ తాయెతుల నిగ్గు జిలుగు తాపిత సన్న
సరిగ జంట కుళాయి కొఱపు నెఱప
నుదుటఁ గస్తురిరేక పీనులఁ గిరిటి
పచ్చఱా పోగులుఁ గృపాణి పాణి నలరఁ
బాదముల జీవదంతపుఁ బావ లూఁది
రాజకందర్పుఁ డంతఃపురంబు వెడలె. 251

తే. సరి దొరలు దండ నొరయ నాస్థానమండ
పమున నిలుచున్న యంతలోఁ బాదరసము
జోక గల తేజి నిండు సంజోకఁ జేసి
యెమట నటు దెచ్చి నల్పె సాహిణి యొకండు. 252

1. ఘాంత ఘోకగఢి నున్న 2. ఘెండు ఛెండాడి

క. మన మలరఁగ నత్తురగముఁ
గని కను దమ్ములనె మ్రొక్కి కర్ణపుటరసా
యనసౌవిదల్లసాహో
నినదం బెసఁగంగ నెక్కి నృపుఁడు నిపుణుఁడై. 253

సీ. భేరీమృదంగశంఖారావములు మ్రోగ
ధస్త్రవార్భటుల దిక్తటము లద్రువ
బిరుదకేతనపరంపరలు శిలోత్తాల
తాలవృంతములతో మేలమాడఁ
దెల్ల పావడల దీధితులు ముక్తామణి
చ్ఛత్రకరుచులపైఁ జౌకళింప
సాంబ్రాణి పొగలు నిచ్చలపు ధూమ్రంపుఁ ది
త్తుల దుమారములతోఁ గలసి మెలఁగఁ
జామరద్వయచలనసంజాతవాత
కందళమ్ములు వదనారవింద ఘర్మ
కణము లడఁపఁగ వెడలె నల్గడలఁ గదియు
సేనతో నద్ధరాసునాసీరుఁ డంత. 254

వ. ఆఖేటసమయసముచితసముత్సాహసన్నాహబహువిధచమూసమేతుండై చను
నప్పుడు. 255

సీ. [1]వంకులు గుదియలు వలత్రాళ్లు మ్రోకులు
[2]బిసలు మాఱమ్ములు పెద్ద విండ్లు
పచ్చకట్టెల[3]గురు ల్బలుతుపాకులు నెద్దు
లేనుంగులు సివంగు లిఱ్ఱిపోతు
[4]లొడిగ కుంపటు లాకుతడికెలు [5]ప్రోగు త్రా
ళ్వాడి గొడ్డండ్లు మవ్వంపు టురులు
పాఁది గువ్వలు మోటుపలకలు పోటు గుం
జలు చిక్కములు నురు ల్జాగిలములు

---

1. వంకర 2. బిసు మాఱమ్ములు 3. గుదు 4. పిడుక (పూ) 5. మ్రోకు

జిగురుఁ గండెలు గాలపుఁ జివ్వ వెదురు
లాదియగు సాధనంబులు నలవరించు
కొని హుటాహుటి నడలతోఁ బినుఁగు తెల్లఁ
గదిసి నడిచిరి యమ్మహీకాంతు నఱుత. 256

వ. అప్పు డప్రతిభాప్రభావుండై. 257

సీ. మంజులద్రుమలతాకుంజపుంజస్థలీ
ఘుటఘుటార్భటిలుఠత్కిటికులంబు
బహుమహీధరగుహాగృహవినిర్నిద్రము
ద్రానిర్యదురుమృగేంద్రవ్రజంబు
గండమండల వినిర్గతగళద్గంధాను
చరదరిప్రోల్లసత్కరిఘటంబు
సరభసోద్ధతపరస్పర హతాహతభగ్న
ఖురవిషాణోగ్రకాసరబలంబు
చండతర ఘోరశార్దూలసంఘచటుల
చంక్రమక్రమదృశ్యాత్రజాతహరిణ
ధావనం బగు నొక్కమహావనంబు
మన మలరఁ గాంచి చొత్తెంచె [1]జనవిభుండు. 258

మ. చకితేభంబు సముద్యమన్మృగ మనాశ్వాసవ్యథాకీర్ణగం
డక మత్యంతహతాల్లురద్గవయ మాఢౌకాయమానస్థలా
వృక మాక్రోశనకృన్మృగేంద్రము రణద్భీభత్సకృత్కోలము
త్సుకభిద్భావతరక్షువై గహన మచ్చో ఘూర్ణతం జెందఁగన్. 259

సీ. వడిగాలి వడి నిల్వ వసపోక బలితంపు
సరిపెణ ల్దునియ వేసరక నిగుడుఁ
బట్టెడ సడలించు పర్యంతమును దాళ
కతులరోషాప్తి నిట్టట్టుఁ బెనఁగుఁ

1. మనుజవిభుఁడు

బడియు నిర్వడియు ముప్పడియు సల్వడి చొచ్చి
కడుపులు చెదరఁ జీకాకు సేయుఁ
గటికి నెత్తురులతోఁ గండ లుర్లి పడంగఁ
జేరి పందుల పాలచేర్లు గఱచు
నేలికలు వెంట వెస నంట నేపు రేఁగి
కోపు మీఱి జవోద్వృత్తిఁ గూడఁ బఱచి
యెందుఁ జొచ్చినఁ జొరనీయ కీడ్చి తెచ్చి
సలుగులను గూల్చె నొక కొన్ని జాగిలములు. 260

వ. అప్పుడు 261

తే. భటుఁ డొకఁడు వింటఁ జుఱుకంటఁ బందినేయ
మిట్టిపడి మించు మెఱసిన ట్లల్లై తూఱి
యది భయదఘుర్ఘురారావ మడర నతని
రెండు తొడలును వెసఁ గత్తిరిలఁగఁ జంపె. 262

క. కొంతాన నొకఁడు బెబ్బులి
గొంతానం గ్రుచ్చి మెచ్చుకొని తను దెలుపన్
వంతుకుఁ గడువని నొకఁడొ
క్కింతయు బెదరక పిడెమున నెలుఁగుం బొడిచెన్. 263

క. బొఱియ వద వేఁపు లొక కిటిఁ
గఱచి కఱచి కూల్చె నపుడు కందలు ప్రేవుల్
మెఱయఁ దమ యేలికలకుం
గురి మేరయుఁ బా ళ్ళమర్చుకొను పొంకమునన్. 264

సీ. వల చెంగునను దాఁటి వడినేఁగు నొక లేటి
కొంకి కొంకక త్రొక్కి కూల్చె నొకఁడు
కలగుండు పడ రొప్పి గవినుండి కుప్పించు
పులిగుండె లవియంగఁ బొడిచె నొకఁడు

ఘోరవ హత్తుకొని సముద్మదవృత్తిఁ జను హత్తి
కొమ్ము లంటఁ బెకల్చి కొట్టె నొకఁడు
పేరెంద నొకకొంత నో రెండుకొని యుండు
గండభేరుండంబుఁ గదిమె నొకఁడు
వెండియు నొకండు నిశితోగ్రమండలాగ్ర
చండతరధార నుద్దండ శరభకాండ
శశగవయఖడ్గముల నెల్లఁ జక్కు సేయఁ
గండ లురులఁగఁ గడుఁదులఁ జెండె నొకడు. 265

క. ఈరీతి వేఁటకాండ్రని
వారణమృగపక్షు నెల్ల వడిఁ దఱిమెడిచో
ధీరుఁ డల రాజచంద్రుఁడు
కోరుకు లెసకొలుప సుభటకోటుల కంటెన్. 266

మ. పులులం ద్రుంచి కడుంపులం దునిమి దుప్పు ల్నుగ్గునూచంబుగాఁ
బొలియంజేసి వరాహసంఘముల రూపు ల్మాపి సింగంపుగుం
పుల నెల్లం దెగటార్చి యేనుఁగులతోఁ బోరాడి భల్లూకమం
డలి నిట్టట్టొనరించి యుండునెడ దండ న్విస్మయం బందుమన్. 267

ఆ. ఒక్క నక్క వల గతుక్కునఁ గొఱికి తా
నవలఁ జనఁగ వెంటఁ దవిలె బలము
వసుధ నక్కఁ గన్న వాఁడెల్ల వేఁటకాఁ
డనెడు వార్త నిక్క మయ్యె ననఁగ. 268

వ. అట్టియెడ 269

ఉ. కోఱలు చప్పరించి కనుగొల్కుల నిప్పుక లొల్క నల్కమై
బోరున రొప్పి పైఁ బడిన పోతరపుం గిటి నొక్క కేలున
న్మోరట బిగ్గఁ బట్టి దృఢముష్టిహతి న్వడి నొంపఁ జూచి కే
ళ్జారుటఁ జాఱె నమ్మెకము జాగిలము ల్వెస వెంట నంటఁగన్. 270

ఉ. హాళి నృపాలమౌళి చతురంగబలంబుల బ్రాపు గోరకే
చాల పరాక్రమించి జవసైంధవము న్వడిఁ బోవ నూకి త
త్కోలము వెంట నంటి చన ఘోరవని న్వెస మాయమయ్యెఁ గాఁ
బోలు ననంగ నమ్మెకము పోవుటకు న్మదిఁ జింత నొందుచున్. 271

క. మును వెనుక తెలియ కత్తఱి
వనమండలిఁ దిరుగు నతని వరవీరభటు
ల్గనుఁ జూడుఁడు ననుఁ జూడుం
డను వారలు వెంట నంట నర్హులు గామిన్. 272

సీ. దుర్దమసమ్మర్దకర్దమస్థలములఁ
జనరాక మదసానుజముల డించి
చటులనికుంజపుంజములఁ గాలాడవి
కతనఁ గంఖాణసంఘముల నునిచి
తండోపతండమై గండోపలము లుండు
పథములందుఁ గౌలారు బండ్ల నాఁగి
వంకలొ నలువంక లంక మల ద్దాఁట
సమకూడమికి నందలములు డిగ్గి
దారి తెలియక ఘోరకాంతారభూమిఁ
జెట్టు కొకఁ డై రి యారాజసింధురంబు
పొలుపుఁ గనుగొన వలసి యుమ్మలిక వొడమ
నక్కడక్కడ సామంతు లరసి యరసి. 273

క. కలగుండువడి పొలంబున
నిలువం బడి బ్రాఁకు లట్లనే యున్నతఱిన్
జలరుహబాంధవుఁ డస్తా
చలశిఖరముఁ జేరె నంత సంజ జనించెన్. 274

సీ. కకుబబ్జముఖులకుఁ గస్తూరిపూఁతలై
భూభృదౌఘముల కంబుదము లయ్యె
భూరిఘోరారణ్యములకు గజంబులై
యారామములకుఁ బికాళు లయ్యె
హర్మ్యపంక్తులకు నిర్యద్ధూమరేఖలై
వరనదంబులకు శైవలము లయ్యె
భవనంబులకు నీలి పట్టుమేల్కట్టులై
కోఁకుల కెలదేఁటి గుంపు లయ్యె
ననఁగ సకల జగద్భీషణాయమాన
లీల వన్నియలను నొక్క నీలి మ్రింగె
ననుట నిజమై యశేషవర్ణాంతరములఁ
గప్పుకొని యొప్పు చిమ్మచీఁకటులు నెఱసె. 275

వ. అంత 276

చ. పరువడి భేకము ల్మొఱయఁ బ్రాగ్దిశనుండి కడంగి తెమ్మెర
ల్పొరయఁ దళుక్కటంచు నడునింగిఁ గడు న్మెఱయన్ ఘనౌఘముల్
తఱచుగ దక్షిణం బొరయఁ దత్క్షణలక్షణము [1]ల్గణించి నేఁ
డరయ మహోగ్రవృష్టి గురియంగలదంచు నృపాలుఁ డెంచఁగన్. 277

సీ. గళదనర్గళగళద్గళదుద్ధతధ్వను
ల్గిలకొట్టి మండూకములు చెలంగ
ధగధగత్ప్రజ్వలత్పటుతటిల్లతికాళి
మిసమిస ల్మెఱసి యాకసము నిండఁ
జిటచిటార్భటిసముద్భటనిరాఘాటసం
ఘటనమై కరక లొక్కటను రాల
[2]ఘుమఘుమారావసంకులకులాచలగుహా
కుహరమై పెనుగాలి గుంపు వీవఁ

1. ల్గ్రహించి 2. ఘుమఘుమంఘుమరవాకుల కులాచలమహా, కుహరంబు పెనుగాలి గుంపు దీర.

బెళపెళారని బెడిదంపు పిడుగు లురల
ఘనఘనాఘనసంఘము గ్రిమ్ముకొనఁగ
ఝుల్లుఝుల్లునఁ బెనుజల్లు చల్లుచుండ
బోరుబోరున [1]వర్షంబు ధార లురిసె. 278

వ. వెండియు నయ్యఖండతరధారాపరంపర లొండొండ మెండుకొని వసుంధరా మండలంబు బెండుపడఁ [2]గురియుచుండ మహీధరశిఖరశిఖాభ్యంతరంబులం బాఁదు లురలి పడు బృహచ్ఛిలాతండంబులమహారావంబునకు గహ్వరీస్థల సింహకిశోరంబులు గర్జించు కహకహారావంబులకు వెఱవక యక్షిణమహా నిక్షేపసంరక్షక బ్రహ్మరక్షోగణంబుల దురాక్షేపణంబులకు భీతిలక శాకినీ డాకినీప్రముఖబహువిధభూతబేతాళగణంబుల కోలాహలంబులకు శంకింపక యమ్మహారాజమార్తాండుండు కరాగ్రనిశితకౌక్షేయకంబు నొఱవెలికి జళిపించినం బొడము ధగద్ధగాయమానప్రభాపటలంబులకుఁ దోడు సూపు విద్యుల్లతానికాయంబుల వలనం జెట్టు గుట్టల సందులం దెరువు కనంబడ నక్కుఱంగట నొక్క వటమహామహీరుహంబుం జేరం జని. 279

ఉ. ఆనృపపుంగవుండటు మహాతరుమూలము డాసి తేజి నెం
తే నికటోర్వి డిగ్గి సముదీర్ణపరిస్ఫుటఖడ్గపాణియై
తా నపు దేపున "న్విపదిధైర్య మథాభ్యుదయే క్షమే''తి వా
గ్రానిపుణస్థితిన్ ధృతిధురంధరుఁడై యొకఁ డుండె నెమ్మదిన్ 280

తే. ఆదిఁగర్వేశ్వరుండైన యప్విభునకు
బ్రమానుపడి మేను బహుతరగ్లాని నొంది
కన్ను గూర్కెడు నంత నగ్గహనభాగ
మేలు బేతాళుఁ డతిదుర్నిరీక్షుఁ డగుచు. 281

1. వర్షాంబుధార లొరసె 2. గురియునంత

క. [1]అనరప్రచార మమితం
బనుపమగాఢాంధకార మతి ఘోరతరం
బనఁదగు మత్పాంతారముఁ
గన నోపునె నుదుటఁ గన్ను గలవాఁడైనన్. 282

వ. అని యనేకరోషానలజ్వాలాభీలవికటీకృతభ్రుకుటీలతాకుటిలవదనుండగుచు నచ్చోటికిం [2](గదిసి యతనిం) గనుంగొని తదీయావయవంబులం గననగు సార్వభౌమముద్రికాముద్రితంబులైన సాముద్రికంబుల నిరీక్షించి సకలశుభలక్షణలక్షితుం డితం డెవండో యని తన మనంబున వితర్కించుకొని స్వకీయానుచరులతో నిట్లనియె. 283

ఉ. ఈ సుకుమారదేహుఁ డిపు డీవని నుండ నుపేక్ష చేసినన్
దోసము వచ్చు మీ రితనిఁ దోడ్కొని పోయి [3]విచిత్రరత్నశో
భాసమమైన యొక్క నృపహర్మ్యమునం బవళింపఁ జేసి సం
త్రాసము చెందకుండఁ గొనిరండు ప్రభాతము వచ్చునంతకున్. 284

వ. అని నియోగించిన నంగీకరించి యతనిం గ్రహించుకొని తదీయపరిచారకులాక్షణంబ శాంబరీవిడంబనంబునం గుకురుకరూశకాశ్మీరమగధమత్స్యమాళవమహారాష్ట్రసౌరాష్ట్రాదిబహువిధదేశంబు లవలోకించు చున్నంత నక్కళింగమహీమండలంబున 285

క. కటక మనఁదగు నాకానాక
పుటభేదన మహితహృదయపుటభేదనమై
కటకలితదానధారా
స్ఫుటకరకరటీసహస్రములఁ దనరారున్. 286

1. అనఘప్రచారరహితం 2. గదిసినతనిం (పూ) 3. విచిత్రరత్నశో, భాసితమైన

క. అందు వెలుఁగొందు నయనా
నందంబగు రాచనగరు నముచిభిదుపలా
మందపగిస్పందరుచిం
గ్రందుకొనిన సౌధ మొకటి గని యాలోనన్. 287

చ. చికిలికిరీటిపచ్చల రచించిన చిల్కలకోళ్ల నందమౌ
సకినెల పట్టెమంచమున శయ్యపయి న్సుఖనిద్రఁ జెంది యుం
చుక తనుఁ దా [1]నెఱుంగకయ చొక్కెడు తన్నృపు నల్లుఁడైన పెం
డ్లికొడుకు నేచి చూచి యవలీలమెయిం గడ నుంచి యచ్చటన్. 288

తే. లీల మణిమండనుని బవళింపఁ జేసి
కడకడల నుండు నంతఁ దత్కటక మేలు
చారుచంద్రమహారాజచంద్రతనయ
కూర్మి [2]మెఱయఁ గళావతీ కోమలాంగి. 289

క. ఆరాత్రి పెండ్లి యగుట న
పారమహావిభవ మొప్ప బలవైరినిభుం
జేరుటకు నిజవయస్యా
ప్రేరితయై మితములేని శృంగారమునన్. 290

సీ. చలువ దువ్వలువ కుచ్చెల యంచు ముత్తెము
లప్రదనఖప్రభకు సలాము సేయ
అవిక కట్టడపుఁ దోరపు నిగ్గుజంటీలు
తనులతాద్యుతికిఁ గైదండ యొసఁగ
సొగసు నిద్దపుఁ గమ్మ మగఱాల ధళధళ
లప్రిబలాక్షిరుచికిఁ బరాకు దెల్పఁ
గమ్మ నెత్తావి చొక్కటపుఁ గస్తురిబొట్టు
చికురసందీప్తి కిచ్చకము వలుక

1. నెఱుంగకను జొక్కెడు (పూ) 2. వెలయు

రవల మట్టెల సద్దు దుర్వారపాద
కటకనినదంబు మొలనూలుగంట రొదలు
నడచికొన లేని నడలతో నధిపుఁ డున్న
కేళిసౌధంబు గదిసె నక్కీరవాణి. 291.

తే. అపుడు తనవెంట వచ్చు వయస్య లెల్ల
నొక్కొక నెపంబుననె యొక్కరొక్క రరుగ
వసుమతీంద్రు నిరీక్షించి ముసుఁగు తోడ
[1]నిదుర వోవంగఁ జూచి యన్నీలవేణి. 292

క. ప్రాణేశ్వరుండు కడు ని
ద్రాణత నున్నాఁ డిదేమొ? తన కన్నులకు
న్రాణింపనొ? యితనికి మగ
పోఁడిమియే లేదొ? యనుచుఁ బొక్కుచు మదిలోన్. 293

ఉ. అంతజయాన కూర్మివిభు నందన యొక్కతివాసి మీఁదఁ గూ
ర్చుండి విపంచి మీటుకొనుచుండెడు నంతట నవ్వసుంధరా
మండలనాథమౌళి మణిమందనుఁ డొయ్యన మేలుకాంచి యు
ద్దండత దండనుండెడు లతాలలితాంగి నొకింత చూచినన్. 294

ఉ. అగ్గజగామినీమణి ముఖాంబుజ మించుక వాంచి తమ్మిపూ
మొగ్గల నేలు పూప చనుముక్కులఁ బయ్యెదఁ జక్కఁ జేర్చుచుం
దిగ్గున లేచి నిల్చి యువతీమకరాంకశుభావతారు స
మ్యగ్గుణహారు నానృపకుమారుఁ గనుంగొన నాతఁ డాత్మలోన్. 295

క. ఈ రామామణి యెక్కడ?
నీరత్నవిచిత్రసౌధ మెక్కడ? నిట కేఁ
జేరుట యెక్కడ? నని యని
వారణమహాద్భుతప్రవర్తనమతియై. 296

1. నిదురఁ జెందుట దెలిసి

ఉ. ఈ మదిరాక్షినేలు విభుఁ డెవ్వఁడొకో ? ననుఁ జేరఁ గారణం
బేమియొ [1](దైవమాయలను నెంతని)మెచ్చెదఁ దెల్లవారిన
న్మామకభాగ్య మెట్లయిన మంచిది నేఁటికి దీనితో రతి
శ్రీమహనీయవైభవముఁ జెందెద నంచు వినిశ్చితాత్ముఁడై. 297

తే. అల జగన్మోహనాంగి నొయ్యార మెసఁగఁ
జూచి కడు దిట్ట యగునట్టి రాచపట్టి
చెట్టవట్టి నిజాంకంబుఁ జేర్పఁ జూచు
నంత నయ్యింతి విభు తనుశ్రాంతిఁ దెలిసి. 298

క. కుందనపు బిందియల నిర
వందిన పన్నీట జలక మార్చి చిలుఁగుల్
పొందుగ నమర్చి నృపసం
క్రందనునకుఁ గలప మలఁది కడు భక్తిమెయిన్. 299

క. [2]సారతరంబగు మధురా
[3]హారంబుల నానవాల నధికక్షుధార్తిం
దీఱిచి [4]యంతట రాజకు
మారున కాతరుణి యాకుమడుపు లొసంగెన్. 300

తే. సరసురాలైన యాచారుచంద్రతనయ
నెలమి కళలంటి యలరించి యలవరించి
ప్రౌఢతరబాహ్యసురతసంబంధములను
బారవశ్యంబు నొందించి పార్థివుండు. 301

సీ. పూవుగుత్తుల వంటి పూపచన్నులు గోళ్ళ
నదిమినఁ గిచకొట్టునట్టి వేళ
మెఱుఁగనంటులవంటి చిఱుదొడ లుప్పిడికిన
నంగంబు పులకించునట్టివేళ

1. దైవమా యనిన నెంతని (పూ) 2. సాంతరంబుగ (పూ) 3. హారంబగు స్నానవాల్చు 4. వేగమె (పూ)

మృదుపల్లవము వంటి రదనాంశుకము పంట
నంట నొక్కిన గెంటునట్టివేళఁ
బొన్నకొవ్విరి వంటి పొక్కిలి గిలిగింత
లలరింపఁ జిట్టాడునట్టివేళ
నదరనీయక యక్కున నదిమి చెక్కు
చిదిమి [1]నెమ్మోము మోమునఁ జేర్చి బుజ్జ
గించి యుపలాలనారతిక్రీడ వలన
మగువ నలరించె నా రాజమన్మథుండు. 302

క. అంత నవరసికుఁ డగు న
క్కాంతుని [2]మన్ననల వలన గడిదేఱి వెసం
గాంతామణి తన మదిలో
నెంతయుఁ గసివోని వలపు హెచ్చిన కతనన్. 303

ఉ. చెక్కిలి నొక్కిన న్మగుడఁ జెక్కిలి నొక్కు రదచ్ఛదాప్తిఁ బ
ల్నొక్కఁ జుఱుక్కున న్వెసఁ గనుంగొనుఁ గ్రూరకటాక్షదీప్తిఁ బే
రక్కునఁ [3]జేర్పఁ గుబ్బచను లంటఁ గవుంగిట నెత్తునప్పు డా
చక్కెరబొమ్మ మార్మలయు చెయ్వులకు న్నృపుఁ డుల్లసిల్లుచున్. 304

సీ. కొఱికిన మడుపుటాకులు మోవి కందిచ్చి
యధరాధరము పంట నంట నొక్కి
కిచకొట్టి బకదారి కివకివ ల్ప్రావిఁ గుల్కి
కుదురు గుబ్బ లురంబుఁ గదియఁ జేర్చి
యతులితోత్కంఠఁ గంఠాశ్లేష మొనరించి
బహుబంధసురతసంభ్రమముఁ జూపి
పారవశ్యసుఖానుభవసంపదలఁ దేల్చి
యుపచారములఁ గొంత యుబుసుపుచ్చి

1. నెమ్మోమునను మోము 2. మన్ననలఁ దగిలి 3. జేర్చి

వలచి వలపించి జీవితేశ్వరుని కేళి
మెచ్చి మెప్పింపఁ జాలి యమ్మీనయన
యండఁ బాయనిచో మణిమండనుండు
వెసఁ బునారతగతిసౌఖ్యవిభవుఁ డైన. 305

చ. పులిపులియయ్యె నంగలత పొక్కె సుధాధరబింబ మింతికి
న్నలినలి యయ్యెఁ గౌను జఘనస్థల మెల్లను నజ్జునజ్జునై
గులగులయయ్యె గబ్బిచనుగుబ్బలు ముద్దుమోగంబు వాఁడెఁ గెం
దలిరు[1]కటారివాని బెడిదంపు దురంబు విభుం డొనర్పఁగన్. 305

తే. రసికశేఖరుఁ డారాజు రాజవదన
కంది కుందిన నెమ్మోము కళ లెఱింగి
కడుఁ బ్రియ మెలర్పఁ గౌఁగిట నిడుముకొని సు
ఖానుభవలీలఁ బవళించె నంబుజాక్షి ! 307

ఉ. అత్తఱి నత్తలోదరి రతాంతపరిశ్రమ మొందెఁ గావునం
జిత్తజు వంటి నాయకుని చెక్కునఁ జెక్కు నురఃస్థలంబునన్
గుత్తములైన గబ్బిచనుగుబ్బలుఁ గంఠమునం గరాబ్జముల్
హత్తుకొనంగఁ జేసి చెలువార వెస న్నిదురించె నంతటన్. 308

క. తెలతెలవాఱుటఁ గని ని
స్తులధృతి బేతాళభటులు తొలుతటి మగనిం
జెలి ప్రక్క నునిచి సాఁప్రా
ట్కులమణి మణిమండనేంద్రుఁ గొని చని రబలా ! 309

క. అని తెల్పునెడఁ బ్రభాతం
బెనయుట రవిరథతురంగహేషారవమో
యనఁ బక్షిరవము సెలఁగె
న్వని చింతాక్రాంత యగుచు వెస నిలు సేరెన్. 310

1. కటారుకాని

ఐదవరాత్రి :

క. ఆకాంతామణి కుముద
వ్యాకోచం బెసఁగు వేళ నిలనాఁడు ధరి
త్రీకాంతుఁ [1]జేర నరుగుట
కేకమతిం జిలుకఁ జేరి యిట్లని పలికెన్. 311.

ఉ. ఓ మకరందబిందునికరోపమరమ్యసుగంధమాధురీ
శ్రీమృదువాణి కీరకులశేఖర! యల్ల కళింగరాజక
న్యామణి వార్త యేతెఱఁగున న్వినవయ్యెనుః దన్మనోవిభుం
డేమి యొనర్చెనోః యెచటి కేఁగె నాకో మణిమండనుం డాగిన్. 312

క. అని పల్కఁ జిల్కదొర యి
ట్లనియెన్ బళి! మేలుః జాణవౌదు వటంచున్
వనితారత్నంబున కా
వనితామణిమండనుండు వడి నేఁగుటయున్. 313

తే. మెల్లనె కళావతీసతి మేలుకాంచి
ప్రక్క వేఱొక్క మగఁడున్న బాగుఁ దెలిసి
యక్కః యిదియేమి చోద్యమో యనుచు మిట్టి
పడి కకావికయై యొండు కడకుఁ జేరి. 314

క. పువ్వారుఁబోణి మదిలో
[2]నివ్వెఱపడి చూచుచుండ నృపుఁ డుపవడమై
జవ్వాదు లతికయో యన
నవ్వెలఁది వడఁకఁ జూచి యతఁ డిట్లనియెన్. 315

క. మదనాగయానః మగతు
మ్మెద యంటిన కమ్మఁదమ్మి [3]మెఱుపు గలిగియు
న్నది నీ ముఖాంబుజం బిది
కొదవ గదాః క్రొత్తపెండ్లికూఁతున కనుచున్. 316

1, జేరఁ దలఁచుట 2, నెవ్వెఱ (వ్రా), నివ్వెఱగొని 3, మెలుపు

సీ. చికిలి చందురు కావి చిగురాకు నునుమోవి
నంటిన మొనపంటి గంటుఁ జూచి
నెఱికురు ల్చెదరి క్రొవ్విరిసరు ల్జారిపాడ
నొప్పు దప్పిన గొప్ప కొప్పుఁ జూచి
వలిచన్నుఁగవ యిక్కువల మిక్కుటంబులై
గుది గొన్న నెలవంక గుంపుఁ జూచి
తెలివాలుగల డాలు గల సోగకనుదోయి
నింపు గుల్కెడు నిద్రమంపుఁ జూచి
యిది సదాచారమే? రాజసదన మిదియె?
యిది కులాంగనయే? యంచు మది నొకింత
సందియము దోఁప నారాచచందమామ
యాగ్రహోదగ్రవిగ్రహుం డగుచు ననియె. 317

తే. నీజనని పుణ్యజనవర్ణనీయసాధ్వి
నీజనకుఁ డెన్న నభిమాననియతధనుఁడు
నీనగరు పోతుటీఁగకు నిలువరాని
దయ్యె వెల్లాటకత్తె పీ వౌట యరిది. 318

శా. నీ జాడ ల్గని యోర్చుకోఁ దగు నటే నీలాహివేణీ! మహా
రాజస్త్రీజన మీ వగ ల్వినిన నౌరా యంచు నిన్మెత్తురే?
యేజాతి నిన్ను వంటి దంట గలదే యిద్ధాత్రిలో? నంచు వి
భ్రాజన్మానధురంధరుండు నృపుఁ డుగ్రవ్యగ్రరోషాత్ముఁడై. 319

క. కుటిచవగ చిక్కటారిం
బరికింపక గొంతు చిదుము పనిఁ దలఁచి నరే
శ్వరచంద్రుఁ డా తలోదరి
కురు లొయ్యన నొడిసి పట్టుకొనియె లతాంగీ! 320

తే అప్పు డా బారిఁ గడతేఱ నగు ప్రయత్న
మెట్లు చింతింప ఫలయ్యు? రాకేందువదన!

యడుగు దప్పినచోఁ దప్పుఁ బిడు గటంచు
నొడువ మును విందువే కద పుడమిలోన. 321

చ. అన విని మందహాసరుచిరాస్య ప్రభావతి పల్కె నీ వగ
ల్గని విని యున్నవారి నడుగం దగు నో శుకసార్వభౌమ! యే
మనఁ గలదానఁ? నీవ కలయర్థముఁ దెల్పు మటన్నఁ గీర మి
ట్లను నల భూభుజంగవరు నంగన యప్పు డవార్యధైర్యయై. 322

క. విడు విడువు మంచుఁ గ్రొమ్ముడి
విడిపించుక బలిమి నొడిసి విభుని కరాసిం
గుడుసు వలిగుబ్బ చన్నుల
నడుమను మొన సేర్చి తెంపున గ్రాలు తఱిన్. 323

తే. నృపకులేంద్రుఁడు వెఱఁగంది నెలఁత కేలి
వాలు కడఁ బాఱవైచి యో వాలుఁగంటి!
గోల విటువంటి తెగువ నీకేల? యనుచు
నెఱికురులు చక్క ముడిచి కన్నీరు దుడిచి. 324

ఉ. లాలన మాచరించి నవలా నడుగ న్నృపుతోడఁ బల్కు బే
తాళుని బోలు నొక్క పెనుదయ్యము నన్నగలించి పట్టి యా
భీలత నింత చేసి వెఱపించి చనె న్నినుఁ బల్కరింప వా
గ్జాలత చాలదయ్యెఁ గల గంటినొ, నెవ్వెఱఁ జెంది యుంటినో? 325

న. నీవేమొ కొల యొనర్చితి
పీవగ నది సోఁకు దగుచు నేచఁ దొడంగె
న్వేవేగఁ దత్ప్రతిక్రియఁ
గావింపకయున్న నెట్లు కడచెద నదినన్. 326

తే. అట్టులగునని తద్దోష మపనయింప
నభయకరమంత్ర [1]తంత్రము లాచరించి

1. యంత్రము

రాజబింబాస్యఁ గూడి యా రాజునేక
కంఠత వహించె నో కంబు కంఠి! యనిన. 827

చ. విని వెఱఁగంది క్రొత్తకథ వింటిని నేఁ డిది చిత్రమంచు నె
మ్మనమున మెచ్చునంత రవిమండల మయ్యుదయాద్రిఁ జెందినం
గని కనుదమ్ముల న్నిదుర గ్రమ్మక రా నిలు సేరి ప్రేమ స
వ్వనరుహగంధి సంజకడ వచ్చి శుకాగ్రణి చెంత నిల్చినన్. 828

ఆఱవరాత్రి :

క. మదిరాక్షీ! యేతత్కథ
కొదవ యగుట తగదు కడమ గూడఁ బలికెద
న్మదమున విని పొమ్మని య
మ్మదనుని స్వామిణి పలికె మధురతరోక్తిన్. 829

క. మణిమండనవిభుని నభో
మణిచండనిభు న్విభాసమానై కవరాం
గణమున నిడి యవ్వీరా
గ్రణు లాశుభవార్త యేలికకుఁ దెలుపుటయున్. 830

తే. అతఁ డతని ధైర్యచర్యాసహాయశౌర్య
బహువిధగుణంబు లెంతయుఁ బ్రస్తుతించి
సంధి యొనరించి యమ్మహాసార్వభౌము
ననునయించుట తగుకార్య మని తలంచి. 831

సీ. జనభయంకరసరోషజ్వాలికాధగ
ద్ధగదుగ్రరుచుల నెమ్మొగము వెలుఁగ
సకలపిశాచశిక్షారక్షణాక్షీణ
కౌక్షేయకము భుజాగ్రమునఁ దనర
శాకినీడాకినీలోకలోకాతీత
బలపరంపర కెలంకుల నడువ

మనుజకోటికరోటిమాలికాభసితచ
ర్మాంబరంబులు మేన దంబు సూపఁ
గోరమీసలు మిడిగ్రుడ్లుఁ గుటిలతరక
రాలదంష్ట్రియుగంబు నుత్తాలబహుజ
టాలజాలంబు నెరయ బేతాళుఁ డపుడు
నిలిచె నాభూవిభుని ముందఱ నలఘులీల. 332

ఉ. అంతకు మున్న యన్నరవరాగ్రణి మేల్కని విస్మయోదయ
స్వాంత మెలర్పఁ గన్గొని వెసం బొడసూపు మహాప్రతాపుఁ డీ
యంతకరూపుఁ డీతఁ డెవఁ డంచు [1]మనంబున నెంచు నంత న
భ్రాంత వసించి యమ్మహివిభు న్వినయోక్తుల నాతఁ డిట్లనున్. 333

క. బేతాళనాయకుఁడ నో
భూతలవల్లభ! మహాప్రభుత్వము గల ని
న్నీతఱిఁ గనుఁ గొనుటకుఁ బ్రే
మాతిశయత వచ్చినాఁడ ననిన సుముఖుఁడై. 334

వ. [2]యథోచితప్రత్యుత్థానాభిగమనంబు లాచరించి [3]కుశలం బడిగి సుఖంబున్న యనంతరంబ యద్ధరిత్రీపాలునకు బేతాళుం డిట్లనియె. 335

ఉ. ఓచతురాగ్రగణ్య! భువి నున్న నరేంద్రులలో భవన్నిభుం
డీ చతురబ్ధివేష్టితమహి న్నహి యంచు జనుల్నుతింప నీ
యాచరణం బెఱుంగక మహాగహనాంగణభూమి నొంటిమై
నేచి చరింప నీతి యగునే? తగునే యిటువంటి కృత్యముల్. 336

1. విచార మొనర్చు నంత 2. యథోచితప్రకారంబున 3. సుఖాసీనుండై యన్యోన్యప్రియవినయగంభీరసంభాషణంబుల కుశలం బడిగి

సీ. అన్యరాజన్యరాజ్యస్థితుం డగువేళ
సరిదొర ల్సాధింప దొరయు వేళఁ
జొరులు గన బయల్పచరింపఁ జను వేళ
నారామములఁ గేళి నలరు వేళ
సరగున దుర్గము ల్సాధింపఁ జను వేళ
వైరిభూభుజు లెత్తివచ్చు వేళ
గుఱు తెఱుంగని జను ల్గొల్వ వచ్చిన వేళ
మృగయా వినోదా ప్తి మెలఁగు వేళ

మండలేశ్వరుఁ డుద్దండదండనాథ
చండభటవీరసామంతమండలంబు
లండ నుండక వెస నొంటి నుండె నేనిఁ
గొదవ యగు నండ్రు నీతికోవిదులు తలఁప. 337

తే. మత్తకరి దండ నెరయైన మావటీఁడు
బుద్ధి యెఱుఁగని కొమరుని పొంత దాది
యతులగర్వాంధుఁ డగు రాజు నండ నాప్త
మంత్రి యొకవేళ నైన నేమఱఁ దరంబె ? 338

క. బల మనఁగ నృపుని దేహము
బలమునకు నృపవరుండు ప్రాణం బగుటన్
బలమును నృపుఁడును ధాత్రీ
తలనాయక ! భేద మనఁగఁ దగునే జగతిన్. 339

చ. అనుపమధైర్యశౌర్యనిధియౌ నృపుఁడైనను జైత్రయాత్రగాఁ
జను నెడ దోఃప్రతాపబలసంఘముల న్ఘనులౌ నిజాప్తులం
జనువు ఘటిల్ల గొల్లముదసల్లఁ గులాగతనీతిమార్గవ
ర్తనులగు పెద్దల న్నగరి దండఁ బ్రచండత నుంచఁగాఁ దగున్. 340

వ. అదియునుఁ గాక దినదిప్రవర్ధమానుండగు భూనాథుండు ధారుణీతలంబును నిర్వైరమండలంబును నిశ్శేషజారచోరంబును నిబిడీకృతగ్రామకూపతటాక కుల్యారామంబును గావించి సన్మంత్రిమంత్రాలోచనంబునఁ బ్రవీణుండై యేకాతపత్రప్రభావంబుఁ గాంచి ద్వివిధవిరోధిశిక్షాదక్షుండయి శక్తిత్రయాలవాలుం డగుచుఁ జతురుపాయసామర్థ్యంబునుంగలిగి పంచతంత్రంబుల మర్మంబు లెఱింగి షడ్గుణైశ్వర్యధుర్యుం డన వెలసి సప్తవ్యసనంబులవర్జించి యష్టభోగంబులకుం దగిన నవనిధానంబుల భాండాగారంబులు నియమించి పదింబదియుఁగా రాజ్యపరిపాలనంబు సేయు నతండు పార్థివరత్నం బండ్రు కావున నీ వేతద్విధంబునం బ్రవర్తిల్లు మని మఱియు నిట్లనియె 341

చ. ఇదిమొదలింక నెందయిన ని ట్లొకరుండవుఁ బోకు పోయిన
న్మదనమనోహరాంగ ! మణిమండన ! నీ గురు వాన యంచుఁ బ్రే
మ దొరల విన్నవించి నృపు మన్నన గాంచి యతండు వోవ న
య్యదనునఁ బ్రాగ్వియోగబల మవ్విభునిం గని [1]చేరి మ్రొక్కె నన్. 342

క. అందఱుఁ గృపార్ద్ర వీక్షా
మందరుచిం గప్పుకొని యమానుషమహిమం
జెంది ముదమంది రాజపు
రందరుఁ దతఁ డూరు సేరె రాజీవముఖీ ! 343

తే. అని శుకాధ్యక్షుఁ డీరీతి నద్భుతైక
గాథ వివరింప నంతలోఁ గమలబంధుఁ
డుదయపర్వతశిఖరాప్తిఁ బొదల నంతి
పురవరంబున కరిగె నప్పువ్వుఁబోఁడి. 344

1. మ్రొక్కి నిల్చినన్.

## ఏడవరాత్రి :

చ. అల యలినీలవేణి విరహాతురయై మఱునాఁటి రాత్రి రా
చిలుకపటాణి నెక్కెఁడి వజీరునిఁ బోలిన యా నృపాలునిం
గలయఁ దలంచి మేన నయగారము గీల్కొనఁ జేసి చేరె ని
ర్మలగుణశాలియైన శుకమండలమౌళిసమీపభూమికిన్. 345

తే. అప్పు డా రాజకీర మిట్లనుచుఁ బలికె
మగువ! మగవాని మేలు నమ్మఁగఁ దగదు
మది నొకానొక యెడ రోషమొదవె నేని
నేర్పుగల దూతి యొకరీతిఁ దేర్పవలయు. 346

క. పతి సేవగించు సతికి
న్సతి నొల్లని పతికి బద్ధసఖ్యము గలుగ
న్మతి నిర్వహించి కూర్చిన
చతురిక యగు దూతికాప్రసంగము వినుమా. 347

వ. అని యిట్లనియె 348

### మూఁడవ కథ

తే. అభ్రచుంబితమణిగణాదభ్రవప్ర
మై విజయభవనమను పే దవనిఁ గలదు
ములికినాఁ డను సీమఁ గోమలుల చూపు
ములికి నాటిన మరుఁడు దా మూర్ఛ నొంద 349

క. ఆరాజధాని వెలయు ను
దారుం డను రాజు ప్రోవఁ దన్నృపు చెంతన్
ధీరుఁడు తన ముక్కాకలఁ
దేటిన దళవాయి యొకఁ డతిస్థిరబలుఁడై. 350

మ. పతికిం బ్రాణపదంబు బంధులకు నాకల్పప్రకాండం బన
ల్పితశౌర్యాబ్ధికిఁ గ్రేవ రాహుతులకు న్యెస్సాసయై శత్రుసం

తతి నెంతేఁ దెగటార్చి తన్మదమహోద్ధండైకవేదండచం
దతురంగంబుల నెల్ల వస్తువులు దండన్నిల్పు నా భర్తకున్. 351

తే. భీమబలశాలి దృఢవర్మనాముఁడైన
ఘనుఁ డతండు నిజస్వామి కనువుపఱచు
రాజపరమేశ్వరాష్టదిగ్రాజకులము
నోభయంకరబిరుదైకవైభవంబు. 352

క. ఇత్తెఱఁగున బహుమహిమో
దాత్తపరాక్రమము మెఱయఁ దగు నాతనికిన్
మత్తరిపుదమనశౌర్యా
యత్తుం డొక కొమరుఁ డలరు నతినిపుణుండై. 353

చ. చదువులమేలు సాముపస చక్కఁదనంబు తెలుంగు సంపదం
బొదలెడు మేల్మి పేర్మిగల భూరిభుజాబలశౌర్యధైర్యము
ల్సదయతయు న్వివేకసరసస్థితు లాకృతిఁ జెందెనో యన
న్మదన[1]మనోహరుండు సుకుమారవరుం డతఁ డొప్పు నప్పురిన్. 354

తే. అతని కేలికయైన యయ్యవనిభర్త
కూర్మి కొమరున కొనరించు గోమునర్పఁ
దల్లిదండ్రులు లోచనోత్సవము నొంద
నవ్విభుం డొప్పు జయకేతనాహ్వయమున. 355

వ. వెండియు నమ్మహాప్రభుకుమారుండు. 356

సీ. ఒకవేళ యవనచోళకళింగళకవంగ
ఘూర్జరు ల్గొలువంగఁ గొలు వొసంగు
నొకవేళ విగళన్మదోద్దండవేదండ
హయపరంపర నెక్కి యాడఁ దివురు

1. నిభాంగుడైన

నొకవేళ దండనాయకచమూనాయకు
 ల్వాళిమై నడువ నాహ్యాళి వెడలు
నొకవేళ రిపునృపాలకజాలసాలదు
 ర్గమదుర్గహరణైకకార్య మరయు
మఱియు నొకవేళ ధీరసామంతమంత్రి
పుంగవులతోడ విభుని సమ్ముఖము చేరి
తెలుపఁ దగు వార్త లన్నియుఁ దెలియఁ జేయు
ననఘగుణశీలుఁ డాబాలుఁ డహరహంబు. 357

క. కంతునిభరూపరేఖా
వంతుఁ డతం డిట్లు మెలఁగ వనితాజనతా
స్వాంతమనోహరకరమై
యంతట యౌవనముఁ దోఁచె నవ్విభుమేనన్. 358

ఉ. ఔర విలోచనాంబుజము లద్దిర ముద్దుల నెమ్మొగంబు సిం
గారము బాపురే యవికి గద్దము మేలు నురఃస్థలోరువి
స్తారము చాఁగురే యెగు భుజంబుల పొంక మటంచుఁ బ్రేమ చె
న్నారఁగ [1]నారు లెల్ల ననయంబుఁ గనుంగొని సంతసింపఁగన్. 359

తే. వానిఁ దనివారఁ జూడని వనజగంధి
చూచి తల యూఁచి మెచ్చని సురుచిరాంగి
మెచ్చి విరహార్తి నొందని మీననయన
గలుగ దొకతైన నవ్వీటి చెలులలోన. 360

క. ఈలీల నతఁడు వర్తిల
బాళిం దన్నృపతిమౌళి పరిణయకార్య
శ్రీలలితుని జేయుట కిది
వేళ యితని కగు నటంచు వెసఁ దలఁచుటయున్. 361

1. జార

తే. అతని జననీజనకు లప్పు డంతరంగ
మున మహోత్సాహమునఁ బొంగి యనుపమాన
మానసంపత్కులాభిజాత్యాధికమ్ము
మమరు సరిమన్నెదొరల యిం డ్లరసి యరసి. 362

క. లావణ్య మంగరేఖయు
శ్రీవిలసల్లక్షణంబు శృంగారకలా
ప్రావీణ్యంబును గల కుల
పావనయగు నొక్క కన్యఁ బరికించుట యున్. 363

చ. అల జయకేతనుండు రుచిరాంగతిరస్కృతమీనకేతనుం
డెలమి మదిం దలిర్ప [1]దయ నేలికయుం దలిదండ్రు లయ్యెడం
దలఁచిన కార్యభాగ ముచితజ్ఞులచే విని నీతికార్యవ
ర్తులగు నియోగిపుంగవులతోడ రహస్య మొనర్చి యిట్లనున్. 364

ఉ. ఎక్కడిజోలి పెండ్లి యనుటెట్లు సమస్తరాజనందనం
బక్కజమే సహింపఁగలనా లలనం గలనైనఁ జూడఁ దా
దృక్కథ లాలకించి విను టెన్నఁడు లేదిది మీ రెఱుంగరే
యక్కట! భామినీజనవిహారత మానధురీణుఁ డోర్చునే. 365

సీ. కాలకూటజ్వాలఁ గబళింప నగుఁ గాని
యతివలతోడ మాటాడ నగునె?
పులుల మీసముల నుయ్యల లూఁగ నగుఁ గాని
వారిజాక్షుల చెంతఁ జేర నగునె!
దంభోళిహతిసముద్ధతి కోర్వ నగుఁ గాని
లేమల పలుకు లాలింప నగునె?
బడబాగ్నిఁ బిడికిట నొడియంగ నగుఁ గాని
కుసుమగంధుల పొందుఁ గోర నగునె?

1. ఁదన యేలికయుం

కటకటా! మూర్ఖమర్కటకరతలస్థ
కల్పతరుసూనమాలికాకల్పుఁ డగుచు
సరసుఁడగు మర్త్యుఁ డంగనాజనమహోగ్ర
ఘోరసంసారవిషధిలోఁ గూల నగునె? 366

క. అని విడనాడఁగ నాతనిఁ
గనుఁగొని యోనృపకుమారకంఠీరవ! యే
యనువున నొనరింతుము నీ
మన మలర నటంచు మంత్రిముఖు లవ్వేళన్. 367

సీ. గార్హస్థ్య మిందిరాకాంతాకటాక్షవీ
క్షణలబ్ధిఁ బ్రధానకారణంబు
సంసార మర్థార్థిజనమునస్సంతాప
కార్పణ్యము లడంపఁ గల్పశాఖి
దాంపత్య మతిశుభతరజగత్పరిపూర్ణ
వరకీర్తిలతికాలవాలభూమి
యౌవనంజనము దివ్యైకలోకానీక
పథము నందించు సోపానరేఖ
ఘనతరకుటుంబ మఖిలోపకారకంబు
గాన సుచరిత్ర యగు కన్యకను వరించి
మానవిఖ్యాతిలాభసంపన్నుఁ డగుట
యెంతయును నొప్పు నట్లు గాదేని హాని. 368

తే. హరిహరహిరణ్యగర్భాదులగు మహాత్ము
లెల్ల నెప్పుడు సంసార మిచ్ఛగించి
పుత్రపౌత్రపరంపరాభ్యుదయవంతు
లగు టెఱుంగవే యేకవీరాగ్రగణ్య! 369

వ. అని యనేకప్రకారంబులం బచరించిన నమ్మనీషివరుల విశేషవచనంబు
లంగీకరింపక దురంతచింతాపరతంత్రస్వాంతంబునం గొంత తడవు విచారించి

యంతఃపురంబుఁ బ్రవేశించి యౌవ నారంభసంరంభంబునం బొదము
మరాళోచనంబున విజృంభించి దూరం బరయక యతం డర్ధరాత్రంబున 370

తే. వేగఁ జనియెద నిఁక నొక్క వింతదేశ
మునకు భామాజనంబుల మోముఁ జూడ
నోపలేనని తీవ్రసంతాపహృదయ
మున రయోద్ధతి నయ్యంతిపురము వెడలి 371

చ. పలుచని దంతపుం దళుకు పాదుకల న్నడలించి కుంచితాం
ఘ్రుల వలిపంపుఁ జేల మునికొంగొకయించుక యొత్తి చిత్తమిం
పలరఁగ నొక్క యందలము నందుఁ దగం జనియె న్విభుండు క్రే
వలఁ దగ నొంటరీలు గొలువం గరదీపతతు ల్వెలుంగఁగన్. 372

వ. ఇవ్విధంబున 373

క. జనపాలునకును జననీ
జనకులకుం జెప్ప కతఁడు చని కనియెను గం
ధనబంధనేంధనాచల
మునకు సమీపంబు పాండ్యభూమండలమున్. 374

తే. [1](కాంచె నచ్చటఁ) బాండ్యభూకాంతరత్న
పాలితంబైన నవరత్నకీలితైక
గోపురంబైన గంధవతీపురంబు
వెలయు నప్పొంత నొక దేవనిలయ మొలయ. 375

మ. [2]కని యంత న్భ్రమరస్ఫురత్కమలినీకాసారతీరంబునం
[3]గనుపించై యనువొంది చైత్రరథశృంగారంబు గన్పట్టు ది
వ్యనవీనద్రుమపుంజరంజితమహోద్యానంబునుం గాంచి స
జ్జనమాన్యుం డతఁ డందు నిల్చె నొక ద్రాక్షాకాయమానస్థలిన్. 376

1. కాంచి యచ్చట (పూ) 2. కనువిందై 3. గనువాఁడై

తే. అప్పు డయ్యేలదోఁటలో నతని సరసఁ
బరిజనంబులు పరిపక్వఫలసుగంధ
కుసుమరసపల్లవంబులఁ గొల్లలాడి
యుల్ల ముల్లాసమును బొంద నుండువేళ. 377

క. తుకతుక నపు డల వనపా
లిక యగు బాలిక మృగాంక [1]లీలారేఖా
ప్రకటితకోపవిశంకట
వికటనటద్భ్రూకుటీసువిభ్రమముఖియై. 378

సీ. నిండారఁ బొడమిన బొండుమల్లియతావి
క్రొవ్విరు లెవ్వరో కోసినారు
ప్రబలంపు గాడ్పుచే రాలిన యెలమావి
దోరపం డ్లెవ్వరో యేఱినారు
వాటమౌ దవనంపుఁ దోఁట కంప వెలుంగుఁ
దొలఁగిపో నెవ్వరో త్రోసినారు
దట్టమై నులిగొన్న యట్టి పందిరి ద్రాక్ష
తీవ లిం దెవ్వరో త్రెంచినారు

కంటి మాయయ్య రావలెఁ గద యిదెవ్వఁ
డిందు నేనెత్తు వెలిపువ్వు టెత్తుకేలఁ
బట్టుకొనె నంచుఁ జిడిముడి పడుచుఁ గాఁపుఁ
బడుచు వగలాఁడి యప్పు డప్పజ్జఁ గదిసి 379

క. తన తేజీ లున్నవి యని
వనవాటిం గనుఁ గొనంగ వచ్చిన లక్ష్మీ
తనయుఁ డన నొప్పు జయకే
తనవిభు వీక్షించి మోహతరళేక్షణయై. 380

1. రేఖా।ప్రతిభా

క. తన తండ్రి యున్న యెడకుం
జని తద్వృత్తాంత మంత చతురతరోక్తిం
గని నట్లు తెలుప విని య
వ్వనపాలకుఁ దద్భుతైకవశమానసుఁడై. 381

ఉ. ఎచ్చట నుండునో మొదల నెవ్వఁడొ యెవ్వరి వాఁడొ వీఁడు నేఁ
డిచ్చటి కేఁగుదేరఁ గత మెయ్యదియో యని తత్కథాక్రమం
బిచ్చ జనింపఁ బాండ్యజగతీశ్వరు రీశ్వరసన్నిభు న్సుమ
ద్యచ్చతురాస్యుఁ [1]గాంచి వినయంబునఁ దద్విధ మెల్లఁ జెప్పినన్. 382

తే. ధన్యుఁ డారాజలోకమూర్ధన్యుఁ డతని
[2]రూపయౌవనవిభవప్రతాపములకు
నాత్మ మెచ్చి తదాలోకనాభిలాష
నప్పు డుద్యానవనవాటి కరుగు నంత. 383

చ. మితపరివారుఁడై రణసమిద్ధభుజుండు జయధ్వజుండు త
త్క్షితిపతిమౌళి సమ్ముఖముఁ జేరి విధేయత మ్రొక్కి నిల్చిన
న్మతిఁ గుతుకం బెలర్ప నసమానలసత్కుసుమానమన్మహీ
జతతియెడ న్వసించి సరసస్థితి నాతని కాతఁ డిట్లనున్. 384

క. ఓ వత్స ! నిను మనంబున
భావింపఁగ సార్వభౌమపర్యాయశుభ
శ్రీవిభవము గననయ్యెడు
నీ వెవ్వరివాఁడ వయ్య నృపకులతిలకా ! 385

ఉ. [3]నీ పరిణద్ధకంధరయు నీదు విశాలవిలోచనంబులు
న్నీ పటుదీర్ఘబాహువులు నీ విపులోరుకవాటవక్షమున్
బాపురె [4]సర్వభూవలయపాలనముం గలిగించి మించఁగా
[5]నోపుచు నున్న వేల యిటు లొంటిఁ జరించెద వంచుఁ బల్కినన్. 386

1. జేరి వినయం బొదవ న్వివరించి తెల్పినన్ 2. రూపలావణ్యవిభవప్రతాప మహిమ 3. నీ పరిశుద్ధకంధరయు నీ విమలాంబుజపత్రనేత్రముల్ 4. సర్వలోకజనపాలన 5. నోపు విచిత్రమేల

తే. అప్పు డాజయకేతనుం డతనితోడఁ
దనకులాచారగోత్రసూత్రములు నొడివి
[1](ప్రేమనా) తలిదండ్రులు పెండ్లి సేతు
మనఁగ విని యొల్ల కే వచ్చి తవనినాథ ! 387

చ. అన విని పాండ్యమండలమహాప్రభుఁ డల్లన నవ్వి యోసుధీ
జనవర ! పెండ్లి యొల్ల మను జాడ్యమతు ల్గలరే జగంబునన్ ?
విన నిది వింత యిందు కొక వేఱు నిమిత్తము గల్గియున్న నె
మ్మనమున సంశయింపక క్రమంబున నాకెఱుఁగంగఁ జెప్పుమా. 388

వ. అని యడిగిన నప్పాండ్యమహీమండలేశ్వరున కప్పుణ్యచరిత్రుం డిట్లనియె.

తే. విను పరాకింత లేక నా విన్నపంబు
పూర్వభవమున నే నొక్క భువనమోహ
నాద్భుతసరోవరంబులో నధివసించి
రాజహంసంబనై యుంటి రాజచంద్ర ! 390

క. అప్పుడు మత్కులకామిని
తప్పని ప్రేమం బతివ్రతారత్నము న
న్నెప్పు డెడ సనక కంటికి
ఱెప్పవలెం గాచి తిరుగు రేలుం బవలున్. 391

వ. అదియునుం గాక 392

సీ. ఆఁకలి గొను నప్పు డబ్జనాళములలో
నూటి కొక్కటి [2]తెచ్చి నోటి కొసఁగు
గమనించు తఱి మందగమన శృంగారా ప్తి
నఁటు వాయక వెంటవెంట నెయును

1. ప్రేమఁ దన (పూ) 2. గూర్చ

నఱుసు పోవనివేళ నుల్లోలకల్లోల
డోలికామాలికాకేళిఁ దేల్చు
బడలి యుండినవేళ నొడలి తాపము దీఱ
వలితెక్క సురటిగా దృలవరించు
ముచ్చటలు [1]దెల్పు రతికేళి కెచ్చరించు
సన్న దెలిపి విలాసప్రసన్నవదన
యగుచు వర్తించు నేను నావగఁ జకోంతు
వరట మది కింపుదొలఁక భావజ్ఞతిలక ! 393

తే. [2]ఇట్లు వర్తించుచున్నచో నెలమి నన్నుఁ
గొలిచి విహరించు రాయంచబలగ మెల్లఁ
గెలన నొక పైఁడి నెత్తమ్మి కొలను జూడ
నొప్పు నని తెల్పఁ దద్వీక్షణోత్సుకమున. 394

మ. చని యద్దివ్యసరోవరంబున యధేచ్ఛా[3]లీల వర్తించు హం
సనికాయంబులతోడఁ గొంత తడ వంచల్లీల వర్తించి త
త్కనకాంభోరుహవిభ్రమద్భ్రమరఝుంకారధ్వనిం దత్తటీ
వనవాటీవిహరద్విచిత్రవిహగవ్యావృత్తి సీక్షించుచున్. 395

తే. మఱియు నచ్చోట విహరించు తఱిని మంద
[4]మందగంధవహాప్తి మై మఱచి యుండు
నంత నను నెచ్చరింపక యరిగె బంధు
తతి మనంబున నిల్లాండ్రఁ దలఁచి కొనుచు. 396

ఉ. అంతట నా శకుంతబల మవ్వరటాతతిఁ జేరి మోహసం
క్రాంతత నంబుజోత్పలకులాయములన్విహరింపఁ జూచి [5]వి
భ్రాంతత నొంది మత్ప్రియుఁడు రాని తెఱం గిది యేమొ యంచు మ
త్కాంత నసుం గనుంగొనని తాపమున న్విరహాబ్ధిమగ్నయై. 397

1. బల్కు 2. ఇప్పగిది నుండు నంతలో 3. కేళి నారాజహం
4. మలయ పవనాప్తి నెమ్మేను 5. విభ్రాంతి వహించి నాప్రియుండు

తే. అమ్మ నేఁ జెల్ల నెవతెయో యవల నొక్క-
కొమ్మ నా ప్రాణవిభు నేలు కొనియె నేమొ
కాక యుండిన ననుఁ[1]జేర రాక యున్నె
యని ప్రలాపించి కను మూసె నాక్షణంబ 398

క. ఈ వార్తలు సవసవగా
నే విని ప్రాణేశ్వరీ ! యిదే నను నొంటిం
బో విడిచి చనుట తగదని
భావించి వియోగవహ్ని పరితప్తుఁడనై . 399

తే. నాఁటి యల హంసజన్మంబు పీటిఁ బుచ్చి
మగుడ మానుషదేహసంభవుఁడ నైన
నేఁటికిని దద్వధూటిపై నెనరు వాయ
నైతి నిఁక నేమనందుఁ బాండ్యక్షితీంద్ర ! 400

ఉ. కావున [2](నేను)నేఁ డితరకాంతల నేరిఁ బరిగ్రహింప నో
భూవర యంచుఁ [3]దెల్ప నృపపుంగవుఁ [4]డౌనని మెచ్చి బంధుసం
భావితలీల నా ఘనుని భావ మలర్చి విశేషవస్తుసం
భావన లెల్ల నిచ్చి యులుపా లొనరించి పురంబుఁ జేరినన్. 401

వ. అంత 402

తే. గరిమఁ దత్పాండ్యరాజన్యకన్యకైన
కాలికానామ బాల యవ్వేళ నిజపు
రోపవనభూమి మునివృత్తి నొదిఁగి యుండు
నల జయధ్వజవిభు వార్త లాలకించి. 403

చ. నలనిభుఁ డీ జయధ్వజుఁడె నా విభుఁ డంచుఁ దలంచు నంతలో
వలపుల తేఁడు కెంపు జిగివంపు మొగంపుఁ బటాణి నూకి క

1. చూడ 2. నాఁడు (పూ) 3. బల్క 4. డాతని

న్నలు గల వింట నప్పుడు వినూత్నశరావళు లేసి యార్చె న
మ్మలఁత మెఱుంగు గబ్బి చనుమిట్టల హారలతల్ చలింపఁగన్. 404

క. అంత నల యింతి విరహా
క్రాంతమతి న్నిమిష మొక్క కల్పంబుగ న
త్యంతతరదురవగాహన
చింతం దంతన్యమానచిత్తాంబుజయై. 405

శా. మారుం బేర్కొని దూఱు గంధవహుఁ బల్మాఱుం దుటారించి వే
సారుం జైత్రునిఁ గేరుఁ గేళివనసంచారార్థమై తెల్పినం
జాఱుం గేకిపికాళి సంఘముల వాచావైఖరిం బోరుఁ ద
న్నారీరత్నము తజ్జయధ్వజసముద్యన్మోహసంక్రాంతయై. 406

తే. అల హరిద్రానిభాంగి సౌధాగ్ర సీమ
నుండ కవనికి డిగియె రేయెండ కలికి
ప్రాణసఖులెల్ల "నెందకుఁ బసువు దలఁకి
నట్లు నీవేల తలఁకెద" వనుచుఁ బలుక. 407

*క. తావ మెఱిఁగింప నేరక
యా వెలఁదుక యున్నఁ జెలువ లవ్విధ మెల్లన్
భూవల్లభునకుఁ దెలిపిన
నావేళ నమాత్యహితకృతాలోచనుఁడై. 408

ఉ. కన్యక యీ జయధ్వజునిఁ గాని వివాహమొనర్ప నొప్పదే
ధన్యుఁడు నైన వాఁడు వనితాజనతైకపరాఙ్ముఖుండు సా
మాన్యమనీషి కీవగ యొనర్చుట కెద్ది తెఱంగు తెల్పుఁడో
మాన్యచరిత్రులార! యని మంత్రులతో విభుఁ డానతిచ్చినన్. 409

*క. అవివర మెల్లఁ బాండ్యా, ధ్మావల్లభుఁ డెఱిఁగి శాలికాబాలికకున్
శీవి వివాహా మొనర్చుట, కావేళ నమాత్యహితకృతాలోచనుఁడై.

క. పొసఁగ దిది యనుచు మంత్రులు
గుసగుసలం బోవ రాజకుంజరుతోడన్
వెస [1]మృదులవాణి యనఁ దగు
బిసరుహముఖి యొకతె విన్నవించెం బ్రీతిన్. 410

ఉ. ఏల విచార మింతుల నొకింత యెఱుఁగని ఋష్యశృంగునిన్
బాలిక లండఁ జేరి యొక బాలికఁ బెండ్లి యొనర్చి భామినీ
లోలునిఁ జేయువార్త మహిలో నుడువ న్వినరేమొ యట్లనీ
బాలిక నాసమగ్రగుణశాలికిఁ బెండ్లి యొనర్తు రావుతున్. 411

తే. అవిభుండు ప్రమోదసద్భావుఁ డగుచు
సెల వొసంగిన [2](నిరుగడఁ) జెలులు గొలువ
సర్వాంగారోహ ణాందోళికాధిరోహఁ
జేసె కార్యప్రవర్తనోల్లాస మెసఁగ. 412

సీ. నేల జీరకయుండఁ గేలఁ గుచ్చెలఁ బూను
కొని యొాతిగపులిసతు ల్గనిసి నడువ
మదమెత్తు పర్వుతో మంత్రాక్షతము లీయఁ
బొల్పడి భూసురభార్య లెదుర
[4]నొక్క కే లొరఁగుపై నునిచి యేకాంతంబుఁ
దెలుపుచుఁ గూర్మి నెచ్చెలులు సనఁగ
జయకేతనుని వార్త సారె విచారించి
వచ్చి ప్రగ్గడకత్తె లెచ్చరింప
సొంపుతోఁ [5]బౌరకామిను ల్గుంపు గూడి
యమ్మ యిది గాక [6]సౌభాగ్యమనుచు మెచ్చ
నప్పు డుద్యానవనవాటి కవ్వధూటి
[7]నెలమిఁ దోతెచ్చి యా చెంత నిలుచు నంత. 413

---

1. మధురవాణి 2. నిరుగ్రమోల (పూ) 3. చెలు 4. నొకకేలఁ మూఁపుపై
5. జార 6. సౌందర్య 7. నెలమి మైసేర్చి యొక్కింత

చ. పిఁపిల నాజయధ్వజుని పెద్ద లెదుర్కొని రాకురాకుఁ డో
యళికచలార! భీతహరిణాయతనేత్రల మత్ప్రియుండు నా
వలనను జూడ నోడఁ నను వార్త వచించిన మందహాసకం
దళవదనం బెలర్పఁగ ముదం బలర న్మృదువాణి యిట్లనున్. 414

క. మునుమున్న తద్రహస్యము
విని యున్నది గానఁ బ్రౌఢవృత్తి నల సుధీ
జనములతో ననుఁ గాంతా
జనరత్నము మధురరసవచస్స్ఫుటఫణితిన్. 415

ఉ. ఈ యెలదోఁట నుండఁ దగ దింకొక చక్కి వసింప నేఁగుఁ డో
ధీయుతులార! పాండ్యనరదేవతనూభవకేళికాగృహ
ప్రాయత నిందు నెప్డు నిరపాయమున న్విహరించు చుండు నేఁ
డా యెలనాఁగ గ్రుమ్మరుటకై యదె వచ్చెఁ దలంగుఁ డిత్తఱిన్. 416

తే. ఇంతమాత్రంబె కాదు పూర్ణేందుముఖులు
సమ్ముఖంబునఁ గార్యప్రసంగవశతఁ
బెండ్లి యనుమాటఁ బేర్కొన్నఁ బెని మిటనిన
మిట్టి మీనై యదల్చు నమ్మీననయన. 417

క. ఇది యేమి నిమిత్తమొ యని
మది నెంచితిరేనిఁ దత్క్రమం బంతయు నీ
యదన వివరింతు వినుఁడిం
పొదవం దొల్లింటి జన్మ మొదవిన వేళన్. 418

ఉ. తా నొక హంసియై సరసత న్నిజవల్లభుఁ డుల్లసిల్లఁ జి
త్తానుగుణోన్నతి న్మెలఁగు నంతటిలో నొక నాఁడు చెంత నిం
పైన సరోవరంబుఁ గని యచ్చటి కేఁగి విభుండు నిర్నిరో
ధానుపమానసౌఖ్యవిభవాప్తిమెయి న్వెస రాక చిక్కినన్, 419

క. మగఁ డేల రాఁడొ? యొండొక
మగువం దగులుకొని నన్ను మఱచె నొకొ? మనం
బగలెడు నని దిగు లొందుచుఁ
దెగువం బ్రాణములు విడిచె దీనాననయై. 420

ఉ. వావిరి నప్పతత్రికులవార్ధిసుధాకరరేఖ యీ ధరి
శ్రీవరకన్యయై యవతరించు విధుం డొనరించు నయ్యుపే
క్షావిధ మెన్నుచున్న దని సారె వచించిన మంత్రు లద్భుతం
బై వెలయన్ జయధ్వజున కత్తెఱఁ గెల్ల నెఱుంగఁ జెప్పినన్. 421

క. వినినంతఁ జెన్నిధానముఁ
గనుఁగొన్న దరిద్రుఁ బోలి ఘనుఁ డా జయకే
తనుఁ డల తలోదరీమణి
తన సొమ్మని తలఁచి యతులితత్వరమతియై. 422

తే. సమ్మదాశ్చర్యమోహముల్ సందడింప
నుద్దవిడి లేచి వచ్చి యమ్ముద్దుగుమ్మ
యెద్దియెద్ది యటంచు నయ్యెంచుఁ బోణు
లలరఁ జని పాండ్యనృపకన్య యండఁ గదిసి. 423

చ. నిను నెడఁబాయఁ జాలఁ దరుణీ యని నీ యనివార్యవిభ్రమం
బనిమిషులందు నైనఁ గలదా యని దాయ నిరూఢి నెంచిన
న్మనసిజబాధ కోర్వఁ దరమా యని మాయని మోహదాహమే
యనువునఁ దీర్చువాఁడ నహహా యని హాయని చేరి మ్రొక్కినన్. 424

క. వనితాలలామ లజ్జా
వినమన్ముఖకమలతం బ్రవీణత లేమిం
గని రాజదూతి యనియెం
గనికరమున నక్కుమారకందర్పునకున్. 425

చ పసిరికపాముపంటి దని పల్కు దు రీ యలివేణివేణి న
ప్పసమును నిండు గుండలయి భాసిలు నీ లలితాంగిగుబ్బ లీ
ముసిముసి నవ్వులాడి[1]రదము ల్వెస మూసిన ముత్తియంబు లీ
కుసుమసుగంధి కేవలము గోల సుమీ [2](యిక మే ల్దలంచుమీ). 426

చ. అనుటయు దండనాథసుతు డాన్నృపకన్యక నాదరించె ద
జ్జనకుడు సమ్మతించె సరసస్థితి బెండ్లి యొనర్చ వైభవం
బెనయ ఘటించి యొక్క విమలేందుశిలామయసౌధ మందు జే
ర్చిన నెన రొప్పగా విడిది చేసుక యంత వసించి వేడుకన్. 427

క. మును నే నొనర్చు నేరము
మనమున నెంచంగ దగదు మగువా ! యనుచున్
గనకాంగి నూఅడిలగా
ననసెజ్జన్ గారవించి నధికప్రౌఢిన్. 428

సీ. కాశ్మీరపంకసంకలితాంకమై పొంక
మగు బాహుమూలంబు లంటి యంటి
వరమృగీమదపత్రవల్లరీరుచి నొప్పు
నుదుటు సిబ్బెపు గుబ్బ లొత్తి యొత్తి
నానావిధబహుప్రసూనైకగంధంబు
నివ్వటిల్లెడు కొప్పు దువ్వి దువ్వి
తాంబూలరసరక్తిమంబైన యమృతంపు
బింబాధరము ముద్దువెట్టి పెట్టి
ఘనజఘనకంబు కంధర కదళికామ్ను
దూరువుల వాడి కొనగోళ్ల నొరసి యొరసి
యెలమి నలయించి మించి యయ్యెలదు బోడి
నతనుసామ్రాజ్య మేలించె నవ్విభుండు. 429

1. కరమువ్వెస మూసిన (పూ) 2. యనమీదలంచుమీ (పూ)

క. ఈమాడ్కి నమితభోగ
శ్రీ మెఱయఁగ నొక్కనాఁడు చిత్తమున నిజ
స్వామియుఁ దలిదండ్రులుఁ దను
[1]గోమించిన నడతఁ [2]వలఁచికొని యతఁ డెలమిన్. 430

తే. మామతోఁ దెల్పి కాంతాలలామయైన
శాలికాకన్యతోఁ గూడ సకలసైన్య
మిరుగడలఁ గొల్వఁ దన పురీవరముఁ జేరె
నేలికయుఁ దల్లిదండ్రులు నిచ్చ మెచ్చ 431

క. పతి సేవగించు సతికి
న్సతి నొల్లని పతికి బద్ధసఖ్యము గలుగన్
మతి నిర్వహించి కూర్పఁగఁ
జతురిక యగు దూతి వలయు జలజాక్షులకున్. 432

వ. కావున నేతత్ప్రియోజనసంధానకారిణి యగు నీ రాజధూతిక తాదృగ్విచక్షణ లక్షణోపలక్షిత యగుఁ గదా! యిత్తెఱం గెఱుంగక యున్నఁ గార్యభంగం బగునని వచియించు సమయంబున 433

తే. విమలతరతారహారము లొ్వస నొకింత
చల్ల నగుటయు నల శరచ్చంద్రవదన
సదనసంచారమున కేఁగ జలజహితుఁడు
చరమగిరిఁ జేరె నంతలో నొఱపు మీఱ. 434

## ఎనిమిదవ రాత్రి :

చ. కులికెడు గుబ్బచన్నుసిఁడికుండలు నిండిన కుంకుమంబు జొ
బ్బిల వలిపంపు మేల్రవిక పిక్కటిలన్ వెలిపట్టు చీర ము
ద్దులు వెలయింప వింత వగ దుప్పటి పై వలెవా టమర్చి పా
వలు మునివ్రేళ్ల మెట్టి శుకవర్యుని మ్రోల లతాంగి నిల్చినన్. 435

1. గోమున కను కడక 2. దెలిసికొని (పూ)

క. ఆతఱిఁ బుంౘదేశురస
ఖ్యాతరుచిన్ రాజకీరకంఠీరవ మా
కాతరనేత్రకుఁ దెల్పె న
తీతంబగు నొక్క కథ యతిప్రీతి మెయిన్. 436

క. ఓ నీలవేణి ! మదిలో
మానవుఁ డొక్కటి తలంప మఱి దైవము తాఁ
[1]బూనుఁ బెఱ కార్య మొక్కటి
[2]కానఁ దదీయాజ్ఞ వలయుఁ గార్యార్థులకున్. 437

వ. ఆ త్రైలింగునం బ్రవర్తిల్లని యట్లయినం దొల్లిఁటి సమయంబున గుణవల్లభుం డను మహీసురవల్లభుండు భల్లూకనఖభల్లహతుండైన యట్ల యగు నది యెట్లనిన వివరింతు నాకర్ణింపు మని యిట్లనియె. 438

## నాలుగవ కథ

సీ. అప్రతిమప్రభుం డగణితైశ్వర్యధు
ర్యత్వసాక్షాన్మహారాజరాజు
రూపరేఖామన్మథోపమానాంగుండు
ధరణీధరోద్దండధైర్యశాలి
యాత్రరక్షణుఁడు సత్కీర్తికల్లోలినీ
డిండీరితసుధాంశుమండలుండు
నత్యుద్ధతప్రభావాంకుండు సకలస
జ్జనవర్ణనీయశోభనచరిత్రుఁ
డలరు నొకరాజు కర్ణాటకాంగవంగ
నృపమకుటఘర్షితాంఘ్రినీరేరుహాగ్ర
నఖరశిఖరుండు భువిఁ గీర్తిముఖుఁ డనంగఁ
దనరి యంశుమతీపురాధ్యక్షుఁ డగుచు. 439

1. బూనును వేఱె యొక్కటి 2. గావన్ దైవాజ్ఞ

తే. అతఁడు కమలాక్షి యను ప్రియురాలి వలనఁ
గన్న లీలావతీనామకన్య నెలమిఁ
బ్రోది సేయంగ [1]నల యించుఁబోణి వెలయు
మలయు పరువంపుజవ్వనం బలము కతన. 440

క. చిత్తరువు ప్రతిమయో? తెలి
ముత్తియమో? కమ్మపైఁడి బొమ్మయొ? యన న
మ్మత్తచకోరాక్షి శుభా
యత్తమతి న్మోహనాంగియై యుండు నెడన్. 441

చ. చెలి నును గబ్బిగుబ్బలకు సిబ్బెపుఁ దళ్కొక వన్నె వాలుఁగ
న్నులకు మిటారి చూపొక వినోదము కెందలిరాకు మోవికిం
గలికితనంపు నవ్వొక చొకాటము మేని మెఱుంగు తీఁగకుం
దలఁపు వహింపఁ జేయు నెఱతావి యొకానొక వింతయై తగున్. 442

వ. ఆసమయంబున. 443

తే. అన్నగరమందు నెపుడు పురాశ్రితుండు
పల్లవాగ్రేసరుఁడు గుణవల్లభుఁ డను
పేరు గలవాఁడు గలవాఁడు ధీరజనవి
రోహితుం డగు నొక్క పురోహితుండు. 444

వ. వెండియు నతండు. 445

ఉ. శాంతు లొనర్చి గండకలుషంబుల నెల్ల నడంచు శత్రుకా
లాంతకరూపమైన జప మాచరణం బొనరించి యమ్మహీ

1. నయ్యించు బోణి

కాంతునకు స్మృథంబు లెసఁగన్ జయము న్సమకూర్చు సారసి
ధ్ధాంతి [1]యుతం డటంచు విబుధప్రకరంబు మదిన్ గణింపఁగన్. 446

క. అల కాలజ్ఞకులాగ్రణి
యెలమిం దద్రాజకన్య నేలాగుననో
కలఁ గన్న యట్టు లోకనాఁ
డలవోకం జూచి మన్మథాజ్ఞావశుఁడై. 447

క. అందని మ్రాని ఫలం బిది
యందుకొనుట యెట్టు లొక్కొ యనుచు మనమునన్
దుందుడుకుచే ధరాసుర
కందర్పం డతఁడు మేలు గలవాఁ డగుటన్. 448

తే. అంత నత్యంతకాముకుం డగు నతండు
ఛాందసుఁడు గానఁ దన మనస్తాప మెల్లఁ
దెల్లమి యొనర్పఁ దగదంచుఁ దెలియనేర
కల్ల నగరింట నొక దాది ననుసరించె. 449

ఉ. ఈ నరనాథకన్య పిఱుఁదించుక ముట్టఁగ నిచ్చి మేను నా
మేనున నంటఁ జేర్చి రుచి మించిన మోవి యొసంగె నేని భూ
దానహిరణ్యదానఫలదానము లిచ్చిన యట్ల విప్రుఁ డెం
తైనను దానయోగ్యుఁడు గదా యని న్నన్నుతికించు నావుడున్. 450

తే. అది దిగుల్పడి యెట్లు నోరాడె నౌర!
పలుక నీరీతి నో వెఱ్ఱి బాపనయ్య!
ముక్కుఱయుఁ గమ్మలును దాల్చి మురియుచున్నఁ
జూడఁ జాలక యిట్లాడినాఁడ వేమొ? 451

1. యటంచుఁ దన్ను

క. అన విని తత్పదయుగళం
బునఁ బడి నీ ధర్మస్తవపుం బ్రాహ్మణునిన్
నను మన్నించిన నిఁక నే
నొనరించిన ధర్మ మెల్ల నొసఁగెద నీకున్. 452

తే. అనుచుఁ గడతేఱి పోవుచు సజ్జనాత్ముఁ
డన్యభామారతోత్సాహుఁ డగుటఁ జేసి
లీల లీలావతీకన్యకాలలామ
నెత్తెఱంగునఁ జేకొందు? నెట్లు మందు? 453

వ. (అని).

క. ఇవ్విధమునఁ దలఁచుచు నతఁ
డువ్విళ్ళూరంగ శుభముహూర్తపుఁ దఱి నా
పువ్వుంబోఁడికి బాల్యము
జవ్వాది తొలంగునంత సమరత పొడమెన్. 454

మ. అపు డా కీర్తిముఖుండుఁ దత్సతియు నత్యానందసంధానతన్
నృపకాంతాజనము ల్మహీసురపురంధ్రీరత్నము ల్గొల్వఁ గా
[1]రపణం బుప్పతిలం దదంతవిభవారంభంబుఁ గావించి య
చ్చపలాక్షీమణికిన్ వివాహ మొనరించం గార్య మూహించుచున్. 455

తే. రాజమౌళియుఁ దత్సతీరత్న మపుడు
తగు కులస్థుఁడు రూపకందర్పుఁ డైన
వరుఁ డెవఁడొకో యటంచు భావమున [2]నెంచు
నంతఁ గపటాత్ముఁ డైన సిద్ధాంతి యనియె. 456

క. ఈబిడ సుముహూర్తకళా
ప్రాబల్యమునన్ జనించు భాగ్యంబున సు
శ్రీబలముఁ జెంది నీ గృహ
మా బలజిద్భోగసమృధికాస్పద మయ్యెన్. 457

1. శ్రవణం 2. దలఁప

వ. తదనంతరంబ. 458

ఆ. బాల దుష్టవేళఁ బ్రథమరజస్వల
యయ్యెఁ గాన దీని యవగుణమున
రాజ్యలక్ష్మి బాసి [1]అంపిల్లు నీయిల్లు
కలిమి పెంపుఁ బాసి పొలియు ననఘ! 459

క. అన విని గుండియ యదర
న్మనుజేశ్వరుఁ డాప్తులైన మంత్రులతో ని
ట్లను నేనేర్పునఁ దీర్చెద
రనవుడు సద్దుష్టమంత్రు లవివేకమునన్. 460

ఆ. సీత పుట్టి లంకఁ జెఱచిన చందానఁ
బుట్టఁ దగని ముద్దు పట్టి యైన
బాలికాగ్రగణ్య లీలావతీకన్య
యిల్లు చెఱుపఁ బొడమె నేమొ యనుచు. 461

చ. మును వెనుకేనియుం గనక మోసమునం గడు కార్యభంగమౌ
ననక సుకీర్తిహానిపదమంచుఁ దలంపక కన్యకామణిన్
వనధిపరీతయై పొదలు వాహినిలో నొక మందసంబునం
దునిచి రయంబున న్వెడల నొత్తుట నీతి యటంచుఁ దెల్పినన్. 462

క. కీర్తిముఖనృపవరుం డప
కీర్తి జనించు నని మిగుల ఖిన్నత నపు డ
వ్వార్త వినలేక బహుళత
రార్తి న్నిజకామినీసహాయత వనటన్. 463

తే. కడుపు చుమ్మలు చుట్టఁగాఁ గన్న కన్నె
చిలుక నెడఁబాసి యేరీతి నిలుచువాఁడ

1. రంజిల్లు

నెక్కుడి [1]వివేకమన మంత్రు లెల్లఁ గదిసి
కువలయేంద్రునితో గుస్సకోలు గొనుచు. 464

మ. మును గుంతీపతి కూర్మినందను మహాంభో [2]వాహినిం జేర్పదో?
మనువంశాంబుధిచంద్రుఁడౌ దశరథక్ష్మాభర్త శ్రీరామునిన్
వనవాటి న్విహరింపఁ బంపఁడొ? కృపాస్వాంతైకవాత్సల్యవ
ర్తనముల్ చూడఁగ రాజనీతియె? నరేంద్రా! యంచు బోధించుచున్. 465

తే. *మాను మీ మోహ మని తెల్పి మానవేంద్రు
చిత్త మొగ్గించి యొక మాటఁ జేసి రాచ
కొమిరె నిదురించు తటి మందసమున నుంచి
పీఁకు వెడలించుకొని తెచ్చువేళ [3]నెదుట. 466

సీ. కలశోద్భవానీత కలితపుణ్యసమేత
యఖిలజగత్పూతయైన మాత
జలధినాయకు నేలుబడి గన్న యిల్లాలు
నిఖిలపుణ్యపుఁ జాలు నిలుచు ప్రోలు
ఆప్లుతఘట్టనఖేలనాభీలకల్లోల
యఘతూలికాజాల మడఁచు కీల
ఫణిలోకవిజ్ఞానపాటవాంతర్మీన
వినుతసత్యవితానమునకు సోన
యధిపతిసమాగమార్థప్రయాణసమయ
సమధికోత్తుంగభంగసంచారజనిత
ఘనగరుద్ధ్వానపటపటాత్కారసార
భూరసితపక్షభేరి కావేరి వెలయు. 467

---

1. వివేకమున (పూ)
2. రాశిలో వైవదో *'మంత్రు లందఱుఁ గూడి యా మానవేంద్రు' అని పాఠాంతరము 3. నచట

ఉ. ఆ వరవాహినిం గని దురన్వయు లచ్చటి మంత్రు లెల్ల లీ
లావతి యున్న పెట్టియ [1]నలంఘ్యతరంబగు తజ్జలంబునం
[2]బో విడిపించి భూవిభుని పొంతనె యెప్పటి యట్ల యుండి రా
హా! వివరం బెఱుంగని దురాత్మల కృత్యము లట్టివే కదా! 468

వ. కావున. 469

క. నృపతి యగువాఁడు విద్యా
నిపుణున్ బహుకార్యభారనిర్వాహకు శాం
తపరజనమర్మభేదన
కపటమతి న్మంత్రిఁ జేయఁగాఁ దగు నబలా! 470

వ. అది యెంతైనం గల దతెఱంగునకు నిమిత్తం బేమి? యట్లుండ నిమ్మ
తదనంతరవృత్తాంతంబు వినిపింతు నని యిట్లనియె. 471

క. జనకుఁడగు వార్ధిరాజుం
గను ప్రేమం దల్లియైన కావేరికడం
జను కమలపాణి యన న
వ్వనజాయతనేత్ర యేఁటివడి నేఁగుటయున్. 472

చ. తను మును జూచి మోహపరితాపము గన్నపురోహితుండు గ్ర
క్కున నిదివేళ యీకుసుమకోమలితో రతికేళివైభవం
బనువుగఁ గోర్కి దీర్చుకొన నంచు మనంబున నెంచి తత్తటీ
వనతలకుంజమంజులనివాసమున న్వెస నొంటి నుండఁగన్. 473

వ. ఆసమయంబున. 474

తే. ఒదిగి యల మందసములోన నున్న రాజ
కన్యకామణి మేల్కాంచి కలవరించి

1. జలంబులఁ బోవఁగ నిచ్చి యందఱున్ 2. నా విధి చూచి పోదమని యట్లన
నక్కడ నట్ల యుండి

బహువిధంబుల విలపించెఁ బంజరమునఁ
జిక్కువడియున్న క్రొత్త రాచిలుక వోలె. 475

సీ. జనకు నెమ్మనము వజ్రప్రాయమాయెఁగా
మాయ గావించి యీ మాడ్కిఁ బనుపఁ
దల్లికి వీను లెంతయుఁ జల్లనాయెఁగా
నా యగాథప్రయాణంబు విన్న
దాది యపఖ్యాతిఁ దలఁపలేదాయెఁ గా
దాయ గాఁబోలు నింతయు సహింప
నళిజనశ్రేణి [1](యాత్మ కింపాయెఁ గాఁ
బాయఁగా రాని యీ బారి నొంద
నకట! నాయీడు రాచకన్నెకల కెల్లఁ
గడఁగి నన్నాడుకొన నోరు గల్గె నేమ
నందు? నిఁక నెందుఁ జొత్తు? నాహా! విధాత
వ్రాఁత యవిలంఘ్య మని యెంచు వడిఁ దపించు. 476

జ. అన్నీలవేణి యివ్వగ
నున్నంత సమీపభూమి నొకరాజు శుభా
భ్యున్నతుఁడు రసికశేఖరుఁ
డెన్నఁగ హేమధామనాముఁ డేపు దలిర్పన్. 477

తే. అతులితోత్సాహమున వేఁటలాడి యాడి
కడఁగి యచ్చోటనే వీడు విడిసెఁ గానఁ
గర్ణయుగమునఁ దత్కన్యకాప్రలాప
కలకలధ్వను లాలించి జలదరించి. 478

మ. ఇదియేమో మనపాళె మెల్లఁ వగ నట్టిట్టె వెతం జెంద ని
న్నదిలోన న్వినవయ్యె నాఁడు మొఱ కాంతారత్న మిందెవ్వతో

1. కాత్మ (పూ)

మది నూహింపఁగరాని దుర్దశవహింపంబోలు నేఁ డీ విప
త్పద మేమో వివరించుఁ డంచుఁ గరుణాపారీణచేతస్కుఁడై. 479

ఉ. భూరిజలప్రచారులగు బోయలఁ బంపిన వార లా పయః
పూరమున న్మెలంగు కలముం బలె నుండెడు మందసంబు న
తీరము సేర్చి యందు సుదతీమణి యుండు టెఱింగి యద్ధరి
త్రీరమణుం గనుంగొని విధేయతఁ దత్క్రియ మెల్లఁ దెల్పినన్. 480

క. విని యప్పు డానృపాలుఁడు
కనుకని నమ్మందసమునఁ గల కలవాణిన్
మన మలరఁ దోడి తెండని
తన దాదులఁ బంపె నో సుధాకరవదనా! 481

ఉ. అంత నతిత్వరైకమతి నజ్జరఠాంగన లేఁగి యమ్మహీ
కాంతు నునుజ్ఞఁ బెట్టె బిగఁగట్టుల నెల్ల సడల్చి రోహిణీ
కాంతుని రేఖఁ గ్రొమ్మొయిలు గప్పుటఁ బాసి రహించినట్లు త
త్కాంతతనూవిలాసరతికాంత తళుక్కునఁ జెంత నిల్పినన్. 482

క. కని యత్యంతకుతూహల
మున నజ్జరఠాంగనాసమూహము వెస న
వ్వనితా రత్నము కులగో
త్రనిరూపణము న్వచింప ప్రార్థించుటయున్. 483

చ. కరతలస క్తగండఫలకస్థలియై చిగురాకు వంటి వా
తెఱ వసివాఁడ ముద్దువగఁ దిన్నని మో మరవాంచి దీనతన్
సురసుర స్రుక్కి యుస్సురనుచుం దన వర్తన మెల్లఁ దెల్పినన్
సరసతఁ గొంద ఱందు నృపు చక్కటి కుద్ధతి నేఁగి వేడుకన్. 484

క. ఓ రాజకులశిఖామణి!
యా రాజీవాక్షి చెల్వ మతిచిత్రము శృం
గారవతి యువతి నృపక
న్యారత్నము దానిఁ బోల సతివలు గలరే? 485

చ. చిఱుదొడ లంద మా చికిలిచెక్కుల చొక్కట మామెఱుంగువా
తెఱ సొబ గాపినీలమణిదీధితుల న్నను(గొప్పు చంద మా
గురుతరశాతకుంభమయకుంభకుచంబుల గుల్కు బింక మా
తెఱవకె యొప్పు నత్తెఱవ దేవరకే తగ నొప్పు భూవరా। 486

క. అని తెల్పి రాజు చిత్రము
కని క్రమ్మఱి రాజకన్యకం దెచ్చుటకై
వినయోక్తుల నంత యెల
ర్చిన( జింతాజలధిమగ్నచిత్తాంబుజయై. 487

సీ. ముకురద్యుతికపోలమకరికాలతలతో(
గమ్మకస్తురిచిత్రకమ్ము చెదర
వక్త్రగంధానుధావన్మిళిందములతో(
గప్పుపెన్నెఱికొప్పు కంప మొంద(
గర్ణికాకుసుమరింఖన్మరందంబుతో
నిడు వాలు(గనుదోయి నీరు చిలుక
గళదనర్గళఘర్మకణపరంపరలతో
నఱుత ముత్తెపుసరు ల్దొరసి [1]యాడ(
బీనవక్షోరుహమును లే(గొను ఘనని
తంబ [2]మలర( బదంబు లందంద వడ(క
నడ(కువ దలిర్ప నన్నరేంద్రాగ్రగణ్యు
కెలని కేతెంచె నల రాచకలువకంటి. 488

క. వచ్చుటయు రాజు చూచి వి
యచ్చరవరకన్య యేమొ యని మెచ్చుతఱిన్
మచ్చరమున నమ్మదను(డు
పచ్చని విలు( బూని పంట( బగవట్టె( జెలీ। 489

1. జడియ 2. ముఱకు

తే. ప్రేమ నవ్వేళ నేకాంతసీమ కరిగి
[1]సరసుఁ డైనట్టి యమ్మహీశ్వరవరుండు
లీల దళుకొత్త లీలావతీలతాంగి
నించువిలుకాని రాజ్య మేలించి మఱియు. 490

క. ఆరామ యండఁ బాయక
యా రాజవరుండు నిజపురాంతఃపురమున్
జేరి సుఖంబున నుండె ను
దారతరోత్సాహుఁడై సుధాకరవదనా ! 491

మ. అని రాచిల్కల తేఁడు పల్కు నెడ నుద్యద్ఘోరగాఢాంధకా
రనివృత్తిన్ జగమొప్ప నూరుజవధూరత్నంబు వీక్షించి యొ
య్యనఁ గేళీగృహసీమ కేఁగి రవి యస్త్రాద్రిప్రవేశంబు నం
దిన వేళం దమి రేఁగి భూవిభుని నర్థిం జేరఁ జారుక్రియన్. 492

క. శృంగారరస మెసంగన్
బంగారపు బొమ్మ వంటి బాలిక యపు డ
య్యంగజరాజతురంగము
చెంగటి కేతెంచి వాగ్విచిత్రప్రౌఢిన్. 493

## తొమ్మిదవరాత్రి :

క. శుకసార్వభౌమ! నేఁ డీ
సకలజ్ఞుండైన రాజు చక్కటి కరుగన్
సుకరమయి యున్న దీదిన
మిఁక వేగమ తెల్పు మవలి యితిహాసంబున్. 494

మ. అనుచుం జిల్కలకొల్కి వల్కు విని యత్యానంద మింపొంద ని
ట్లనియెం గీరకులప్రభుండు హేమధామాఖ్యుండు తా నూరికిం

1. శయ్యఁ జేర్చుక

జనుచో నెచ్చెలి యున్న మందసములోనం గ్రూరసక్రోధచం
దనిరాతంకము నొక్కభల్లుకము నుండం జేసి గర్వోన్నతిన్. 495

తే. అమ్మహావాహినీజవాభ్యంతరమున
విడిచి చనెఁ గాన నది నీటి వెంట నరుగఁ
దొలుత నమ్మందగమనపై వలపుఁ జెంది
పొంచికొనియున్న యవ్విప్రపుంగవుండు. 496

క. కనుఁగొంటి నదె నిధానము
గనుఁగొన నొక మాళ్కి బిండె గలిగెఁ గదా యే
మనవచ్చు దైవయత్నం
బని తలఁచుచు మోహవశత నవ్యగ్రమతిన్. 497

మ. తన శిష్యుల్వెనువెంటరా నడిచి యుద్దండస్థితిం దన్నదీ
వనమధ్యస్థలి నున్న మందసము తేవం దెచ్చి తత్తీరమం
దు నవీనద్రుమలతానికుంజమున మెచ్చుల్గుల్కుచో నుంచి య
త్యనురాగంబునఁ గామినీగమనమోహానూనచేతస్కుఁడై. 498

సీ. వలుదలై మెఱయు పార్వణపు ముద్దల వంటి
వలిచన్ను లెన్నఁడు వ్రచ్చి కొందుఁ?
బున్నాగపల్లవంబులఁ బోలు కెమ్మోవిఁ
గడువేడ్క నెన్నఁడు గఱచి కొందుఁ?
గొనలు గల్గిన దర్భకోటి నేలెడు నెఱు
లిట్టిగా నెన్నఁడు పట్టుకొందుఁ?
బంచామృతముఁ గ్రిందుపఱచు వాక్సుధ చవు
లనివంద నెన్నఁడు ద్రావి కొందు?

ననుచు నేఁ గోరికొని యుండు నట్టి తలఁపు
లన్నియు ఫలించెఁగా నేఁటి కని తలంప
వీని జన్మంబు కిష్కింధలోన నేమొ
కావలయు నంచు శిష్యవర్గము గణింప, 499

క. వేదము చదివిన ఫలమున్
వాదించిన ఫలము సంధ్యవార్చిన ఫలముం
బైదలి నీకు నొసంగెదఁ
గా దనినన్ బ్రహ్మహత్యఁ గట్టుదుఁ జుమ్మీ. 500

తే. అని యనన్వయరీతి నెన్నైన వదరి
వదరి యొక్కింతయును నీతి మది గణింప
కతనుఁడను మృత్యు వెసకొల్ప నల్ల మంద
సమునఁ గల చీల లన్నియు సడలఁ జేసి. 501

సీ. *అవునషే నను వివాహము గమ్ము విద్వాంసు
రాల వయ్యెదవు శీతాంశువదన !
వివరింతు నొక చిన్న విన్నపం బాలింపు
మభిమతార్థంబు నీకగు మృగాక్షి !
యలయింప నేటికే యకట నీ శిష్యప్ర
శిష్యుండ నగు నన్నుఁ జిగురుఁబోఁడి !
పంచాస్త్రుఁ డిదె నేఁడు బాధించుచున్నాఁడు
బ్రదికింపవే నన్ను పంకజాక్షి !
బ్రాహ్మణోత్తము నిపుడింత భంగపఱచు
టెంతయు నధర్మ మని చెంత కేఁగునంత
నుల్ల మగలంగ నయ్యుగ్రభల్లుకంబు
గుటగుట యటంచు రొప్పి యక్కుటిలు [1](నొడిసి). 502

1. గదిసి (పూ)

*రాజాపేట దగ్గఱ మద్దిరాలలోఁ దెచ్చిన ప్రతి ప్రకారము

సీ. అవునషే నను వివాహము గమ్ము విద్వాంసురాల వయ్యెదవు శుభ్రాంశువదన !
అవునషే నను మనోభవకేళి నేలవే సోమిదమ్మవుదువే కోమలాంగి
అవునషే నా మాట లాలింపవే పురోహితురాల వౌదువే యిగురుఁబోఁడి
అవునషే నను బొందు మవిరళశ్రాద్ధాలయామాశనము తిందు వబ్జవదన
యేల నన్నింత యేచఁగనేల వినుము, వనిత నీధర్మ సత్రపు బ్రాహ్మణుఁడను
ఘనుల నమ్మిన వాఁడు బ్రాహ్మణుఁ డటంచు, నేటికైన నను దయఁ జూడు నీరజాక్షి.

క. మెడఁ బట్టుకొని తనూలత
జడియం గుదియించి నేలఁ జదికిలఁ బడి య
మ్మడియఁ డపు డెంత పొరలిన
విడువక మృత్యువు కొనర్చె విందు లతాంగీ! 503

క. అని కీరకులశిఖామణి
యనుగాథకృతావధానయై విని యయ్యం
గన యిది విచిత్రతరమౌ
ననుచున్ దరహసితవదనయై యుండు తఱిన్. 504

మ. ప్రకటాకాశవిభుం దహర్ప్రభుని మత్ప్రాప్తైకనక్షత్రమా
లిక నీవేటికి దాఁచినా వనుచు హాళిం బల్కుచో నాతఁ డ
త్యకలంకస్థితి నగ్నితప్తచటులంబౌ లోహఖండంబు సా
త్వికరీతిన్ వెస నెత్తినట్లు రవి తీవ్రం బ్రాగ్దిశం దోఁచినన్. 505

క. అంతటఁ దన నగరుకుఁ జని
కాంతాతిలకంబు ప్రొద్దు గడువమి నెంతో

వ. అని మఱియును

సీ. గోదానఫలదాన భూదానఫలములు చేరునంతటికైనఁ జేరు ఫలము
వివరించి తెల్పెద విన్నపం బాలింపు మభిహితార్థంబు నీ కగు మృగాక్షి
అలయింప నేటికే యకట నీ శిష్యుండ నగు నన్నుఁగాఁ జూడు మిగురుఁబోఁడి
పంచాస్త్రుఁ డిదె నేఁడు బాధించుచున్నాడుఁ బ్రతికింపవే నన్ను బంకజాక్షి
బ్రాహ్మణోత్తము నిపుడింత భంగపరచు, టంతయు నధర్మమని చెంత కరుగునంత
యుల్ల మలరంగ నయ్యుగ్ర భల్లుకంబు, గుటగుట మటంచు రొప్పి యక్కుటిలు నొరసి.

చింతిలుచు నుండునెడ భా
స్వంతుఁడు పశ్చిమపయోధి వడిఁ గ్రుంకుటయున్. 506

**పదియవ రాత్రి :**

క. కలధౌతరత్నరశనా
కలితబహుక్షుద్రఘంటికాతతి మెఱయన్
వలచేని భద్రగజమనఁ
చెలి యారాచిల్క చెంతఁ జేరిన యంతన్. 507

చ. కనుఁగొని యా సఖీజనశిఖామణి నేఁ డొకగాథఁ దెల్పెదన్
విని చను మన్యనాయకుని వేడ్క మెయి న్రమియింపఁ బోవుచోఁ
పెనిమిటిఁ గన్న యంత నొక బింబఫలాధర ధైర్యవర్తనం
బనువు పడంగఁ దెల్పు టరయు న్వివరింతు నటంచు నిట్లనున్. 508

## అయిదవ కథ

క. *కనువిందై యొకపురవర
మనువందు న్నృపి మదేభహయభటరథరం
జనమై యఖర్వరిపుభం
జనమై పొలుపారుచు న్విశాలం బనఁగన్. 509

క. ఆనగరీవర మేలు మ
హానటనిటలస్థలీబృహద్భానుమహా
శ్రీనిర్జితసమదరిపు
క్ష్మానాథుఁడు భీమసేనజనపతి కడఁకన్. 510

క. ఆరాజు రమ్మ పొమ్మని
గారా మొనరించి మనుపఁగా మోహనుఁ డ

* కనకాంగీ! కనకస్థల మనఁగా నొక పురము గలదు హర్మ్యాగ్రవినూ
తనహరిమణిఘృణితిమిరాజనితరహఃకేళిసౌధజాలం బగుచున్.

న్పేరు గలవాఁడు తగు గుణ
వారిధియగు నొక్క బచ్చువాఁ డవ్వీటన్. 511

ఉ. [1]మైనపుటంటు పల్వగల మచ్చుల చా లొరగల్లు కల్లెలుం
దూనిక నాలుగేన్పారలతోఁ దగు వట్రములోన నున్న నా
నానగరోద్భవంబులగు [2]నాణెము లుండెడు సంచిఁ గొంచు బే
రానకు వచ్చు నన్నయధురంధరుఁ డంగడికి న్గణింపఁగన్. 512

తే. *ఆతని కనుకూలవతి రూపవతియునైన
భామినీమణి దనరు సౌభాగ్య సీమ
యాత్మనాయకపాద సేవాభిరామ
నవ్యగుణవతి శుభవతీనామ యొకతె. 513

ఉ. [3]ఆలలితాంగి పుష్పవతియై దివసత్రయముం గ్రమించినన్
నాలవనాఁడు దా గురుజనంబులు కుంకుమ సంకు పొంకముం
బోలెడు చల్వయుం బసుపు ముద్దయుఁ గైకొని తోడరా మహా
కేళిరథాంగయైన నదికిం జని మజ్జనమాడి వేడుకన్. 514

ఉ. అత్త యొసంగ నొక్క కబళాన్నముఁ గైకొని పీటికారుచుల్
క్రొత్త మెఱుంగు లీను రదకోరకముల్ గబళించి తేనె ప
ల్లొత్తులు బట్టబైట నిద నోపుచు వాతెఱ నీనె గట్టఁగా
నత్తరళాక్షి చూపులు నిజాంఘ్రుల నిల్పుచు వీథి నేఁగఁగన్. 515

వ. ఆ సమయంబున- 516

చ. చిటిలిన గంధముం దళుకు చెంపను వ్రేలు రుమాలు జాఱు దు
ప్పటియును నిద్రదేఱు ముఖపద్మము చెక్కిటి కాటు మూఁపు చెం

1. మైనపుటుంటలు న్వగల 2. నాగరముల్ గల సంచి
* అతని కులకాంత నవమోహనాంగ విజిత, కాంతరతికాంత రుచిర రేఖానిశాంత
వఱలు వరపాదకమల సేవావిధాన, నయగుణవిధేయ శుభవతీనామధేయ.
3. ఆలతకూన

గట నులిగొన్న జన్నిదము కన్నుల కెంపు లతాంత పీటికా
పటిమ రహింప వచ్చె వరభద్రుఁడు నా విటుఁడొక్కఁ డత్తఱిన్. 517

ఆ. వచ్చి మదికి మెచ్చు వచ్చు నచ్చెలి బడా
పగలఁ జూచి వింతపదము వాడి
కేకరించి కొన్ని పోకలఁ బోయి య
చ్చెడె చూపు దన్నుఁ జేర కునికి. 518

క. నొగులుచు మరు బరిగోలలఁ
బొగులుచు నయ్యిందువదన పొందును గూర్పం
దగువారు లేరు దీనికి
నగువారే కాక యని ఘనంబగు చింతన్. 519

సీ. తనమాట యేమెఱుంగని యంగనకు జార
మమకార మొనరించు మందు గాఁగఁ
దన ప్రౌఢి సందు గానని సుందరికి గోడ
చివ్వున దాఁట నిశ్శ్రేణి గాఁగఁ
దననేర్పు గురుభీత తతనితంబకు సాహ
సక్రియ కభయహస్తంబు గాఁగఁ
దన బుద్ధి బొంకనేరని పంకజాక్షికి
ధవుని వాకట్టు మంత్రంబు గాఁగ

నమరు నవ్వీట నన్నపూర్ణాభిధాన
మదనమాయామహాస్థాని మంత్రసాని
దానితో మాటలాడి చూతము విచార
మేల యని వేళగని దాని [1]యింటి కడకు. 520

ఉ. [2]చని వరభద్రుఁ డల్లగుణశాలిని జూచుటఁ దెల్పి దాని మో
హానమగు రూప మెంత కొనియాడెద నేఁడు దురంతకంతుకం

1. యింటి కరిగె 2. చనవున నాథుజంగుఁడల చంద్రనిభానన వార్తఁదెల్పి

తనిహతిఁ జింత వంతఁ బడి తాంతలతాంతము చందమొందె నా
తను విదె చూడు వేఁడుకొనెద న్ననుఁ గ్గూర్పుము దాని నేర్పునన్. 521

క. నాకనఁగాఁ గనకము భా
మా కనుఁగొనఁ జిల్లపెంకు మాత్రము దానిం
జేకూర్చిన నాతను విదె
నీకుం గైవస మొనర్తు నీతోడు సుమీ. 522

మ. [1]అని సూచించిన మంచిదంచు విని యయ్యబ్జాక్షినిం గూర్ప నా
తనికిన్ బాస యొసంగి పీడ్కొలిపి తత్కార్యార్థ మూహించి మో
హను గేహంబునకుం బ్రయోజనశతవ్యాపారము ల్దెల్పికొం
చు నిరూఢంబగు రాకపోక లొనరించు న్మాయ డాయింపుచున్. 523

క. అంతట నా శుభవతి కది
యంతింతనరాని యంతరంగంబున నా
ద్యంతమధురోక్తి చాతురి
సంతతము న్వింత సంతసం బెసఁగించున్. 524

క. ఆలలనామణి కాఁగ
య్యాళి యొకానొక్కవేళ నక్కలితో సు
వ్వాలు న్శోభనములు ధవ
ళాలు న్మొదలైన పాటలం దగ నేర్పున్. 525

చ. వనజదళాయతాక్షి! మగవాఁడు పరాంగన పొందుఁ గోరువాఁ
డని వినవేమొ యట్టి చవు లంటినచో మఱి చౌక సేయఁడే
నిను నటుగానఁ బూని మగనిం బెఱత్రోవలఁ బోవ నీకు నే
ర్పున [2]నని బుద్ధిగాఁ గఱపు ముద్దియ సందియ మందకుండఁగన్. 526

1. అని తెల్ప న్వీని మంచికార్యమని
2. నది ముట్ట బుద్ధి గఱపుం జెలి సందియ మందకుండఁగన్.

క. అంతట నొకనాఁడొక వెల
యింతియు మోహనుఁడు నప్పులిచ్చిన పనికై
మంతన మాడఁగ నమ్మది
జంతయు వెసఁ బోయి వాని సతికిం [1](జూపెన్). 527

తే. చూపి యిన్నాళ్ళు నిటువంటి సుద్ది గాదు
కాదటందువు గద దాని కాళ్ళ మీఁద
సాగఁబడి మ్రొక్కి యిల్లాలిఁ జక్కఁ జూడఁ
గావుమని బాసలీయఁగాఁ గంటి నేను. 528

ఉ. బిడ్డయొ పాపయో? చిదిమి పెట్టిన కైవడి నున్న నిన్నుఁ దా
సడ్డ యొనర్ప కవ్వలఁ బిశాచము వంటి గరాసుఁ గూడె నీ
యెడ్డెఁడు గుట్టుతోడ నిఁక నేనియు నాపలు కాలకించు నే
నొడ్డెద దీనికిం దగిన దొక్క యుపాయము తోయజాననా! 529

క. తిట్టిన [2]మెట్టిన కైవడి
సెట్టిం గని పొడిచినట్టు చేకూడ మఱి
నెట్టుకొని నేఁటినుండియు
గట్టిగ వేఱొకనిఁ గూడఁగావలె నీవున్. 530

చ. తెలియదుగాక నీకు సుదతీ! రతినైపుణిఁ జూపవచ్చునో
కలకల నవ్వవచ్చునొ వికాసపుముచ్చటఁ దెల్పవచ్చునో
బలువగ పారువాపలుకు పల్కఁగవచ్చునొ కుల్కవచ్చునో
చెలువుని చెంగటం బరుని చెంగటఁ బోలెఁ గురంగలోచనా! 531

క. కొసరువగమాట లలుకలుఁ
గుసిగుంపులు [3]తిట్టు లోరికొట్టులు జారుం
డసమసుఖంబుగఁ గైకొను
ఖసవెద్దగు మగఁడు మండిపడుఁ గుసుమాంగీ! 532

1. జెప్పెన్ (పూ) 2. మెట్టినగతి నీ 3 తిట్లు మోరికొట్టులు (పూ)

తే. నోరెఱుంగని యట్టి జంతువులు సైత
మంబుజానన! యిచ్ఛావిహార మందు
బ్రతుకనేర్చిన తనువొక్క పతి కొసంగి
బంగరము వంటి మనసు [1]గెంటంగ నేల? 533

క. అని చెలి పుడకలు విఱిచినఁ
గనుగొని యది క్రొత్తగుమ్మ కావున మనసొ
గ్గిన నదియును [2]నేనొక్కనిఁ
గొని వచ్చెద నూరిబైటిగుడి కడ కనుచున్. 534

క. చింతాకు ముడుఁగుతఱిఁ
దత్కాంతం గొని తెచ్చి మేరుకార్ముకగేహో
పాంతమున నిల్పి మఱి తా
నంతన్ వరభద్రుఁ బిలువ నరిగె న్వేగన్. 535

తే. అరిగి యతఁ డింట లేకున్న నాత్మఁ బొగిలి
కొదవ వచ్చె నటంచు నమ్మది [3](పిసాసి)
తిరిగి చనుదెంచుచోఁ గాంచెఁ దెరువు లోన
వానిఁ బోలిన నెఱసీటుకాని నొకని. 536

క. కని పొలివోవని మగనా
లిని గూర్చెద నీకుఁ జాల లేవడిఁ బాల్మా
లిన యది యనుచుం బిలిచినఁ
జని యాతఁడు కాంచె నాలిసప్రసవాస్యన్. 537

క. కనుఁగొని తన యిల్లాలని
మనమున నతఁడెఱిఁగె నంత మగువయు నాథుం
దని తెలిసెం దత్సమయం
బున నాశుభవతి మఱెట్లు బొంకఁగ వలయున్? 538

1. బట్టంగనేల 2. నేఁడొక్కని 3. పిసాలి (పూ) పిశాచి, మఱలి యేతెంచుచోఁ

క. తెలిసిన నేఁగుము తెలియమి
యలవైనం బోకు కొంచెమా పరపురుషుం
గలయుటలు? నిలువ నాడం
గలదానికిఁ జెల్లుఁ గాక కరివరగమనా! 539

వ. అని యివ్విధంబునం గీరసునాసీరుండు పలికి యూరకుండిన నవ్వైశ్యాదృశ్య
మధ్య యతిధ్యానాధీనయై యలక్ష్యనిక్షిప్తవీక్షణంబున నున్నమితభ్రూ
లతంబుగాఁ గొంత తడవు విచారించి భూతలాధిపానీతయగు రాజదూతిం
గనుంగొని యిందేమైనను దెలియునె? యని యడిగి ముఖవికారంబునం దాని
యజ్ఞానం బెఱింగి రెండవ చంద్రమండలంబునుంబోని తనముఖం బెత్తి చిగు
రాకు మఱుఁగునం బొడము మొగ్గయుం బోలె మధురాధరంబు చాటునఁ దల
సూపు దరహాసకందళంబుతో నచ్చిలుక కిట్లనియె. 540

తే. అరయ నిక్షేప ముంచినయట్టివారె
తెలియవలెఁ గాక [1]యొకరికిఁ దెలియ (నగునె?)
యింత యేమిటి కిపుడు నీ యుడిన చిక్కు 541
నీవె విడిపింపు మన శుకం బిట్టు లనియె.

ఉ. అప్పుడు తద్వధూటి చలితాధరయై వరు గుప్పతెప్పునం
జప్పుడుగా నదల్చి పరసారసగంధులఁ బొందనంచు నా
కొప్పని బాస నిచ్చితి వహో యిటు లెంతకు నెత్తికొంటి విం
కెప్పనికైన నమ్మఁ దగునే? ననుఁ జంపఁగఁ జూతు వింతటన్. 542

ఉ. నీమదిఁ జూడఁ గోరి తరుణీజనధర్మము గాక యున్నచో
[2]నేమని దీని చేత నిటకేఁ బిలిపించిన వచ్చి తన్యభా
మామతి నిప్పు డిట్లు పరమానినియైన రమింప వచ్చి నా
తో మది మోహమగ్నగతిఁ దోఁపఁగ నుండుట కిచ్చగించితో? 543

1. యొకరికిఁ దెలియఁ దగునె (పూ) యొకరిచేఁ దెలియ వశమె-
2. నేమనదూతిచేత

క. చుట్టాలకుఁ దెల్పుదు మదిఁ
దొట్టిన కినుకం దలార్లతోఁ జెప్పుదుఁ గూ
పెట్టుదు దొరఁ ముందఱ ననుఁ
బట్టకు మని పఱవ నతఁడు బరువగు భీతిన్. 544

తే. పాదముల వ్రాలి నేనేమి పాప మెఱుఁగ
నీ మహాదేవు నాన పూర్ణేందువదన!
రవ్వ యొనరింపవలదంచు రమణిఁ దోడు
కొనుచు గుట్టున నిజగృహంబునకుఁ జనియె. 545

క. అని చిలుక పలుకఁ గుతుకం
బున నౌరా! యెంత బొంకు బొంకెను మృగలో
చన యని ప్రభావతీసతి
యనుపమమతి మెచ్చుకొనియె నవనీనాథా! 546

వ. అనిన నర్ధరాకాంతుండు తదనంతరగాథాప్రకారం బెవ్విధంబని యనుడు. 547

శా. విశ్వామిత్రమనఃప్రియంకర! కరావిర్భూతదానక్రియా
శశ్వత్తోషితధారుణీసుర! సురేశస్తుత్యశౌర్యాతిల
బ్ధైశ్వర్యోజ్జ్వలవైభవోన్నత! నతాయాసాపహృద్భీమహో
ఘాశ్వాస్త్రాసవిరామ! రామబలగర్వారంభనిర్వాపణా! 548

క. ధారాధరవర్ణ! సుధా
ధారాపరిపూర్ణవాక్యధారా! విబుధా
ధారా! నిజకౌక్షేయక
ధారాదళితాహితవసుధాధరధారా! 549

మాలినీ - జలధరనిభదేహా! సజ్యకోదండబాహా!
ఖలదనుజవిదారీ ! కంధిదర్పాపహారీ !
కులగిరిసమధైర్యా ! కుంభినీనాథవర్యా !
సలలితగుణజాలా ! జానకీకేళిలోలా ! 550

గద్యము:-

ఇది [1]శ్రీమత్తాదిరినృసింహకరుణాకటాక్షవీణసమాగతకవితాధార పాలవేకరికులకలశాంభోనిధిసుధాకర తాడిగోళ్ళ కరియమాణిక్య నృపహర్యక్షపౌత్ర పవిత్రచరిత్ర కదురధరామండలాఖండలపుత్ర విద్వత్కవిరక్షణానుసంధాయక ఖదిరీపతినాయక ప్రణీతంబైన శుకసప్తతి యను మహాప్రబంధంబునం ప్రథమాశ్వాసము.

1. శ్రీ మత్కదిరి

శ్రీరస్తు

# శుకసప్తతి

## ద్వితీయాశ్వాసము

శ్రీరామాంక! ధరాజా
తారామవసంత! సంతతామితవిభవో
దారా మాధుర్యవచో
ధారా! మార్తాండధామ! దశరథరామా! 1

తే. అవధరింపుము సకలరాజాధిరాజ
నతపదాంభోజుఁ డగు ధర్మనందనునకు
సకలవైదికలౌకికాచారవిహిత
హితకథారమ్యుఁ డగు ధౌమ్యుఁ డిట్టు లనియె. 2

ఉ. అంతటఁ దెల్లవాఱిన దినాంత మొకానొకరీతిఁ గాంచి త
త్కాంత మెఱుంగు గుబ్బకవ కస్తురిపూఁతను రంగు చెంద వె
న్నంతయు వేణికారుచుల నండగొనం గయిసేసి నీలచే
లాంతరదృశ్యయై హరిశిలావృతహేమశలాకఁ బోలుచున్. 3

పదునొకండవరాత్రి :

క. జనవరసురేంద్రు కడకుం
జనఁ జూచినఁ జూచి చిలుకజాబిల్లి యనున్

మనమున నొక కథఁ దలఁచితి
విని పొమ్మా కొమ్మ ! యింత వేగిర మేలా ? 4

## ఆఱవ కథ

తే. అనుచుఁ దెలుపఁదొడంగె నో యంబుజాక్షి !
మదన మను పట్టణం బేలు మదవదరిస
మూహముల ఘాంతలముల మోద్పుఁగేలుఁ
బెనచ నేర్పిన నందనుం డనెడు రాజు. 5

క. ఆరాజశిఖామణి దే
వేరి శశిప్రభ యనంగ వెలయు న్మిగులం
బౌరందరమణిబృందము
దూఱం దరమైన నెఱుల దొరలెడు సిరులన్. 6

సీ. మగువ సోయగపునెమ్మొగ మెంచ [1](వెలిదమ్మిఁ
గొలువున్న) వానికిఁ దలము గాదు
పడఁతి నితంబబింబము నెంచఁ బుడమిమో
పరియైన వానికిఁ దరము గాదు
కలికి నెన్నడు మెన్న ఖచరుల కొజ్జయై
వఱలెడు వానికి వశము గాదు
నలినాయతాక్షి లేనడ లెంచ నంచవ
య్యాశికత్తెకు నైన నలవి గాదు
భామినీమణి గబ్బినిబ్బరపు గుబ్బ
కవ నుతింపంగ నల్ల బంగారుకొండ
వింటివానికిఁ గూడ దవ్వెలఁది మూర్తి
వర్ణన మొనర్ప నింక నెవ్వారు గలరు.

క. ఆ పడఁతియు నందనధర
ణీపతియు న్నిజమనోజ్ఞసితసంతోష

1. (గొలువున్న వెలిదమ్మి (పూ)

వ్యాపారాపారసుఖం
బేపార న్మెలఁగుచున్న యెడ నప్పురిలోన్. 8

క. దేవాలయంబు గలదు త
దావాసమున న్వసించు నంతర్లలిత
శ్రీవత్సునకు రథోత్సవ
మావిష్కృతమయ్యెఁ బశ్యదఖిలామరమై. 9

వ. ఇత్తెఱంగున నభంగనభోమధ్యరథ్యాధ్వనత్సముద్యద్ధ్వజంబును నదభ్రమేరు భ్రమావలమానభానుకంబును నిజాంతరదంతురితమౌరజికపాణవికదుర్దమ మర్దలధ్వాననృత్యమానవైమానికమానినీనికరంబును నగరథోత్తమంబుపై మధువిరోధియధివసించినం దదుత్సవాలోకనాయాతనానాజనపదవ్రాతంబులతో నదృష్టపూర్వం బగుట నాగలం దగు దారుకల్పితదారకాకారంబునకు దేవతా మనీషం జేసి గోరంటయంటునం గెంపు సొంపు గ్రమ్ముకొను కేలుదమ్ము లెత్తి మ్రొక్కు నెడ నందులకుఁ గ్రొత్త గుమ్మలని యాతతాయు లొత్తు కాండ్రునుం దారును లేని జగడంబుల బహుళంబులగు తుములంబులు గల్పించి గుంపులు చేసిన నాసందునం దమతమ జనంబులం గానక కాందిశీకులైన వారల మీవారిం జూపెదమని తోడుకొనిపోయి విజనస్థలంబుల నొడంబడ కుండినఁ బుడమిం బడవైచి యాలువుగొని విడిచినం గ్రమ్మరి తమ్ము నన్వేషించున త్తమామలం గలిసికొని తేలుగుట్టిన దొంగలం బోలె మెలంగు ముగ్ధాంగనలును బూర్వానుభూతలగు నుపభర్తలం బ్రయత్నంబులం గాంచి కనుసన్నలఁ గొన్ని చిన్నెలు నెఱపిన నది గని రోషకషాయితాక్షులై యాక్షేపించుచు స్వజనంబులు సొచ్చి సమ్మర్దబాహుళ్యంబునం బోలి వెలమచ్చెకంటుల నంటు గల్గుటంజేసి వారల నవ్వలకుం ద్రోసి చనినఁ జేయు నది లేక యిచ్ఛావిహార విరోధియగు నిజకులాచారంబులం దలంచుకొని యుస్సు రను విదగ్ధముగ్ధేందుముఖులును, బరపురుషభోగాయత్తచిత్తలగుటం గ్రందు కొను సందడింబడి కంటికిం బ్రియంబైనవానిం గామించియు గోరం జీరియుఁ గొంత యాస తీర్చుకొని యంతట నతఁ డెఱింగినం గలంగి తొలంగి చన వెండియు నతండు వెంటంబడిన నదరంటఁ జంకించు కామినులును, దైవ

నమస్కారంబులు దూరంబుచేసి పదుగురైదుగురు గుమిగూడుకొని కోడెకాండ్ర రూపాధిక్య హైన్యంబు లుపన్యసించు సామాన్యకన్యకలును, మఱియుఁ గటిఘటితార్ద్రవసనఖండంబులతోఁ బొర్లుదండంబు లిడువారలకు మార్గక్షుద్రశిలాకలాపంబు లవ్వలం ద్రోచివైచి యెండమెండునం బెండుపడకుండ గడితంపు పచ్చడంబు లుల్లెడల వడువునం బట్టువారును, నిట్టసిగలు మిట్టిపడ లలాటపట్టికలం బెట్టిన పట్టెవర్ధనంబులు వర్ధమానఘర్మజలంబులం గరంగ భక్తిపారవశ్యంబున నాయాసం బెఱుంగక వర్తించు భాగవతులకు వ్యజనవీజనంబుల దయాభాజనంబులగుచు వీచువారును, నాగంతుకులకు శీతలోదకంబులుం బానకంబులును నీరుమజ్జిగయుం దెచ్చి కైకొనుండని ప్రార్థించి యిచ్చువారునుం గలుగు రాజవీథుల వేంచేయు నప్పుడు. 10

క. చెప్పెడి దే మిఁక నొకచో
దెప్పరమగు నుక్కు జీను దిగవైచిన వే
నెప్పుకొని కదలకుండెడు
కప్పలి తీరునను దేరు గదలక నిలిచెన్. 11

సీ. ఇటుకు మ్రాఁకుల వైచి యేలెల్ల యనుచుఁ దో
పించిన నింతైనఁ బెకల దయ్యేఁ
జూడవచ్చినవారిఁ బీడించి పెనుమోకుఁ
బట్టింప నింతైనఁ బాఱదయ్యేఁ
[1]దమతమ భక్తి యెంతయుఁ బురికొల్పఁగా
జనులు ప్రార్థించిన సాగదయ్యె
[2]నిమ్నోన్నతక్షితిని సమంబుగాఁ జేసి
జన్నెల మీఁదెత్త సడలదయ్యె

1. పొలమునఁ గల్గునేటల నెల్ల బలియిచ్చి జరిగింప నెంతైన సాగదయ్యెఁ
జుట్టుమానవులెల్లఁ బట్టుపట్టు మటంచు గట్టిగాఁ బట్టించఁ గదలదయ్యె
2. ఛాలుఘ్నూలలవారు సాహసంబున వచ్చి

భాగవతులెల్ల నుపవాసపరత స్రుక్కఁ
దెరలి చూపఱు లెల్లఁ బందిళ్ళు సేర
నేఁగుదెంచిన నృపులెల్ల నిండ్ల కరుగఁ
జేరి యధికారులెల్లను జిన్నఁబోవ. 12

క. ఆకార్యము విని నందన
భూకాంతుం డేను మ్రొక్కఁ బోకునికిఁ జూమీ
యీ కొదవ గలిగె నని తన
రాకాచంద్రాస్య వెంటరా నరుదెంచెన్. 13

ఉ. అత్తఱి బాటదార్ల పరపైన భువిం బడువారి నెత్తకు
న్మత్తగజంబుఁ గన్న గరిమ న్మొలత్రాడని గట్టినట్టివా
రెత్తిరి త్రాణ కొద్ది పరు వెక్కుడి వేడుకలంచు నంత ను
ద్వృత్తరమయ్యె వీథి ధవళాక్షులచే నవరోధముం బలెన్. 14

తే. వెంట నరుదెంచు తన మచ్చెకంటి తీరు
సొట్లు శోధించి క్రీఁగంటఁ జూచికొనుచు
నీటు వాటిల్ల నరిగల నీడఁ బెండ్లి
నడల నవ్వీథి నరిగె నప్పుడమి ఱేఁడు. 15

క. ఆవేళ శశిప్రభరే
ఖావిభవముఁ జూచి పౌరకమలేక్షణ లా
హావుట్టి పడినయట్లన్
దేవునిఁ గన మఱచి యిట్లనిరి తమలోనన్. 16

తే. ఆఁడుదన మెల్ల నొక్కఁటే యట్టిపట్ల
నింతి యొప్పులకుప్పయై యొఁసగకున్న
నిమ్మహారాజు చేపట్టు నేల? యిట్టి
ఫడఁతి గల్గుట సీతఁదే భాగ్యశాలి. 17

క. అని పొగడుచుఁ గనుఁ గొన న
వ్వనితలలోఁ డాఁగి యాధవళలోచనఁ గ
న్గానియె నొకవర్తకుని నం
దనుఁడు ప్రవీణుఁ డనువాఁడు తత్సమయమునన్. 18

క. చూచిన యంతనె మదనుం
డా చపలుని నడ్డగించె నా తరువాతన్
వాచాగోచరదుర్మద
వైచిత్రిం బొగడదండ వైచెం బెలుచన్. 19

క. ఈరీతి నతఁడు బహుమో
హారూఢిం బొగులునంత నా నృపతి నమ
స్కార మొనరించి పోవం
దే రొక నిమిషంబులోన నెలవున కరిగెన్. 20

క ఆ తరువాతఁ బ్రవీణుఁడు
జాతరవాతతమిళిందసమితికి సుమరే
ఖాతతవారికి నిజకర
కాతరవాలిజమరీచికలకే [1](కలఁగన్). 21

క. ఆందోళన మొందుచు న
య్యిందుముఖిం బొందకున్న నిందవు గద యీ
బొందికిఁ బ్రాణములని య
మ్మందుం దొకనేర్పు తనదు మదికిం దోఁపన్. 22

క. ఆరూఢి యశోదయనం
బేరువడిన పేదరాలి పెద్దమ గృహముం
జేరం జని యాయవ్వయు
రారమ్మని ప్రియ మెలర్పఁ బ్రముదితుఁ డగుచున్. 23

1. దలఁగన్ (పూ) కలఁగెన్.

చ. సడి కొడిగట్టలేని కనుచాటు మెలంకువ తీఁగబోండ్లకుం
గడుపులు దించ నింతులకు గ్రొంతవశీకరణార్థమంత్రముల్
నొడువఁగఁ బల్లవాళిగతి లోకపుపూఁతలు మేఁత లీయ నే
కడమయు లేక నింట గడకట్టితి నిన్ గొనియాడ శక్యమే. 24

క. నీ కీవలఁ కెన్నఁడు వ
క్కాకున [1]కీలేదు నిర్దయామతి నేలా
కోకొమ్మా యని పిడికెఁడు
రూక లొడిం జల్లి యాతురుండై మఱియున్. 25

క. నందననృపాలు సుందరి
యందముఁ గనుగొంటి మొన్న నది మొద లెదలోఁ
గందర్పదర్ప మార్ప మ
డిం దెలుకువ శరణు సొచ్చితి స్నికిచటన్. 26

క. అని దీనాలాపము లా
డిన నవ్వుచు నయ్యశోద డెప్పరమగు నీ
పని యైన నే నృపాంగన
నినుఁ గూర్చెదఁ [2]జూడు నాదు నేర్పని పనిచెన్. 27

క. రాకాశశాంకవదన ప
రాకా! యిఁక నయ్యశోద రాజాంగనతో
నే కైవడిఁ గూర్పఁగ వలె
నాకాముకుఁ ? దెలిసెనేని యానతి యిమ్మా! 28

క. అని చిలుక తేనియలు బో
రనియెడు జడివాన వెలిసినటువలెఁ బలుకం
దనయంతనె తా నిల్చిన
విని కోమటి చిటుకులాఁడి వెస నిట్లనియెన్. 29

---

1. కీయలేదు 2. ననుచుఁ బనిచె నేర్పు దలిర్పన్

క. ఓ రామచిలుక ! మాకీ
మారాముశ్శెట్లు తెలియు ? మగవారమె ? నీ
దారిఁ బలుపోకలం గడి
దేఱం దరువాతి గాథఁ దెలియం జెపుమా ! 30

చ. అనవుడుఁ జిల్కతేఁడు విడియంపువారపుఁ గెంపుఁ గన్న జ
వ్వని నును దొండపంటి జిగి వాతెఱ జాఱిన ముక్కు నిగ్గు వా
సన నెడసేయఁ గుంకుమ వసంతము సల్ల కథావిశేష మి
ట్లని తెలుపం దొడంగె వసుధాధిపు దూతిక చిన్నఁబోవఁగన్. 31

సీ. నడునెత్తి మజ్జిపాలిడి తాలిక లొనర్చి
కడలు కొల్చిన గొప్ప జడల దిండు
నలికభాగమునఁ జింతాకు వెడల్పుగఁ
బొసఁగించు కొన్న విభూతిరేఖ
సందిటఁ నిరువంక నొందు పైఁడి కుసుళ్ళ
నందంబు నొందు రుద్రాక్షపూస
కటితటి గాసెపై గట్టిగాఁ బిరుచుట్టు
గట్టిన కుఱుమాపుఁ గావి కోక
నాగబెత్తంబుఁ దామ్రపు నందిముద్ర
యుంగరము జన్నిదపువాటు యోగపట్టె
యమర జంగమురా లయ్యె నఖిలపల్ల
వావశీకృతసమ్మోద యయ్యశోద. 32

క. ఈ లీలఁ గ్రొత్త జంగము
రాలై తన వెంట శిష్యుఁడై యొక్కఁడు రా
నాలలన యిల్లు వెడలెన్
గోలయు బలె నొక్క [1](పెంటికుక్కం) గొనుచున్. 33

1. పెట్టకుక్కం (పూ)

చ. వెడలి పురంబునం గలుగు వీథుల వీథుల సౌధయూథముల్
బడిబడిఁ జుట్టి యా శునకభామఁ గనుంగొని యిట్టిపుట్టు వె
క్కడను లభించె నీకు [1]మమకారము గానము మేలహింపఁగాఁ
దడఁబడ నన్నెఱుంగవు గదా యనుచుం జరియించి యెంతయున్. 34

క. ఆనందనాఖ్య ధరణీ
జాని యగారంబు బలు హజారముఁ జేరం
గా నరిగి కృతప్రత్యు
త్థానత బహువిధములందుఁ దను సేవింపన్. 35

తే. వారితోఁ గాశికాకృతావాస ననియు
నిపుడు రామేశ్వరంబున కేఁగుచున్న
దాన ననియు ఫలాహారమానసీయ
ననియు [2](వచియింప) వైరాగ్య మౌర యనుచు. 36

తే. వారు చెట్టునఁ దనదాన యారఁ బండి
నట్టి పరువంపు రసదాడి యరఁటి పంటి
గొలలు చక్కెర నెయ్యి మక్కువ నొసంగ
నన్నియును సన్నచే శిష్యుఁ డందు కొనియె. 37

క. చూపట్టఁగ గోమయమునఁ
జేపట్టొనరించి జడలఁ జెక్కిన లింగం
బాపోకలాఁడి గైకొని
వేపి కద న్నిలిపి భక్తివివశయ పోలెన్. 38

క. ధూపంబు కద్దివత్తులు
దీపంబు నొసంగి తనకుఁ దెచ్చిన ఫలముల్
చూపి యుపహార మిచ్చి ని
శాపతిధరుఁ గుక్క నొక్క సరిగాఁ గొలువన్. 39

1, మమకార మపారముగా రహింపఁగా   2. వసియింప (పూ)

చ. గుమిగొని పైలపైలఁ బడికొంచు ఛటావళి చూడఁబోవ వె
చ్చము గొనిపోవు దాసులు నిజంబు గనుంగొని యా శశిప్రభా
రమణికిఁ దెల్ప నాయమ నిరంతరవిస్మయ మంది చూత మా
క్రమమని వారిచేఁ బిలువఁగాఁ బనుపం జని మ్రోల నిల్చినన్. 40

తే. ఆశశిప్రభ జంగమురాలః యేమి
కారణం బిటు కుక్క లింగంబు నొక్క
సరిగఁ బూజింపః నిది వింత సరణి గాఁగఁ
దోఁచుచున్నది తెల్పుమా దాఁచ కనిన. 41

క. ఆ మాయలాఁడి యపుడా
కోమలి మొగము గని గోడుగోడున నేడ్వం
గా మఱియు వెరవు దోపఁగ
నా మంజులవాణి యనునయాలాపములన్. 42

క. ఊరార్చి యడుగ నమ్మది
బేరజ మిది విన్న నీకుఁ బెనుదుఃఖం బౌ
నేరీతి నైన మఱి వినఁ
గోరిన నన్నాంటి నడుగు కువలయవదనా! 43

క. ఆ మాట విని వయస్యా
జనములు కడ కరుగ నవ్విశాలేక్షణతో
మన కథ [1]యవితథముగ విను
మని యంత న్మాయజోగురా లిట్లనియెన్. 44

చ. మునుపటి పుట్టువ న్మనము ముప్పుర మొక్కతె కుద్భవింప నం
దనఘచరిత్రయైన మన కగ్రజ నాథునిఁ గాని తన్నుఁ గో
రిన మగవారలం దన నిరీక్షలకుం బ్రియులైన వారలం
దనివి దొరంగఁ గూడనికతంబున నీగతిఁ బుట్టెఁ గుక్కయై. 45

1. యీ విధముగ 2. వౌ (పూ)

క. నీ వపుడు వీఁడు వాఁడని
భావింపక గుడిసెపై చి పరులం బొందన్
దేవేరి వైతి [1]వీవసు
ధావల్లభమణికిఁ గేళితత్పరమతివై. 46

క. ఏ నపుడు కోరి వచ్చిన
వాని బ్రమియించుట నృవానీపతి సే
వానిగతియు జాతిస్మర
తానూనత్వంబుఁ గల్గి హర్షముఁ గంటిన్. 47

క. కావున సహోదరీమై
త్రీవిధి నీ వెపితోఁ జరింతున్ శివపూ
జావేళనైన నని యనఁ
గా విని యారాజముఖి వికాసోన్ముఖియై. 48

[illegible]
[illegible]
యక్కట! నే ననన్యరతనై యొక రాజును గూడి యుంటి ని
ట్లెక్కడ వచ్చునాకొ యిఁక నెత్తు భవంబున నిట్టి దుర్దశల్. 49

సీ. అక్క నా కిచ్ఛావిహారంబు గూడ దీ
పట్టున టౌర చెట్టఁ బట్టి యునికి
నింకొక్కజన్మమం దేనియు జాతిస్మ
రత్వవిఖ్యాతిచేఁ బ్రబల వలయు
నప్పటి కన్యా వ్రతాభావజనితమై
నునకత్వ మెడలించు కొనఁగ వలయు
నటు గాన ననుఁ గోరినట్టి చక్కని చిన్న
వానిఁ దోతెంచి నా వాంఛ దీర్పు

1. [illegible] (పూ)

మాతఁ దపరోధగమన మెట్లనుచు వెఱచి
యొడఁబడక యున్న నా ప్రాణ ముత్తరింతుఁ
దనకుఁగా నని యే నంటి ననుచు ధైర్య
మిచ్చి తోడ్కొని రమ్మిప్పు డేగుఁ మనిన. 50

చ. చని యది యొక్కనాఁ డరిది జంగమురాలయి శిష్యఁగాఁగఁ గై
కొనుచుఁ బ్రవీణుఁ దెచ్చి యొనఁగూర్చినఁ బెచ్చుతమి న్శశిప్రభా
వనరుహపత్త్రనేత్రయును వాఁడును వేడుక మీఱఁ గేళికిం
బనుపడి సౌఖ్య మొందిరి ప్రభావతి వింటె యశోద నైపుణిన్. 51

క. ఈరీతి నేర్పు గలిగినఁ
బోరాదో? మగనికన్నుఁ బొడిచిన రీతిన్
రారాదో? లోకములో
వారికి నీ కనుట గాదు వారిజనేత్రా! 52

మ. అని యారీకృతమూకభావుఁడయి కీరాధ్యక్షుఁ డుండంగ వై
శ్యని యిల్లా లతివిస్మయాంబునిధియం దోలాడు చిత్తంబుతో
డ నిజంబౌనె యశోదవంటిది నిరూఢప్రౌఢ చేకూర్చినన్
[1](జనుఁగా స్వైరవిహారధీరసురతేచ్ఛాల్ కాముకశ్రేణికిన్.) 53

క. అని తెల్లవాఱ వచ్చుటఁ
గని నిద్దుర కరిగెఁ గీరకారణజన్ముం
డును నేఁటికిఁ దక్కెఁ గదా
కనకాంగికి మానమని సుఖస్థితి నుండెన్. 54

పంద్రెండవ రాత్రి :

ఉ. అంతటఁ జక్రవాకవిరహప్రదమౌ సమయంబు వచ్చినన్
గంతుఁడు రాజదూతిసతి కన్నను మున్నుగ హెచ్చరింప సం

1. జనితస్వైరవిహారధీరసురతేచ్ఛాకాముకశ్రేణికిన్ (పూ)

భ్రాంతమనోజ్ఞయై యల ప్రభావతి యింద్రశిలావిభూషణా
నంతరుచిచ్ఛటల్ పెనకులై తన చూపుల నంటి కొల్వఁగన్. 55

క. కలపంబు నలఁది కస్తురి
తిలకము పొలుపొంద రత్నదీప్తములగు పా
వలు మెట్టి మేలిమిం [1](గుఱు)
వలు వమురం గట్టి యింత వగ గనుపట్టన్. 56

తే. రాజు తొలునాఁటి రేయి విరాళిఁ గొనుటఁ
దెలుపుచును వెంటవచ్చు దూతికయుఁ దాను
సరస కేతేర నక్కీరసార్వభౌముఁ
డరిది యపరంజి పనుల పంజరము వదలి. 57

క. చనువేళ నిలిచి పొమ్మని
యనరా దవశకున [2](మగుట) నైనన్నిపై
నెనరునఁ దెలిపెద నొక కథ
కనకాంగీ! వినిన నేర్పు గలుగు న్నీకున్. 58

వ. అని పలికి యా భామినీమేదురావలోకనాసారంబునం దదీయాంగీకారంబు నెఱింగి యప్పతంగపుంగవుండు హాసంబుతో నితిహాసం బిట్లని చెప్పం దొడంగె. 59

## ఏడవ కథ

తే. అమర సౌవీరదేశంబు నందు విటత
రంగితాభంగమోహాంబురాశిచంద్ర
కార్యకృద్వారభామాప్రకాశమాన
లపనమండల మగు విశాలాపురంబు. 60

1. గురు (పూ) 2. మనుట (పూ)

క. ఆపురము నరోత్తముఁ డను
భూపాలుం డేలు నతని ప్రోపున వైశ్యుం
డేపారు నొకఁడు ధర్మ
[1]వ్యాపారం బలర విమలుఁ డను నామమునన్. 61

ఉ. ఆతని యాలు డీలుపడనట్టి మనోజుని వాలు, వాలు కిం
జాతము చాలు, పూలు గల సంపఁగి కొమ్మల కీలు, క్రాలు ము
క్తాతతి డాలు, మేలుకొను కల్వల [2](తావుల)మేలు, జాళువా
జోతుల జాలు, జాలుకొను చూపులఁ జూపఱనేలు ప్రోలునన్. 62

క. దానికి మోహన యను నభి
ధానము దగు విమలుఁ డా సుధాకరముఖితో
నానావిధ సౌఖ్యప్రద
సూనాయుధకేళి నింపు సొంపు వహింపన్ 63

తే. దానికై చంద్రరేఖ యన్నాకవనిత
సునవు తొడ శోకకుండేయు మోహకుండు
వాని యిల్లాలికై ధనవంతుఁ డనెడి
వన్నెకాఁ డట్టి మదవట్టి వలపుఁ జెందు. 64

క. అంతట నొకనాఁ డల ధన
వంతుం డేరీతి వైశ్యవనితామణితోఁ
గంతురణకేళిఁ దేలం
గాంతున్ దైవకృప కలిమి గాకని మదిలోన్. 65

సీ. అవ్వీట నమరుఁ గా హాలావికృతహాస
కహకహధ్వనిసంగ గ్రామగంగ
యాయమ్మ పురుషుఁ డభ్యర్థియైన వధూటి
నబల కార్యార్థినియైన పురుష

---

1. వ్యాపారకరుండు 2. తావుల (పూ.)

బలివెట్టి కొలువ వారల కోరుకు లొసంగు
నటు గాన నొక [1](వెలయాలిఁ జంపి)
యద్దేవి కర్పింతు నని యెంచె నాచంద్ర
రేఖాబ్జముఖియు నా రీతిఁ దలఁచె
నిష్ట మొనరించి తమి నెలయించి యొకనిఁ
గాళికాభుక్తి చేసి నా కాంక్ష దీర్చ
కొందునని చూచె మఱి యొనఁగూడె దైవ
ఘటన నయ్యిద్దఱకును సంగమసుఖంబు. 66

తే. కల్పితాన్యోన్యవిరహంబు కంతుసమర
సముదితాళీకదైన్యవాచావిధంబు
సకలధనశాంబరీనిరాశాగుణం బ
ఖండగతి నొప్పఁ దద్వంచకద్వయంబు. 67

సీ. కల్పితప్రణయవిగ్రహకాలవైదగ్ధ్య
జనితమాయాతాపసంభ్రమంబు
ప్రతివాక్యశపథపారంపరీవిజ్ఞాపి
తాత్మీయకృతకమోహాతిశయము
దంభేతరానుబంధనిబంధనిహ్నవ
జల్పితసూనృతశపథ [2]శతము
కపటనిద్రాజాతకైతవోత్స్వప్నపరి
ణామవాచామిథోనామధేయ
మురుతరచ్ఛద్మ సంప్రయత్నోపగూహ
నసకృదతులితకృతవశాంతరదశంబు
సౌఖ్యముఖ్యత్వవంచనాసమ్మదం బ
ఖండగతి నుండె నవ్వంచకద్వయంబు. 68

1. వెలయాలినంపి (పూ) 2. ఛయమ్ము.

తే. ఇవ్విధంబున నయ్యెడ్డ తెనసినట్ల
యుండి యొకనాఁటి రేయిఁ బ్రచండకుసుమ
కాండఖండనమున సరికట్లఁ బెనఁగి
సుప్తిఁ బొందిరి తెమ్మెఁరల్పూరనాడ. 69

క. ఆమీఁదఁ జంద్రరేఖా
భామామణి లేచి యులికిపడి భయమున సు
శ్రీమించఁగ ధనవంతుని
తో మాటలఁ దొట్రుపాటు దొలఁకం బలికెన్. 70

క. ఓరీ! నాయాకారము
కూరిమి పటముననుఁ వ్రాసికోరా! యని నా
మారుగఁ జూడర! నాబం
గారయ్యా! నీవు చల్లఁగా నుండు మిఁకన్. 71

క. అన విని మది నిది వంచన
మని కని ధనవంతుఁ డింత యాగడ మేమ
య్యెనొకో నా మీఁ దానే
ననుఁ జంపితి తెలుపుమన మనం బలరారన్. 72

క. కలగంటి నీవు వేఱొక
కలకంఠిం గూడినట్లు గావున నిఁకఁ గాఁ
గలుగును బ్రాణత్యాగం
బెలిమిం జేసికొన నిశ్చయించితి మదిలోన్. 73

చ. కనుఁగొనఁ జాల వేఱొకతె కౌఁగిట నీవు సుఖింప నిష్టదే
పనివిని వాసనావశత భావిభవంబున నైనఁ జెందెదన్
నిను నటు గాదటన్నఁ బరనీరజనేత్రలఁ బొందనంచు నిం
పునఁ జనుదెంచి గంగ గుడి ముందఱ బాస [1]యొసంగు మిత్తఱిన్. 74

1. యొనర్పు

క. అని చంద్రరేఖ పలుకం
గనుఁగొని నగ వలర నట్ల కానిమ్మని యా
ననబోఁడి వెంట రాఁగా
ధనవంతుఁడు గంగ గుడి కుదగ్రత నరిగెన్. 75

సీ. [1]కాఁపు గుబ్బెతలు పొంగళ్లు వెట్టిన పాల
కడవ చాటికల పొక్కళ్ల జాలు
దొరలు దెప్పించి బంతులు గట్టి యర్పించు
పొట్టేళ్ళ నెత్తురు బురద రొంపి
కోరిక్క చెల్లిన భుజంగు లొసఁగఁ బెటికిన
కుక్కుటపటలంపు తెక్కగుంపు
మంత్రముల్ ఫలియింప మాంత్రికుల్ ప్రజ్యోతి
వన్నె యుంచిన పంచవన్నె కోళ్ళు
పరఁగ గుగ్గులగురుధూప పరిమళంబు
శాకినీడాకినీభూతసంభ్రమంబు
చరదిళప్రాణమృతికాతురగచయము
నలరు నా గంగగుడిఁ జేరనరుగు నపుడు. 76

క. తనుఁ దునుమఁ దలఁచు తత్కా
మిని కన్నను మున్నె యతఁడు మిసిమికటారిం
దునిపి బలి యొసఁగె సాహస
మెనయం దల మొత్తి బాస యిచ్చెద ననుచున్. 77

సీ. బలుకప్పు నెటి గొప్పుపై నొప్పు బుడుతజా
బిల్లితో మృదుతనూవల్లితోడ
నునుపైఁట తెరచాఁటు గొను నీటు గుబ్బచ
న్కట్టుతోఁ గపురంపు బొట్టు తోడఁ

1. కాఁపు గుబ్బెతల పొంగళ్ళ బాటిన పాల, కడిఁది చాటికల

గరుణారస ముదారగతి మీఱఁ జూపట్టు
చూపుతో రతిఁగేరు రూపుతోడఁ
దలిరాకు జిగి జోక వెలి నూకఁగల మేలి
కేలుతో నెలదేఁటి డాలుతోడఁ
గెంపు పవడంపు జిగి సొంపు నింపు ముద్దు
మోవితో గుమ్మరను సిందు తావి తోడ
సంతసము వింతగా ధనవంతు చెంత
కాంతయై రుద్రకాంత సాక్షాత్కరించి. 78

క. మెచ్చితి వర మడుగు మనం
దచ్చిత్రదయాత్వమున కతం డలరి సము
ద్యచ్చరితః విమలు నాకృతి
యచ్చొత్తిన రీతి నొసఁగు మని వేఁడుటయున్. 79

క. ఇచ్చితిఁ బొమ్మని కాళిక
విచ్చేసిన యపుడె యతఁడు విమలుని రూపం
బచ్చుపడఁ దాల్చి యందుల
కచ్చెరుపడి యింటి కరిగె నతిగూఢగతిన్. 80

ఉ. అంతట నోడబేరమునకై విమలుండు చనంగ నెమ్మదిన్
వంత దొలంగఁ జేసి ధనవంతుఁడు వాని గృహంబుఁ జేరె న
త్యంతధనంబుతోడఁ గల మంబుధిలోన మునింగె నయ్యెడన్
దంతురవీచికల్ దరికిఁ దార్చిన వచ్చితి నంచుఁ బల్కుచున్. 81

క. ఊరి దొర బేరు [1](తెల్లరు)
నూరార్పఁగ నిట్లు వచ్చి యుండెడువానిం
జేరి నిజనాథుఁడని క
[2]న్నీరు వడిం దొరఁగ మోహినీసతి పలికెన్. 82

1. తెల్లను (పూ) 2. న్నీరొడిఁ దొరఁగ గంగ

ఉ. అక్కట ప్రాణనాథ! ధన మంబుధిఁ గూలినఁ గూలనిమ్ము వే
యొక్క తెఱంగునం బడయ నోపమె విత్తచయంబు లేనిచో
[1]నిక్కడి పేదవారి మన మెవ్వరిఁ బోలుదు మింతె చాలుఁ బో
గ్రక్కున నక్కఱ న్మొగమొగంబులు చూచికొనంగఁ గల్గెఁగా. 83

తే. నేఁటి కీపాటి నీవు [2]నా త్రాటి మహిమ
నింటి కేతేరఁ జల్లఁగాఁ గంటి నింక
నిదియె పదివేలు వైభవం బెల్లనాఁడు
నల్లపూసలు చెవియాకు నాకుఁ జాలు. 84

క. అని ధైర్యమిచ్చి తగ మ
జ్జన భోజన[3]ములను దృప్తి సలిపి దినాంతం
బున [4]నాతండును దాఁ గే
శినిశాంతముఁ జేర నరిగె లీలాపరతన్. 85

క. ఈకైవడి నెచ్చెలి తన
యాకాంక్షలు దీర్ప నిర్భరానందముతో
నాకోడెకాఁడు చివురుం
జేకత్తి వజీరు సద్దసేయక [5](యుండన్). 86

తే. వచ్చె విమలుండు నిస్తులవస్తుచయముఁ
గొనుచు నింటికి వచ్చిన ఘోరకలహ
మయ్యె ధనవంతునకు వాని కాగృహంబు
నాది యన నాది యనఁగ నౌఁ గాదనంగ. 87

క. పురజనులు తమ్ముఁ గనుఁగొని
యిరువురి యాకార మొకటి యేర్పఱుపఁగ నె
వ్వరి వశమనుచుం జూడఁగ
దొరముందఱఁ బడిరి వాదుతోడ న్వారల్. 88

1. నిక్కడి వారిలోన 2. నిచ్చోటి మహిమ 3 విధుల 4. కాంతుఁడుఁ దానును 5. యుండెన్ (పూ)

క. ఆదొర యేగతి వారల
వాదుడుపన్వలయు [1](వింటివా వినలేదా)
పైదలి? యనినఁ బ్రభావతి
మోదము వెలిఁ జిలుకఁ జిలుక మొకరికిఁ బలికెన్. 89

తే. వింటి నంతయు మేదినీవిభుఁడు వారి
కలహ మేరీతి నుడిపెనో తెలియ రాదు
ధర్మసంకట మిదియేల తడవు సేయ
కవలి కథఁ జెల్పు మయ్య కీరాగ్రగణ్య! 90

చ. అన విని చిల్క పల్కె వినవమ్మ ప్రభావతి యన్న రేశ్వరుం
డనఘత మోహినిం బిలువ నంపి భవత్పతి నిన్నుఁ బెండ్లి యా
డిన తఱి నుండు వేమొసఁగె డెందమునం దలపోసి తెల్పు మా
కనవుడు నూఱుమాడలనె నా విమలుండును నట్ల పల్కెనన్. 91

క. ధనవంతు నట్ల యడుగం
గన కది తెలియమికి నీళ్లు [2]దా నమలిన నా
తని వెడల నడిచి ప్రమదం
బున నాదంపతులఁ గూర్చి [3]హొమ్మని యనిచెన్. 92

క. ఇంతటి నేరుపు గలిగినఁ
గాంతా! కడతేఱు జారుఁ గదియుట లేదా
కాంతుం డెఱిఁగిన నాతని
[4]పొంతకు నే మొగముతోడఁ [5]బోయెదు చెపుమా. 93

క. అని చిలుక యూరకుండినఁ
[6]గనుఁగొని యక్కలికి దీపకళికలతోడం
[7]దన మోము వెలుకపాఱం
జనియె న్నిదురింపఁ గేళిసదనంబునకున్. 94

1. వింటివో విన లేదో (పూ) యతిభంగము
2. నమలిన నపుడా 3. పొమ్మని యొఁ జేలి! 4 చెంతకు 5. చేరెద వెలమిన్
6. ఫినియును తా దీపకళిక విధమున నపుడున్ 7. తన చేతి గెరల్గనపడ

తే. పల్లవియుఁ దెల్లవాఱ నప్పార్థివేంద్రు
కడకుఁ జని చిల్క సేయు విఘ్నములఁ దెలిపి
యతఁడు ప్రార్థించి పుత్తేర నరుగుదెంచెఁ
బొలఁతి చెంతకు నంతకుఁ బ్రొద్దు గ్రుంక. 95

పదమూఁడవ రాత్రి :

ఉ. గందపుఁ బూతఁబోలు అవికం దగ గుబ్బల మీఁటు హారపుం
జందెపు వాటు మాటు బురుసాపని పయ్యెదనీటుఁ జాటు సే
యందగు మేల్ముసుం గమర నల్లఁ బ్రభావతి వచ్చె మీనుల్
ల్పొందిన రాచవాని యెుఱలోని కటారిఁ దుటార మాడుచున్. 96

ఉ. వచ్చినఁ జూచి కీరము రువారము మీఱ ముఖారుణద్యుతుల్
బచ్చెనపన్న నా నృతిపాలికిఁ బోయెద వేమొ పొమ్ము నీ
యిచ్చకు వచ్చినట్లు రమియింపు మొకానొక మాట పుట్టినన్
నెచ్చెలి ! లేదు బంతి యను నేర్పున దిద్దుకొనంగఁ జాలినన్. 97

చ. వదినెలపోరు మాన్ప విజవల్లభు నిద్దురపుచ్చ మామ నో
రదమఁగ నత్తగారికి భయం బొనరింప మఱంది నూరకే
గదమఁగఁ దోడికోడలి కొకానొక నింద ఘటింపవచ్చుఁ బో
కడిసిననేర్పుచేత బెళుక న్వెరవొందిన జారకాంతకున్. 98

ఎనిమిదవ కథ

ఉ. ఇందుల కొక్క గాథ గల దింతటిలోఁ బతి పాఱిపోవఁ దో
యిందునిభాననా ! వినుమ యిందిరకుం దిరమైన యిల్లు సం
క్రందనరాజధాని కెనగాఁ దగు శూరపరావలోకమా
రందసమాఖ్యచే నొక పురంబు పరంతపరాజు ప్రోవఁగన్. 99

తే. అచట జనవల్లభుం డన నమరు నొక్క
ఢంగసౌష్ఠవమున రతి యౌవనసంగ

నలరు మెండైన నిండుప్రాయంబు కలిమి
రస్తు మీఱుచు నాతనిగేస్తురాలు. 100

తే. పీటఁ గల కోడెకాండ్రెల్ల వింతరతులఁ
జవుల మరగించి భయము లజ్జయును దీర్చ
జారవిద్యలఁ గడు గడిదేఱి యా మి
టారి విడివడ్డ మరుతేజి దారి మీఱె. 101

క. తిండి కతంబునఁ గండలు
మెండుగఁ[1]దాఁ బెంచి మగఁడు మెదలఁ దనుచు ను
ద్దండత నది మిండనికిన్
వండినకూడుమనఁగ దుడ్డువైఖరి మెలఁగున్. 102

చ. పలుమఱు నేటి సీటికని బానిసఁ బిల్చెద నందు ఱోలురో
కలి కని కూరగాయ కొనఁగావలెనం చాకలేని కార్యమే
పలుకుచుఁ గోడెకాండ్ర కనుపండువుగా నడయాడు వీథి న
వ్వాల నిఁక మాటలేల ? తలవాకిటఁ గాఁపురమయ్యె దానికిన్. 103

చ. కలయని వింతవాఁ డెదురుగా నడతేరఁగ దాసి యవ్వలన్
బెళుకుచు నమ్మచెల్ల ! తరుణీ ! చెఱఁగించుక సోఁకె దానికిం
దలఁపున నేమి సేయునొ కదా యని నెచ్చెలి తోడఁ బల్కు మె
చ్చులు దులికింప వాఁడు తనుఁ జూచినఁ బక్కున నవ్వు వీథులన్. 104

తే. తనదు చిన్నెలకై యాసఁ దవుసేయ
కడుగవచ్చిన మనసు రానట్టివారి
రట్టు గావించి మగనాలిఁ బట్టె దాసి
తౌర ! మొత్తో ! యటని దుమ్ము తూరుపెత్తు. 105

క. కంటికిఁ బ్రియమగువానిన్
గెంటని తమకమునఁ గామినీభూతమునన్

1. మగవాఁడు పీట

వెంటఁ బడి కౌఁగిలింపక
నింటికిఁ బోదవ్వ్యధూటి కెంతటి తమియో ? 106

క. పతి ప్రక్కఁ బండినప్పుడు
"రతికొంగక నిదుర వోదురా యయ్యో ! నా
చతురుఁడ ! గుఱకలు చాలున్
[1]గత చెప్పు" మటంచు వానిఁ గడు బాధించున్. 107

క. ఇట్టి వగ నడుచు తన పగఁ
జుట్టములకుఁ దెలుపు మగని సుద్దులు విని యా
దిట్ట చని వారితో మఱి
[2](యొట్టు లిడుం) దన్ను నాథుఁ డొల్లఁడటంచున్. 108

తే. మఱియు నమ్మాయలాఁడి కోమటి నెలంత
లందఱును గువ్వకోల్గొని యగడు సేయ
వారిఁ గూర్చుండఁ బెట్టి నా వర్తనంబు
దెలియదే కద మీ కంచుఁ బలుకఁ దొడఁగు. 109

ఉ. అన్నెముపున్నె మే నెఱుఁగ నమ్మ మఱిం బతి నాదు పాలికిం
బెన్నిధి గాఁగఁ జూతు మెఱమెచ్చులుగా వొరు నెట్టి వానినేఁ
గన్నులనైనఁ జూడ నిది కల్లయొ సత్యమొ చూచుచున్నవాఁ
డన్నలినాప్తుఁ డింకొకటి యారజ ముట్టిపడ న్మెలంగుదున్. 110

తే. అట్లు మెలఁగుట యేమిటి కంటిరేని
నింక నెక్కుడి సిగ్గు మా యింటి యతని
కాస పుట్టింప మెలఁగుదు నట్టు లయ్యు
బూచి వలెఁ జూచు నను వానిఁ బొడిచిత్రోయ. 111

---

1 గత (పూ) 2 యొట్టుపిడుం (పూ)

చ. కలిగినవాఁడుగా మరునికన్నను వన్నియ కల్గువాఁడుగా
కులమున మేటిగా సవతిగోరము గాన మటంచు నెంచి వే
దక్కల కెదురేఁగుదు న్మగఁడు గల్గియు లేని విధంబు సేసి తా
నెల గలనైన నన్నుఁ గరుణింపఁడు భోగమువారి పొందునన్. 112

క. నా సుద్ది యింత గని మది
దోసమనక తనదు సెట్టితొత్తులకేమో
బాసలఁట బండ్లికండ్లఁట
చేసన్నఁట విన్నవారు చెప్పిరి నాతోన్. 113

తే. పొన్ను కెక్కించి తనప్రక్కఁ బవ్వళింపఁ
గోరి నేఁ జూడ తేలు తాఁ గుడిచి కట్టి
యూరకే యిల్లు వెడలు నాయుసుఱు తాఁకి
దీపములుసైత మల్లాడుఁ దెఱవలార! 114

సీ. పతివత్ని నని మేనఁ బసుపు పూసికొనంగ
సొగసులా! యని ముంతపొగ ఘటించుఁ
బెనిమిటి గలదాన నని కాటుక ధరింప
వేడుకలా! యంచు విఱిచి కట్టు
ముత్తైదువ నటంచు బత్తిబొట్టు వహింపఁ
జిన్నెలా! యని కాలఁ జేతఁ బొడుచు
ధవసంగత నటంచుఁ [1](దల) దువ్వి ముడిచిన
మురువులా! యని ముడ్డి మూతి నులుచుఁ
బొలుపు దిగనాడి నేఁ జిన్నఁబోయి యున్న
నతని కెక్కడ కీడౌనొ యంచు నాతఁ
డెంత చేసిన [2]నేమాన కింటఁ గలుగు
సొమ్ము మెయిఁ బూని కానని చోటుఁ గందు. 115

1. దుల (పూ) 2. మానక యింటఁగలుగు

క. ఇల్లిల నుండ నింటం
[1]బల్లియు నను( జౌక సేయు పలుకులు వినరే
యెల్లెడ లోకములో 'మగ(
డొల్లని యా సతిని మారి యొల్ల' దనంగన్. 116

ఉ. నా కనరాదు గాక మలినత్వము పోగయి సేయు జోకలన్
రేకల నన్ను( బోల( గలరే కలకంఠులు? నేరరా! యయో
పోకలు వారబాలికల పోలిక వారల మాయచేత నన్
జౌక యొనర్చు నాథు( డది చాలక తిట్టును గొట్టు నెప్పుడున్. 117

చ. కటకట నన్ను దూఱెదరు గాక వివేకము లేక మీకు ని
చ్చట మగవారు లేరె కద చర్చ యొనర్ప(గ నాడుదానికే
మిటి కని నాథు( గూర్చు విధి మీర లెఱుంగరె యిట్టి పోడిమే
యటమటనైన( దాళ వశమా నెఱప్రాయపు( బూవు( బోడికిన్. 118

క. అని చిత్తిని మగ( డొల్లని
తను వేటికి( దనకటంచు దయపుట్ట(గ బో
రున బాష్పంబులు తెలిగను(
గొనలం గురియంగ గోడుగోడున నేడ్వన్. 119

తే. వార లెల్లను బంగారు వంటి నిన్ను(
బాసి పలుగాకులకు( గొంగుపఱచు చెలుల
నంటి వర్తింప వాని కేమాయె? ననుచు
నంతయు నిజంబనుచు నిండ్ల కరుగునంత. 120

క. జనవల్లభుండు బాంధవ
జనముల వెస( గూర్చి భార్య చందము దెలుపన్
విని వారంద ఱిదేమని
నెనరున గద్దింప( జిత్తినీసతి కడ(కన్. 121

1. బిల్లియు నను( జౌక సేయు మీరటు వినరే

తే. ఇంత యేటికి నీరేయి నితఁడు పడుక
టిల్లు వెలువడి యెక్కడి కేఁగుఁ దలుపు
మూసి గడియ బిగించెద మోసపోక
తెల్లవాఱిన మీరది తెలిసికొనుఁడు. 122

క. ఏ నిల్లు వెడలిపోయినఁ
దాను గవాటంబె మూయఁ దలఁపఁడె? యంతన్
దానం దెలియదెఁ తన వగ
నానేరము? [1](చెప్పఁదేటి) నగుఁ బాటిచటన్. 123

క. అన విని వారిది యగునని
చనుటయు నానాఁటి రేయి శయ్యపయి నా
థుని ప్రక్క నుండి తమిరేఁ
గినఁ జిత్తిని చనియెఁ దలుపు గిఱు కనకుండన్. 124

తే. అంత నిద్దుర లేచి వైశ్యాగ్రగణ్యుఁ
దమగు టిల్లాలు [illegible]
బంధన మొనర్చి తానుండెఁ బాన్పు మీఁదఁ
బంత మీదేఱె ననుచున్న యంతలోన. 125

చ. చనుఁగవజోడు పో టొక భుజంగునకుం, బదఘాత మొక్కజా
రునకుఁ, గటాక్షనీలమణిరోచు లొకానొక తేరకానికి
న్మనసిజకేళి యొక్క యుపనాథునకుం గలిగించి వేగుజా
మునఁ జనుదెంచెఁ జిత్తిని సముజ్జ్వలకేళిగృహంబుఁ జేరఁగన్. 126

తె. వచ్చి యరరనిరోధంబువలనఁ జూచి
కాంతు చేష్ట యెఱింగి చేగడియ దివియఁ
గూడ దెత్తఁగరా దింకఁ గోరి వచ్చు
చెనఁటి చుట్టాల చేతఁ బజీత నగుదు. 127

---

1 చెప్పఁజేటి (వ్రా.)

క. అనియెంచి పరుని వాఁకిటి
కనుపం దా నిల్లు సొచ్చి యరరపు మూయుఁ
దన తప్పు [1]దప్పుఁ జిత్తిని
వనితా! యేత్రోవ త్రొక్కవలయుం జెపుమా! 128

తే. అనఁ బ్రభావతి రసభంగ మగు నిదేల
మాటిమాటికి నడిగి నా మన్కిఁ గొనఁగ?
వినఁగఁ జిడిముడి పడియెదు వీపుదోయి
చిలుక! నాతోడ నీవది తెలుపు మనిన. 129

ఉ. కీరము కెంపు సొంపు నడఁగించు మెఱుంగుల ముక్కుటెక్కు చె
న్నారఁగఁ బల్కెఁ గల్కి! విను మత్తఁజిత్తిని చిత్తవీథిలో
ధీరతఁ బూని లేని తెగదెంపు వహించుచుఁ బల్కె నల్కతో
నేరము లేనిదాని కరణి న్బతి యుంపున నాలకింపఁగన్. 130

తే. వెడలి పోయితి నివ్వీథి వెంట నరుగు,
పెండ్లి వారలఁ జూడ నా పిన్నతనము
గూల నింతటిలో వట్టి కోపమెత్తి
తలుపు బిగియించె మగఁడేమి తలఁచినాఁడొ! 131

క. [2]చుట్టాల చెంత నాకు
బ్రట్టొనరింపంగఁ దలఁచెనా యందుకు వా
రెట్టును జాలరెకా నడి
గట్టఁ గలరె నొసటఁ గన్ను గలవారైనన్. 132

ఉ. ఏనటువంటిదాననె యహీనపతివ్రత నేను గల్గఁగా
వానలుఁ బంటలుం బుడమి వర్తిలు నింత యెఱుంగ లేక తా

---

1. గప్పు 2. చుట్టాలచేతఁ దనకున్

నే నను రవ్వచేసినఁ దృణీకృత మింతె శరీర మొక్కము
త్తైన ననూనదుఃఖ మెనయన్ దన కాఁపుర మెత్తి పోవనే. 133

క. కాసీ బహుళతరతోయా
నూనం బైనట్టి బావి యున్నది నేను
స్నానంబు మిగులఁ జప్పుడు
గా నపుడే యగ్గయాళి గ్రక్కునఁ జనియెన్. 134

క. చని నూతిలోపల గుభు
ల్లన నొక గుండె త్తివైచి [1]యల్లనఁ గను చా
టున నిలువఁబడియె [2]నిజముని
జనవల్లభుఁ డాత్మలో విచారము మీఱన్. 135

క. ఎత్తెరఁ గాకని చనియె
మత్తచకోరాక్షి కేళిమందిర మపుడు
ద్వార [illegible] రఁజాఱి మూసిన
ముత్తెమువలెఁ దలుపు మూసి మొక్కల మిడియెన్. 136

క. అది గని సిగ్గొఱఁగున నె
మ్మది గానక తద్విటుండు బ్రాహ్మణుఁడై యుండెం
జదికిలఁబడి యంతట రవి
[3]యుదయించిన వచ్చి బంధు లొక్కటఁ జూడన్. 137

తే. బాలతో నది మోహమ్ము బల్లార కంటి
గా [4]విలవిలగ నవ్వుచును జట్టు చేసి
తానె తొత్తుల కాంక్ష మదంబు కతన
నిల్లు పట్టక తిరిగెను నిర్విధమున. 138

1. యల్లుఁ 2. నంతట
3. యుదయించుటవచ్చి బంధు లొక్కట మూగన్. 4, విలావిల

క. అని పలుక వార లలుకన్
జనవల్లభుఁ దిట్టి వాని జాతికి వెలిగా
నొనరించిపోయిరో చ
క్కని కొమ్మా! యింత నేర్పు గలిగినఁ బొమ్మా! 139

క. అనినఁ బ్రభావతి తన యా
త్మనె యౌరా యాఁడువారి తల్లియ యని చి
త్తినిఁ బొగడి తెల్లవాఱుటఁ
గని చనియెం గేళిసదగారంబునకున్. 140

వ. చని యథోచితవిధంబునం బ్రవర్తిల్లె నదనంతరంబ క్రమక్రమంబున.

## పదునాలుగవ రాత్రి :

చ. హరనటనాతివేగగళితాలికలోచనవిస్ఫులింగమై
సరసిజబంధుఁ డస్తగిరి చక్కటిఁ బ్రాలఁ దదీయ కీచకో
త్కరములు గాలు క్రొందగు పొగల్బలెఁ జీఁకటి పిక్కటిల్లె నం
బరమున మించుఁ దత్త్రుటితమౌక్తికముల్బలెఁ జుక్కలొప్పఁగన్. 142

చ. అపుడు ప్రభావతీరమణి హారమణీఘృణిధోరణీప్రసూ
నపటలయు న్వినీలవసనభ్రమరాళియునై లతాకృతిం
గపురు వహించి వచ్చిన శుకంబు "మనోరథసిద్ధిరస్తు తే
చపలవిలోచనే" యని యసహ్యపు దీవన నిచ్చి యిట్లనున్. 143

## తొమ్మిదవ కథ

ఉ. వింటివె యొక్క వింతకథ వీనుల కింపు ఘటింపఁజాలు ని
ష్కంటకరాజమౌళి దొరగా విదిశాపురి మించు నందు నే
వెంటఁ గొఱంత లేని పృథివీసురుఁ డొక్కఁడు సోమశర్మ పే
రింట నెసంగు భార్యయయి రేవతిపేరి వధూటి గొల్వఁగన్. 144

సీ. గాదెలం గొలుచు ముక్కారుం బండెడు మళ్ళ
[1]నతోంపు నడబావు [2]లంద దొడ్డి
యాకుందోంటల గుంపు పోంకప్రమాంకులు గుత్త
చేలు గొత్తెలకదు పాలమంద
చెఱకుగానుగ మొదల్ చెడక వర్ధిలు నేర్పు
బానిసె ల్బడవాళ్లు బంటుపైద
పారిగోడలు గొప్పపడసాల మేల్మచ్చు
గారముంగిలి వింతగాని పొరుగు
రాగి నగలు సదాచారరతియు దేవ
పూజ నిత్యాన్నదానంబుం బూసబొట్టు
చిదురం జల్లిన తులసెమ్మ చిన్నితిన్నె
గలిగి కనుపట్టు నాతని కాంపురంబు. 145

తే. *ఇట్లు వర్తింప నాతని యింతి గర్భ
కలితయై చిట్టుముల బయకలు మొగమునం
దెలుపుం గనిపింపం దొమ్మిది నెలలు నిండి
పసిండిరే కనందగు నాండుపడుచుం గనిన. 146

తే. పురుడు వెడలిన వెనుక నా భూమిదేవుం
డా శిశువు జన్మనక్షత్ర మరసి ఖిన్నుం
డై సురార్చన మొనరింప నరుగుదేర
కున్నం గనుంగొని రేవతీయువతి చేరి. 147

క. ఇదియేమి మీర లిత్తఱిం
జదివితి రేమేమొ పడుచు జాతకమునకై
యది మొదలు చిన్నంబోయితి
+రెద నడరెడు భయము నుడువుం డేలా దాంపన్. 148

1. వింతొప్పు 2. వింద్ల

+కలికి! యాతని కులకాంత గర్భచిహ్న, కలితయై చాల ముద్దులు గులుకు మొగము

*రిది యంతయు నాకుం బలుకుం డేలా దాంపన్.

క. అన విని యిది యేమియు లే
దనఘగుణా ! మీఁద జార యగు నిది యటుగా
వునఁ జింతించెద ననఁ బతిఁ
గనుఁగొని యమ్మగువ నగవుగల మొగ మలరన్. 149

*క. ఔలెండ యేటి మాటలు
మేలే యిది బ్రదికినట్టి మీఁదటఁ గద యా
జోలి యెటులైన నైదువ
రాలై మనపడుచు గాఁగ నమరినఁ జాలున్. 150

క. అని చని యాయమ జననీ
జనకులకుం దెలుప సంతసంబున వారల్
విని మనుమరాలు గావున
ననువారము దాని జార యని పిలుచుటయున్. 151

తే. ఊరివారెల్ల రావె యో జార యనఁగ
నదియె పేరయ్యె నాజార కంబుజాక్షి!
యంత నది యింతయై యంతయై వినూత్న
పేశలాకారయై మించి పెండ్లి కెదుగ. 152

తే అడుగ వచ్చిన వార లయ్యబల రూప
శీలకులగుణవిఖ్యాతి చాల మెచ్చి
జార యనుపేరు విన్నంత జాఱుటయును
బీఁట మీఁదిటి పెండ్లిండ్లు పెక్కు లెడసె 153

*క. పోలెండ యేటి మాటలు, జాలింబడనేల మనము సరగున దీనిం
బోలంగ నొక్క తెలుఁగున, బాలింత మటన్న సతికిఁ బతి యిట్లనియెన్,
క. బాల యిది యాయు వలరుచు, మేలిమిగా బ్రతికినట్టి మీఁదట గద యా
జోలి యెట్లైన నైదువ, రాలై మన పడుచుగాఁగ నమరిన జాలున్.

చ. పొలుపుగ మోసులెత్తు చనుపూపలు తొమ్మన నిక్కి నాఁకట
న్మలమల మాడఁగాఁ జెఱఁగు మాసిన [1]దోసము వచ్చునంచు న
గ్గలికల తల్లి కూడడఁగఁ గట్టె మహీసురజాతిధర్మముల్
దెలుపుచుఁ బెండ్లి పే రకట దేవుఁ డెఱుంగు మెఱుంగుఁబోఁడికిన్. 154

క. వేఱే పనులకు వచ్చిన
వారిం గని పడుచు నడుగ వచ్చిరటంచున్
గారాబు కూఁతునకు సిం
గారించుం దల్లి యాస్యకమలం బలరన్. 155

క. ధరణీసురమాత్రుఁడు పే
రరయక యరుదెంచి పెండ్లి యాడినఁ జాలున్
వరదక్షిణతో నిచ్చెదఁ
దరళేక్షణ ననుచుఁ దండ్రి తలఁచు న్మదిలోన్. 156

తే. వార లీరీతి నుండి రో వామనయన!
యంత బుధవంత మను నగ్రహారమునను
వినయవిఖ్యాతి మించు గోవిందుఁ డనెడు
బ్రహ్మచారి చతుర్వేదపారగుండు. 157

తే. ఆతఁ డుపనీతుఁడైన యనంతరంబ
తల్లిదండ్రులు వోవ సంతాప మెడలి
యప్పురీవరమందె విద్యార్థి యగుచు
నఖిలవిద్యలు దనకుఁ దా నభ్యసించె. 158

క. అంతట నవ్వటుమణికిం
గంతుపరబ్రహ్మతావిఖండనచణవే
దాంతతిరస్కృతికరణా
నంతం బైనట్టి జవ్వనం బరుదెంచెన్. 159

1. మోసము

వ. ఇవ్విధంబున సంప్రాప్తయౌవనుండై యతండు సమావర్తనహోమంబుల ప్రేల్చువారలం గనుంగొని మోము ప్రేల్చియుఁ గళ్యాణకంకణధారులం గనుంగొని మేకాఁరియు, నాకబలిసంవిధానంబు లాచరించువారలఁ గనుంగొని గ్రుక్కిళ్ళు మ్రింగియు, నూతనవధూయుక్తులై యూరేగువారి నిరీక్షించి మనంబునం గుందియు, నాత్రవశోభనపరాయణులైనవారలం గనుంగొని ఖిన్నత్వంబు నందియు, వివాహవాంఛాధీనుండై కన్యార్థియై పోయి యొక్కచోట నక్షత్రానుకూల్యంబు లేక మనోవైకల్యంబు నందుచు, నొక్కయెడ జాతివిరోధంబైన వెలవెలం బాఱుచు, నొక్క చాయ రాశిమిత్రత్వంబు చాలకుండినం బెండువడుచు నొక్కదారి గణవైపరీత్యంబైన నత్యంతం బనుతాపించుచుఁ బుడమి యెల్లం జెల్లం దిరిగి యలబ్ధమనోరథుండై యుండి వెండియు. 160

తే. మునుపు చదివిన శాస్త్రసమూహమెల్ల
నూఁచముట్టుగ నొజ్జల కొప్పగించి
యుద్వహనకేళి చింతింపు చునికిఁ జేసి
పలుకు నిద్దురలోఁ బెండ్లి కలవరింత. 161

క. ఊరెల్లఁ బిలిచిరేని య
పారంబగు చింతమునిఁగి పలుకం డదిగో
చేరె వివాహమఁటన్నం
దోరంబగు కాంక్ష నోరు నోరే తెఱచున్. 162

తే. ఇట్లు చింతించి యవ్వటుఁ డేఁగుదెంచి
సోమశర్మ గృహాళిందభూమి కొక్క
నాఁడు గ్రాసార్థమై రాఁగ [1] (రామగోత)
ప్రస్నయంబును నడిగియు నక్కటుఁడి. 163

---

1 వాని నామ (పూ) యతిభంగము

క. మనయింటఁ గన్నె యున్నది
యనఘా! యిది యేమి పెండ్లి యాడెదవే మీ
కును మాకును బంధుత్వం
బనుతరమై బ్రహ్మనుండి యమరిన దరయన్. 164

క. అని యనియుననకమును పే
యనఘా! యే బ్రతికితిని మదన్వయ మిది పా
వనమయ్యె ననుచు నవ్వుచుఁ
దనితరగతిఁ దత్పదద్వయంబున బ్రాలెన్. 165

తే. అతఁడును బొంతనము లెల్ల నరసి లెస్స
యున్నవని పల్కి యారేయి యొక్క లగ్న
మేర్పఱిచి యిరుగు పొరుగు నెఱుఁగకుండఁ
దన తనూభవ నతనికి ధారవోసె. 166

ఉ. అంతట దాని పేరు విని యల్లుఁడు మెల్లన మామగారి నే
కాంతమునందుఁ జేరి వినయంబున నీ యభిధాన మెట్టులీ
కాంతకుఁ గల్గెఁ దెల్పు మనఁగా విని యాతఁడు దాని పూర్వవృ
త్తాంతముఁ దెల్పి దీనిఁ జెడుగై పడనీయక కాచికొమ్మనన్. 167

తే. మంచిదని నాగవల్లట మించినపుడె
యాలిఁ దోడ్కొని తన యగ్రహారమునకుఁ
బోయి [1]తనగృహమధ్యంబు పోతుటీఁగ
కైనఁ బొలయక యుండంగ నలవరించి. 168

క. తలయంటు నలుఁగుఁ బెట్టున్
జలకము లార్చు న్మెఱుంగు చలువలు గట్టుం

1. తన గేహాసీమకు

దిలకంబుఁ దీర్చు గలపం
బలఁదున్ గోవిందుఁ డయ్యొయ్యారికి దినమున్. 169

తే. ఇట్లు పోషింప నా శారదేందువదన
తెలిమి దళుకొత్తు బెళుకుఁ గన్నులును ముద్దు
లొలుకు నవ్వులఁ గులుకుగుబ్బల మెఱుంగుఁ
జిలుకు బెక్కులుఁ దగు[1](వయశ్శ్రీ యెసంగె). 170

వ. అంత. 171

సీ. వీధి నేఁగెడు ప్రౌఢ విటుఁడు పాడెడు వింత
యేలపదా లట్టె యాలకించుఁ
బొరుగింటి మగవాని పొలుపైనఁ బెనుగోడ
యివ్వల జోటిపై నెక్కి చూచు
నాయవారములకై దాయువారల తోడ
జోలి ద్రవ్వుచుఁ బెక్కు సుద్దులాడు
పరుసతో మాటాడ వచ్చు విప్రుల మ్రోల
రాకపోకల నొయారంబు నెఱపు
నింటి కేతెంచు నెదురింటి యింతితోడ
దాని హృదయాధినాథు వర్తనము లడుగు
రతు లెఱుంగక మున్నె యా రాజవదన
వ్రాత తప్పింపఁ జేయ నెవ్వరితరంబు. 172

తే. * అగృహంబున నిచ్చావిహారమునకు
మనసు పరువులు వాఱ నేమాడ్కి నైన
సందు గానక యినుపపంజరములోని
చిలుకపోలికఁ దలఁకు నక్కులుకులాఁడి. 173

1 వయ[illegible] నెసంగె (పూ) *అనుదినంబును

క. ఆలలన జారలీలా
లోలితమతి యుడుపు టెట్టులో జాణవు నీ
వాలోచనమె ఱుఁ దెలుపుము
బాలా! యనఁ జిలుకతోఁ బ్రభావతి పలుకున్. 174

* క. మగువయె విడిచెద ననిన
న్మగవాఁడా నిలుపువాఁడు మానము? నీవే
వగఁ జెప్పెదవో విని తగుఁ
దగ దనియెదఁ గాని తెలుపు తత్కథ యెల్లన్. 175

చ. అన విని మంచిదంచు విహగాగ్రణి యిట్లను నట్టి భార్య వ
ర్తనమున కార్తి నొందు మతిఁ దద్ధరణీసురమౌళి యొక్కనాఁ
డనుపమవైభవం బలర నార్తవశాంతి యొనర్చి నిత్యశో
భనబహులాభకారి యగు బ్రాహ్మణభోజనమైన పిమ్మటన్. 176

తే. చిఱునగవుతోడ నిజకాంతఁ జేరఁ బిలిచి
నీకు నేర్పెడువారలు లేక యునికిఁ
దెలుపవలెఁ గద కేళిమందిరము నొకట
తోయజామోద లెల్లను డాయు విధము. 177

క. మొగమున మసిబొట్టులు కర
యుగమునఁ గప్పెరయుఁ గత్తియు స్రేవలు నెఱుల్
దిగ్రమించెద నను పలుకులు
దగఁ జేరఁగ వలయుఁ గేళిధామంబునకున్. 178

తే. అనిన నంగీకరించి తా ననతిచ్చి
నట్లె యేతెంచుదానితో నతను కేళిఁ
దేలి పతిరాత్రమును నట్టి తెఱఁగుమీఱఁ
బదుకయిలు సేరఁగా నేలుపటిచె నతఁడు. 179

* మగువల వగలును వలపులు

ఉ. అంతటఁ గొన్నినాళ్ళరుగ నయ్యురగాయతవేణి యేటికిం
గాంతుఁడు వోవ వీథిఁ బొడకట్టిన కేశవనామభూసురున్
జింతతనంబునం దలుపు చాటుగ నుండి కరారవిందసం
భ్రాంతిని సన్న చేసి వలరాయని బారికి లోనొనర్చినన్. 180

తే. ఆతఁ డది యాదిగాఁగ నయ్యబల మగని
మొఱఁగి చావడిలో నిల్చి మొగము సూపుఁ
జిన్నలకు లోఁగుఁ గంచంబు చెంతఁ బిల్లి
కరణి నెదురింటి వాఁకిటఁ గాచి యుండు. 181

క. గోవిందుఁడు సవసవగా
నావిధ మించుక యెఱింగి యాత్మోపాయ
శ్రీ వెలయింపఁగఁ దలఁచి ర
సావేశమ్మున మెలంగు నంగనతోడన్. 182

క. ఎల్లుండి సమారాధన
చిల్లర వెచ్చములు గొనఁగ శీఘ్రమె యిదె యీ
పల్లియ సంతకుఁ జని యే
నెల్లిటి కరుదెంతు పదిల మిల్లని పలుకన్. 183

చ. అది మదిఁ దోఁచు వేడుక బయల్పడనీయక వేఁడి కంటినీ
రొదవఁగ మోము వాంచ నతఁ డోచెడుఁ ద్రిమ్మరి సమ్మదాశ్రువు
ల్గద యివి యంచు నాత్మను దలంచుచుఁ జింతిలనేల తేపె వ
చ్చెద నని బుజ్జగించి యతిశీఘ్రమునం బురి నిర్గమించినన్. 184

క. అతఁ డూరు వెడలి చనుఁడ
య్యతివ పదింబదిగఁ దెలిసి యపుడా యెదుటన్
ధృతి నిల్చిన కేశవుతోఁ
బతి యరుగుట తెలిపి గూఢభంగి న్మఱియున్. 185

క. ఈ రేయి నన్ను నిలువున
నీరుగఁ గరఁగింపవలయు నేఁడున్నవి నీ
నేరుపు లన్నియు నని నయ
గారపు వగలాఁడి యనుపఁగా నతఁ డరిగెన్. 186

క. రవి గ్రుంకెఁ బంకజాత
చ్ఛవి డొంకెన్ జక్రవాకచక్రోల్లాసా
రవ మింకె జారరతమా
నవి బొంకె న్నాదునీతి నాథునితోడన్. 187

క. అంతట నగ్గోవిందుం
డెంతయుఁ గనకుండఁ బడుకయిలు సొచ్చి తద
భ్యంతరమున వస్తుసమా
క్రాంతం బగు నటుకమీఁదఁ గదలక యుండెన్. 188

తే. అంతటను గేశవుం డూరి యలబలంబు
మట్టుపడఁ జూచుకొని మాటుమణిగె ననుచుఁ
గటికి చీఁకటి నెఱనేస్తకాఁడు దాను
ధృతి ([1] యొసంగఁగ) దాని మందిరముఁ జేర. 189

చ. ఎదురుగ వచ్చియు న్నటుకటింటికిఁ దెచ్చియు మోవి యిచ్చియుం
గుదురు మెఱుంగు గబ్బివలిగుబ్బల గ్రుచ్చియు నాతగానికిన్
ముద మొదవించి యమ్ముదిత మున్పటి క్రైవడిఁ గేళిగేహముం
గదియఁ దలంచి లేచి చని గ్రక్కున రాకటు తామసించినన్. 190

క. నన్నిచట నుంచి చనియెం
[2]గన్నియ వఱి రాక తడసెఁ గపటోపాయం

---

1. యొసఁగఁగ (పూ)
2. గన్నియ యిటు రాక పోయెఁ గావున కపటం

బెన్నె నొకొ యెవ్వఁ డెఱుఁగుఁ బ్ర
సన్నాంబుజముఖుల యింద్రజాలము లెల్లన్. 191

తే. అనుచుఁ దద్భూసురుం డెంచునంతలోన
నురియ నిప్పులు రాలు కప్పెరయు మొగము
మీఁద మసిబొట్లు మించ నమ్మోలఁత రాఁగఁ
జూచి దిగులొంది యిదిగో పిశాచి యనుచు 192

తే. అతఁడు పరువెత్త నిదియేమి యోరి పోకు
పోకు మను పల్కుతోడ నప్పుడది నడచి
వెంటనే యంట నీదయ వేగఁ గాలి
పోవ నిమ్మించు దన గేహమునకు నేఁగ. 193

తే. అంతలో దాని పెనిమిటి యటుక డిగ్గి
గూఢముగ నేఁగి పెరటి బల్గోడ దాఁటి
వెలుపటికి వచ్చి యెవ్వరే తలుపు తెఱవ
వే యనుచుఁ బిల్వ నచ్చెల్వ వేష మడఁచి. 194

క. గడియ సడలింప నతఁడ
య్యెడ నవ్వగలాఁడిఁ దప్ప కీక్షించి యిదే
మడరెఁ బరపురుషవాసన
చెడుగా! నొడువు మని కాలఁ జేతం దన్నెన్. 195

చ. అది మొద లవ్వధూమణి పరాప్తికి దండము వెట్టె వాసనా
భ్యుదయము నాయకుం డెఱుఁగునో యని యెంతయుఁ గేశవాఖ్యసం
విదితతదీయమూర్తులయి వేడుకకాంద్రదది తల్లి తోడుగా
మది గణియించిరో చెలి! సమర్పణ మయ్యెనె ([1]వాని) నైపుణుల్. 196

క. అనినఁ బ్రభావతి యిదిగా
దనవచ్చునె పురుషులే యుపాయపరుల్ వా

1. వాణి (పూ)

రిని గెలువఁ దరము గాదని
యినుఁ డుదయింపఁగఁ బడుకయింటికి నరిగెన్. 197

## పదునేనవరాత్రి :

క. అంతఁ గ్రమంబున నలినీ
కాంతుం డపరాబ్ధి మునుఁగఁగాఁ బుణ్యజనా
త్యంతాద్రికరణ పాపం
బంతయు వెడలె ననఁ దిమిర మడరెం దఱచై. 198

చ. అనుపమలీల నప్పు డసితావరణాంబరదీపిగు ప్తయై
తనులత మబ్బులోని తెరతళ్కుల మించు నదల్చు దూతిఁ దో
డ్కొని చనుదేర వచ్చు నలకోమటి కోడలి కొమ్మఁ జూచి యి
ట్లను శుక ముత్పలాశముకుళాంచలచంచలచుంచుచంచువై. 199

చ. పనివడి రాజుఁ జేరఁ జలపట్టినదానవు చేరకుందువే
విను మటి రాచవారు మదవిహ్వలు లించుక నేరకున్నఁ గో
పనియతి చేత మొక్క పఱపం దమకింపుదు రట్టులైన నా
ఘని యెడఁ బొంకఁగా వెఱవు దోఁచినఁ బొమ్ము సరోజలోచనా! 200

## పదియవకథ

తే. అమ్మ! దీనికి నొక యితిహాస మలరు
వినుము ధనపాలుఁ డను రాజు పెనుప వెలయు
మేదురోద్భటభటసింహనాదచలిత
దిగ్గజవరంబు పద్మావతీపురంబు. 201

క. అందు సువేషుండను ధృతి
మందరనిభుఁ డొక్కఁ డమరు మరు క్రొవ్విరి తూ
పుందెగడి సుమతి యనుపే
రందిన సతి యందగత్తెయై వర్తింపన్. 202

తే. ఆతఁ డిల్లాలిపై మోహ మతిశయిల్లఁ
బెల్లుగాఁ జెల్ల విడిచి వర్తిల్లు కతన
నరయఁ బాటించుకొని గణనాథుఁ డనెడి
బంటువానికి మానముఁ బ్రాణ మిచ్చు. 203

తే. కూర్మిఁ జూపట్టుఁ జేపట్టుఁగుంచ మగుచు
వాఁడు వర్తింప నెఱనీటు వగలు పూన
నెంచి యించుకయైన నాసించ దౌరుని
రతుల కాసించ దా చేడె ప్రాణ విభుని. 204

క. తల నొప్పి కడుపు కుట్టుం
బలుగురుపుం గాళ్ళుతీపు పాటించుచు స
చ్చెలి మూల్గుఁ బాన్పుమీఁదం
జెలువుఁడు దత్తచ్చికిత్స [1]చేయ న్నగుచున్. 205

క. *మున్నె కొలువున్న వానికి
జన్నె విడిచి యన్నెలంత చక్కనివరు నే
మన్నా రావన్నా పో
వన్నా యనుఁ గాని యోయి యన దెంతైనన్. 206

క. కనుచాటు తిండి నడిపిన
పనులం గండలును బెరిఁగి బకుతండ్రి హిడిం
బుని కొడుకన గణనాథుఁడు
ఘనబలమున బిరుదుజెట్టి కైవడి మెలఁగున్. 207

సీ. చెప్పనిపని నీళ్ల చేఁదెద నని పోవు
సంతకుఁ బొమ్మన్నఁ జింతసేయుఁ

1. చేయఁగ నుండెన్ * తిన్నని ప్రాయము వానికి

జేటఁ గ్రైకొని చూళ్ళు చెరిగెద నని పోవు
దండు వొమ్మన్న సంతాప మందు
వలదన్నఁ గందులు గొలిచి చూడఁగఁబోవు
నగరికిఁ బొమ్మన్న దిగులు పడును
[1]నాసర వేఁపఁగ నెండుసెనఁగ లెత్తఁగఁ బోవు
నూరికిఁ బొమ్మన్న నులుకుఁ జెందు
సింటిలోపలి పనుల నెన్నైనఁ జేయుఁ
గడప దాఁటెడు పనియైనఁ గళవళించుఁ
బెట్టుపోఁతల సొగసాని సెట్టిసాని
యింటికడ నుండి నట్టాడు బంటువాఁడు. 208

క. ఇదియేమి సెట్టి యెఱుఁగఁడె
కద పెంచిన చనువు ఇలిమికడఁ బనిముచ్చై
యెదురాడుచున్నవాఁ డని
మదినెంచుచుఁ బొడము కినుక మగుడ నడంచున్. 209

తే. అంత నయ్యూరి దొర ముత్తియములఁ జూచి
తెమ్మని సువేషు దవ్వుల దీవి కేఁగు
మనుచుఁ గట్టడ సేయఁగా నతఁడు వచ్చి
పయన మెఱిఁగింప సుమతి సంభ్రమము నొంది. 210

సీ. మలయుఁ బో మధురాతిమధురాధరల వాఁడి
చెన్నారు గోరః సీ చెక్కుమీఁద
నానుఁబో రంగస్థలాబ్జగంధుల గుబ్బ
మెఱుఁగుఁ జందోయి సీ యురము మీఁద

---

1, వాఁకిలి ముంగిలి జోక సేయఁగఁ బోవు వేఁ మాడు మటన్న బెగ్గలించు;
వెంట పైవం బగుచు వేగమే రమ్మన్న కడఁగి రాలేనని కళవళించు.

మించుఁబో కాంచికాచంచలాక్షుల వాఁడి
మొనపంటి నొక్కు నీమోవి మీఁదఁ
జేరుఁబో నెల్లూరు నారీమణుల కెంపు
పసమించు టడుగు నీ నొసటి మీఁద
*నింట నుండిన నీసౌఖ్య మేల కలుగు
ననుచుఁ గన్నుల నూరార్చి యక్కుఁ జేర్చి
మోవిచిగు రంటనొక్కి తాంబూల మొసఁగి
పోయిరమ్మని పనిచె నప్పువ్వుఁబోఁడి. 211

తే. అఁత బుడిబుడి యేడ్పుతో నదలుదాని
బుజ్జగించి సువేషుఁ డప్పుడె ప్రయాణ
భయసముత్కంపితగ్లాని బంటువాని
నింటికడ నిల్పి పైనమై యేఁగుటయును. 212

చ. ఇపుడు గదా తపంబు ఫలియించె నటంచు మహోనుర క్తిభా
వపరత రేఁబవళ్ళుఁ దలవాఁకిలి వేసినయట్టు లుండ స
న్నపు విరిదమ్మి తేఁకువ సన నమృతూపులఁ దుప్పు మించఁగా
నపరిమితప్రమోదరసులై రమియించిరి వార లిద్దఱున్. 213

క. ఇంటి మగఁడయ్యె దానికి
బంటుతనం బుడిగి వాఁడు బానిస యయ్యెన్
నంటున బోఁటియు వానికి
నింటన్ మేలువడి సాఁగ నిచ్చం బరఁగున్. 214

*నింట నేయుండఁబెఱ మచ్చెకంటి నంటఁ, గూడ కల్గాదు నీ కనుకూలుఁడయ్యె
నృపతి పయనంబు చెప్పుట నీవు గోరు, పోఁడుము ల్గల్గ నిఁక నేమి పోయిరమ్ము.

క. ఈరీతి మెలఁగు వారల
దారుల్వని రాజుకొడుకు ధవళాఖ్యాకుం
డౌరా గగ్గోలుగన
న్నారి పయిం బడుదు నని ఘనంబగు ప్రేమన్. 215

క. ధనముల జాలెలు రతనపుఁ
బనిఁ దగు నొకవరుస సొమ్ముఁ బనిచిన గణనా
ఘన కీవచ్చుఁ గదా యవి
యని కోమటి కొమిరె వాని యప్పనఁ గొనుచున్. 216

ఉ. అమ్మకచెల్ల! నేను వెలయాలనొ త్రిమ్మరినై పురంబునం
ద్రిమ్మరఁ జూచెనో తనకుఁ దేట మిటారపు నిండుఁ బ్రాయపుం
గొమ్మలు లేరొ నా ముదుక గోకయుఁ గోమటి యెద్దె వీఁకయున్
సమ్మతమయ్యెనే యని యసత్యపుఁ దక్కులు తక్కి వెండియున్. 217

క. రమ్మను మిచ్చటి కిది కా
నిమ్మని యనకున్న నగర మేలెడి దొర దా
నెమ్మదిఁ గనలుచు దండుగ
దెమ్మనిన న్సెట్టి యెడఁ దెచ్చు న్వెఱతున్. 218

క. అని పనిచిన దూతికయుం
జని తెలుప న్రాజసుతుఁడు చరమాంబునిధిన్
మునుఁగ రవి నెఱయు చీఁకటి
గనుఁగొని కేలుట్టిపడఁగఁ గట్టాయితమై. 219

చ. తలవరు లింతనంత వెడదాఁటులతో గగనంబు చించు లీ
లల విలసిల్లి వెంటఁ బదిలంబుగ రాఁ జని యూడిగంబులన్
వెలుపల నిల్పి తా నొకఁడ వేగ నగారము సొచ్చి యోరవాఁ
కిలి యయి యున్న తల్లలితకేళినికాంతముఁ జేరి యచ్చటన్. 220

క. కనియెం బాన్పునఁ గినుకం
బెనఁగొని కాట్లాడు పికిలిపిట్టల చందం
బున సుమతియు గణనాథుఁడు
మనసిజరణకరణకేళిమగ్నత నుండన్. 221

క. కనుఁగొని యిది ననుఁ బిలువం
బనిచియు వేఱొకనిఁ గూడఁ బాడియె యని యె
ట్టని కనుఁగవతో ముడిచిన
కనుబొమ్మలతోడఁ జేరఁగాఁ జని వేగన్. 222

క. బెడిదపు టడిదముఁ గైకొని
గడితపు టొఱ దుస్సి వాఁడి ఖడ్గము చేతం
దడఁబడ మొదలంటంగా
జడఁ గోసి యతండు వేగఁ జనియె లతాంగీ! 223

క. అమ్మఱునాఁడె సువేషుఁడు
క్రమ్మరి యయ్యూరి యేటికడ నుండి ప్రమో
దమ్మునఁ దన రా కనుఁగుం
గొమ్మకుఁ దెలుపుమని బంటుకొడుకుం బనిచెన్. 224

ఆ. వాఁడు వచ్చి మగఁడు వచ్చినాఁ డను వార్తఁ
దెలిపినపుడె భీతిఁ గలఁగె సుమతి
నెఱుల పోక కింక వరునితో నేమని
బొంకవలయుఁ దెలుపు పువ్వుఁబోఁడి. 225

చ. అనినఁ బ్రభావతీరమణి యద్దిర! యయ్యెడ బొంకు పెట్లు నేఁ
గనినది గాదు విన్నదియుఁ గాదది తెల్పినఁ దెల్పు ([1]నూరకుం)
డిన మఱి యూరకుండెదవు నే నిటువంటి వెఱుంగఁ జాలఁజాల్
దినమును రాజుఁ జేరఁ జనఁ దీరక నీకథ వించునుందునే? 226

1. లేకయుం (పూ)

మ. అనినం గీరము కోపమేల వినవమ్మా కొమ్మ! యమ్మాడ్కిఁ దె
ల్పిన ఖంటుం గని యూరుజాబ్జముఖి మేల్వేయేండ్లు వర్ధిల్లు చ
క్కని నానాథుఁడు వచ్చెనంచు ముకు గల్గ న్వచ్చి యామేలు వా
ర్త నిజంబొందఁగఁ దెల్పితంచు మది మేరల్మీఱ ధైర్యంబునన్. 227

తే. కాకి కఱ్ఱనెఁ దోడనె గౌళి పలికెఁ
బొలిచె నట్టింటఁ గుమ్మరిపుర్వు [1](చెలఁగి)
యిన్నియునుఁ గల్ల గాకుండ నేఁగుదెంచె
హృదయనాయకుఁ డోయన్న యిదియె చాలు. 228

క. అని పతితో నే నటకుం
జనుదెంచిన దాఁక మీరచటనే యుండం
బని గల దనుమని పనిచినఁ
జనియె న్వాఁ డంత నవ్విశాలేక్షణయున్. 229

క. ఇల్లలికి ముగ్గు వెట్టి మ
హోల్లాసము పల్లవింప నొక్క మెఱుంగుం
బల్లెమునఁ గోసి పైచిన
యల్ల జటాఖండ మిడియు నలరులతోడన్. 230

ఉ. ఐదువరాండ్లతోఁ గదలి యాత్మమనోవిభు డాయఁబోయి య
ప్పైదలి వేణితోఁ జెలఁగు పళ్లెర మారతి భంగిఁ ద్రిప్పి యా
మోదముఁ జూపె నాతఁ డది ముందఱఁ దెల్పు మటంచు వేఁడఁగా
నాదయితుం గనుంగొని దృగంచలమం దుదయించు సిగ్గునన్. 231

చ. చెడుకల [2]గాంచి దానిఁ జని చెప్పితిఁ బెద్దలతోడ వారల
య్యెడ ననుఁ జూచి నీదు హృదయేశుఁడు వచ్చె నటంచు విన్న నె
క్కుడు నెన రొందఁ గీలుజడఁ గోసి నివాళి యొనర్పు మప్ప దే
కడమయు లేదటం చనిరి కావున నిత్తఱి నట్ల చేసితిన్. 232

1. మెలఁగి (పూ) 2. గంటి మొన్ననది

క. నెఱు లనఁగనెంత? తేపే
పురిగొని తెగబారెఁడేసి పొడమెడు మీరే
మురువుగ జడ యల్లెద రీ
కరణి స్త్రీ రరుగుదేరఁ గాంచుటె చాలున్. 233

చ. అన నతఁ డింతభక్తి గల యంగన యింట వసించి నాకు శో
భనములు గోరఁగాఁ గద యపాయము చెందక క్షేమలాభము
ల్గని యిలు చేరుటంచును దలంచి వధూమణియుక్తుఁడై నికే
తనమున కేఁగె నింటివి గదా సుమతీస్ఫుటచాతురీస్థితుల్. 234

చ. అనవుడుఁ జిల్కఁ జూచి వణిగగ్రణిరాణి సుహాణిము త్రైపు
న్మినుకులు రాల నవ్వి యొకనీరజలోచన యట్లొనర్చినన్
వనితలకెల్ల వచ్చు నపవాదశతం బని పల్కునంతలో
నినుఁ డుదయింపఁగాఁ బడుకయింటికి నేఁగె నసిద్ధయత్నయై. 235

## పదునాఱవరాత్రి :

ఉ. అంతఁ గ్రమంబున గ్రవి నిజాంతరశౌరిని మామగారి గే
హాంతముఁ జేర్చు టారి నపరాంబుధిఁ గ్రుంక నవారితోత్సుక
స్వాంత ప్రభావతీవికచవారిజలోచన చేరి నిల్చినం
గంతుపతాణియుం గతలకారితనంబున మీఱి యిట్లనున్. 236

క. చనియెద వక్కట తో న
య్యను ప్రక్కకుఁ ద్రోవ నొక్క యిక్కట్టైనం
గని మొక్కవోక గ్రక్కునఁ
జనుదేర నపాయ మెఱుగఁ జాలుదె బాలా ? 237

వ. ఏతదర్థసమాయాతంబగు నొక్క పురాణవృత్తాంతంబు గల దంచు మాటలఁ
బిటవెట్టి యా సెట్టిపట్టితోఁ జలపట్టి పచ్చచట్టుపలపిట్టదిట్ట యిట్లనియె 238

## పదునొకండవకథ

*క. నలినావాసం బనఁగాఁ
గల దొక పుర మబ్ధికన్యకామణికిం దా
వలమై మదసారంగో
జ్జ్వలఘీంకారవిదళితదిశాభాగంబై. 239

క. ఆనగర మేలు దుర్దమ
సేనుండను నృపతి యతని చెంతను శూరా
ఖ్యానుఁ డను నొక్క రౌతు మ
హానతరిపుభీతిహేతువై వర్తిల్లున్. 240

సీ. గిఱు నామము చిన్ని కోరమీసలు చెంపఁ
బనిమట్టు సికబొందు పట్టు నూలు
వెనుక కట్టు రుమాలు వెడఁద గాయపుఁ గాయ
దారిఁ గాన్పించు గందంబుఁ బూఁత
కమ్మి పంచెయు గట్టి కమ్మిదుప్పటి వల్లె
వాటు కెంగేలిలో వంకవంకి
పట్టుచే నపరంజి పరుజుతోఁ దగు కత్తి
పలుచని బచ్చెన పావుకోళ్ళు
చికిలి చౌకట్టు సరిపెణ లకమెసంగు
నుంగరంబులు నొక వింత యొఱపు నెఱప
నేలినాతని కొలువున కేఁగుదెంచుఁ
జూపఱు నుతింప నయ్యాయుధోపజీవి. 241

క. అతనికిఁ గలహప్రియ యను
సతి గల దయ్యతివ నడచు చందము లెల్లన్

*గంగాతీరము చెంతను, బొంగెడు సంపదలచేతఁ బూర్ణంబగుచున్
శృంగారఖని యొ యొద్దియనఁ జెంగల్వపురంబు పేరఁ దెలఁగుచునుండున్.

మతి నరయ నతని పాలిటి
ప్రతిబంధపుఁ బేరఁటాలు పంకజవదనా! 242

క. ఆరమణి నడత యొకటియుఁ
బేరొకటియుఁ గాక యుండఁ బెనుదుఃఖముగాఁ
బోరాడ విసివి వేసరి
శూరుఁడు స్త్రీహత్యఁ జేయఁ[1]జూడని కతనన్. 243

తే. వెడల నడిచినఁ గాతిరాజవీర మనెడి
పురమునందున్న పితృగేహమునకుఁ బోవఁ
దలఁచి యయ్యింతి డింభకద్వయము తోడ
నరిగెఁ బథికులచే మార్గ మరసికొనుచు. 244

వ. ఇవ్విధంబునం గతిపయప్రయాణంబుల నరిగి యొక్కనాఁటి పయనంబున నది మార్గంబు దప్పి కాల్త్రోవం బడి యక్షుద్రనిద్రావిరామసయయసముదిత హర్యక్షకిశోరక్షుధారావసమాకర్ణనాతిభీతగర్భస్రవదర్భకానవలోకి పలాయమానధేనుకావితానంబును, దదీయశ్రవణపవనచలితకీచకాన్యోన్యకర్షణ సంజనిత ధనంజయ శిఖాభిముఖధావనా శార్దూలంబును, దదీయభీషణాకార వికారావలోకనమాత్రత్రస్తతటాకగాహన పరాయణవరాహంబును, దదీయ పతనచలితజలజాగ్రసముత్పతద్రథాంగసముత్తుంగపక్షపుటపటపటాత్కార సంభ్రాంతసకలశకుంతంబును,వెండియు వలీముఖపరికంపితశాఖాగళితకుసుమ రసవిసరంబులపై ముసురుకొను నసమభసలంబుల వినీలంబైన నేలయుఁ, గురంగనాభికాసద్యస్స్రుతమృగమదపంకిలంబైన భూమియు నభేదత్వంబు చూపఁ బరిస్రుతప్రసవపరాగంబును, సప్తచ్ఛదరంభా స్తంభ పతితరజోవ్రజంబును, వేఱులేక మీఱఁ దరణికిరణవిదారితవేణుముక్తముక్తా మణులును, నచిరప్రసూతకుందలిపనితాండజంబులు నఖండంబులై మెండుకొనఁ గాసరంబులకు వాసరంబులును, గవయంబులకు నిలయంబులును,

1. భూడమివేగన్,

దుప్పులకు నెప్పులును, జమరవాలంబులకు విభ్రమస్థానంబును, భల్లుకంబులకు నుల్లోకంబును, ఖడ్గసంతానంబునకు నిశాంతంబును, మయూరంబులకు జయారంభస్థానంబునునై సురసరణ్యానీతాగ్రయగు నొక్క యరణ్యానిం బ్రవేశించి కించిచ్చలనంబు లేక యయ్యాకాశమధ్య యభ్యగ్రఝురీ మధ్యంబునం గూర్చుండి మార్గాన్వేషణంబు సేయుచున్న సమయంబున.

తే. చెంత బారెడులో నికుంజాంతరమున
నొక్క బెబ్బులి యుండి యయ్యువిదఁ జూచి
కూర్చె నాహార మాఁకలి గొన్న నాకు
దైవమని యంతలో వేఱు తలఁపు వొడమ. 246

క. ఇది నాపద మిది నానద
మిది నాపొద చేర వెఱతు రెవ్వరు నేఁడీ
మదవతికి నెన్ని గుండెలొ
కదలక నే యున్నయునికి [1]కార్యమెఱుంగన్. 247

ఉ. ఈ వనమెల్ల నేలెడు మృగేంద్రుఁడు సైతము [2]సాపరాధుఁడై
సేవకుఁ డాత్రి నా మఱుఁగుఁ జెందినచో మదనుజ్ఞమీఁద సం
భావితుఁ జేసి వాని బహుమానముతోఁ గొనిపోవుఁ గాని తే
జోవిభవంబు చూప వెఱచున్ బలవంతుఁడ నేను గావునన్. 248

తే. అట్టి నన్నునుఁ జేరి భయంబులేని
పొలుపుతో నున్న దీ పువుఁబోఁడి చెంత
[3]ననుచు గవుకునఁ బట్టరా దరయ వలయు
యోజన యొనర్చి చేయుట రాజనీతి. 249

క. కార్యాకార్యము లెఱిఁగిన
యార్యుఁడు నా మంత్రి జంబుకాగ్రేసరుఁ డా

1. కతమె యెఱుంగన్ 2. నిర్మలాత్ముఁడై 3. అగవునకుఁ బట్టరాదు ధీ నరయ వలయు

ధైర్యనిధి సుమతి నామకుఁ
డర్యమపదభక్తుఁ డెచటి కరిగెనొ యెఱుఁగన్. 250

తే. అతని రావించి నా విచారానువృత్తి
([1]జంపుదునొ) దీని, నేటి విచార మింకఁ
గమిచి నామేని రక్తమాంసములఁ బీల్చ
సాఁగె నతిగాఢతరలుఠజ్జారరాగ్ని. 251

క. అని తెంపు చేసి కనకనఁ
గనుఁగొనల న్నిప్పు లురలఁగా వాలము భూ
మినిఁ దాటించుచుఁ దద్గృహ
మును జూచుచు గుఱక యుఱకఁ బోనతులున్నన్. 252

క. [2]అబ్బెబ్బులిఁ గన వచ్చెం
దబ్బిబ్బు లిఁకేమి సేయుదాన ననుచు న
బ్బిబ్బోకవతి మనంబున
నబ్బురమును భయముఁ ద్రొక్కులాడఁగ నుండెన్. 253

క. ఆ కలహప్రియ పులిచే
నేకరణిన్ బ్రదికి యూరికేఁగఁగ వలయున్
రాకేందువదన! తెల్పఁ గ
దే కందముగాని నీ యతిస్థిరబుద్ధిన్. 254

క. అనినఁ బ్రభావతి యిఁక నే
మని తెల్పుదు నాకుఁ జూడ నగపడియెన యా
వనిత పులివాతి; కేగతి
వినిపించెదొ దాని బ్రదుకువిధ మిఁక మీఁదన్. 255

1. జెప్పుదునొ (పూ) 2. ఆ బెబ్బులి యిదె వచ్చెన్.

ఉ. నావుడుఁ జిల్క పల్కు లలనా ! విను మత్తఱి నవ్వధూటి ప్ర
జ్ఞావతి యోట నిప్పలి నిజంబుగ న న్గనుఁగొన్న యప్పుడే
చేవ దలిర్పఁ బైఁ బడక చింత యొనర్చుచు జేలుపోయె నే
నేవగదాననో యనుచు నీ యెడ భీతియుఁ జూపఁగా దగున్. 256

క. అనుచుఁ దనూజుల నిద్దఱఁ
గొనగోటన్ గిల్లి వారు కోయని యేడ్వం
గనుఁగొని యూరార్చు విధం
బున నిట్లను విసివినట్టి భూనిక దోఁపన్. 257

తే. ఏల యేడ్చెద రాఁకటి కేమి యొల్ల
రకట! పులిమాంసమే కాని యన్నలార!
మీ కొఱకు వ్యాఘ్రములఁ జంపి మీఱు కతన
దూఱు మఱి వ్యాఘ్రహంతయ [1](న్పేరుఁ) గంటి. 258

క. ఇలు వాసి మీకు గ్రాసపు
పొలవాసిం గూర్ప రోసి భువి ఘోరమృగా
వలికిం దలఁకక యడవిం
బులికిం బులి నగుచుఁ దిరిగి పులిపులియైతిన్. 259

తే. ఐన నేమయ్యె నిచ్చోట నరయుచున్న
దానఁ బులులున్న[2]వో యని కాన నింక
రెండు గలిగిన మీ యిద్దఱికిని జాలుఁ
గాక యొకటుండినఁ జెఱి సగంబు గలదు. 260

క. అని పలుక జతుకు మదిఁ బెనఁ
గొనఁగా మేనెల్ల ముచ్చికొనుచుం బులి మె
ల్లనె యవలికిఁ జని వెసఁ జం
గున నచ్చటి లతలు ద్రెంచికొనుచుం బాఱెన్. 261

1 నేర్పు 2. ఛాలుఁభో కాన నింక

క. అనినఁ బ్రభావతి మదిఁ బ
ర్విన నివ్వెఱ ముక్కు మీఁద వ్రేలిడి తల యూఁ
చి నిజంబుగ మగువలె పో
ఘనసాహస లనుచుఁ బ్రొద్దుఁ గని పల్లవితోన్. 262

క. కనుఁగొంటివె యది చక్కన్
మనసిజనృపకీర్తిరుచిసమాజపు మొక్కన్
మినుకుల కులముల యిక్కన్
వినుచక్కిం జొక్కమైన వేగుంజుక్కన్. 263

తే. అనుచుఁ గేళిగృహంబున కరిగె మఱి క్ర
మక్రమంబునఁ దరణి బింబమ్ము వ్రాలె
నపరవారాశిఁ దమఁ జూచి యచటి మీన
కోటి పలలం బటంచు ముక్కులను బొడువ. 264

పదునేడవరాత్రి :

మ. తన మేనం దగఁ దోఁచు సొమ్ములయినం దజ్జ్యోతి లోఁగొంచు న
ల్లని మేలౌ బురునీసుకప్పడము చాల న్మించ నేతెంచెఁ బ
చ్చనివిల్కాని జయాస్పదంబగు జిరాసంజోకతేజీవిధం
బున నవ్వేళఁ బ్రభావతీసుదతి చూపు ల్వెన్నెలం బర్వఁగాన్. 265

క. చనుదేరఁ జిల్క తత్కర
మున వ్రాలి మెఱుంగుఁ బోఁడి ముక్కుకొనఁ జూఱు
క్కున గీరి కడమ కథయున్
విని పోయిన లెస్స గాదె విమలేందుముఖీ! 266

వ. అని పలికి రాజసంభోగసమారంభవిజృంభమాణాధీనంబగు నమ్మానవతీ మానంబుఁ ద్రిప్పి చెంగటం జెలంగు మెఱుంగు టపరంజిపీఁట పయిం గూర్చుండిన యక్కురంగనయన తరంగితనిజవాంఛాఫలరసవీచికలం బ్రార్థింప నింతింత తఱితీపు చూపుచుఁ గీరపుంగవం బిట్లనియె. 267

మ. విను మారీతిఁ బదాళిఘాతపతితోర్వీజాతమై భీతి పీ
డని శీఘ్రంబున దూర మేఁగి దగ దొట్టన్ వ్యాఘ్రి మాదండ ను
న్నని గండోపల మెక్కి యక్కలికి యందం బందు నల్దిక్కులం
గనిపింప న్వెడ గుండెకాయ లదరం గాలూఁద లేకున్నెడన్. 268

తే. కనియెఁ దన్మంత్రియైన సృగాలమౌళి
సుమతినామకుఁ డారీతిఁ జూచి యచట
కేమిటికి వచ్చెనో వాని నేలి నాతఁ
డనుచుఁ జెంగటి పొదఁ జేరి యాత్మలోన. 269

సీ. తన యునికి యెఱుఁగ కుద్ధతిఁ జెంతఁ జను లేటి
కొదమపైఁ బెట్టదు క్రూర దృష్టి
దగ్గఱ గంతులు తగ వేయుచున్నట్టి
కుందేళ్ళఁ బట్టని యందమేమొ
చెంగటఁ దిరుగుచుఁ జెంగున దాఁటెడు
దుప్పులఁ బట్టక తప్పెనేమొ
మొక్కలంబునఁ జేరి సొక్కుచుఁ దిరుగాడు
మనుబోతుఁ బట్టంగ మఱచెనేమొ
యనుచుఁ దనలోన నూహించి యాత్మఁ జెదరి
చూచి ధైర్యంబు వదలక చోద్యమంది
చెంతఁ జేరఁగ భయమంది చాలఁ గలఁగి
తఱచు భ్రమనొంది యంతటఁ దానె తెలిసి 270

ఉ. నాలుక వ్రేలవైచి వదనంబు వివర్ణవిధంబుఁ జెందఁగా
మ్రోలఁ జెలంగి యాడెడు రురుప్రముఖంబుల మీఁద నేమియున్
వ్రాలని చూడ్కి గుండె యదర న్నిలుపోపక యున్నయట్టి శా
ర్దూలకులేంద్రుఁ జూడ్క భయదోషముఁ జెందినరీతిఁ గన్పడన్. 271

క. నాయంత మంత్రి యుండి య
పాయంబగునట్టివేళ నధినాథు సుఖ
శ్రీయుతుఁ జేయక యుండుట
నాయమె [1](యిదె)పోదుఁ బతిమనం బలరింతున్. 272

క. అని తలఁచి సుమతి చేరం
జని పులికిం గేలుమొగిచి సవినయముగ న
వ్వని నుండి యుబుసుపోకం
జనుదెంచితిరేమొ! యిచటి జాడలు చూడన్. 273

క. దొరయైన యతఁడు మఱచియుఁ
బరభూమికిఁ బోవరాదు పని గల్గినచో
నురుతరనిజభటయుతుఁడై
యరుగం దగు లేకయున్న నాపద లొదవున్. 274

క. అసహాయశూరులరు గను
క సముత్సాహంబు వొడమఁగా వచ్చితి రి
వ్వసుధయును గంటిరే కద
వసతికిఁ బోవుదము తడయవల దిచ్చోటన్. 275

చ. అనఁ బులి యాతఁ డచ్చటి మృగాక్షి కఠోరవచోవిశేషముల్
వినినది లేదు గాన బహువింతలు [2](తెల్పెడునంచు) నెంచి నె
మ్మనమునఁ దోఁచు భీతిని నమందతరస్వర మొప్ప నాతనిం
గనుఁగొని పల్కు దైన్య మధికంబుగ దిక్కులు పాఱఁ జూచుచున్. 276

క. విను తల్లికి నే మఱలం
జనియించితి నేఁడు నీదు సల్లాపకథా
వనధిం దేలఁగఁ బుణ్యం
బునికిం బడకితిని కీర్తిభూషణమూర్తీ! 277

1. యిది (పూ) 2. తెల్పెదవంచు (పూ)

ఉ. సిగ్గులచేటు సుమ్మది వచించిన నాప్డు(డ వౌట నీకు నే
నిగ్గురుభీతిహేతు విపు డింతయు( దెల్పెద నన్యు లెవ్వరి
దగ్గఱ లేరుగా ! మన దిటంబు( గనుంగొన నంచు మెల్ల నే
యగ్గజయాన పల్కిన [1]మహాకటుభాషలు విన్నవించినన్. 278

క. ఆ(టది గాదది మృగముల
వే(టాడ న్వచ్చు మృత్యువే తప్పదు నో
రాట మిదియేల యిచ్చట
నే(టి కెడ యొనర్చుకొనుట నీతియె కాదో ! 279

క. అని పలుక సుమతి యెంతయు
విని యకటా! యెవ్వతెయు వివేకవిహీనుం
డని యితని బేలుపఱిచెం
జనదు గదా పితికి దొరల సరసం గొలువన్. 280

క. పతికి భయ మదరుచో నది
యతిశయముగ( జేసి మాన్యు(డై బ్రదుకుం గు
త్సితమంత్రి యతని( గైకొను
నతిదుర్మతియైన నాథు( డాప్తు(డు గా(గన్. 281

వ. కావున [2]నేకాచారంబగు నమాత్యపథంబునం బ్రవర్తిల్లు నాకు నకారణభయ
భ్రాంతుండైన యతని కనుగుణంబుగా నడుచుట కర్తవ్యంబు గాదు బహు
కాలం బేతదర్థంబున( బోషితుండనై యుండి యివ్వేరవు( దెలుపకుండిన
సామాన్యులలో గణ్యుండ నగుదు నితండు మదీయవచనంబులు వినియెనేని
మే లట్లు గాక దుర్బుద్ధియై మదీయస్థానహానిపర్యంతంబు( దలంచిన(
దలంపనిమ్మని నిశ్చయించి యాసృగాలంబు శార్దూలంబున కిట్లనియె. 282

తే. ఎలు(గులకు వేరువిత్తు దుప్పులకు గండ
మేదులకు మిత్తి లేళ్ళకు నెదురు చుక్క

1. భయప్రదభాషలు 2. సనూచారంబగు

కాసరంబుల పాలిటి కంటి నొప్పి
యసదు గాదు గదా భవదన్వయంబు. 283

చ. అలవి యెఱుంగ కొక్క పులి కల్గిన వాఁడయి భీతిఁ జెంద య
క్కొలఁకుల పగఁ దీర్చుకోఁ దలఁచి కోదె వయాళి వజీరుఁ డెప్పుడున్
మెలఁగెడు వ్యాఘ్రచర్మమను మీ నెఱడాగు ధరించి శూరతా
కలన భవత్కులంబునకుఁ గల్గదు జోడు మృగాన్వయంబునన్. 284

క. భిన్నేతరమగు సకలస
మున్నతవిభవాభిజాత్య మున్నదె కద ని
న్నెన్నుతఱిఁ గొంచగాఁడవె
యన్నన్న నఖాగ్రనిర్జితారివి గావే! 285

తే. ఇట్టి నీవొక్క భామ యేమేమొ పలికె
ననుచు వెఱచితి నను టెల్ల నరయ నాకు
బుద్ధి శోధింపగాఁ బోలుఁ బొసఁగ దొరలు
తలఁప సేవకహృదయభేదకులు గారె! 286

తే. కాక వెఱచినమాట నిక్కంబ యేని
నేఁడు నీవంక శార్దూలనికరమునకుఁ
జెల్లఁబో మాంసకబళంబు బెల్లమయ్యెఁ
బ్రాంత పరివారముల నోట బగ్గిపడియె. 287

క. మనుజాంగన యట! తనయుల
కనవరతముఁ బులులఁ ద్రుంతు ననెనట! యిదియే
వినినంత శరీరముతోఁ
జనుదెంచితె ? యకట! నీదు శౌర్యము గూలన్. 288

తే. రమ్ము నావెంటఁ గొంత[1]దూరమున నుండి
దంటతనమునఁ నను వెన్నునంటి చూడు

1. దూరమ్ము వెనుక

నీకుఁ గైకాన్కఁ జేసెద నేఁడు దానిఁ
దత్తనూజుల కంఠరక్తంబుఁ గ్రోలు. 289

క. అన విని శార్దూలంబను
విను మిచ్చటఁ బ్రేలవచ్చు వెసదానిఁ గనుం
గొనినంత మాట వెడలునె
నినుఁ బోఁటికి నేనెఱుంగనే నీ బలమున్. 290

క. తగిలించుకొన్న పిమ్మట
నిగిలించుటె కాని కార్యమేమున్నది యా
మగువఁ జననిమ్ము పోవుద
మగునె యసాధ్యమున [1]సాహసాదృతి సలుపన్. 291

క. చలమున నది పైఁబడినం
[2]జాలుకనివాఁడ నని యుఱుకఁ జూతువు మఱి మాం
సలదేహుఁడ ధావనచే
నలసితిఁ బరువెత్తఁ జాల నౌనిట మీఁదన్. 292

క. నావుడు గోమాయు వనున్
నీ విటు [3]తప్పించుకొన గణించెదు కాయం
బీ వగల దాఁచికొని యా
హా! విను మెన్నేండ్లు బ్రదుకుదయ్య మృగేంద్రా! 293

క. బలవన్మృగమంత్రుల యెడఁ
దలవంపుల కోర్వలేక తఱిమెద మదిలోఁ
దలఁపకు బహుభీతిని తె
మ్మలఘుపరాక్రమ మొనర్ప నందుం గిరుల్. 294

1. సాహసంబులు 2. జాలుకనివాఁడగుట 3. ప్రాణంబుభీతి వెంతయు కాయం

క. నను నమ్మవేని యిచ్చటి
[1](నన తీఁగెలు) చుట్టి పెనఁచి నాకు స్వీకుం
బెనవై చికొమ్ము రమ్మిఁక
నినుఁ జూచిన నవ్వధూటి నేలం గూలున్. 295

తే. అనుచు నక్క నిజాధీశు నతులశౌర్య
మెనయ బోధించి పెనవై చికొనుచుఁ దెచ్చెఁ
గురుబలావళిఁ జేర నుత్తరుని ధైర్య
శోభితుని జేసి తెచ్చు నర్జునుఁడు వోలె. 296

క. ఈ లీల వచ్చు నా శా
ర్దూలసృగాలముల భయముతోఁ గనఁ జేయం
జాలుట గలహ ప్రియ కిం
కేలాగునఁ గలుగవలయు నిందునిభాస్యా! 297

ఆ. అనుచుఁ జిలుక వలుక నా ప్రభావతి యిట్టి
యవగడంబు మాన్ప నది యెఱుంగు
నిపుడు నీవెఱుంగు దింతియే కాని యీ
తెంపు వగలు మాకుఁ దెలియ వనిన. 298

శా. కీరం బిట్లను నట్లు ఘోరతరభంగిన్ వ్యాఘ్రిగోమాయువుల్
చేరన్నాఁ దిలకించి యవ్వనిత కించిద్భీతియు న్లేక ధై
ర్యారూఢిన్ మృగధూర్తముం బలుకు నాహా! సత్యవాక్యత్వ మీ
దేఱన్ దబ్బఱకాఁడ వై తిగద యింకేరీతి సైరింపుదున్. 299

తే. పులుల రెంటిని దెత్తు నీ పుత్రయుగళ
మునకు నని నమ్మిక లొసంగి పోయి యిప్పు

1 వనితీఁగెలు (పూ)

దౌక్క శార్దూలమును దెచ్చి యొప్పగించె
దొల్లఁబో కాన నేఁడు నీయుసుఱు గిసురు. 300

మ. అనుచున్ దిగ్గున లేచు దానిఁ గని యావ్యాఘ్రేంద్ర మౌరౌర! భ
ద్రమన సేసెం గద నక్క యెక్కరణి నమ్మన్వచ్చు నంచు న్భయం
బున దాని న్వెస నీడ్చి కొంచుఁ బఱచెన్ భూభాగ మల్లాడఁగాఁ
దనకంచుం బరువెత్తుచోఁ గలవె కాంతావంచనాసంపదల్. 301

క. అనఁ జిలుక కా ప్రభావతి
మునుపటి వగ కన్న నధికముగ వెఱపించెన్
వినుమా కలహప్రియ యిం
త నిరూఢంబైన నేర్పు దానికె చెల్లున్. 302

వ. అనిపలికి విరహిజనమథనంబున[1] మనసిజుండు పట్టించు ధర్మదారోదయంబునుం
బోలి మిక్కుటంబగు కుక్కుటారవంబున నరుణోదయం బగుట
యెఱింగి యక్కురంగనయన యంతఃపురంబునకుం జనియెఁ దదనంతరంబ.
303

క. వనజరుచిఁ గొనఁగ సమయం
బను చోరుఁడు రోదసీగృహముఁ జొచ్చి భయం
బునఁ బఱవ నడఁచు దీపం
బునఁ బోల్పంబడుచుఁ బొద్దు పొటుకునఁ గ్రుంకెన్. 304

## పదునెనిమిదవ రాత్రి :

చ. ప్రవిమలమౌక్తికంబుల తురాయి నిగన్నిగలన్మెఱుంగు చ
న్గవ మను గెంపుదండల ధగద్ధగలన్ బయలొందనీక నీ
లవసనపు న్ముసుంగు పొదలంగఁ బ్రభావతి వచ్చె న త్తఱిన్
గవిసెనలోపలం జకచకల్గల దర్పణలక్ష్మిఁ గేరుచున్. 305

1. దనిసి మనసిజుండు

క. పచ్చుటయు నిచ్చలంబున్
బచ్చలపంజరము వెదలి పడఁతీ! యిదె యే
నిచ్చట నున్నానని యను
పచ్చని విలుకాని తేజిఁ బరికించి వెసన్. 306

క. నిన్నటి కథ మఱి యింకను
నున్నదియో యుండెనేని యుచితవచస్సం
పన్నతఁ దెలిపెదె గ్రక్కున
నన్నరపతి పొందు నేఁటికైన న్వలయున్. 307

క. అన శుక మిట్లను గుతుకం
బునఁ గథ కొదవ యన నెంత మూఁడే మాటల్
విని పొమ్ము పోయి యచ్చట
జనపతి రతిఁ జొక్కి తామసము చేయకుమీ. 308

మ. అని యాశావశఁ జేసి యా శుకసుధాశాధీశ మీశానశి
ర్షనదీశోభితు శేశయాంతరరసశ్లాఘావిశేషాపనో
దనశీలాతివిశాలశీతలగుణోదారోక్తిధారానిగుం
భనగంభీరము గాఁగ నిట్లనుచుఁ దెల్పం జొచ్చె నచ్చెల్వకున్. 309

క. కాంతా! వింటివెకద వి
భ్రాంతపుఁ బులి నక్కఁ గొనుచుఁ బఱచుట మునుపే
యంతం గలహప్రియ త
త్కాంతారము వెదలి తల్లిదండ్రులఁ జేరెన్. 310

శా. నిర్దాక్షిణ్యమనస్క యవ్వనిత యందె న్వెంటనే యంచుఁ ద
చ్ఛార్దూలం బతిభీతిఁ [1]బాఱెను లతాసంబంధమౌట న్మహా
దుర్దాంతోగ్రశిలాభిఘాతవిగళద్ఘోరాస్రధారాతిస
మ్మర్దాధ్వంబగు నక్క నీడ్చుకొని సంభ్రాంతాన్యజంతుత్వరన్. 311

1. బాఱె లతికాసంబంధ

క. ఈరీతిఁ బఱచి పరచిం
తారంభము మఱచి ధావనాయాసమునన్
నోరెండ నిలిచె నొక కాం
తారమునం బిఱికి గుండె తటతట యదరన్. 312

క. నిలిచి దగదీర్చుకొని హె
చ్చిలు కోపముతోడ నింత చేసిన దీనిం
దల ద్రవ్వుక ద్రిమింగెద నను
తలఁపున జంబుకముఁ గ్రూరతరముగఁ జూచెన్. 313

క. అప్పుడు సృగాల మద్దెసఁ
దప్పించుకొనంగ నేమి తలఁపఁగ వలయుం
జెప్పుము ప్రభావతీ ! యన
నప్పలుఁగున కా సుధాకరానన పలికెన్. 314

తే. కాలిసంకెల లతికానికాయబంధ
మప్పలి యటన్న నాగ్రహవ్యగ్ర మించి
జాఱిపోరాదు సాంత్వనసరణి కూడ
దెట్లు తప్పించుకొను నక్క ? యిట్టి యెడను. 315

వ. కావున సృగాలంబునకు శార్దూలవదనగహ్వరంబె యవశ్యంబు భావ్యంబని తలంచెదఁ గాని తత్ప్రాణగోపాయనంబునకు నుపాయంబు దోఁపదు మదీయ శేముషీవిశేషం బింతియ, యనంతరకథావృత్తాంతంబుఁ దెల్పుమనినఁ గీరం బిట్లనియె. 316

క. ఇది దెలియకున్న బుద్ధికిఁ
గొదవనుట ల్గాదు జారుఁ గూడఁగఁ జను తో
యదకచ కిట్టి విపద్దశ
యద నెఱిఁగి యదంపవలయు నని యనుట చుమీ ! 317

క. అవ్వలికథ వినుమా యెల
జవ్వని ! యారీతిఁ జూచు శార్దూలపతిన్
నివ్వెఱఁ గనుఁగొని జంబుక
మవ్వేళకు నొక యుపాయ మాత్మం దోఁపన్. 318

మ. పులికిం గేలు మొగిడ్చి పల్కు విను మంభోరాశిగంభీర ! నా
పలుకుల్ ద్రోహ మొనర్చెరా యనుచు నాపైఁ గోపమే కాని రాఁ
గల కార్యం బెఱుఁగంగలేవు సముదగ్రక్రోధయై యావధూ
తిలకం బిచ్చటి కేఁగుదెంచుఁ దనుజోద్రేకక్షుధల్ మాన్పఁగన్. 319

క. మన మున్నచో టెఱుంగునె
యని తలఁప న్వలవ దుపలహతి గళితాస్మ
త్తనురక్తధార స్రోవం
గనుఁగొని యదె యడవి జాడగాఁ బఱతెంచున్. 320

క. మున్నొనరించిన నేరం
బెన్నకు తత్ఫలముఁ గంటినే కద యిఁక మీఁ
ద న్నీకు శుభ మొనర్చెద
నన్నరయకు మింక పంచచాపరుఁ గాఁగన్. 321

క. పెనఁ ద్రెంచి యెచటి కేనియుఁ
జనుమా శార్దూలహంత్రి జాడమెయిం గ్ర
క్కున వచ్చిన నినుఁ బొరిగొను
ననఘా ! జైవాతృకత్వ మందుము నీవున్. 322

క. అని పలికినపుడె నఖములఁ
బెన పటుకునఁ ద్రెంచి వైచి బెబ్బులి పఱచెం
జనియె న్నక్కయు వేఱొక
ఘనమున నటుం దెలియ ఖింటిషా తైలిగంటీ ! 323

క. అనినఁ బ్రభావతి నివ్వెర
గున బ్రమ్మవడి యుండి తెలిసికొని చిలుకా! యీ
యనపాయోపాయస్థితి
నను నడిగిన నాకుఁ దెలియునా యెంతైనన్. 324

క. అని యంతఁ దెల్లవాఱుటఁ
గని యంతఃపురము సేరెఁ గాంతామణి యా
దినకరబింబము గ్రుంకిన
దను కాకీరమణి యొప్పిదంబున నుండెన్. 325

## పందొమ్మిదవ రాత్రి :

క. అంతటఁ జీఁకటి గని య
క్కాంతామణి నృపతిఁ జేరఁగాఁ బోవు తమిం
జెంతకుఁ జేరినఁ గనుఁగొని
కంతుని నెఱతేజి ముద్దుగాఱఁగఁ బలికెన్.  326

తే. ఎంత వేగిరమమ్మ పూర్ణేందువదన!
మాటుమదిగినఁ జనుమ యమ్మనుజవిభుని
ధామసీమకు నిపుడు నందాఁక నొక్క
యమలతరమైన కథ విను మనుచుఁ బలికె. 327

## పన్నెండవ కథ

క. ధరపై రాజపురంబునఁ
బరఁగెడు నొక రెడ్డి గలఁడు పరహితనామ
స్ఫురితుఁడు కృషికార్యధురం
ధరుఁ డలరున్ హాలికావతంసుం డగుచున్. 328

క. ఆరెడ్డి కిద్ద ఱాం్రడు ప
ఘోరుఘాభాణుని శరంబులో ఝన్నఁగా శ్యం

గారిణియు సువేషయు నను
పేధుల మెలఁగుదురు సొంపు [1]పెంపెసలారన్. 329

తే. చెలువుఁ దెప్పుడుఁ బగలెల్లఁ జేసి పనులు
కోరి మెలఁగుట రేలెల్లఁ గుంభకర్ణ
నిద్రఁ బొల్పడి రతికి సంధింపకునికి
వార లిద్దఱు గడిదేఱి జారలైరి. 330

ఉ. చామనిమేనులు న్ననుపుఁ జల్లెడు మోములలోనఁ గల్గు బల్
గోములు మానవుం బొడవులుం బిడికింట నడంగు కౌనులుం
గోమలబాహువు ల్మరులు కొల్పెడు చూపులు ముద్దుమాటలుం
గాముని కొక్కి చేవ యెసఁగ న్విహరింతురు వార లిద్దఱున్. 331

సీ. గొంటుపూసలు రెండుగుండ్ల ముంగరలు మై
జారుచీరలు పెనసన్నగొలుసు
పెద్దమట్టెలు మట్టిపిల్లాండ్లు బొబ్బిలి
కాయ లొత్తులతోడి కడియములును
గప్పుపల్వరుస లుంగరములు తూలెడు
కొంగులు బలుచెంపకొప్పు లంచు
కమ్మగవ ల్సన్నకాటుక రేకలు
నాభినామంబులు నానుచుట్లు
పసుపుఁబూఁతలు గుబ్బలబాగు దెల్పు
బిగువుఅవికెలు చిగురాకుఁబెదవు లంటు
పిడియపుఁగప్పు లెప్పుడు వెలయ రతుల
బేరమాడును కాఁపుగుబ్బెతల జోడు. 332

క. పసుల కొడల్వఁగక కా
మిను లిద్దఱుఁ గూడి గోళ్ళుమీటుచు దాదుల్

1. ఝెంపలఝారన్,

దినదినము మిసిమి యిడఁగాఁ
గనుపింతురు గున్నగచ్చకాయల శరణిన్. 333

చ. దిటమున రెడ్డి పాటుపడి తెచ్చి ముదంగను గూటిఁ బొద్దుసం
కటి తటి వెన్నమజ్జిగలు కంకటిపైఁ బవలింటి నిద్రలున్
బెటుకులుఁ జెల్లిరా [1]సొబగు వెట్టుచు మన్మథకేళిమీఁద నె
క్కటి వడి జారసంగమసుఖంబునకే తమకింతు రిద్దఱున్. 334

చ. పెనిమిటి చేనిపాటుపడి పేర్చు శ్రమంబున నింటి కేఁగుదెం
చినతఱి దాలితోఁ గపయిఁ జేర్చిన కాఁగులనీరు మజ్జనం
బున కమరించి దేవతలపట్ట మొసంగుచు బొడ్డుగిన్నెలో
నుసుతురు రాగిసంకటి తలోదరు [2]లద్భుతభక్తిఁ జూపుచున్. 335

ఉ. ఒక్కతె రెడ్డి ప్రక్క వినయోక్తుల వింతలఁ గౌఁగిలింతలం
జక్కిలిగింతల న్మెఱసి జంతతనంబునఁ బ్రొద్దుపుచ్చుచో
నొక్కతె జారుప్రక్క మెలుపొందినచెక్కులఁ జూపు చొక్కుల
న్మిక్కిలి చొక్కుచు న్మదనునిం జరితార్థునిఁ జేయు రాత్రులన్. 336

చ. చెలువుని ముందట న్పతి చిక్కినఁ బోరు ఘటించి లేని యా
సులు ప్రకటించి మోసమునఁ జొచ్చెద రొండొరుమీఁది చాడిమా
టల మఱి మాటమాట జగడంబులు చూపి పతండు వోయినం
గలకల నవ్వుకొంద్రు తమ కౌశల మాతఁ డెఱుంగలేమికిన్. 337

క. ఈరీతి నుండి యొకనాఁ
డారెడ్డన పసికిఁ దలుగు లమరించుటకై

1. సొగసు 2. లిద్ధఱు తద్భక్తితోన్.

నారలు గావలెనని పొరు
గూరికినై[1](పోయె)మట్టియూడలు దేరన్. 338

వ. తదనంతరంబ. 339

చ. చిటిపొటిమబ్బు లాకసపుసీమఁ గనంబడ గొప్పగొప్పలై
పటపటమ్రోయుచు న్నళినబాంధవబింబముఁ గప్పికొంచుఁ జీఁ
కటి ఘటియించి యధ్వగనికాయము బెండగిలం దటిల్లతా
కుటిలతఁ గొంచెపాటి చినుకు ల్దొరఁగించె ధరాతలంబునన్. 340

క. అనవధివనధివిహారం
బున నధికవ్యథల కర్శ్యమును బొందు తఱి
న్మనసిజుఁ [2]దేయు శరంబుల
యనువున నవ్వేళఁ జినుకు లడరెన్ నదులన్. 341

సీ. గొంగడి ముసుఁగుతో గొల్లలు చట్రాతి
పైని బందారాకుఁ బఱచికొనఁగ
నాలమందలు మేఁత కరిగి యేతెంచి యం
బారవంబులతోడ మంద గొనఁగఁ
బొదుఁగు దూఁటుల మాని యొదిఁగి క్రేపుల గుంపు
జననీనికాయంబు చాఁటుఁ జేర
నొకటి నొక్కటి చూచి యుఱికి మేఁకలు చెట్టు
నీడల గుమిగూడి నెమరు వెట్టఁ
దనరు నంబుదకాండవేదండయూథ
గర్జితోర్జితభూరిభూత్కారగళిత
వమధుశీకరవారదుర్వార [3](మయ్యెఁ)
జలువతెమ్మెర లేతేర సన్నతూర. 342

1. పోయి (పూ) 2. డేసెడి శరములు 3. మగుచుఁ (పూ)

తే. అప్పు డాకాఁపువలిగుబ్బలాండ్రు పథికు
[1](లుసు అను) ముసురుకొన్న యమ్ముసురులోన
రాఁడు పతి యంచు నిర్భరరతులఁ దేల
మందిరమునకుఁ దెచ్చిరి మాఱుమగల. 343

తే. తెచ్చుకొని యిచ్చలోపల హెచ్చు కోర్కు-
లెన్ని గల వన్నియును దీఱ నెనసి చతుర
రతుల కఱువునఁ బడినట్టు లతులసౌఖ్య
వారినిధిఁ దేలుచుండిరి వార లంత. 344

క. పరహితుడు మిన్నుఁ గనుఁగొని
దురుసౌ నిఁకమీఁద వాన తూర ల్నిజసుం
దరు లెదురెదురే చూతురు
మరుబారికిఁ జిక్కి- కాన మగుడన్వలయున్. 345

క. గ్రక్కునఁ జని యక్క-ఱతోఁ
జక్కెర విలుకాని కేళిఁ జతురుఁడనై నేఁ
దక్కాంతల నిద్దఱ నిరు
ప్రక్కల నునిచికొని మేలు వడసెద ననుచున్. 346

క. తలపై నూడల మోపును
మొలఁ గత్తియు నింటి మీఁది మోహము మదిలోఁ
దలకొనఁ జలికిఁ జలింపక
బలు బూతము వోలి పెద్ద పరువున వచ్చెన్. 347

తే. వచ్చి యాత్మీయమందిరద్వారసీమఁ
దెప్పునను మోపు వైచిన చప్పుడు విని
నరకఁ డదె వచ్చె ననుచు నొండొరులతోడ
గుసగుసలువోయి రాతని కూర్మి సతులు. 348

1. లుసుఱుమన (పూ) గణభంగము

వ. ప్రభావతీ! యనిర్గమసావకాశంబగు నిజగృహంబునం దల్లడిల్లు నుపవల్లభుల నప్పల్లవాధర లెవ్వడువున వెడలింపవలయు నిది యెఱింగిన యంగనలకుం బరపురుషసంగమంబును బతిప్రమోషంబును సులభం బగునని పలికినం దెలుపనేరక వెలవెలంబాఱు నమ్ముద్దియ నెమ్మొగంబుఁ గనుఁగొని యయ్యనంగతురంగం బవ్విధంబును నేన తెలిపెదనని యిట్లనియె. 349

సీ. ఆరీతిఁ బతి వచ్చెనని వేగ శృంగారి
ణీవధూటి సువేషతో విచార
మేటికి నీవు కవాటంబుఁ దెఱచి [1](లో
నికి వాఁడు రాకుండ) నేర్పు తోడఁ
గడప కడ్డము గాఁగఁ బడి నివ మాడుము
కొదవ కార్యము చూచికొనఁగ వచ్చు
నని యుపదేశింప సది యట్ల సేయ వి
భ్రాంతుఁడై నిల్చిన భర్తఁ జేరి
మట్టి యూడల నుండి యమ్మగువ మీఁద
గాలి సోఁకెనొ యనుచు శృంగారిణి యన
నంతలోన సువేష దంభాతిరోష
ఘోషయై వానిపైఁ బండ్లు గొఱికికొనుచు. 350

శా. ఓరీ! నాపదమైన మట్టి మదరేఖోద్వృత్తి ఖండించి తీ
వేరా యిప్పుడె పోయి మ్రొక్కుబడిగా నీ యూడ లాచెట్టునన్
ధీరోదారతఁ గట్టి రార! మదిలో దేవేరిపైఁ గోర్కె నిం
డారం గల్గిన నన్నెఱుంగవె పిశాచాధీశవిఖ్యాతునిన్. 351

క. అన విని పరహితుఁ డాత్మన్
వనితామణి బ్రదికియుండినం జాలు వటా
వనిరుహము కడకు నిట పో
యిన నేమగు ననుచు దాని కెఱఁగి వినీతిన్. 352

1. వాఁడింటికి రాకుండ (పూ) యతిభంగమ్ము.

క. ఇదె మఱ్ఱి మీఁద నిడి వ
చ్చెద నూడ ల్నేర కేను జేసిన సేఁతల్
మది నుంచకు వటభూరుహ
విదితనివేశా ! పిశాచవిబుధాధీశా ! 353

క. అని యతఁడు [1]మఱ్ఱిపైఁ ద్రొ
క్కున నిదఁ జన మారుకేళి కొదవల్దిఱిఁ
బనిచి రుపనాయకుల నం
గన లింక నిటువంటి నేర్పు గావలె నీకున్. 354

ఆ. అనినఁ జిలుకఁ జూచి యాప్రభావతి చెల్ల !
నే నెఱుంగ నయ్యె యిట్టినేర్పు
లిద్ద ఱగుట వార లింత చేసిరి గాని
యొకతె కెట్లు గూడునో శుకేంద్ర ! 355

ఇరువదియవ రాత్రి :

మ. అని యకోఁ్కమటి కొమ్మ దేవనిలయప్రాంచన్మహామర్దల
ధ్వనిచే వేగు టెఱింగి య త్తతి నిశాంతం బొంది యాసంజ సం
జనితానంగశరా ర్తి వేఁగుచుఁ దమిస్రస్ఫూ ర్తి వీక్షించి త
జ్జనపాలాయతనంబుఁ జేరఁ జనుచో శౌ కేశ్వరం బిట్లమన్. 356

## పదుమూఁడవ కథ

ఉ. అక్క పరాకు నీకుఁ బ్రమదా ప్తి ఘటింపఁ దలంచి పల్కు దే
నొక్క కథో త్తమంబు విను ముజ్జయినీపురి నొక్క జెట్టివాఁ
డుక్కునఁ దీరినట్లు కఠినోగ్రశరీరముతోడ మీఱు నే
దిక్కున మాఱులేక బలదేవుఁ దనం బలుపేరు దాల్చుచున్. 357

1. మఱ్ఱికై ద్రొ, క్కునఁ జనఁ దమ మారుకేళి

సీ. శీర్షవర్తులశిలాస్థిరమైన కేకినాఁ
జిన్నారి పొన్నారి సిగ పొసంగఁ
దను మేరుగిరి మీఁది తరుణాతపంబునాఁ
బలుచని [1]పట్టు దుప్పటి యెసంగఁ
గమనీయముఖచంద్రుఁ గబళించు చిల్వనా
దంబైన బవిరి గడ్డము చెలంగ
[2]బాహుభుజంగమపతి నాలుక యనంగఁ
[3]జేత సాణాకత్తి చెలువు మీఱ

మ్రోల వీణయు సాధన మురవునడలు
బిరుదుటందియ వెంబడి పిల్ల జెట్లు
నమర దొర కొల్వుచేసి గేహమున కేఁగు
మత్తరిపుశైలధంభోళి మల్లమౌళి. 358

క. *ఘనశ్రీఁ బొందియు నాతఁడు
దినదినమును గొంతకొంత దిరుగుచు రాఁగాఁ
దనవారు శత్రులైరటఁ
గనుఁగొనఁగా వాని లక్ష్మి కడ చనిపోవన్. 359

సీ. ధనవారములు చోరతతుల పాలయ్యెను
సొమ్ములు కుదువను సొగిసి చనియె
గాదెల ధాన్య మెల్కల కయ్యె గుత్తకై
యొనసిన గ్రామంబు లెల్ల నెండె
నప్పు లిచ్చిన చోట నటమటించిరి డాఁచి
కొనిన పత్రంబులు చినిఁగిపోయె

1. మట్టి (పూ) 2. సను మదాహిత వ్యథాస్పద మృత్యు జిహ్వానా
3. నతులితంబైన శాతాసి మెఱయ

* ఈ పద్యము మద్రాసు ప్రా. పు. భాం. వ్రాఁత ప్రతులలో లేదు.

వాడకంబులు గొన్నవార లేఁగిరి తోఁట
        లెల్లను బరులచేఁ గొల్లవోయెఁ
గప్పదం బెల్ల గాలిచేఁ గదిలి యురియు
నింట దొర్లెడు కుండలు నినుపకట్ల
మానిముంతలు నిలిచె నమ్మల్లపతికి
వార్ధికన్యాకటాక్ష మవ్వలికిఁ జనిన. 360

వ. ఇవ్విధంబున నక్షుద్రదరిద్రత్వంబు వహించియు నతండు కుటుంబభరణాదరుండై. 361

ఉ. మాసికవైచి కుట్టిన రుమాలును జాలని దట్టి బట్టియు
న్మాసిన [1]యెడ్డె దుప్పటి దనర్పఁగఁ గోమటివారిఁ జేరి శం
కాసమవాప్తి నొల్ల మనఁగాఁ దనుమర్దన మాచరించుచుం
గాసును గీసు దూసికొనుఁ గాని విడం దతఁ డేమి చెప్పుదున్. 362

ఉ. కూలికి నూనె లంటి కలగూరలకై పొలమెల్లఁ జుట్టి పా
ల్మాలక యాత్మబంధుజనులన్ దరియం జని ప్రాఁతబట్టకై
కూళతనంబునం బ్రభులకుం దనుమర్దన మాచరించుచున్
వ్రాలుడుప్రొద్దుతోడ గృహవాటికిఁ జేరు నతండు నిత్యమున్. 363

క. ఈరీతి నుండు నాతని
గారాబు మిటారి తలిరుకైదువుల దునే
దారి కటారి సులక్షణ
పేరింటి వధూటి లేమి [2](బిమ్మిటి) గొనుచున్. 364

తే. కుడువఁ గూడును గట్టుకోఁ గోక లేక
యితని కిల్లాలినై యుండనేల యనుచు

1. పేటు దుప్పటి 2 (బిమ్మట (పూ)

సొగసు గనిపింప వల్లంబుఁ జూపి నిలుచు
జారులకు నయ్యెయారి యాస్పద మొసంగి. 365

ఆ. కలిగినప్పుడెల్లఁ జెలువుని చెంగట
నడఁగి మడఁగి యుండు టరిది గాదు
చేరి లేమియప్పు డారీతి నుండెనా
యది పతివ్రతాజనాగ్రగణ్య. 366

క. ఈలీల జారరతివాం
ఛాలాంఛన మొంది పింఛసమకచ వికచ
ల్లోలస్వాంతత సద్గుణ
శీలుం బ్రేమ గల మగనిఁ జేకొన కలరున్. 367

సీ. చేయప్పు లడిగి తెచ్చెదనంచుఁ జని కాంచుఁ
గోడెమిండని తప్పుకోలు మ్రొక్కుఁ
జెలువులో నీళ్ళు తెచ్చెదనంచుఁ జని తెల్పు
నుపభర్తకాత్మవియోగవహ్నిఁ
జీర చాకింటఁ దెచ్చెద నంచుఁ జని చేరుఁ
దరుణపల్లవుఁ డున్న తాపిచోటుఁ
జిక్కంటె యెరవు దెచ్చెద నంచుఁ జని యిచ్చు
గమనాతురున కింపు కౌఁగిలింపు
నిట్లు జారోపభుక్తయై యేఁగుదెంచి
మగఁడు విన లేమి చెంగట మందిరంబు
వెడలి తిరుగాడ వలసె నిప్పాట విధిని
దూఱవలదా యటంచుఁ గన్నీరు నించు. 368

చ. పుర మిది చూడ నింత చెడిపోయె నయో! మఱి యాఁడుతోడఁ బు
ట్టరె ననువంటి సాధ్విని బడాపగలం గనుఁగొంద్రు జారు లె

వ్వరు గనుఁగొన్న లేమిఁ దలవంచి రయంబున వత్తునమ్మ యో
పొరుగుపొలంతి! యంచుఁ బువుఁబోఁడి యను న్విభుఁ డాలకింపగన్. 369

క. పడియుండఁ గంటినని యీ
[1]యెడల న్మామేనమామ యిచ్చె నటంచున్
బడఁతి యుపనాథుఁ డొసఁగిన
తొడవులు చీరలు ముదంబుతో ధరియించున్. 370

తే. నీవు మఱి యింటిలోన గుం డించుచున్నఁ
గడుపు నిండునె దొరఁజేరి గ్రాస మడుగు
పొమ్మనుచుఁ బల్కు నాథు నప్పొలఁతి జార
కాంతుఁ బొందుటకై సందు గలుగవలసి. 371

క. ఈగతి మెలంగు నంగన
లా గా బలదేవుఁడెఱిఁగి లలనా! రావే!
బాగాయెం గదఁ చిన్నెలు
నీ గరితతనంబుఁ గంటి నే నివ్వేళన్. 372

ఉ. ఓసి గయాళికాన! నను నుగ్గు నెఱుంగవె రోసమెత్తినన్
దోస మెఱుంగ వీటఁ గల తొయ్యలు లెల్లను గుంపుగూడి సం
త్రాసము చెంద నీ గళము రాట్నమునన్ బిగియించి యొంతునో?
కోసుకతిందునో? యనినఁ గోమలి నిశ్చలధైర్యధుర్యయై. 373

ఉ. గొంటుఁదనంబునం గులుకు గుబ్బల పయ్యెద చక్కఁ జేర్చి యే
మంటివి నన్నువంటి సుగుణాకరకా చెడుబుద్ధి? లెస్సగాఁ
గంటివి గాక నాదునడక ల్కలగంటివొ? కల్మివోవ వె
న్వెంటనె పోవునే మఱి వివేకము లోకములోనివారికిన్. 374

1. యెడరున మామేనమామ

ఉ. లేపడిమీఁద బానిసలు లేని కతంబున నూరకుండినం
బోవమి నప్పసప్పలకుఁ బోవుట వేఱుగఁ దోఁచె నేమొకో
కావలె నట్టులైన నవుఁ గాదన నేటికి నేఁటినుండి నా
థా ! వెలికేఁగఁ బ్రాణవిభుఁ దల్గినకార్యము సేయవచ్చునే. 375

తే. ప్రతిన వలికెద నేను నీ పాదమాన
యకట! మోసంబు లేదు కొండంతపనికి
నైన బతిమాలి నీవు పొమ్మన్న వెడలి
పోవ నూరకయుండు మీ పోరు చాలు. 376

క. అన విని ముదితల హృదయము
గని యెఱుఁగమి నతఁడు నిజముగా నెంచెం ద
ద్వనితయును మదనవేదన
దినశేషముఁ దీర్చె యుగముఁ దీర్చిన రీతిన్. 377

చ. లకుచకుచాలలామ శుభలక్షణలక్షిత కౌతుకప్రదా
యకమగు జారుఁ గోరు దరహాసము మీసముమీఁదికేలు నా
త్మకుఁ దమిఁ గించు మొక్క వగతక్కులు చెక్కులు లేని మోహ మూ
రక కలహించి మించు పెనురాపులు చూపులు నేచ నెమ్మదిన్. (?) 378

ఉ. ఎప్పుడు పోదుఁ ? బోయి హృదయేశ్వరుమాటలు వాని కెప్పుదేఁ
జెప్పుదుఁ ? జెప్పి వాని మదిఁ జిత్రపుమోహముచేత నెప్పుడేఁ
గప్పుదుఁ ? గప్పి వానియెద గబ్బిచనుంగవచేత నెప్పుడేఁ
గుప్పుదుఁ ? గుప్పి వాని రతి గోరుట యెప్పుడటంచు నెంచుచున్. 379

వ. ఇవ్విధంబున నూహించుచు నాచంపకగంధియు నొక్క యుపాయంబు
పెంపున. 380

ఉ. ముంగిట నిల్చి యో పొరుగు ముద్దియ! నాపతి నెత్తి మాసె నే
నంగడి కేఁగలే నిపు డహర్ముఖ మౌతఱిఁ దెచ్చి యిచ్చెదం
జెంగటి గోడఁ జేరి యొక చిట్టెడునూనె యొసంగలేవె య
భ్యంగ మొనర్తునం చడిగి [1]యాకె యొసంగఁగఁ దెచ్చి వేడుకన్. 381

మ. తలమాసెం గద రంగదాప్తకులయూథా నాథ ! నాధన్యతా
కలనాధర్మము[2]చే నసంఖ్యముగఁ బ్రేంఖద్వైభవారోగ్యముల్
గలుగం [3](గాంతువె) యంచుఁ దేనియలు చిల్కంబల్కి యక్కల్కి వె
న్నెలలో నాయకు నుంచి నిల్చి తలయంటెం దాశమానంబులన్. 382

తే. ఇట్లు తలయంటి యటకలి యిడి సులక్ష
ణాసరోజాక్షి యిఁక నెట్లు నాథ! జలము
తెరలి యున్నది దొరలింపఁ దెచ్చికొనఁగ
బాగుగా దూరియవ్వలి బావినీళ్లు. 383

క. ఏ నరుఁ రాదు గద నీ
పైనానలు [4]పెట్టుకొనుటఁ బడుపాటులు గా
కేనాఁటి వారికైనం
గాని గేహమున బావి గలుగన్వలదే. 384

క. అన విని బలదేవుం డో
వనితా! యానలకు నేమి వచ్చెం బోవే
కొనితేవే జలములు గ్ర
క్కున నీ చలిచేత నిలువఁగూడ దటన్నన్. 385

క. ఓనాథ! సతుల గుణముల
నేనాఁటికిఁ బురుష లెఱుఁగ రే నెచ్చటికిం
బోనేల? నీకుఁ గోపము
రానేల? యటంచు నది పరాకై యున్నన్. 386

---

1. యామె 2. చేత సఖ్యముగ 3. గాంతువె (పూ) 4. పెట్టుకుని

క. బలదేవుఁ దబల నాపైఁ
జలమా? నానేర మెల్ల సైరించి జల
మ్ములు దెమ్ము వేగఁ బొమ్మని
పలుమఱు వేఁడుకొనఁ గపటభయ మెనయంగన్. 387

ఉ. మంచిది నీవు పంప ననుమాన మిదేటి కటంచుఁ బల్కి య
క్కాంచనగాత్రి రజ్జుఘటక్రమకరాంబుజయుగ్మయై కటా
క్షాంచలచంచలాలత యొయారవుఁ గొప్పు మెఱుంగు [1](గుబ్బలు)
న్మించఁగ నేఁగె ముద్దునడ నీటునఁ గూపసమీపభూమికిన్. 388

మ. చని యాచేరువఁ జారుభూరుహలతాసంతానతంతన్యమా
ననవీనాళిలసూనసౌరభనిశాంతంబైన పూఁదోటలోఁ
దన మేకోలున వచ్చి యున్న యుపనాథప్రౌఢు నాథౌకమా
ననిరూఢప్రధిమానురాగ మిగురొందం గూడి క్రీడింపఁగన్. 389

ఆ. అంతరెఁ వేగుఁజుక్క యది చూచి భయ మందఁ
దనరెఁ బక్షిరుతము దాని వినుచు
దగులు పడఁగఁ దూర్పు తెలతెల గావచ్చె
వారి కిట్లు తెల్లవాఱె నంత 390

క. వినుమో ప్రభావతీ! సతి
తన నేరం బెట్లు తప్పదాఁట న్వలయున్
మనమున దీని కుపాయము
గననేరని నారి జార గారాదు సుమీ. 391

క. అని పలుకు చిలుక పలుకుం
గనుఁగొని వైశ్యాంగనాశిఖామణి యిచ్చో
నను నడుగు టుడుగు బెడఁగుగ
ననఘగుణా! నీవె నొడువు మవ్వలి కథయున్. 392

---

1. నుబ్బుల (పూ)

ఉ. నా విని కీర మిట్లను ఘనాఘనవేణి! సనాతనప్రవీ
ణావలిఁ గేరు నీకుఁ దెలియం బడకున్నదె యైన మద్వచః
శ్రీ వెలయింపఁ గోరి తెఁకఁ జెప్పెద నప్పగిదిం బ్రభాతవే
ళావిభవంబు మీఱుడుఁ గలంగుచు జారుఁడు లేచిపోయినన్. 393

ఉ. అచ్చపలాక్షి యింటిమగఁ డంపఁగ నిప్పుడె బావినీటికై
వచ్చితి వచ్చి జారరతివాంఛల నుండితి నింతలోనఁ దా
నెచ్చట నుండి వచ్చె రవి యీతని కెక్కడఁ బ్రొద్దువోదు నా
యిచ్చ గలంగ సాఁగె నిఁక నేమని యేను గృహంబుఁ జేరుదున్? 394

వ. అని వితర్కించి ధైర్యం బవలంబించి యొక్కకార్యంబుఁ గాంచి యీ యపాయంబున కీయుపాయంబ యుచితంబని తలంచి నిశ్చయించి కుంభంబు జలపూర్ణంబు గావించి సరజ్జుకంబుగా దిగవిడిచి తాను మెట్ల వెంబడిఁ గూపంబు లోనికిం దిగ్గి కటీదఘ్నంబులగు జలంబులం గల పడుకు లూఁది ప్రభాతసమయోచితంబుగా వికసించు కమ్మని తమ్మియుం బోలె నెమ్మొగం బెగయించి మీఁదుఁజూచుచు దృశ్యంబగు భయపారవశ్యంబున నున్న యవసరంబున. 395

ఉ. ఒక్క కృషీవలాచలపయోధర నాయకు పక్క నిద్రకుం
జిక్కి విహంగమధ్వనులచే నెడ మేల్కని తాలుమాలుగా
గ్రక్కనఁ గట్టుకొన్న చిటికమ్ముల చీర తగంగఁ దక్కటీ
భాక్కచకుంభకుంభమున బాగొనరం జనుదెంచె నూతికిన్. 396

తే. వచ్చి జలములు చేఁద నవ్వామనయన
యానవాబ్జంబు వాంచి నిజాధినాథు
తోడి పొలయల్కఁ దోయంబుఁ దొలఁగి వచ్చు
వరుణసతిఁ బోలు నమ్మల్లితరుణిఁ గనియె. 397

క. కని మొఱవెట్టినఁ జెంగటి
జను లొక్కట మూఁగ వారి సందడిపలుకు
ల్విని యాఁడువారు సేరం
జనఁదెంచెన్ జెట్టి దట్టి చల్లడములతోన్. 398

తే. వచ్చి నిజభార్య చేసిన వగలు గాంచి
దిగులుపడి మున్నుగా నరుదెంచియున్న
దాని యుపభర్త తోడుగాఁ బూని, వెడలఁ
దిగిచి తోడ్కొని పోయె నమ్మగువ నతఁడు. 399

క. ఏవంవిధచాతుర్యము
నీ వెఱిఁగితివేని మేదినీవరుఁ జేరం
బోవచ్చుఁ బోయి క్రమ్మర
రావచ్చుఁ బ్రభావతీ ! పరాకా యనినన్. 400

క. నాకేమి తెలియుననని య
క్కాకోదరవేణి కమలగంధాంధమరు
త్పాకము రాక నిశీధిని
పోకడఁ గని యంత నంతిపురమున కరిగెన్. 401

**ఇరువదియొకటవ రాత్రి :**

క. చని దినమను వననిధి నీఁ
దిన యదియై రాత్రిపేరి దీవిం గని య
వ్వనజాక్షి యాఱడిలి నృపు
[1]నెనయఁ జనుదేఱఁ జిలుక యిట్లని పలికెన్. 402

1. నెనయంగాఁ బోవ

శా. కాంతా సంతసమయ్యె నామది వధూకందర్పుఁడౌ యద్ధరా
కాంతుం జేరఁగ నుత్సహించియును మద్గాథాసుధాలోలుప
స్వాంతత్వంబునఁ జేరవచ్చెదు భవత్సౌలభ్యసాద్గుణ్య మే
నెంతంచు న్గొనియాడ నేర్తు మఱి నీవే నీకు జోడిమ్మహిన్. 403

క. *క్రమ్మఱ నొకకథఁ దెలిపెద
ధమ్మిల్లోత్ఫుల్లకుసుమదామంబులపైఁ
దుమ్మెదలు చిమ్మ రేఁగం
గొమ్మా తలయూఁచి మెచ్చికొమ్మా పిదపన్. 404

## పదునాలుగవ కథ

చ. అని తెలుపందొడంగె విను మంబుధి మోహపు రాజివాసమై
తనరెడు కృష్ణతీరమునఁ దామ్రపురం బను కాఁపుటూరు భూ
వనరుహగంధి నెమ్మొగము వైఖరి మీఱు [1]విశేషకాంతివ
ర్తనము వహించి మించు విదితంబుగఁ జూపఱ కింపొనర్చుచున్. 405

చ. కొలుచు సమగ్రభంగి నొనగూడ దివాణపువారి చేతికాఁ
కలు హుసివోపఁగాఁ గఱవుకాల మెఱుంగక పూసబొట్టు లం
బలి కలినీళ్ళుఁ జందనపు మాసికెఁ గొల్చినమాళ్ళు గల్గి శో
భిలుదురు రెడ్డి బిడ్డలు కుబేరుని పిల్లలనంగ నచ్చటన్. 406

+తే. అచట నొకరెడ్డి వెలయు హలాంకుఁడనెడి
పేరుగలవాఁడు కులములోఁ బెద్దయింటి

*ఇది హంసవింశతిలోఁ గూడఁ గలదు. 1. విశేషరూప

+ఉ. అందువ వానికెల్లమ హలాంకుఁడవ న్నొక పెద్దరెడ్డి చె
ల్వొందు సుభోగుఁడై నగరిలోపల వన్నియ గన్నయట్టివాఁ
డందునఁ బెద్దకాఁపనుచు నందఱుఁ గొల్వఁగ లెక్కలేని వె
ల్లందగు మిన్కులుం గలిగి యాతఁడు రాజిలుచుండు నప్పురిన్.

వాఁడు బొంక నెఱుంగనివాఁడు వాఁడు
పట్టినది యెల్ల బంగారు పనులపట్ల. 407

సీ. అచ్చమై వాఁకిట రచ్చజాయి మెఱుంగు
పంచతిన్నెలు గొప్పపారిగోడ
కంపతెట్టులును రాకట్టు ముంగిలి మల్లె
సాలె దేవర యఱచవికె యొకటి
కోళ్ళ గూండ్లును గొట్టు కుఱుగాడి ([1]యేడికో
లలు) కాఁడిపలుపులు గలుగు నటుక
దూడలు పెం మూవకోడెలు కఱుకాఁడి
గిత్త లీనిన మేటిగిడ్లదొడ్డి
యిఱుకుమ్రాను పెరంటిలో నెక్కుబావి
మునుఁగలును జొప్పపెనువామి [2](జనుము) రుబ్బు
ఱోలు పిడుకలకుచ్చెలు దాలిగుంత
దనర నిరతంబు వెలయు నాతని గృహంబు. 408

తే. అతనికి సుకేశి యనియెడు నాలివెనుక
నబ్బె గుణవతి యనఁగ నిల్లాలొకర్తు
చిత్తసంభవు చేకత్తి చివుకుపోవఁ
జేవ దొరకిన మాడ్కి నచ్చెరువు గాఁగ. 409

సీ. సాక్షాత్కరించిన జలదేవత యనంగ
నీలాటిరేవున నీటు చూపు
రథముపై గనుపించు రతిదేవి యన జొన్న
చేను గాచుటకు మంచియ వసించుఁ
గేళికాగళితమౌక్తికము లేతెఱు వనాం
బుజపాణినా నిప్పపూవు లేఱుఁ

---

1. యేడికోలులు (పూ) 2 జనము (పూ)

గాలచక్రముఁ ద్రిప్పు కమలనాభుని శక్తి
నా నూలు వడుక రాట్నంబుఁ ద్రిప్పు
మేఁతగాని వచ్చు తమ్మిరుమ్మి ఫిరంగి
దొర తురంగీవిలాసంబు దొరయఁ గొల్పు
గంప లింటికిఁ దెచ్చు నాకాఁపు బిగువు
టొగవగల గుబ్బలాఁడి యొక్కొక్కవేళ. 410

సీ. తిరునాళ్ళకై పోయి తిరుపతిలోఁ గొన్న
నొక్కుపూసలపేరు టెక్కుసూప
జిగికుందనముఁ గూర్చి మగఁడు చేయించిన
మెఱుఁగు కమ్మలు వింత యొఱపు నెఱపఁ
దనుఁ జూడవచ్చుచోఁ దల్లి తెచ్చినయట్టి
యల్లికనాను సోయగ మెసంగ
మొదటి కోడలిదంచుఁ దుది నత్త యిచ్చిన
చుట్టు మెట్టెలజోడు సొంపు నింపఁ
గడియములు కెంపురవలయుంగరము వెండి
కుప్పె సౌరంబు కుఱుమాపు కూనలమ్మ
చీర కుడిపైట లోపలి సిస్తుఱవిక
యెసఁగఁ జరియించు [1]నిట్టు లయ్యేమ్మెలాడి. 411

తే. దాని వలలకుఁ జిక్కి మోదమునఁ జొక్కి
యుండెడు హలాంకుఁ డొక్కనాఁ డుదయవేళ
మితి యెఱుంగక తుంపురు ల్మీఁదఁ బడఁగ
జొన్నకూడును మజ్జిగ జుట్టి లేచి. 412

1. నింట వయ్యెమ్మెలాఁడి.

సీ. మొలకు సగంబును దలకు సగంబుగాఁ
గట్టిన యయగారి కఱలచీర
పై నల్లకమ్ముల పచ్చడమ్మును దోలు
పావలు చేతిలోఁ బట్టుకఱ్ఱ
కత్తెఱ గడ్డంబు కఱకు జుంజురుమీస
ములు రోమశంబైన పలక ఱొమ్ము
మొలయుంగరము వ్రేల వలముగాఁ దీర్చిన
నాభినామము బీదనరము లమరు

గడుసుఁ బిక్కలు గలిగిన మడమ లమర
వెంట నిరువంకఁ బెంపుడు వేఁపు లరుగఁ
గెలనఁ దగు నెడ్లకొట్ట మీక్షించికొనుచు
నింటి వెలుపలి తిన్నియ కేఁగుదెంచె. 413

చ. దుసికిలఁ జాఱు కోరసిగ దుప్పటి నీటు లలాటపట్టికం
బొసఁగు విభూతిపైఁ బసుపు బొట్టును దొట్టిన కల్లు చొక్కు వె
క్కసముగ నెఱ్ఱవాఱిన వికారపుఁ జూపులుగాఁ గనంబడ
న్వెసఁ జనుదెంచె నొక్క బవనీఁడు తదీయ సమీపభూమికిన్. 414

తే. వచ్చి [1]జములిక వాయించి వరుసతోడఁ
దాతతండ్రుల చౌదరితనము లెల్ల
నెన్ని కైవార మొనరించి యింపు నెఱప
నతనిఁ గూర్చుండ నిడుకొని యాదరమున. 415

మ. కలలో దేవర చెప్పె రేయి నెదుటం గన్పించి నెయ్యంబు వా
టిల నీ పాలికి దేవుఁ డింక బవనీఁడే యంచుఁ దానాడఁగా
వలెనే కాఁపన మొప్పెలైన సరియే వారెల్ల సాత్కాలు నీ
వలె గోరించిరె నిన్నె కొల్తు ననుచు న్వర్ణించుచో నంతటన్. 416

1. జవనిక, జమిడిక

తే. ముదుక తలపాగయును బాహుమూల మందుఁ
గవిలె చర్మపు దొంతిలోని కత్తి గంట
మలంతి సిర్కావి దోవతు లమరి గ్రామ
కరణ మేతెంచి రెడ్డి చెంగట వసించె. 417

క. ఈ రీతి నెల్లవారలుఁ
జేర హలాంకుండు రచ్చసేయఁ దదీయాం
భోరుహముఖి సరికాఁపుటొ
యారులఁ గూడుకొని నిజగృహాంతరసీమన్. 418

తే. దివసమంత వితా పోయె నవుర రారె
గుంపునంపును లేకుంత గుండుపోగు
గాఁ బదాటింటి తరమును గాఁగ నూలు
వడకరే యంచు నొండొరు లొండొవికొనుచు. 419

క. వడి దారము చెవులుం ద్రొ
క్కుడు పలకయు దిండు కదురు గుంజలునుం ద్రొ
క్కుడు బొమ్మయునుం ద్రిప్పుడు
పుడకయునుం గలుగు రాట్నములు గైకొనుచున్. 420

తే. ఎడమదెస దొడ్డుగా వైచి యేకులెల్లఁ
గెలనఁ బలువగ వేఁపుడు గింజ లునిచి
చేవపీఁటల మీఁద నాసీనలైన
వారలై వావివరుసలు వదరికొనుచు. 421

సీ. గుంపునంపును లేక కొనసాఁగఁ బ్రోగు వెం
ట మెఱుంగుఁజూపు పేరెములు వారఁ
బ్రాయంపు పడుచులఁ బని గొంటివే దూది
యనెడి పాటలఁ దేనె చినుకు లీన

నేకుతోఁ జెలఁగు కేలెత్తుచో భుజమూల
        కాంతులు బయలు బంగారుసేయఁ
బుడుకఁ ద్రిప్పెడు కయంబునఁ బైఁట [1]జాఱుచో
        మినుకు గుబ్బలు తళుక్కని రహింప
ముడిచికొన్నట్టి తెలిగంజి మడతచీర
లరిది తొడ నిగ్గుచే పసుపంటినట్లు
పొసఁగఁ జరణాభ ద్రొక్కుడు బొమ్మ మీఁద
బచ్చెన ఘటింప వడ్కికి రప్పద్మముఖులు. 422

సీ. పోలిరెడ్డికి మగపోఁడిమి లేదుగా
        గాదికేలాగునఁ గడుపు నిక్కె
వదరకే మగవారు వచ్చెద రదె చక్కఁ
        జెక్కుకో పయ్యెద చెఱఁగు [2]కొంది
యోసి లేవే మల్లి వేసాలు వేయకు
        మగవార లెఱుఁగని [3]మర్మ మెద్ది?
నీకేటి సిబ్బితి నెఱజాఁగవై మించి
        యడఁగఁ ద్రొక్కిన దాన వత్తగారిఁ
బెద్ది! వినలేదె మన సుబ్బి పెరఁటి గోడ
దాఁటఁగా మామ గనె నంట యేటి సుద్ది?
యెసఁగి మగఁ డొల్లకున్న నదేమి సేయు?
ననుచుఁ గసివోవఁ బలుమాట లాడికొనుచు. 423

తే. ఎన్నికలు పట్టి పుంజంబు లేర్పరించి
పంట కట్టలు మఱి తోడుపడగ లూఁచ
కండె లొనరించి చాలించి కాఁపుటింతు
లున్న యవ్వేళ నద్భుతం బుట్టిపడఁగ. 424

1. జూచుచో (పూ) 2. కొద్ది 3 మాట గలదె

సీ. నునుపుగా దువ్వి తీర్చిన [1]కొప్పు బాలేందు
  పస మీఱు నొసటి కెంబసుపు బొట్టు
మెడతోలు పావాలు నిడుద గవ్వల దండ
  సన్నంపు జికిలిదర్శనపుఁ బేరు
నెడమచేఁ బళ్ళిక నిడిన బండా రన్య
  పాణిఁ బట్టిన నాగపడిగకోల
కటిఁ గాసెకట్టుగాఁ గట్టిన చెంగావి
  నిద్దంపు గుబ్బల నీలి అవికె
పదయుగంబున గజ్జెలు బాగు నెఱపఁ
బరశురామునిపైఁ బాటఁ బాడికొనుచు
సొంపు మీఱంగ నెక్కాలో జోగటంచు
ముంగిటికి వచ్చి నిలిచె మాతంగి యొకతె. 425

తే. దానికై యిల్లు గల రెడ్డిసాని జోగు
పెట్టుటకుఁ బోయి పొదిగిలి పట్టి నిలిచి
గణకుఁ గని వాని ప్రాయంపు కలిమి యెల్లఁ
గొల్లలాడుదు నని యెంచికొనియె నంత. 426

సీ. మెలివెట్టి చుట్టిన తెలిపరంగి ముడాసు
  పై లపేటా [2](డాబు) పసులఁ జెలఁగు
బంగరు వ్రాఁతల పట్టు హిజారు క
  బరు చీని నిమతాని పాడు నొసలు (?)
తనుకాంతి గనుపింపఁ దనరు నంగీజోడు
  వలిపెంపు శాలువ వల్లెవాటు
పడుదలలోన డాబాకత్తి వదలు పా
  పోసులు గోరంటఁ బొలుచు గోళ్ళు

1. కెంపు (పూ)  2. డబ్బు (పూ), డిబ్బ

నడుమ సీలున్న తోలుడాల్బెరఁగు సూప
నభయముగ వెంట నరుదెంచు నభరువాఁడు
నమరు మున్నైదు తేజితో నరుగుదెంచె
దారుణాకారుఁడైన యుద్ధారుఁ డొకఁడు. 427

తే. వచ్చి యయ్యూరి వెలుపలి రచ్చరావి
క్రేవ దుర్వారుఁడై 'తలారికి బులావు
ధగిడికే' యను మాటకుఁ దలఁకి రెడ్డి
తోడివారల[1]తోఁ జేసి త్రోవఁ బట్టె. 428

క. అంతటఁ దదీయగేహా
భ్యంతరముం జొచ్చెఁ గరణ మతిభయమునఁ ద
త్కాంత తదాకృతిఁ గొంతకుఁ
గొంత విలోకించి మించి గుణవతి యాత్మన్. 429

తే. కోరినప్పుడె యీతనిఁ గూర్పవచ్చె
నాకొ్క నాపాలి యా దేవుఁ డొకరిపాలి
బంటుగా [2](నిట్లు) తురకరూపంబు దాల్చి
యనుచుఁ దలపోసి యేకాంత మగుటఁ దెలిసి. 430

క. అకుకక రమ్మని [3](యభయముఁ)
దెలుపుచుఁ దద్భూమిసురుని దేవరయఱలో
పల నుంచి కిమ్మలూఁగం
గులుకుచుఁ దాఁ గడపమీఁదఁ గూర్చుండె వెసన్. 431

తే. కలికి చూపుల మాటల కందువలను
ఊరిక లొనర్చి మేకొనఁ జేసి వాని
నెనసి నప్పుడె దేవరయిల్లు పడుక
యిల్లు గావించె నంతఁ బూర్ణేందువదన. 432

1. తోఁద్రోచి 2. ఇట్లు (పూ) 3. భయముం (పూ)

క. ఆది మొదలుగ నాతని చే
వదలక [1]మఱి తాననంగ వాఁడనఁగా నె
మ్మది వేఱు లేక తమి న
మ్మదవతి మన్మథుని లంకెమానిసి యయ్యెన్. 433

సీ. కలికి మాటలు కిలకిలనవ్వు లోరచూ
పులు మోవి విఱుపులు గులుకు నడలు
బెళుకునందములు గొబ్బిళ్ళపాటలు కొప్పు
[2]సవరించునేర్పు చేసన్న వగలు
గోటిచిమ్ములు తెచ్చికోలు నివ్వెఱ లేని
వెఱపును నెచ్చెలి వెన్నుచఱపు
మోముద్రిప్పులు బొమ్మముడి ఱొమ్ముతాటింపు
రాని జంకెన కావరంపుఁ బోవరు

మొలక సిగ్గులు వట్టి కొంకులును [3]వలపు
చాటునిలకడ లలఁతి వేసటలుఁ జూపు
గడియలో వాని దారునఁ గన్నయపుడె
కొమ్మ మారుని జంత్రంపు బొమ్మ కరణి. 434

సీ. మితిలేని కూలి చాకెత కిచ్చి కైకొను
గడియ కొక్కటి గాఁగ మడుపుఁ జీర
పొరుగూరిసంతకుఁ బోవువారల చేతఁ
దెప్పించుఁ బోఁకలు తెల్లనాకు
లూరి నంబికి మోహ మూరించి తెప్పించి
పూను మాపటివేళఁ బూవుదెత్తు
లగసాలె కేమైన నర్పించి పలుమాఱు
మెఱుఁగు వెట్టించుఁ గ్రొమ్మిసిమికమ్మ

1. నేవేళ తానె వాఁడనఁగా 2. సవరించుటల్లును చేసన్న 3. తలుపు

లనుదినంబును దలగడు గవధరించు
నరిది గంధపు నెఱపూఁత లలవరించుఁ
గమ్మసారాయికై సంచకర మొసంగుఁ
జిత్రజాయ త్రయై కాఁపుచిన్నెలాఁడి. 435

వ. ఇవ్విధంబున నున్నంత. 436

క. ఆ పల్లె నుల్లసిల్లెడు
కాఁపులకుఁ బురోహితత్వగౌరవమునకుం
బ్రాపగుచు నొక మహీసురుఁ
డే ప్రొద్దు సుశర్మ యనఁగ నింపెసలారున్. 437

ఉ. అక్కట పొట్ట చించిన నొకక్షరమైనను రాదు లెక్కలుం
దక్కలు గాని యమ్మనిన దమ్మన నేరఁడు వేదమందు సొం
పెక్కిన యన్ని విద్యల నహీనుఁడ నేనని కాఁపువారిచే
మ్రొక్కులు గొంచు నాతఁడు సమున్నతగర్వము హత్తి వర్తిలున్. 438

చ. తెరువరులైనయట్టి పరదేశ మహీసురు లర్థవాంఛఁ ద
త్పురమున కేఁగుదేర వెడదోసములం బచరించి వారి ని
ర్భరగతి నోడఁ గూయుఁ దమ బాపఁడె గెల్చెనటంచుఁ గాఁపు ల
చ్చెరుపడ నాదు కంటికి ఉసింతురె వీరని యాతఁ డుబ్బునన్. 439

క. జలముల మొసలియు, గుహలోఁ
బులి, గంధపుమ్రానిమీఁద భుజగము బలె నా
హాలికగ్రామంబున నతఁ
దలరుం బరు లెవ్వరైన నడుగిడకుండన్. 440

క. అతని కుటుంబిని పతిదే
వతయై వర్తిల్లు శీలవతి యనఁగ నరుం
ధతికిం బ్రతియై గుణసం
తతికిన్ గతి యగుచుఁ బురజనంబులు మెచ్చన్. 441

తే. అమ్మహీసురుఁ డొక్కనాఁ డాహలాంకుఁ
దెలమి వింతటి పండుగ కలిమి వెలయఁ
జేయు వార్తలు వినుచుఁ దాఁ జేనికడకు
నేఁగు తత్తఱ మొనగూడ నిల్లు వెడలి. 442

సీ. అఱుతఁ గీల్కొన్న ముత్తరముల ధావళి
యంసాగ్రమున గోనె యసిమిసంచి
కట్టిన ముతక సీర్కావిదోవతియు నా
పై బిగించినయది ప్రాఁతబట్ట
తలచుట్టుకొన్న చింపుల బైరవాసంబు
చెమటచేఁ గరఁగెడు సేసబొట్టు
మారేడు బుఱ్ఱలో మంత్రాక్షతంబులు
పదముల విఱ్ఱోడు పాదరక్ష

లొడిసి పంచాంగ మొకకేలఁ బొడుపువ్రేల
వెండియుంగరమును మెడ వ్రేలు ముఱికి
జందెములు నవ్యయాచ్యుతస్మరణ మాస్య
సీమఁ గనుపింపఁ బఱతెంచెఁ జేనికడకు. 443

ఉ. వచ్చినఁ బెద్దరెడ్డి సుగవాసివి మేలిపుడైన నీడకున్
వచ్చితె యంచు బావయను వావిని ద్రస్తరలాడి బాపఁడా!
యిచ్చటఁ జల్లు విత్తు ఫలియించునె వేళగుణం బెఱింగి నా
యిచ్చకు మెచ్చుగా వదరు మిప్పుడన న్విని యాతఁ డుబ్బుచున్. 444

ఉ. చెప్పిన నేమిలేదు గద చింపులదోవతిఁ జూడు మేను మీ
కెప్పుడు [1]మేలుఁగోరి మఱి యెక్కలిదేవికి గ్రామగంగకుం
జప్పిడిఁ దించు మ్రొక్కుకొను జాడ లెఱుంగవె యిట్టిపట్ల నే
చొప్పున నాశ్రితుం గరుణఁ జూడరుగా కదియేల యిత్తఱిన్. 445

1. మేలు గావలసి యెక్కలిదేవికి

ఉ. నిన్నటి రేయి నాయెదుట నిల్చెఁ జుమీ కలలోన మీకు మే
ల్పన్నెడు పేరఁటా ల్నిలిచి బాపఁడ! రెడ్డికిఁ దెల్పరాదె న
న్నెన్నఁడుఁ దిన్నెఁ బెట్టి నుతియించుచుఁ గొల్వరటంచుఁ బల్కె నా
కన్నుల నీరు దొట్టి పులక ల్గనుపట్టెడుఁ జూడు మిప్పుడున్. 446

క. అన రెడ్డి మనసు గరఁగం
గనుఁగవ నీరొదవి జాఱఁగను బాఁపఁడ! నే
వినలేను తాళు చెప్పకు
మని మునుపటి దాని చిన్నె లాత్మకుఁ దోపన్. 447

క, ఆలని యెంచక మనియెడు
కాలంబునఁ దల్లిమాట గడవక దానిన్
నేల నిడి కాల రాచితి
నీలాగున వచ్చు ననుచు నెవ్వఁ డెఱుంగున్. 448

తే. అనుచు ధైర్యంబుఁ దాల్చి యాయమ్మ సత్య
నుప్పుడే కంటి నింకఁ దా నడిగినట్లె
తీనెఁ బెట్టుక కొలిచెదఁ గాని నేఁడు
మొదలు నామాఱుగా నీవు మ్రొక్కికొనుము. 449

తే. అనియె నీరీతి దానికై యవనిసురుఁడు
సివము పుట్టించి యపుడు చేఁజేతఁ దీసి
కొనియెఁ బుట్టెడు విత్తులు కొలుచు మంచి
వేళ వచ్చితి ననుచు భావించుకొనుచు. 450

వ. అయ్యవసరంబున. 451

చ. [1]తలపయిఁ బైఁటచుట్టపయిఁ దాల్చిన పుట్టికలోనఁ [2]బొల్చు సం
బలి గల పంటియుం జిలుము వాయఁగఁ దోమిన కంచము న్నను

1. తలపయిఁ బైట చుట్ట యిడి 2. మెత్తనం

జ్వాలమగు చూపుడాలు ముఖవారిజవైరికి వెల్లపావడ
ల్పులెఁ దగ రెడ్డి కోడలు విలాసము తోడుత నేఁగుదెంచినన్. 452

తే. అప్పు డవ్విప్రుఁ డలికఘర్మాంబుపటలి
జాటి పీడెంపు చాళ్ళతో సంధి సేయఁ
బెరుఁగు నివ్వెఱతో నోరు తెఱచికొనుచుఁ
దప్ప కీక్షించె దాని సౌందర్యమహిమ. 453

తే. చూచినప్పుడె విలు పెఱవైచి సరస
తామరసభీమతరగదాదండమెత్తి
దండహత్తి మనోజుండు దండ వెట్టె
నమ్మహీదేవు నెమ్మది రిమ్మ వొడమ. 454

ఉ. అంతట రెడ్డి పంపఁగ మృగాక్షి గృహంబున కేఁగ దాసి యా
ద్యంతశరీరసౌష్ఠవమునందు మెలంగు మనంబు లోపలం
గంతుల గోరి కోరికలు గంతులు వైవఁ గృషీవలాజ్ఞ గే
హాంతర మొంది చెందు విరహజ్వర ముజ్జ్వలమైనఁ గుందుచున్. 455

తే. అద్ధరాదేవుఁ డాహలికాబ్జవదనఁ
గన్న కన్నుల కింటిలో గరిత రూప
మెట్టులుండునొ కాని సహింపఁ దయ్యెఁ
దద్బహూకృతోపచార విధంబు లెల్ల. 456

సీ. కీలుగం టిడియేల పోలఁగా నునుఁ గొప్పుఁ
గీల్కొల్పుకొమ్మంచుఁ గిజుపోరుఁ
జసుపు బొట్టిదియేల నొసట విభూతిరే
ఖ యమర్చికొమ్మంచుఁ గంటగించుఁ
గాసె కట్టిదియేల కపురుగా మైజారు
చీరఁ దాల్చుమటంచుఁ జిమ్మరేఁగు
లక్కాకు లివియేల చొక్కటంపు టంచుక
మ్మలు ధరించు మటంచు నలుకఁ గాంచు

భార్యతో నాయమయు వెట్టి పట్టె నేమొ
యనుచు నాలాగె కావింప నతఁడు హాలిక
లికుచకుచవేషమే కాని యకట దాని
యొఱపు లేదని యాత్మలోఁ బరితపించు. 457

తే. గేస్తురా లొక్కపరి రతికేళి మీఁద
మనసు పాఱినఁ గఁకటి మైల చీరఁ
బఱచి విడె మొల్లరే! యంచుఁ బలుకరింపఁ
గుక్కకూఁతుర! వలదంచు వెక్కిరించు. 458

సీ. ఒడిలోనఁ బంచాగ ముంచుకొన్నది గాన
కెటుపోయె ననుచు నూరెల్ల వెదకుఁ
బనిలేని పని వీథిఁ[1]జనుచుఁ గ్రమ్మరు నాత్మ
గృహమంచు నెంచి యిల్లిల్లుఁ దూఱు
నపుడు భుక్తి యొనర్చి యవునషే సంకటి
తింటినా యని యింటి తెఱవ నడుగుఁ
గుఱుచ దోవతి గట్టికొని యెవ్వరో యిట్లు
గట్టిపోయి రటంచుఁ గలవరించు

గడియలోఁ దెల్లవాఱె భాస్కరుఁడు గ్రుంకె
జాగు లేలంచు సందెపై సందె వార్చుఁ
గంతుమాయల నుమ్మెత్తకాయ దిన్న
పొలుపు సారెకుఁ దెల్పు నప్పుడమివేల్పు. 459

వ. ఇవ్విధంబునఁ బునఃపునఃప్రవర్ధమానమన్మథోన్మాదుండై యమ్మేదినీదేవుం డొక్కనాఁ డహర్ముఖంబున సంధ్యావందనార్థంబు తటాకలితవిటపిచ్ఛటాకం బగు తటాకంబున కరిగి తదీయతోయజామోదమేదురమధువ్రతతీవ్రాతతా రవంబులం బొలుచుచున్న సమయంబున. 460

1. జని క్రుమ్మఁరుచు నాత్మ

క. మేలి కడాని సరాకల
పోలికగల యిరుసుపొరుగు పొంతుకతో నా
హాలికబాలిక శశిరే
ఖాలిక యచ్చటికి నీటికై యరుదెంచెన్. 461

క. వచ్చిన మేనికిఁ బ్రాణము
వచ్చిన యట్లైన మెచ్చి వసుధావిబుధుఁ
డచ్చపలాక్షీమణికిన్
ముచ్చటతోఁ జేతులెత్తి మ్రొక్కినయంతన్. 462

తే. [1]అయ్యవారెవ్వతెకు మ్రొక్కె ననుచు నొక్క
నాతి పలికిన విని యది నగుచు నాతఁ
డెవ్వతెకు మ్రొక్కఁ డేవేల్పు కెఱఁగెనో యని
సప్పు చేడెలఁ గూడి యన్నాతి చనియె. 463

క. [2]వాలాయము దినదినమును
బాలామణి [3]వచ్చుననుచుఁ బాఱుఁడు ప్రాతః
కాలమునఁ దత్తటాకము
కూలంబున ముక్కుపట్టుకొని కూర్చుండున్. 464

తే. ఉండి నీటికి వచ్చు నయ్యువిదఁ జూచి
సన్నగా మ్రొక్కు మ్రొక్కఁ దజ్జలజనయన
తనకు మ్రొక్కుటఁ దా నాత్మఁ దలఁచి తలఁచి
యేటి యాలోచన యటంచు నింటి కరుగు. 465

1. అయ్యవారెవ్వరికి మ్రొక్కె నంచుఁ బలుక, నెవ్వతెకు నేల మ్రొక్కునో యెమ్మెలాఁడి, నమ్మె యేదేవరకు మ్రొక్కినాఁడో యనుచు (పూ)

2. వాలాయముగా దినమున్ 3. వచ్చు టెఱిఁగి

క. అంతట విను మొకనాఁ డ
కాంతామణి యతని మనసుఁ గనవలె ననుచుం
జింతించి జోడుప్రాయపు
దింతుల నెడఁబాసి నీటి కేతెంచుటయున్. 466

తే. అతఁడు గనుఁగొని యిది సమయం బటంచు
మఱియు మఱియును మ్రొక్కి నమ్మందగమన
కదవ యట డించి తెలిసెదఁ గాక యనుచుఁ
జెంత కేతేర నాతఁడు చేర నరిగి. 467

క. ఆశీర్వాదము మేరుధ
రాశాసిభవత్కచద్వయంబునకు సుధా
పేశలహాసాననరా
కాశశికిన్ నీకు మేలుగావలె నబలా! 468

క. ఇన్నిదినంబులు నసియె
న్నన్నన నీవెన్నఁడైన మము నమ్మినవాఁ
డున్నాఁడీ బాఁపండని
వెన్నెలచూపులను జూడవేకద నన్నున్. 469

చ. అన విని నవ్వి యవ్వికసితాంబుజలోచన పైఁటకొంగు కే
లున నులివెట్టుచుం [1]దళుతళుక్కను చూపులఁ జూచి రెడ్డి నీ
ఘనత యెఱిఁగి తానదవఁగా నది గాదని యేను జేయగ
ల్గినపని యేమియున్న దవులే దయఁ బల్కితివేమొ యీగతిన్. 470

క. అది యుండనిమ్ము నే నడి
గెద నొక్కటి నీవు దినముఁ గేలెత్తి [illegible]
బొదవఁగ ! మొక్కి పఠింతువు
గద! యది యెవ్వరికి? తెలుపఁగావలె ననినన్. 471

1. దళుకుతళుక్కన (పూ)

తే. ఆతఁ డిట్లను నో జలజాస్య నీకుఁ
గాక యింకెవ్వరికి మ్రొక్కఁగాఁ గడంగు
నతులధర్మపవిత్రంబులైన నా క
రంబులను మాట లిఁకనేల త్రవ్వవలయు. 472

క. అతిథినయి వచ్చినాఁడన్
రతిభిక్ష యొసంగి నన్ను రక్షింపఁ గదే
సతి నీ పితృదేవతలకు
గతి గల్గెడు ననిన హాలికకామిని కలఁకన్. 473

తే. అమ్మ నేఁజెల్ల! బాఁపనయ్యా మతేమి
రజ్జులాడెదు మంచి గురస్తు వగుదు
చేరి మాటాడినపుడె నా సిగ్గు వోయె
నౌర! యంటివి లెస్స బాగాయెఁ గాదు. 474

తే, ఓడ కిటువలె నీవింతవాఁడవేని
మించి తగినట్టి బుద్ధి చెప్పించవచ్చు
గ్రామమునకెల్ల మాలిమికాఁడ వగుట
బ్రతికిపోతివి పోర బాఁపనగరాస! 475

క. అనుమాటలు చెవినిడ కా
యన యిట్లని పలుకుఁ దన్మృగాక్షీమణితోఁ
జనుమనుచుఁ ద్రోయ విస్తరి
చినిగెడు నన్నట్లు వలపుచెడ్డది సుమ్మీ! 476

సీ. పట్టెవర్ధనము నీపాదాబ్జములు సోఁక
మ్రొక్కినఁ గాదషే ముద్దుగుమ్మ!
జందెము ల్నీగుబ్బచన్నులంటఁగఁ గౌఁగి
లించినఁ గాదషే మించుఁబోఁడి!
వేల్మి వేల్చినచేత వెస నీకు వక్కాకు
లిచ్చినఁ గాదషే యిందువదన!

వేదము ల్గదుఁ జదివిన నోట నీమోవి
యానినఁగాద షే యబ్జనయన!
యింతకంటెను నన్ను నీవేమిసేయు
దనుచు నొండాదవేని ప్రియంబుఁ గంటి
నీవు తెచ్చిన కడవలో నీళ్ళు దెమ్ము
ధారవోసెద నా విప్రధర్మమెల్ల. 477

క. వేదము చదివిన ఫలము
న్వాదించిన ఫలము సంధ్య వార్చిన ఫలముం
బైదలి! నీకు నొసంగెదఁ
గాదనిన బ్రహ్మహత్య [1](కట్టెక) సుమ్మీ! 478

తే. అని యతఁడు వల్క నచట నేకాంత మగుట
మరఁడు ప్రక్కలు పొడిచి సమ్మతముఁ జెందు
మనుచు నిర్బంధ మొనరింప నతని కనియెఁ
గలికి నాలుగు దిక్కులుఁ గలయఁ జూచి. 479

క నసగొట్టు బాఁపనయ్యా!
పిసవెట్టికిఁ దగులు వడి తపింపఁగ నేలా
బసవెద్దు గదలకుండెడు
వసతికి [2]రమ్మచటి కేను వచ్చెదఁ బొమ్మీ. 480

తే అనిన సంభ్రమమంది యయ్యవనిసురుఁడు
శీఘ్రమేవ త్వదీయేష్టసిద్ధిరస్తు
స్వస్తిరస్తు తథాస్తు తథాస్తు హాలిక
వనజగంధి యటంచు దీవన లొసంగి 481

సీ [3]వలుదలై మెఱయు పార్వణపు ముద్దల వంటి
[4]ఁగుబ్బ లెన్నఁడు ప్చిచ్చికొందుఁ

1. కట్టైదు (పూ.), కట్టుద. 2. రమ్మేను నటకు వచ్చెదఁ బొమ్మా 3. వలుద
లైనట్టి 4. వలిచన్నుఁగవ గోర్ల

బంచ పల్లవముల మించిన పెదవి [1]యాఁ
కలి దీఱ నెన్నఁడు గఱచి కొందుఁ
గొనలు గల్గిన దర్భకోటి నేలిన కురు
ల్గట్టిగా నెన్నఁడు పట్టుకొందుఁ
బంచామృతముఁ గ్రిందు పఱచు వాక్సుధ చవు
లనివంద నెన్నఁడు ద్రావికొందు.
ననుచుఁ గోరుచు నవ్వుచు నాడికొనుచు
సారెఁ గేరుచుఁ జూచినవారు వీని
పుట్టు కిష్కింధలోనఁ గాఁబోలు ననఁగ
నా సుశర్మయు నాత్మగేహమున కరిగె. 482

తే. ఇవ్విధంబునఁ దనయింటి కేఁగి హాలిక
కాంత రమ్మనె బసవెద్దు గదలకుండు
చోటి కక్కట యది యెట్టి చోటు? తెలియ
నడుగలేనైతి నని ఖిన్నుఁడై కృశింప. 483

ఉ. [2]శీలవతీసతీమణి విచిత్రతరంబగు ధర్త్రహర్ష మ
వ్వేళను దోఁచు తత్ప్రథయు వేమఱుఁ గన్గొని చేరి దీనతా
శ్రీలలితంబుగా నతఁడు చెప్పిన నించుక [3]చింత సేసి వా
చాలసమానమాధురి విశాలము గాంచి రహించ నిట్లనెన్. 484

క. బసవెద్దు గదలకుండెడు
వసతియు నన్నదిది [4](యెన్న) వనజారికళా
లసమానమౌళి కోవెల
మసలక యటు పొందు నేఁటి మాపటి కనినన్. 485

క. పరమామోదత నెంతటి
వెరవరి విది తెలిసినపుడె విద్వాంసుని కూఁ

1. యాఁకలిదీఱఁగాఁ బండ్లఁ గఱచికొందు
2. శీలవతీశిరోమణి (పూ) 3. నవ్వినీతివా 4. యన్న (పూ)

తుర వగుదని యతఁడా సుం
దరి వడ్డింపంగ భోజనము దీర్చి వెసన్. 486

సీ. [1]సోల సీటను నీడఁ జూచుచుఁ బట్టెవ
ర్ధనము నిండఁగ నక్షతలను మెత్తి
[2]యదుసుతోఁ బడు వరాహము చంద మొదవంగఁ
దగ వేఁప చెక్క గంధం బలంది
నరసిన సిగలోన నంబివాఁ డిచ్చిన
గన్నేరు పూవులు కొన్నితుఱిమి
తడి యాఱియాఱకుండెడు ప్రాఁతదోవతి
బట్ట వేమఱుఁ బింజ వెట్టి కట్టి
కూర్మిసతి పెట్టెలో దాఁచికొన్న నల్ల
గఱల పండుగు చీరఁ బైఁ గప్పుకొనుచు
నతనుఁ డెసకొల్ప దేహాలయంబుఁ జేరి
ప్రొద్దు గ్రుంకకమున్నె సొంపులు జనింప 487

క. ఈదారిఁ జేరి యే చెలి
రాదాయె నిదేమి యనుచు బ్రాహ్మణుఁడు బహి
ర్వేదికి వచ్చుచుఁ గోవెల
లోఁ దూఱుచునుండె నంతలోనఁ దలారుల్. 488

తే. అతని తహతహ గనుఁగొని యౌర! యీతఁ
డే వధూమణి రాకకో యిచట నున్న
వాఁడు మంచిది యదియును వచ్చినపుడె
పట్టుద మటంచుఁ బొంచిరో పద్మనయన! 489

ఉ. హాలికబాలికామణియు నంత నిజాంగము మీఁద నున్న ని
ద్రాళుమనోధినాథుని కరమ్ముల మెల్లనె డించి సాహస

1. షోలసి నీటను 2. బురదలోఁ బడిన సూకరము ఛందంబుగా

శ్రీలసమానయై వెడలి శీఘ్రగతిం జనుదెంచి చొచ్చె దే
వాలయము న్మనోరథపరాయణుఁడైన సుశర్మ మెచ్చఁగన్. 490

క, గుఱికాఁడు రాక మన మీ
తరుణీభూసురులఁ బట్టఁ దగదని చుట్టుం
[1]బురిగొనుచుండిరి యాతల
వరు లంతట నదియు నతని వాంఛలు దీర్చెన్. 491

క. ఆలోన యామికావళి
యాలోచన యెఱిఁగి మగని హాలికాళికచన్
జాలిఁబడకుండఁ గావఁగ
శీలవతీకాంత కొంత చింత యొనర్చెన్. 492

క. అని మఱియు నా ప్రభావతిఁ
గనుఁగొని యచ్చిలుక పలికెఁ గలికీ యిఁక న
వ్వనితామణి వారల నే
యనువునఁ గావవలెఁ దెలియ [2]నడిగెదఁ జెపుమా. 493

క. [3]అని యడిగిన కథ కద్భుత
మున మునుఁగుటఁ బలుకలేని ముద్దియమొగమున్
గనుఁగొని యదియుం దెలిపెద
వినుమనియెం జిలుక యమృతవిధమధురోక్తిన్. 494

తే. అట్లు తలపోసి యొక యుపాయంబుఁ గాంచి
పళ్లెమునఁ బెద్దజోతి యేర్పఱచుకొనుచు
నిల్లు వెలువడి దేవతాగృహము చేరఁ
దెగువమై వచ్చె శీలవతీలతాంగి. 495

1. పరిగొన్నుచున్ నిల్చిరి తల 2. కడిగెద 3. అనియడిగి కథాద్భుతరస

క. ఆనాతిఁ జూచి తలవరు
లేనెలఁతయొ గండదీప మెత్తఁగ వచ్చెం
బోనిమ్మని కనుఁగొన న
మ్మానిని గుడి సొచ్చి కనియె మగని న్మగువన్. 496

క. కని వచ్చితి వెఱవకుఁడని
తన చేలము దాని కిచ్చి దాని పటంబుం
దన కటి ధరియించి రయం
బునఁ బళ్ళెర మీవు గొంచుఁ బొమ్మని పలికెన్. 497

*క. పనిచిన మెచ్చుచు హాలికాం
గన యీశ్వరు మ్రొక్కు చెల్లెఁ గద యింక మము
న్మనుపటివలె మనుపుము దయ
నని చని పతిప్రక్క ముగ్ధయై పవళించెన్. 498

ఉ. అంతఁ దలారు లాత్మవిభుఁ డచ్చటికిం జనుదేర జారవృ
త్తాంతము దెల్పఁ బట్టుఁడని యాతఁ డనన్ గుడి సొచ్చి దివ్వటీ
ల్చెంతకుఁ దెచ్చి చూచి యిది శీలవతీసతి యాతఁ డెంచఁ ద
త్కాంతుఁ డటంచు సిగ్గువడి తప్పెఁ బ్రయోజన మంచుఁ బోయినన్. 499

తే. రమణుఁ దోడ్కొని తన మందిరమున కరిగె
శీలవతి యంచు వచియించు చిలుకఁ జూచి
యా ప్రభావతి యప్పుడే యదిగో! తెల్ల
వాఱె నని యేఁగె నంత నగారమునకు 500

## ఇరువదిరెండవ రాత్రి :

క. చని నాఁటి రేయి నరపతి
నెనయం దద్గేహసీమ కేఁగెడుదానిం

*తే. అప్పు డా శీలవతి కేల నొప్పు పళ్ళె, మెలమితోనందుకొని కాఁపుటింతిశిఫుని, మ్రొక్కు చెల్లించు విధమున ముద్దు నడల, గుడి వెడలి చేరె నిల్లుల్కు గుబ్బలాఁడి,

గనుఁగొని యొక కథ విను మని
యనియెం గీరంబు పలుకు లమృతము దొలఁకన్. 501

## పదునైదవ కథ

*క. కుముదబిలంబను నొక పుర
మమరు సురవ్యజనితధ్వజానీకమద

---

క. జగతిఁ బొగడొందు విద్యా, నగరంబునఁ బరమధూర్తనాయకు లగుచున్
నెగడుదు రిద్దఱు భూసురు, లగణితులై విందుఁ డనఁగ ననువిందుఁ డనన్.

సీ. తల్లి బిడ్డలు నన్నదమ్ములకైన నా, అని పోరు గల్పించి యట్టు సేయ
యామికావళి కన్నుఁ బ్రామి యంతఃపురాం, గణములైనను జొచ్చి కన్నపెట్టఁ
బతిభక్తి సతి నరుంధతి వంటి వాల్గంటి, నైన బెల్లించి వెల్లాలిఁ జేయఁ
దప్పక శకునియంతటివానినైన జూ, దంబున గెల్చి పందెంబు గొనఁగఁ

తే. జీరకును గొత్తికును లంజవారి తల్లి, పూఁట కొప్పించి తియ్యని మాటలాడి
జాయి గరఁగించుచును నప్పురమున వార, లొకనికొక్కఁడు మెచ్చక
యుందు రెపుడు.

సీ. పగడసాలలఁ గోడిపడవులఁ బుట్టచెండాటల నిష్కారణార్యనింద
మది భోగములఁ జేరి మగఁడాలి చక్కటికథల దుర్వ్యవహారకర్మకలన
దీవుల నీరాటరేవుల రచ్చల మాటల జనవశ్యమంత్రశక్తి
బొమ్మలాటల వట్టి బూటకంబుల వంతుపాటల కొక్కపఠనశక్తి

తే. పగటినిద్రల వెలయాండ్రఁ బట్టుపనులఁ జాడికూఁతల పరిహాససరణినడక
తేనిదుడుకులఁ బెట్టుటఁ బూనికొనుచుఁ బ్రొద్దు పోనిత్తు రెపుడును భూమిసురులు.

తే. వారలంతట నలకంచివరదరాజు గరుడసేవ నిరీక్షింప నరిగి పోవు
వరుస వెంబడిఁ జని యన్యభామినీవిలోకనాపేక్ష నెమ్మదిలోన హెచ్చ.

సీ. వృద్ధవేశ్యతనూజవిటుఁ దిట్టుమాటల వెలపువ్వుఁ బోండ్ల నవ్వించుకొనుచు
నత్తకోడండ్ర కాట్లాటమాటలఁ గులస్త్రీల సిబ్బితి చూపి చెప్పికొనుచు
వరునితో నిల్లాలు ప్రతిరాత్రి యాడుమాటలఁ గులాంగన గుట్టు కలఁచికొనుచుఁ
గొట్ల కే గొణిగెడు గుందనిమాటలఁ కొమిరశానిస గుంపుఁగూర్చుకొనుచుఁ

తే. గోడెకాండ్రెల్లఁ గూడిరాఁ గొంత తడవు, కథలు మఱికొంత తడవు
శృంగారవతుల
చిత్తము లెఱుంగునేర్పులుఁ జెప్పికొనుచు, నరుగుచోఁ ద్రోవఁ గడపి
రయ్యవనిసురులు.

తే. పరుస డిగ్గినచోఁ దమవంతు వగల, కాసపడి చూచు కొమిర యిల్లాండ్ర చెంత
నగుచు నన్నేలవేల్పు లన్నంబు వార్చి, కొండ్రు వారలు వండిన కూర తిడఁగ.

(పాఠాం)

భ్రమదప్రమదప్రమదా
సుమాదామకటాక్షజనితసూనశరంబై. 502

తే. అందుఁ దనరారు వీరాఖ్యుఁడైన యొక్క
రౌతు వానికి దోసిటి ప్రాల ముద్దు
గుమ్మ మదవతి యన నొక్క కొమ్మ గలదు
కమ్మపూవులరెమ్మ బంగారు బొమ్మ. 503

క. ఆలలన నాయకుని యుప
లాలనమునఁ దనివిలేక లలితాకారా
వాలములగు జారుల కను
కూలముగా మెలఁగు[1]చుండుఁ గోర్కులు దీరన్. 504

సీ. అత్తగారికిని దీర్ఘాయు విచ్చినయట్టి
బ్రహ్మదేవుని మీఁదఁ బండ్లు కొఱుకు
భర్తకుఁ బొరుగూరు పయనంబుఁ జెప్పని
ధరణీధవుని మీఁదఁ దప్పు లెంచుఁ
జంద్రసూర్యుల ప్రకాశము మాయఁ జేయని
కటికిచీఁకటి మీఁద మెటిక విఱుచుఁ
బసులగోడల నాన్పి వసుధపైఁ గూల్పని
ముసురువానల మీఁదఁ గసరుఁ జూపు
వదినెలకు రేలు మఱి పారవశ్యగరిమ
నెసయఁ జేయని నిద్ర నేమేమొ దూఱుఁ
దవులు కోర్కులచే వెలిచవుల కరుగ
సందు గానక కుందు నయ్యిందువదన. 505

చ. కడకుఁ దొలగినం గెలనఁ గాఁపుగ నుండెడు చేడెతోడ నీ
వెడపక వింతవాని రతికే గతి నేఁగుదు వమ్మ చెల్లి! యె

1. నిండు కోర్కులు

క్కఁడు భయమయ్యెడుం దలఁచికొన్ననె [1](యంచన నిట్టి) సౌఖ్య మె
క్కఁడఁ గల దంచు విస్తరముగా నది చెప్పినఁ గోరు జారుఁడున్. 506

చ. జననము నందినం బురుషజన్మము గావలెఁ గాక యాఁడుదై
నను గుడిముద్ర వైచికొనినం దగు లేక కులాంగనాస్థితిం
దనరినఁ గామరూపమయిన న్వలదా యని చింత సేయు న
వ్వనరుహపత్రనేత్ర తలవ్రాఁతకుఁ దప్పులు గల్గ నేర్చునే. 507

క. పెనిమిదియు నత్త వదినెలు
కనుఁ గలిగి మెలంగ వెదలఁగా నెడ లేమిన్
[2]దినదినముఁ దత్తలోదరి
మనముననే యిట్టి నేలమాలెలు ద్రవ్వున్. 508

మ. వరునిం గన్ను మొఱంగి యిల్వెడలి పోవం, బోయి జారోపభో
గరతిం జొక్కఁగఁ, జొక్కుచోఁ దలవరు ల్గద్దించినన్ డాఁగ, డాఁ
గి రయోదారత నిల్లు సేరి సతిభంగిన్ గుట్టుతో బంధుమో
హరముం జెందఁగ నవ్వధూమణి యుపాయం బెంచు నెల్లప్పుడున్. 509

మ. ఇది జారుం డిలు సేరఁగాఁ దగిన తా విచ్చోటఁ దత్సంగమా
భ్యుదయార్హం బిది యింటివా రెఱిఁగినం బొమ్మంచు వాని బ్రయం
బొదవం బంపఁగ వచ్చు త్రోవయని తానూహించు గేహంబున
న్మదవత్యంబుజలోచనామణి మదోన్మాదం బుదారంబుగన్. 510

క. ఈరీతి నుండి యయ్యం
భోరుహముఖి మగఁడు మోసపోవని కతనన్
జారరతి కొక మహోపా
యారంభముఁ బూని దీనయైనది పోలెన్. 511

1. యంచని యిట్టి (పూ) 2. అనుదినము

క. ఒకనాఁటి రాత్రి నిజనా
యకుతో గురుభూమిఁ దగు మదంబ జనానం
దక యెటువలె నున్నదియో
యకటా మా యన్న ధవళుఁ డరుదేఁడేమో. 512

తే. తొమ్మిది పదేండ్లు గావచ్చెఁ దోడుఁ జూచి
గుఱుతు సైతంబు మఱచితిఁ గోరి యటకు
మీరు నన్నంపఁగాఁ బోరు వారు నిటకు
రారుగా చూచు టెట్లు వారలను నేను. 513

క. [1]అని పలుక న్వారుఁ డూరా
ర్చిన మాటలు వారి తిన్నెఁ జేరిన పథికుం
డనుపమధూర్తుం డొకఁ్డుడు
[2]విని చూతము గాక దీని విధమని యంతన్. 514

తే. వేగ మఱచాఁడె యంగటి వీథి కేఁగి
పచ్చడము చీరయును బండ్లుఁ బసుపుఁ గొనుచు
వచ్చి వారింటి కేఁగి బావా యటంచు
వీరునకు మ్రొక్కి యతని నివ్వెరగుఁ గాంచి. 515

క. తివిరి జనానందక గా
రవమున నీయనుజఁ జూచి రారా పోరా
ధవళా యన వచ్చితి నన
నవహితుఁడై వీరుఁ డద్భుతానందమునన్. 516

క. ధవళుఁడ వీవేనా యని
కవుఁగిట గదియించి నెనరు గల బంధుఁడ వౌ

1. అనుటఁయు దద్వరు 2. కని చూచెదఁ గాక దాని క్రమమని

దువు నేఁటికైన వచ్చితి
వవసర మిపుడైనఁ గలిగెనా యని పలుకన్. 517

తే. వారి మాటలు విని మదవతి మదీయ
వచన మేజాణయో విని వచ్చి యిట్లు
సందుకొన్నాఁడు కార్యంబు చక్కనయ్యెఁ
గాంక్ష యొనఁగూర్చ ధవుఁడే కలఁ డటంచు. 518

తే. వచ్చి కల్పిత సంభ్రమావార్య యగుచు
మ్రొక్క దీవించు నాతని మోముఁ జూచి
యన్న! యాశీర్వదించినయంత ఫలము
నీవు వచ్చిన కతమున నేఁడు గలిగె. 519

సీ. మన యమ్మ కడు సుఖమ్మున నున్నదే యయ్యఁ
పెద్దవాఁ డయ్యెఁగా పేర్మి నతనిఁ
బోషింతురే మీరు పొరచూపు లేక నా
యరిది చెల్లెలి వచ్చి యత్తవారు
తోడ్కొని పోయిరే దూరంబు గాన యే
వార్తయు వినము మా వదినె వేక
టని వింటి నేబిడ్డఁ గనియెనో మగవానిఁ
గనియెనో యదిమేలుగాక యాఁడు

దాననై పుట్టి మిముఁ జూడఁగాన కిట్టు
లేను బడుపాటు చాలదా యెన్నఁడైన
దలఁతురా నన్ను మీరు డెందంబునందు
నేల తలఁతురు మఱచిపోయితిరి నన్ను. 520

చ. చెలియలి పెండ్లి చేసితిరి చిల్లరపబ్బము లెన్నియైన శో
భిలె నను నెన్నఁడైనఁ బిలిపించితిరే పిలిపింపకున్న నే
మలరెడు కూర్మి నాఁడుఁబడు చాసపడుం గద యంచుఁ బచ్చపోఁ
గులు గల చీరయంప నొనఁగూడక పోయెనె యేమి చెప్పుదున్. 521

తే. ఇపుడు మీ పుణ్యమున నాకు నేమి కొదవ
యుండె నేను ధరింపఁగా నొకరి కీయఁ
గలదు లే యందులకు నంటగాదు మీ ద
యాతిదాక్షిణ్య మిటువంటి దంటి నింతె. 522

క. అనవలసి యంటి నిన్నుం
గనుఁగొనుటే చాలు బడలికలు కనుపించెం
జనుదెమ్ము కంచ[1](మిడియెద
ననుచుం)గను గీఁటి పిలువ నాతఁడు మదిలోన్. 523

తే. [2]కల్లవగజూదకత్తెలఁ గంటిఁ గాని
యింత మాయల జగజంత నెందుఁ గాన
నెట్లు నమ్మెడి దౌర యీయింట దీని
కడమ నకలెల్ల తెలుతముగాక యనుచు. 524

క. చని యది పట్టించఁగ భో
జనకృత్యముఁ దీర్చి యంత జలజాప్తుఁడు గ్రుం
కిన దాని కన్నుసన్నం
గని కూటములో [3]వసించెఁ గంకటిమీఁదన్. 525

చ. మదవతి యంత నాత్మవిభు మన్మథకేళిని దేల్చి కూటి చొ
క్కొఁదవఁగ నిద్రఁజెందు పతి నొయ్యన నారసి లేచి చెంబుతో
నుదకముఁ గొంచు ధూర్తమణి యుండెడి [4]చోటికి నేఁగి మాయపు
న్నిదుర వహించియున్న యతనిం గరసంజ్ఞల లేపి యిట్లనున్. 526

---

1. మిడినది, యనుచుం (పూ) 2. కల్లవగజూడ కత్తెలు
3. శయించె 4. చోటున కేఁగి

క. ఏమోయి నిన్న నడచిన
నామాటలు పొంచి విని ఘనంబై తగు మ
త్ప్రేమ యొనఁగూర్ప వచ్చిన
సామివి గద! నిన్నుమెచ్చఁ జనదే నాకున్. 527

ఆ. అందగాఁడ వగుదు వప్పుడె కంటి నీ
దారి మగఁడు నిద్రఁదేఱి నన్ను
వెదకు నటకుమున్న వేగఁ బోవలయు నీ
జోలి యేల ప్రక్కఁ జోటొసంగు. 528

చ. అన విని వాఁడు వల్కు భవదద్భుతచాతురిలో శతాంశమై
నను గలదా మదీయనిపుణత్వము నేర్పరులందు నిన్ను నె
న్నినఁ దగు మున్న నా గుఱుతు నీవు నెఱుంగవు నిన్ను నే నెఱుం
[1]గనె కద యిట్టిచో నిజముగా నిలనాడితిఁ [2]గామినీమణీ. 529

క. [3]అది యెంతయైన నున్నదె
కద యీ యద్భుతము జోక గలుగుట మేలౌ
ముదిత కౌఁగాని వాఁ వి
ట్లాదవినచో మదనకేళి కొదఁబడఁ దగునే. 530

క. అన విని యది యిట్లను నా
మనముఁ గనన్వలసి పలుకు మాటలు చాలు
న్మన యిద్దఱి ఘనసాహస
మునకు న్వల మతనుకేళి మోదము గాదే? 531

క. చక్కని వనితాపురుషుల
కెక్కడి వావులు? మనోజుఁ [4]డెక్కడ నున్నాఁ

1. గనె యిది నియందగించుకొనఁగా 2. గాన మానినీ (పూ)
3. అదిగాక నీవు చేసిన,దది యద్భుత మొకటి జోకదగులుట జాలున్
4. డేచెటివేళన్

[1]దక్కుడఁ దగవులు నడచునె ?
మొక్కులితన మేల ? మేలములు వల దింకన్. 532

క. అని పలుక మఱియు నాతఁడు
[2]మనసీయక యున్నఁ జూచి మంచిది పతిచే
నినుఁ దునిమించెద ననుఁ గనుఁ
[3]గొనరా యని బోఁటి పోటుకూఁతలు వెట్టెన్. 533

క. గడగడ వడంకి యతఁడో
పడఁతీ ! నీ వానతిచ్చు పనిఁ జేసెద నా
[4]కడ నెగ్గు దలఁప వద్దని
యొడఁబడిన న్మంచిదని సముత్సాహమునన్. 534

క. మది నాతని రక్షింపఁగ
నది యెంచెఁ బ్రభావతీ ! మహామతి వౌదే
కద యెట్లు కావవలెఁ బది
పదిగ విచారించి తెలియఁ బల్కుమటన్నన్. 535

క. కోమటిమిటారి చిలుకా !
నామతి విస్తార మేమనన్వచ్చు వచ
శ్శ్రీ మెఱయ నీవె తెల్పుము
నా మంచి దటంచుఁ గీరనాథుం డనియెన్. 536

వ. ఇవ్విధంబున సమ్మదవతీవరారోహ యుపాయపరాయణయై యుండె నంతకు
మున్న కర్ణనిర్భేదనంబగు తదాక్రోశంబు నిద్రాభంగంబుఁ గావించుటయు
నవ్వీరుం డదరిపడి లేచి కృపాణపాణియు వికటీకృతభ్రుకుటినిటలుండును
నగుచు వచ్చునంతకమున్న యయ్యింతి సమంతికప్రవర్తియగునాథూర్తుని
సవికారంబుగాఁ బడియుండుమని బోధించి యగాధవ్యథాబాధితయుం బోలె
నిజనాథుని కెదురుగాఁ బఱతెంచి సాక్రందనంబుగా నిట్లనియె. 537

1. ఇక్కడి వగవులు 2. మనసీయని యునికి జూచి
మత్పతిచేతన్ 3. గొనుకో 4 యెడ కరుణింపఁగదే యని.

క. పని గల్గి నీరపాత్రము
గొని మ్రుంగిటి కేఁగుదెంచి కోయను కూఁత
ల్విని చేరిన వికృతాకృతిఁ
గని యున్నాఁ డన్న యేమి కతమో యెఱుఁగన్. 538

క. ఇన్నాళ్ళు రానివాఁ డే
యెన్నిక లొనఁగూర్చ నిచటి కేతెంచెనొ మా
యన్ననుఁ గనుఁగొన రావే
నిన్నని వచ్చుట నుపేక్ష నించుట తగునే. 539

క. అన విని పదరకువే యా
తని కేమియు లేదటంచు వాని పిఱుందం
జని వీరుఁ డతని యాకృతిఁ
గని త్రోపన్ గాలి సోఁకెఁ గావలె ననుచున్. 540

ఆ. వెన్ను చఱచి ధవళ! వెఱవకురా యంచుఁ
బలుక నంత నతఁడు తెలివి నొంది
వారిఁ జూచి లేచి మీరేల వచ్చితి
రేమి యెఱుఁగనైతి నింత తడవు. 541

చ. అనవుడు నవ్వి వీరుఁడు నిజాంబుజలోచనఁ జేరఁ బిల్చి మం
తనమున నీతఁ డొంటికి మనంబున భీతి వహించె నేమొ నీ
వినుఁ డుదయించు దాఁక వసియింపు సహాయము గాఁగ నంచుఁ బో
యిన నగి ధూర్తుతోడ రమియించె వధూమణి యాప దీఱఁగన్ 542

క. అంతటఁ దెలతెలవాఱెం
గాంతా! యని పలుక వైశ్యకామిని యిచట
న్వింత గదె తెల్లవాఱె (1శ
కుంతమ) యని యంతిపురము గుట్టునఁ జేరెన్. 543

1. శకుంతల (పూ)

## ఇరువదిమూఁడవ రాత్రి :

తే. చేరి రేయి మహీకాంతు చెంత కరుగు
దానితోఁ బూని తోయజోద్యన్మరంద
ధార లూరఁగఁ గీరమో తరుణి ! యొక్క
కథ విను మటంచు వెస నరికట్టి పలికె. 544

### పదాఱవ కథ

క. ఏలానగరంబున గో
పాలుం డొకఁ డమరు విష్ణుభక్తుఁడు ధరా
లోలమనస్కుఁడు తంత్రీ
పాలుం డనువాఁడు నిఖిలబంధుప్రియుఁడై. 545

సీ పులుల వాకట్టు మందులు పాము బదనిక
లొప్పుగు చేఁపుడు మాత్రములును గోదె
దామెన పగ్గము లెలత్రాళ్ళు నురిత్రాళ్ళు
చిక్కంబులును జల్లిచిక్కములును
మాఱు మానిసిఁ గన్న దూఱు వేఁపుల జోళ్ళు
కొలికిచెప్పులు జమ్ముగూడ లలఁతి
పిల్లగోవులు నెక్కువెట్టిన విండ్లు కం
బళ్ళు దుప్పట్లును వల్లె త్రాళ్ళు
మొదలుగాఁ గల పరికరంబులఁ గొఱంత
లేక భూమీరుహచ్ఛాయలే గృహాళి
గాఁగ వాఁ డాలమందలఁ గాచు బాళి
నడవి మానిసి[1]యై తిరుగాఁడు నెపుడు. 546

1 విధము తిరుగాడు వాఁడు.

చ. పిదికిన యాలపా ల్వెదురుబియ్యము కావడికుండ నించి య
య్యదుపతికిం బ్రియంబుగఁ దదాహృతవహ్నిసమిత్ప్రరంపరా
హృదయము నొందఁ జేసి పయి పొంగలి పెట్టి భుజించు నాతఁ డిం
పొదవఁగఁ దేకుటాకుల వనోర్విని మందలఁ గాచు వేళలన్. 547

సీ. మేర లెంచక నూరివారిండ్ల కేఁగి పా
ల్పెరుఁగు వెన్నలు మ్రుచ్చిలించె ననుచు
నీరాడు తటి నాఁడువారు కట్టిన పాఁత
లెత్తుక పోయి చెట్టెక్కె ననుచుఁ
బ్రతుకు భాగ్యము క్రిందఁ బడఁగ బాఁపన యిండ్ల
కరిగి యాఁకటికిఁ గూడడిగె ననుచుఁ
గడపటఁ జుట్టాల గరితల పైఁటలోఁ
జెయి వేసి యేమేమొ చేసె ననుచు
వ్రాసికొన్నారు బాఁపన బైసిగాండ్రు
కొలము స్వామి విచారించుకోక యిట్లు
చేయునే యంచుఁ బెద్దల చేత వినెదు
కృష్ణ కథలందు నిటువంటి వెల్ల వినఁడు. 548

సీ. తులసిపూసలు బోడితలలు నడ్డాదిడ్డి
పట్టెనామములు సంభ్రమము నొప్ప
బిరుదు లెత్తిన యెద్దుపై నొంటి తముకు రా
వములును వేణునాదములు పొసఁగ
రచియించు తప్తముద్రలును బైపైఁ బలుక
గోవిందలును హాస్య మావహింప
నతిరసంబులఁ బుట్టి యవనతులైన వా
రల కొసంగెదు దీక్షలు సైలంగఁ

గొలమువారెంచఁ గల గొల్లకొడుకుఁ గనఁగ
బంటులును వోలెఁ జుట్టముల్ వెంట నంటఁ
గోరి మ్రొక్కులు చెల్లించు కొఱకుఁ గాఁగ
నాతఁ డేటేటఁ దిరుపతి కరిగి వచ్చు. 549

క. వానికి మనోహర యనఁ
గా నొక యంగన యెసంగుఁ గంతుని షేజీ
కూన యన వాని గేదఁగి
జీనీజనుదాశి యనఁగ సేమ మెసంగన్. 550

క. శోభితముఖదారితశశి
వైభవ![1]యాలోకనప్రవర్ధితమదన
ప్రాభవ మెవ్వరితర మ
య్యాభీరగభీరనాభి నభినుతి సేయన్. 551

చ. చనుఁగవ యొప్పు నెన్నడుము సన్నదనంబు మెఱుంగు లీను మో
మునఁ గల తేట నెన్నడల ముద్దును మాటల నేర్పు కోపు చూ
పునఁ గల యందమున్ బిఱుఁదు పొంకముఁ గల్గిన దానిఁ జూడ గొ
బ్బునఁ బదివేల మన్మథులు పుట్టుదు రప్పురిఁ బల్లవాత్మలన్. 552

శా. మైనిగ్గు లెరయెత్తఁగా నమృతకుంభంబంది యేతెంచు మా
యానారాయణి లీలఁ దక్రఘటదీవ్యన్మస్తయై చూపు ల
జ్ఞానమ్రత్వముఁ జెందఁ జల్లఁ గొనరో చల్లంచు నేతెంచుచో
దాసిం జూచిన కంతుఁడైన రతిమీఁదం దప్పుఁ గల్పింపఁడే? 553

క. ఆలీలావతి తంత్రీ
పాలుఁడు దినదినము మందపాలై తిరుగన్
జాలివడి మనసుఁ బట్టం
జాలక పరపురుషభోగసంగతిఁ గోరెన్. 554

---

1. యాలోకనగురుప్రవర్ధితమదన (పూ)

సీ. అరిది సిబ్బెపుగుబ్బ లన్యుచేతికి నిచ్చి
నప్పుడే చనదె శుద్ధాన్వయంబు
పవడంపు జిగిమోవి పరు పంటిమొన కిచ్చి
నప్పుడే చనదె గుణార్ణవంబు
మితిలేని మెఱుఁగుమే నితరు కౌఁగిటి కిచ్చి
నప్పుడే చనదె మహాభిమాన
మతనిఁ గన్నొఱఁగి యీగతి జారుఁ బొందిన
సుద్దెఱింగిన రాజు బుద్ధి చెప్పు
నింతయేమిటి కాజారుఁ డేలుటెంత
తెవులుగొన నమ్మరాదంచుఁ దెలిసికొనదె
యకట ! తిమిరంపు నిండు ప్రాయంబు కతన
నెఱుఁగ రింతియె కాక రాకేందుముఖులు. ౫౫౫

ఉ. అమ్మహిళాలలామ విను మాగతి జారులఁ గోరి కానికా
ర్యమ్మగు నైన మా కొలము రాధకు వచ్చిన దూఱు నాకు రా
నిమ్మని నిశ్చయించి యెదురింటి గుణార్ణవనామధేయునిం
గ్రమ్మిన బాళి నంటి యెలప్రాయము చూఱలొసంగె వానికిన్. ౫౫౬

సీ. ఒక తెల్వి వాదము నయ్యెఁ జపులాఁడికిఁ గమ్మ
తమ్మియందము గ్రమ్మ నెమ్మొగమున
నొకనవ్వు వాదము నయ్యెరగవేణికి మిన్న
గన్న కెంపుల వన్నె చిన్నిమోవి
నొక తళ్కు వాదము నయ్యెవిదమిన్నకు మంచి
యంచగుంపుల సంచు మించునడల
నొకనీటు వాదము నయ్యెరునితంబకు మేటి
రంగుబంగరపు బెడంగుమేన

న త్రయానతి [1]మజ్జిగ లమ్మ వేళ
[2](వాని దారిలో)నీక్షించెనేని యింక
జాలిమాటలు తలమీఁది చల్లకడవ
పడుట సైఁతము నెఱుఁగ దప్పుడఁతి యపుడు. 557

సీ. [3]ఆగుణార్ణవుని యిల్లాలికి మెఱమెచ్చు
కూర్మితో వండిన కూర వెట్టుఁ
గమ్మ[4]నేతులు చల్లకడవలోపల డాఁచి
కొనిపోయి పురయామికుల కొసంగు
నేరంబు లోమెదు నియతికానికి గట్టి
మీఁగడ కానుక గాఁగ నిచ్చు
నాజ్ఞ వెట్టఁగఁ గర్తలైన బంధులకు నె
య్యంబున నడుగని యప్పు లిచ్చుఁ

దన విధంబంత మెల్లనే తప్పదార్చ
వలసి యీ లీల మెలఁగు నవ్వనజగంధి
జారవిద్యల కొడిగట్టు సతుల కింత
యెచ్చరిక యుండవలయుఁ బూర్ణేందు వదన ! 558

క. వినుము ప్రభావతి ! నే మ
న్ననఁ దెలిపెదఁ జూపి మోపి యనుటయుఁ గాదా
యని తలఁపకు మిఁక నీకై
నను హెచ్చరి కింత లేక నడువం దగునే ? 559

1. వీథిఁ జల్లమ్మువేళ 2. దానిదారున (పూ) వాని వరుసను, 3. ఇంట వండిన కూర లిడి సారెకును గూర్మి చెలువునితోడ మచ్చికలు సేయు 4, తేనెలు

తే. తగ నవధరింపు మవలి కథావిశేష
మమ్మనోహర యిట్లు గుణార్ణవునకు
మేలు వడియున్న నొక్కనాఁ డేలినాతఁ
డనుప నాతఁడు పొరుగూరి కరుగుటయును. 560

క. ఆఘోషాంగన మదన
జ్యాఘోషం బితరపరసమాక్రమనిష్ఠా
ద్రాఘిష్ఠంబై మించె ని
దాఘసమవియోగవహ్ని తన మది ముంచన్. 561

సీ. అదలించి పిదుకని యావులుండఁగ వేగ
దోహనధేనువు దూడ విడుచు
బానలోపలఁ బిచ్చిపాలుండ మించి చే
మిరి యిడ్డ పా ల్పొయిమీఁదఁ బెట్టుఁ
బేరి పక్వంబైన పెరుఁ గుండఁ గవ్వంబు
పులిచల్లలో నుంచి చిలుకఁ బోవు
వెసలలో మూన్నాళ్ళ వెన్నలుండఁగ నాఁడు
కాఁచి డించిన నెయ్యి కరఁగఁ బెట్టు
దివమునను సంజకడ యంచు దివ్వె తెత్తు
దద్దరిలినట్లు నడురేయి ప్రొద్దు పొడిచె
[1]ననెడు మతిఁ బాచిపనులు చేయంగఁ బూను
వలపు వెఱ్ఱికిఁ జిక్కి యవ్వనజగంధి. 562

క. ఈ రీతి నుండ మచ్చిక
దేర న్వలసినవి యెల్లఁ దెప్పించుటకై
వారసతు ల్పొజుగులతోఁ
బోరామి యొనర్పఁ బసులపొంగలి వచ్చెన్. 563

1. ననుచుఁ జని

సీ ఇంక నాల్గావంబు లిదనైతిఁగా యంచుఁ
గుమ్మరి నెమ్మదిఁ గుందికొనఁగఁ
[1]గుడుము రూకల కెల్లఁ గొననైతిఁగా యంచు
బేరి తేరని యూరి వేర మొంద
గొఱియమందల నించుకొననైతిఁగా యంచు
గొల్లవాఁ డూరకే క్రుళ్ళుకొనఁగఁ
బెనుపసు పే వితుకొననైతిఁగా యంచుఁ
గాఁపు నిద్దుర లేక కళవళింప
మొనసి వెల చూపిచూపక మునుపె వారి
సరకు లమ్ముడు వోయె నేజాతివారి
కేని బాటింపవలసి పేరెక్క నట్టి
యాదినంబున నంబురుహాయతాక్షి! 564

తే అపుడు పొంగలికైన బియ్యంబుఁ దెమ్ము
శ్రీఘ్రముగ నంచు నొకరూక చేతికిచ్చి
యత్త పొమ్మన నమ్మనోహరతరాంగి
సాంద్రమైనట్టి చెంగటి [2]పంత కరిగె 565

క. తండులములు గొని పుట్టిక
నిండం బెట్టుకొని రాఁదె నేఁడైనను జా
రుం డని మదిఁ దలఁచుచు న
మ్మిండం దేతేఱఁ దత్సమీహిత మొదవన్. 566

క. కనుచూపు మేర దానిం
గనుఁగొని యమ్మగువ యగునొ కాదో యనుచుం
జనుదెంచి గుణార్ణవుఁ డే
గిన కార్యము చక్క నగుటఁ గెరలిన తమితోన్. 567

1. ఘూడర్ఘూకల 2. దగ్గరి

క. అంత మనోహరుఁ గనుఁగొని
సంతసమున మనసు నిలుపఁ జాలక యపుడే
కంతురణకేళికై యుప
కాంతునితో నచట వల్లికాగృహసీమన్. 568

తే. చేరి పుట్టిక వెఱుపలి చెట్టు నీడ
డించి పొదలోని కరిగి యమ్మించుఁబోఁడి
జారుతోఁ గూడి తమ్మినేజావజీరు
దురమునను దన్మయావస్థతో రమించె. 569

చ. అది గని యొక్క ధూర్తవరుఁ డబ్బెర పొంగలి కంచు నెమ్మదిం
బెదరక మెల్లనే యరిగి బియ్యముఁ గైకొని యెంచరాని నే
ర్పొదవఁగ గంపలోన సికతోత్కరము న్వెస నించి పోయిన
న్మదవతి జారుఁ బొందెడు సుమాళమె కాని యెఱుంగ దేమియున్. 570

తే. అంతఁ బొదరిల్లు వెడలి గుణార్ణవునకుఁ
బురముఁ జేరంగఁ బెఱత్రోవఁ బోవఁ జెప్పి
సందడిని గంప యెత్తి మస్తంబు మీఁదఁ
దాల్చికొని వచ్చె నది యాత్మధామమునకు. 571

ఉ. వచ్చిన నత్తగారు తలవాఁకిటికిం బఱతెంచి యింతసే
పెచ్చట నేమి యంచని శిరోగ్రమునం దగు గంప డించి నే
మెచ్చితిఁ గోడలా యిసుక మేదినిఁ బుట్ట దటంచు నెంచియో
తెచ్చితి వంచు నాగ్రహమతి న్నెమకె న్వెలెత్రాఁడు ముంగిటన్. 572

క. ఆయెడ నా గోపాంగన
యే యనువున బొంకవలయు నెఱిఁగింపఁ గదే !
కాయద్యుతినిర్జితశం
పా యను నచ్చిలుకతోఁ బ్రభావతి యనియెన్. 573

క. చిలుకా ! యీ చిక్కులు సం
ధిలు గాథలు నాకుఁగానె నేర్చితివో ? కా
వలసి తలంపునఁ దలఁచితొ ?
తెలియదు గద యవలికథయుఁ [1]దెల్పుము వేగన్. 574

వ. అనిన విని యాభామాలలామంబునకుఁ గీరసార్వభౌముం డిట్లనియె. 575

క. ఆదారి నత్తకినిసెనొ
లేదో యాలోన నుమ్మలించుచు నే నిం
కేదియుఁ జెప్పిన నిక్కము
గాదే కద ! యనుచు గోపకామిని యేడ్చెన్. 576

క. ఆమాటలు విని యత్తద
యామేదురహృదయయై ప్రియంబున నడుగం
గోమలి యిట్లనుఁ గోకిల
కోమలకాకలిని గేలిగొనియెడి పగిదిన్. 577

తే. ఓపలేనన్న వినక కెంపొదవు చూడ్కి
నంపఁగా నేను మీకు మాఱాడ వెఱచి
సంత కేఁగితిఁ గద యందు సరఁగఁ జెఱఁగు
ముడి విడువ రూక వెస జాఱి పడియె నమ్మ. 578

క. వెదకితి నచ్చోఁ గానక
కద యంతటఁ బ్రొద్దు వోవఁగా భయమున నె
మ్మది నింటికిఁ జని తూర్పె
త్తెద నని యచ్చోటి యిసుము దెచ్చితి గంపన్. 579

1. దెలియం జెపుమా

చ. వెలుపల వడ్డి కిచ్చినను వీసము వచ్చును నట్టు లాయెనో ?
బలబలవేగ వచ్చు నల బాఁపని కిచ్చిన యట్టు లాయెనో ?
యలయక నాల్గు చట్ల పెరుఁ గమ్మినఁ జేతికి రాని రూక నా
వలె నల సంతలోనఁ బడవైచినవారలఁ గాన నెచ్చటన్. 580

క. అని పల్కి నత్త కనికర
మున రావే ! యెంత లేదు వోయిన యపుడే
మన సొమ్ము గాదు వగవకు
మని యూరార్పంగ నది గృహంబున కరిగెన్. 581

క. ఇట్టి వగఁ గనినఁ జనుమా
గట్టిగ నని చిలుక పలుకఁగాఁ [1](దమ మెడసెన్)
నిట్టూర్పు నిగుడఁ గోమటి
పట్టపుదేవేరి కేళిభవనం బెనసెన్. + 582

శా. కోగ్రగ్రావభిదాదికీర్తితగుణవ్యాఘోహ గాఢత్రినే
త్రగ్రావోద్ధరణోగ్రబాహుబలగర్వగ్రంథి లంకాధినా
థగ్రీవగ్రసనోజ్జ్వలాద్భుతభుగస్త్రస్థేమ వాతూలభు
గ్భుగ్రాజత్పటుశౌర్యవైభవ హృతాంభోధిప్రభుప్రాభవా ! 583

---

1. దమితోడన్ (పూ)

+ దీని తరువాత నీ క్రింది పద్య మన్ని ప్రతులలో గానవచ్చుచున్నది.
క. ఆ పగలు గడవఁ బడుటయు, భూపతి భవనంబుఁ జేరఁ బోయెడు తటి నా
కోపవఁ గనుఁగొని సుమన, శ్చాపుని యొకింత సంతసం బుప్పొంగన్.
ఇది ప్రక్షిప్తమై యుండునని తోఁచి గ్రంథభాగమునుండి తొలగింపబడినది.

క. భోద్రేక ప్రబద్ధవచః
కద్రూభవభూరిభావుకప్రాభవదై
త్యాద్రివరధ్వంస సద
యార్ద్రకృపావీక్ష భానుకులహర్యక్షా! 584

హంసయానవృత్తఖడ్గబంధము—

దారితారి భూరిధైర్యధామధామ భూరుహా!
భారతీశవంద్య! శౌరి! భాస్వదబ్జలోచనా!
నారదస్తుతప్రభావ! నవ్యమేఘసన్నిభా!
భారతీశశాంకకీర్తిభా! సుసూరిరంజనా! 585

## గద్య.

ఇది శ్రీమ[1]త్తాదిరీనృసింహకరుణాకటాక్షవీక్షణ సమాగత కవితాధార పాలవేకరి కులకలశాంభోనిధి సుధాకర తాడిగోళ్ళ కరియ మాణిక్య నృపహర్యక్ష పౌత్ర పవిత్ర చరిత్ర కదురధరా మండలాఖండల పుత్ర విద్వత్కవిరక్షణానుసంధాయక కదిరీపతినాయకప్రణీతంబైన శుకసప్తతి యను మహాప్రబంధమునందు ద్వితీయాశ్వాసము.

---

[1] తక్కదిరి.

శ్రీరస్తు

# శుకసప్తతి

## తృతీయాశ్వాసము

శ్రీజానకీమయూరీ
రాజన్మేఘాయితాంగ! రతిరాజశత
భ్రాజితసౌందర్యసుధా
రాజతగిరికీర్తిసాంద్ర! రామనరేంద్రా! 1

తే. అవధరింపుము సకల రాజాధిరాజ
నతపదాంభోజుఁ డగు ధర్మనందనునకు
సరస లౌకిక వైదికాచారవిహిత
హితకథారమ్యుఁ డగు ధౌమ్యుఁ డిట్టు లనియె. 2

**ఇరువదినాలుగవ రాత్రి :**

తే. అటులు నిజగృహమున కేఁగి యబ్జవదన
పగలు గడవంగఁ బడుటయుఁ బార్థివేంద్రు
కేళిగృహమున కరుగు నవ్వేళఁ గాంచి
మరుని యెకిరింత సంతోషభరిత యగుచు. 3

క. ఒక కథ వినియెదె మఱి పొం
దిక తో నటు నిల్పి తర్జనీనాసాయో
గకరణధురీణ మిది యని
యకలంకసుధావిధోక్తు లలరం బలికెన్. 4

## పదునేడవ కథ :

క. ధర [1]శాలివాహనుండను
నరనాయకమౌళి [2]పెనుప నలువై విభవా
కరము ప్రతిష్ఠానం బను
పుర [3]మలరు న్వేల్పుతేని ప్రోలుం బోలన్. 5

క. అప్పురిఁ గుబేరు కలిమికిఁ
దప్పుట [4]ఘటియించు సోమదత్తుం డను పే
రొప్పు నొక వైశ్యుఁ డలరుఁ గ
[5]కుప్పటలిని గీర్తివల్లికోటులు ప్రాఁకన్. 6

సీ. నవరత్నములు సువర్ణమును వెండియును లో
హాంతరములు పటలాంశుకములు
గోవజవ్వాది కుంకుమపూవు పచ్చక
ప్పురముఁ బన్నీరుచెంబులుఁ బటీర
తరుఖండపటలి యందలపుఁ గొమ్ములు జల్లి
సవరము ల్పాదరసంబు జాజి
యింగువ లేలాలవంగము లోడపోఁ
కలును గోరోచన గంధకములు
కొచ్చికుక్కలు మానిసిక్రోఁతు లరిది
పంచవన్నెల చిలుకలు బహువిధముల
పారువాతిన్నె లిఁక మీఁద బలుకనేల
పొదలు వానింటఁ బులిజున్ను మొదలుగాఁగ. 7

1. శాతవాహనుం 2. ప్రో[illegible] నానా 3. మొకటి వేల్పు
4. కల్పించు 5. కుప్పటముల

క. ఈళయు ముమ్మోఁగియు బం
గాళము పైగోవ మొదలుగాఁ బొదలెడు ద్వీ
పాళిఁ గల సరకు లాతని
కౌలున దిగు మాటనిజము గలవాఁ డగుటన్. 8

శా. ఏయూరం దన యాపణంబు మఱి యింకే బేరి పేరైన నా
త్మాయత్తం బగు విత్త మేయదవియందైన న్నిజద్రవ్య మీ
చాయ న్సంపద వృద్ధిఁ బొంద ధనదస్పర్ధాళుఁడై నిల్పెఁ బో
యాయూరవ్యుఁడు కోట్లకుం బడగ లెన్నైనం బ్రమోదంబునన్. 9

చ. వలసిన బేరము ల్దెలియవచ్చినవారలు వాదుగల్గువా
రలు తెగగు త్తగొల్లలును రత్నపరీక్షలవారు కార్యము
ల్గలిగిన యింగిలీషుల ముఖాములు చెంగట నుల్లసిల్లఁగాఁ
గొలు వొసఁగు న్మహీశగతిఁ గోమటి యాత్మగృహాంగణంబునన్. 10

క. ఆతఁడు ధూ ర్తచకోర
ఖ్యాతంబగు నొకక్రచిలుక నతులితగమనా
యాతేరితవిజ్ఞానస
మాతులశేముషిఁ గృపాళుఁడై పోషించున్. 11

తే. అప్పురంబునఁ గామసేనాభిధాన
యైన వెలచాన మీఱు జయైకతాన
మీనకేతననలినప్రసూనశరస
మానతానూనవీక్షావితాన యొకతె. 12

ఉ. కారుమెఱుంగు రాచిలుక కస్తురివీణె పదాఱువన్నె బం
గారము నచ్చుకుప్పె తెలిగంబుర వెన్నెలలోనితేట సిం
గారపుతీవి లేనగవు గల్గిన చక్కెరకీలుబొమ్మ యొ
య్యారపు జీవగఱ్ఱ యన నెచ్చెలి మెచ్చులు గాంచె నెంచఁగన్. 13

సీ. ప్రత్యక్షబాహాటపాంచాల[1]నటనలు
గనుపట్టఁగాఁ బుస్తకములు చదువుఁ
గనుఁగొన్నరూప మచ్చున నొత్తినట్టులఁ
దళుకొత్త భావచిత్రములు వ్రాయు
నట్టువకాని యందముగాక వింతగాఁ
గోపులు గల్పించుకొనుచు నాడుఁ
[2]జేతి తంబురతిత్తి చిగురొత్తఁ బన్నిటి
తేట మీఱఁగ వింతపాటఁ బాడు
జాతివార్తలు[3]దొలఁక రసంబు గులుకఁ
గవిత [4]రచియించుఁ గల్పించి కతలు నుడువు
మనసు గరఁగంగఁ దీయని మాటలాడుఁ
జిలుకరౌతుకటారి యవ్వేలమిటారి. 14

సీ. పలుకు ముద్దులకుఁ గోవెల జియ్యంగాండ్రెల్లఁ
గుంటెనకాండ్ర వెన్వెంటఁ బడఁగఁ
జనుజక్కవలు గన్న సన్న్యాసులైనను
దలవరివారితోఁ జెలిమి సేయఁ
దళుకుఁజూపులకు విద్వాంసులైనను నిజ
రామలతోడ రారా పొనర్పఁ
బొలుపున కాచార్యపురుషులైనను దమ
వేషభాషలమీఁద వెగటు పడఁగఁ
[5]దెలిపి గని చూచినట్టి పతివ్రతలును
నిజకులాచారవృత్తిపై నెటికె విఱువ
వింతయొయ్యార మెసఁగఁ గోవెలకుఁ బోయి
మరలి యింటికి వచ్చు నమ్మచ్చెకంటి. 15

1. శయ్యలు 2. జేరి తంబుర మీటి సారసుధాసూక్తిఁ దేట లూరఁగ (పూ)
3. మించి రసంబు దొలుక 4. కల్పించు రచనానుగాథ నెఱపు
5. హారువుఁ జూచి పతివ్రతలైన నిల్పి

చ. తాలఁకెడు తత్తఱంబు పగతోఁ దొడనిగ్గు హిజాముమీఁద మె
ట్రిలువడ నొంటికట్టున ఘటించిన చీర సగంబు మూఁపుపై
నలవడ బోటి దట్టి మొదలైనవి తేఁ దిరుమజ్జనంపు వే
ళలు తఱితప్పెనంచు నవలా భయమందుచు నిల్లు వెల్వడన్. 16

క. కొడుమెత్తు కొఱకు గుడికిన్
నడుచు న్వేలపడుచు నాభినామమునం గ్రొ
మ్ముడి సౌకు న్మడిచారు
న్వడి జాఱుంబైఁట వింతవగఁ గనుపింపన్. 17

సీ. తానున్న కేరి కంతటికి గణాచారి
పెక్కు సుద్దులు ప్రోయు పెద్దబేరి
పేరుకోఁ దగినట్టి యూర లేని యుటంకు
పరుల బుద్ధులకుఁ జొప్పడని మంకు
కల్లలు పచరించి గద్దించు తాటోటు
పూని యొక్కరి కీయలేని జూటు
కలహంబె కూడుగా మెలఁగెడు గయ్యాళి
నిష్ఠురత్వము సూపు నెఱకరాళి
బేరజపు గట్టిజంత పాడూరి సంత
చలము సాధించు దిట్ట రోసాల పుట్ట
లోకముల కెల్ల సూచి యల్లుండ్ర బూచి
యెంచఁ గల యుచ్చమల్లి యయ్యంతి తల్లి. 18

తే. దాని నుతియింపఁ దరమౌనె తాటకావ
ధూటి తల్లియొ? పూతన తోఁబుట్టొ?
శూర్పణఖ మేనగోడలొ? చూడ లంకి
ణీతనూజయొ? యనఁగ వన్నియకు నెక్కె. 19

సీ. ఇరుగింటి దయ్యంబు పొరుగింటికిని గూబ
యెదురింటి వారల కెదురుచుక్క
వాడకుఁ బగ యూఁవారల తలనొప్పి
పెంపుడు కూఁతుండ్ర పెద్దపిడుగు
పరదేశులకుఁ బులి బాఁపల [1]గాలంబు
యాచకకోటుల కాసపిలుపు
దాసర్ల మిత్తి సన్న్యాసుల తెరబొమ్మ
జోగిజంగాలకు సొంటికొమ్ము
పాఠకుల కొఱ్ఱు నట్టువపాలి యదురుఁ
గ్రోవి భరతంపు టయగారి గుండెదివులు
బట్టు వాకట్టు బవనీల పాసుకూన
యనఁగ విఖ్యాతిఁ గాంచు నాయాఁడుఁగూచి. 20

సీ. గూనిపీఁ పనరాదు కోలమూతిని జాఁచుఁ
గొడిపెమో మనరాదు గొడఁగసాగు
[2]బాకినో రనరాదు పగసాటి బెదరించు
నొంటిప ల్లనరాదు కంటగించు
నరవెండ్రు కనరాదు నాఁడెల్ల జగడించు
వాటుగా లనరాదు చేటుఁ దెచ్చుఁ
జెవు డనఁగారాదు చేట యెత్తుకవచ్చు
గ్రుడ్డి కన్ననరాదు గొట్టుసేయు
వెఱ్ఱి యనరాదు పైఁబడి వెక్కిరించు
గామి డనరాదు మొగమున గంటువెట్టు
పెంకి యనరాదు పట్టి గుంపెనలు సేయు
ముద్ది యనరాదు గ్రుద్దు నయ్యొద్దు మొద్దు. 21

1. పాపంబు 2. బాకిమోమనరాదు (పూ)

క. గడెతడవు వేసటలచే
సుడివడ కటు తనదు ప్రాంతసుద్దులు విన్నన్
వడి నిచ్చ నొక్క పుచ్చిన
యదగొంటుం బడుకక్రింది యాకులు రెంటున్. 22

సీ. రమ నేలినట్టి గురస్తు నందు రదేమొ
నేలమిన్నులు గొల్వనేర్చు టరుదె
మేనకాంగన నంటుకాని మెత్తు రదేమొ
సృష్టికిఁ బ్రతిసృష్టి సేయు టరుదె
కడవఁ బుట్టినవానిఁ గడు నుతింతు రదేమొ
పాథోధి పుక్కిటఁ బట్టు టరుదె
లంకఁ గాల్చినవాని బింకమెంతు రదేమొ
హెచ్చు మందుల కొండఁ దెచ్చు టరుదె
యనుచు మది తప్పి [1](తప్పు) సీళ్ళాని పూని
తోడి ముదుసళ్ళఁ బెక్కండ్రఁ గూడఁబెట్టి
పట్టి తలనొవ్వ రవ్వగాఁ బవలురేలు
వట్టి పగ్గెలుప్రేలు నవ్వారజరర. 23

క. అది నెమ్మది వదలని చల
మొదవఁగఁ దనసుతకుఁ బైఁడి యొక నిద్దరకుం
బదివేల మాడ లీయక
కదియఁగ నీదెట్టి విటశిఖామణినైనన్. 24

క. ఆకామసేన నవబి
బ్బోకము గనుఁగొనుట మదనభూతావేశ
వ్యాకులితమానసాంబుజుఁ
డై కుందుచు సోమదత్తుఁ డతివిరహమునన్. 25

క. అక్కలికి కొసఁగ వలసిన
రొక్కము పురహరుఁడు దానరూపము రతిగాఁ

1. తప్పి (పూ)

జక్కొరవిలుతుఁడు వెఱపు
నొక్కక్కలితన [1]మెపుడుఁ దన్ను ముంపఁగ నుండెన్. (?) 26

ఉ. అంతట నొక్కనాఁ డతఁ డొయారము మీఱఁగఁ గామసేన నే
కాంతమునందుఁ జేరి మనసారఁగఁ బుక్కిటి వీఁడె మిచ్చి గి
ల్గింత లెసంగు గౌఁగిటి బిగింపుల నింపులనింపు పొరువా
వింతరొద ల్మదంబు [2](నొదవించి)నటు ల్కలఁ గాంచి వేడుకన్. 27

చ. తన చెలికానితోఁ బసిఁడి దార్చక యేనల కామసేనతో
నెనసితి నిన్న యంచు వచియించిన నాతఁడు దాని యింటికిం
జని మది నిల్పఁ జాలక ప్రసంగవశంబున సోమదత్తుఁ డా
డిన వచనంబు లెల్లఁ బ్రకటించినచో వెలముద్ది యుగ్రయై. 28

క. ఏ నెఱుఁగకుండ న సుత
తో నెనయుట యెట్టు లిట్టి దుడుకులు గలవే
కానీ రొక్కం బీయక
పోనో చూచెదము తన ప్రభుత్వం బనుచున్. 29

సీ. శ్లేష్మంబు కుత్తుకఁ జిట్టుబుట్టన కట్టు
కట్టును దగ్గు లగ్గలముఁ గాఁగఁ
జన్నులు తలఁగడ సంచులవలె వెళ్లి
పయ్యెదమీఁద జంపాల లూఁగ
బీదనరాలతోఁ బెరుఁగు వాఁగడుపులో
బల్ల నల్లడలందుఁ బ్రుష్కిపడఁగ
బుగ్గ లాహిరియూటఁ బొడము వాసనతోడి
కఁకినోటను జొంగ యంకురింపఁ

1. ములర 2. నొదవించు (పూ)

దిరుకొళములోనఁ బడిన క్రోఁతియును బోలె
వడఁకుకొంచును నెదుట నెవ్వారిఁ గన్న
గ్రుడ్లు మిడికించుచును గుడ్లగూబరీతి
వేగఁ దనయిల్లు వెడలె నా వృద్ధవేశ్య. 30

తే. అంతలోననె శాలివాహను దివాణ
మునకు నేఁగుటకై బంధుజనులు గొలువ
వచ్చు నలసోమదత్తు నవ్వారవనిత
జనని వీక్షించి సందడి జడియ కరిగి. 31

తే. వెట్టిసీ రానుకతమున వెడలునట్టి
[1](చొంగ) బోఁదట్టి యొకకస్న వెక్కఁబెట్టి
దడి గఱవఁబోవు వేఁపిచందమునఁ బట్టి
పరుస మెచ్చఁగ నూరుజ ప్రముఖుఁ బలికె. 32

శా. అయ్యా! యల్లుఁడ! యెంత పెద్దఱికమయ్యా! నిల్చి మాటాడ [2](పీ)
వియ్యం జాలని సెట్టివా? నెఱరు లే దీపట్ల నిల్లైన నీ
వియ్యా లందఱి కేడి దిక్కు? మఱి నీ వెన్వెంటనే వచ్చు మా
యయ్యల్చెప్పరె? నీకు మాకుఁ దగ వీయాదాయమే కంటివో? 33

క. నలుగురిలో [3]నిట్లాపని
పలుకఁగఁ దగదైన వెట్టిపట్టిన కతనం
దెలిపెద నీకే రోసము
గలిగిన బ్రతికితిమి మంచికార్యం బిదియున్. 34

క. ఇయ్యెడఁ గలిగిన రోవెల
యియ్యక నాకెఱుకలేక యిటు నే నింటన్

1. చొక్కు (పూ) 2. నీ (పూ) 3. నిక్లానని

దయ్యమువలె నుండఁగ మా
తొయ్యలితో నెట్లు కూడితో? నే నెఱుఁగన్. 35

క. పైఁడేమి భ్రాంతి? యిదిగో
నేఁడిచ్చెదు ముచ్చువగల నెలఁత రమింపం
బోఁడిమి చెడదే? మఱి [1](గుఱి
కాఁడవు గద) కొదవలే జగంబు లెఱుంగున్. 36

తే. నిన్ననే నన్ను మొఱఁగి నా చిన్నదాని
నక్కటా! యోడరేవున నమ్మికొందు
వేమిటికొ జాఱ విడిచితి వింతె కాని
యంత దబ్బఱకాఁడ వీవౌదొ కావొ? 37

తే. మంచి మణులకు వెలఁ బొసంగించువేళ
హెచ్చు వెలలకు సొమ్ము చేయించుచోట
నగరి జాలెలు నీ యింట నిగిడియున్న
వింత మాకేల? మా రొక్క మిచ్చి పొమ్ము. 38

క. అన సోమదత్తుఁ డద్భుత
మున నచ్చట నిల్చి వెఱ్ఱిమొద్దియ! కలలో
నెనసితి నీదు తనూభవ
ననుపమరతి నింతె కాని యన్య మెఱుంగన్. 39

తే. అనిన నమ్మొద్ది మంచి దట్లైన నేమి?
నా తనూభవ వలన ననంగసౌఖ్య
మబ్బెఁ గద నీకు? నిదియు లేదన్న నందు
[2]నర్ధ మిప్పించి యవ్వల నడుగు వెట్టు. 40

1. పురికాఁడవు తగ (పూ) 2 వర్థ (పూ)

క. అని రట్టుసేయ నచ్చటి
జనములు సోమ్మి యకునికి చనదని వగదెం
చిన దానిఁ దోడుకొని పో
యె నతం డింటికిని రొక్క మిచ్చెద నంచున్. 41

క. చని ధూర్తచకోరమునకుఁ
దన వృత్తాంతంబుఁ దెలుపఁ దత్కారము న
వ్విం నిజంబుగ గెలిపించెద
నిను వెఱవకు మనియె వైశ్యనీరజగంధీ! 42

క. ఆ వైశ్యునిఁ దత్కారం
బేవిధి గెలిపింపవలయు నెఱిఁగింపఁ గదే
నీవే జాణ వటన్నన్
భావించుచుఁ జిలుకతోఁ బ్రభావతి పలికెన్. 43

క. ఏలాగున గెలిపించెనొ
బాలమెయిన్ బ్రహ్మలోకపర్యంతము నే
నాలోచన యొనరించితిఁ
జాలదు నాహృదయ మిది నిజంబుగఁ దెలియన్. 44

వ. అనిన విని యవ్విహంగమపుంగవం బనంతరకథావిధానం బిట్లని తెలుపం దొరంగె నవ్విధంబున నా ధూర్తచకోరంబు దత్ప్రతిజ్ఞంబైన విత్తంబు సోమదత్తునిచేత మూట గట్టించి దానికిం గట్టెదుర నొక్క నిలువుటద్దంబున్ బెట్టించి పెద్దలతో నవ్వేలముద్దిం బిలిపించి దర్పణప్రతిబింబితార్థంబుఁ గైకొనుమని పలికిన నచ్చటివారును స్వప్నదృష్టంబునకు నిదియె సమానంబని నిర్ణయింప నప్పణ్యవృద్ధయు లజ్జానమ్రవదనయై సదనంబునకుం జనియెనని పల్కునవసరంబునం బ్రభాతం బగుటయు. 45

## ఇరువదియైదవ రాత్రి :

క. అంతిపురంబున కరిగి ది
నాంతమున న్నృపతిఁ జేర నరిగెడు తమితోఁ
జెంతకు వచ్చిన కోమటి
యింతిం గని చిలుకరాయఁ డిట్లని పలికెన్. 46

క. రమణీ! యా ధూర్తచకో
రము కథ యిఁకఁ గొంత కలదు రాజవియోగ
భ్రమ మడఁచి తెచ్చికోల్పె
య్యము తోడుతనైన వినుమటంచుం బలికెన్. 47

క. ఆగతి నింటికిఁ జని యా
భోగము ముసలాపె యాత్మపుత్రికతో నా
జాగెల్లఁ దెలిపి పరిభవ
యోగంబున మదికి ఖేద మొదవఁగ నంతన్. 48

సీ. పుట్టలమ్మ యటన్నఁ బో యెంతలేదను
సందివీరు లటన్న జాము గొణుగు
నెక్కలమ్మ యటన్న నొక్కటి కొదవనుఁ
బోతురాజు లటన్న బూతు నుడువు
ధర్మరాజు లటన్న దబ్బఱలే తిట్టుఁ
గంబమయ్య యటన్నఁ గ్రాసి యుమియు
గ్రామగంగ యటన్నఁ గాదా మరో యను
దేవాదు లన్న గద్దించి చూచు
నిన్నిదేవళ్ళఁ గొలిచి నేనేమి గంటి
పోయి పచ్చని పులుకాసి పులుఁగుచేత

మోసపోయితి నని కుందు మొనయు ఖేద
మారట మొనర్ప విసివి [1](యయ్యారి, బసివి). 49

సీ. నట్టింట దేవళ్ళపెట్టెఁ బెట్టిన తిన్నెఁ
గొట్టించి వెసఁ బందిగూడు చేసె
మెడనున్న పాదాలు విడిచి యెవ్వరిఁ గన్న
మొరుగు తలారికి మురువు చేసె
బానలో దాఁచిన పట్టుపుట్టము చించి
పొదుగుడు కోళ్ళకుఁ బొత్తి చేసె
దేవాదుల కదెంబు దిగిచి కమ్మ్రతగాని
పట్టికానికి మొలకట్టు చేసెఁ

గాటిజేనికి మీఁదుగాఁ గట్టియున్న
గట్టివరహాని వరహానిగాఁగఁ జూడ
కాడఁబోఁగూడ కొక్కు మాటాడకుండ
గుండనికి రంగుబంగారు గోరుసేసె. 50

తే. అంతఁ దత్పుత్రి కీరమా యింత చేసె ?
దాని నంజుడు దినకున్న నేను సాని
కూఁతురనె ? యంచుఁ దల్లిని గుస్తరించి
మఱియు నవ్వార్త యూరెల్ల మఱవనిచ్చె. 51

క. వలసిన సతికే చిన్నెలు
గలవో యచ్చిన్నెలెల్లఁ గనుపించుచు న
వ్వెలవెలఁది సోమదత్తుని
వలకుఁ న్లోపఱచి మేలువానిం జేసెన్ 52

తే. చేసి యొకనాఁడు మీయింటి చిలుక కతలు
చెప్పనందురు నామాట చిన్నఁబుచ్చ

---

1. యయ్యారి బసివి (పూ)

కిపుడె తెప్పించరా! దాని యెడను గలుగు
పొలుపు గనుఁగొని మరల నంపుదము గాని. 53

చ. అన విని సోమదత్తుఁడు నిజాప్తులఁ బంచిన వారు దెచ్చినం
గనుఁగొని కామసేనయు వికాసపు మాటలుగా వచించి యెం
దును సరిలేక మించు నల ధూర్తచకోరశుకాగ్రగణ్యముం
దన గృహసీమ నుంచుకొని దబ్బఱ నెయ్యము నిబ్బరంబుగన్. 54

తే. కొన్నిదినములు చన రోషకుటిలహృదయ
వనజయై దీని మాంసంబు వండు మనుచుఁ
జిలుక నెవ్వరుఁ గనకుండఁ జేతి కొసఁగ
బోనకత్తియ వెస పాకభూమి కరిగె. 55

మ. అపు డాధూర్తచకోరకీరవర మయ్యాపన్మహాంభోధి యే
నిపుణత్వంబున నీఁదఁగా వలయు? నీ నేర్పెల్ల శోభిల్లఁగాఁ
జెపుమా చూత మటంచుఁ బల్కి తెలియం జింతింపఁగా నవ్వి వై
శ్యపయోజాస్యకుఁ జిల్క తక్కిన కథాంశం బిట్లు తెల్పెం దగన్. 56

క. అరీతిఁ బాకగేహముఁ
జేరిన యావంటలక్క చిలుకం దఱుగం
గోరి పచనక్రియాచిం
తారతితో సిలకత్తి నలుగడ నెమకన్. 57

ఉ. అత్తఱి దానిఁ జూచి శుక మంగన! యెంతటి పుణ్యమూర్తివో
బత్తి జనించి నాదు చెఱఁ బాపెదు గావున నిన్నువంటి య
త్యుత్తమ కేను నేర్పెదు ప్రయోజన మున్నదె యైన నామనం
బుత్తల మందె నీకిటు లయో! జర యింతటి పాటొనర్చెనే. 58

క. ఏను త్రికాలం బెఱుఁగుదు
మానిని! పదినాళ్ళలో సమంచితరేఖా
నూనవయి నిండు జవ్వన
మూనంగా నీకు హేతు వున్నది సుమ్మీ! 59

వ. ఇంత యెఱింగిన నీకీ యపాయంబుఁ దప్పించు కొనరాదే యని యంటివేని యలంఘనీయంబగు విధివిధానం బిట్టి దని నిశ్చయించి యున్నదాన నది యట్లుండె నవయౌవనాపాదకంబగు నొక్క మంత్రంబు నాకభ్యాసంబై యుండు; నది నాతోడనె పోయెడుం గదా యను విచారంబు తీరకునికి నీకు నుపదేశించెద దాని వలన నీకుఁ బ్రాయంబు వాడముట కడుగ నేల నీవిచ్చిన వారికిం గలదు కాలయాపనంబు సేయక యిచ్చోట గోమయంబున నలికి ముగ్గు వెట్టు మనుటయు నా వృద్ధ సంభ్రమాశ్చర్యానురుద్ధయై యచ్చిలుక తెని నచ్చట నునిచి తదుక్తప్రయోజనంబులకుం బోయిన. 60

క. అధూర్తచకోరము గరు
దాదృక్పటపటనినాద మదరం బరదు
స్వాధంబై వరమానా
బాధత్వర మెఱయఁగా నభంబున కెగిరెన్. 61

తే. ఎగిరి చెంగట నీశానగృహములోన
గూళ్ళు పెట్టిన చిలుకలఁ గూడు కొనియె
దానిఁ గానక భయమంది బోనకత్తె
కార్కృవాకవపాకపాకం బొనర్చె. 62

క. ఆకామసేన మదిఁ జిం
తాకలుషత మాని సోమదత్తునితో నే
లేకున్న తఱి బిడాలం
బాకీరముఁ బట్టి చంపె ననుచుం బొంకెన్. 63

క. అటు కనుక నేర్పు గలిగినఁ
గుటిలాలక ! నేఁడు నీవు కోరినపని కేఁ
గుట తగు లేకుండినచో
నిట నుండియె మరలుమని శుకేంద్రుఁడు వలికెన్. 64

## ఇరువదియాఱవ రాత్రి :

తే. అంతలోననె యరుణోదయంబు మించ
నా ప్రభావతి యంతఃపురాంతరమున
కరిగి యానాఁటిరేయి భూవరునిఁ జేర
నేఁగుచోఁ జిల్క యక్కలికి కిట్టు లనియె. 65

తే. అతివ ధూర్తచకోరశుకావతంస
మంత చేసిన కామసేనాంబుజాత
గంధిఁ జెఱతు నటంచుఁ గంకణము గట్టె
నెట్లు చెఱపంగవలయు నీ వెఱుఁగఁ జెపుమ. 66

క. అని పలికి తెలియనేరని
వనితామణిఁ [1](జూచి) కీరవల్లభుఁ డది తా
వినిపింపఁ దొడఁగె ననితర
[2](జనితరసస్తవ్య) వచనసంభావ్యముగన్. 67

క. ఆరీతిఁ దలఁచి ధూర్తచ
కోరము తత్ప్రియకు వేళ్ఁ గోరుచు నుండన్
మారుని చెళిఁ జెనకెడు నా
య్యారము గల కామసేన యంతట భక్తిన్. 68

క. ఒకనాఁడు కోవెలకు నేఁ
గి కపర్దికి మ్రొక్క గర్భగృహమునఁ దన్మా

1. జూచు (పూ) 2. జనితరసంస్తవ్య (పూ)

రి_కి వెనుక దాఁగికొని యా
శుక మిట్లని పలికెఁ దద్వచోగతి గాఁగన్. 69

ఉ. మెచ్చితి నీదుభక్తికి సమిద్ధవిశుద్ధకళాభివృద్ధికిన్
దచ్చన గాదు నా పలుకు దప్పదు చొప్పడుఁ గాయసిద్ధి యే
నిచ్చెద నీవుఁ దల్లియు మఱెవ్వరితో నెఱిఁగింపఁ బోక యీ
వచ్చు సరోజగాత్రవుని వారమునాఁ డిటు రండు వేడుకన్. 70

క. తొలునాఁడు బోదలైని
శ్చలభక్తిన్ జోగులకును జంగాలకు మీ
యిలు చూఱవిడిచి యిటు రా
వలయున్ వైష్ణవుల కొసఁగవల దేమైనన్. 71

క. వారు శివద్రోహులు గద!
యీరసమున శైవమతము హెచ్చఁగ రాదం
చేరీతినైనఁ జెఱతురు
నారీమణి వారి మాట నమ్మకు మింకన్. 72

క. అని పల్కి నాల్గు దిక్కులు
గనుఁగొని శంకరుని మాటగా నమ్మి కృపా
వననిధి! హర! త్రిభువనపా
వన! ధీరస్వాంత! యనుచు వర్ణించి వెసన్. 73

క. గుడి వెడలి వైష్ణవులు గను
పడకుండఁగఁ జెలుల నడిగ పట్టుమటంచున్
బడఁతి తన యింటి కడకున్
వడిఁ జని నిజజననిఁ బిలిచి నగుమొగ మలరన్. 74

క. హరుఁ డానతిచ్చినాఁ డె
వ్వరితోఁ జెప్పకుము సోమవారమునాఁ డి

ర్వరకు నెలప్రాయ మిచ్చున్
జరయు న్మృతి లేదు సంతసంబయ్యెఁ గదా! 75

చ. అన విని వృద్ధవేశ్య పులకాన్వితయై "నవయౌవనంబు నే
నెనసితినేని యీపడుకటిల్లు మదీయము నీవు వేఱె యిం
టను బవళింపుమన్న జగడాలకు రాకుమె యీర నీవు నే
నును గడియింపఁ జొచ్చినఁ దనూభవ! గోడలు పైఁడి సేయమే."? 76

సీ. ఇప్పుడే తెచ్చి నీకిచ్చెదఁగాని [1](నీ)
తళుకుఁ గమ్మలు నేనె తాల్చికొందు
నృపులచేఁ దెచ్చి నీకిచ్చెదఁ గాని నీ
పెద్దముక్కఱ నేనె పెట్టికొందు
నృపునిచేఁ దెచ్చి నీ కిచ్చెదఁ గాని నీ
బొగడల జోడు నేఁ బూన్చికొందు
నెటులైనఁ దెచ్చి నీ కిచ్చెదఁ గాని నీ
మట్టెలు నేఁ గాళ్ళఁ బెట్టి కొందు
నౌర! నీవు గడించిన వనుచు నా కొ
సంగకుండిన మఱి నేను సంతరించు
సొమ్ము మీఁదట నీకీయఁ జూడు నా ప్ర
తాప మని పల్కె యుత్సాహచాపలమున. 77

సీ. కుఱుచనెరు ల్దువ్వికొని కొప్పు సవరించుఁ
బరువెత్తి కాటుకబరిణ వెదకు
సొంపుతో నద్దంబుఁ జూచి పండ్లిగిలించుఁ
బడఁబోవుచును ముద్దునడలు నడచు
గోరంబుగా సారె గుంటకన్నులు ద్రిప్పుఁ
జూపఱ నగు నోరచూపుఁ జూచు

1. యీ (పూ)

గరిడి కేఁగెద నంచుఁ గాసె దాల్పుఁగఁ బోవు
బాకినో రెగనెత్తి పాట పాడు
నింటి కెవ్వారు వచ్చిన నెనయుఁ దనకు
నదిగొ! పైఁ డీయ వచ్చి రటంచు లేని
బింక మెక్కించుకొని సారె బిగియు నపుడె
ప్రాయ మేతెంచె నంచు నప్పుణ్యవృద్ధ. 78

తే. ఇప్పు డెట్లున్నదాన? మీరేల చెప్పు
రౌర! లెస్సాయె నని యొద్దివారిఁ దిట్టు
గుంపుగొని చూచువారలఁ గొట్టఁబూను
వెరఁగుపడి యింటి బిడ్డల వెక్కిరించు. 79

వ. ఇవ్విధంబున బహుప్రకారదుర్వికారంబులు మీఱఁ గుమారిం జేరి. 80

క. ఏమో తెలుపఁగ వచ్చితి
భామా! యీలోన మఱపు వాటిల్లెఁ గదే!
యేమీ వెఱవక తనకు
న్నేమంబును బ్రాయ మిచ్చు శివుఁ డుండంగన్. 81

క. గడువీలో మనమేగతి
నడువన్వలె? నేమి చెప్పినాఁడు శివుఁడు? నీ
వడిగితివా లేదా తెలియం?
బడుచువు గద నీకుఁ దెలియఁబడ దింతైనన్. 82

తే. పడుచవే కాకయుండినఁ బ్రాయ మిపుడె
యిమ్మనఁగ రాదె సోమవారమ్మటంచు
గడు వాకటి యేల? యింతలోఁ గాలమేమొ
దేశమేమొ కదా యంచుఁ దెలియు నటవె? 83

క. అనిన విని కామసేనా
వనజానన విస్మయట్టి వచనము లెల్లన్

వినిపించిన నేమేమీ!
యని యమ్మృదిజంత చింత యాకుల పఱపన్. 84

క. బ్రదుకెల్లఁ జక్క నగునని
మది నమ్మితిఁ గూఁతురా! ప్రమాదము రాదే
తుది నిల్లు చూఱవిడిచిన?
నిది యేమో మీఁది కార్య మెవ్వఁ డెఱుంగున్. 85

తే. ఆశపడి బోదనైన నే నగుదుఁ గాని
యింటి సొమ్మొక్క కాసైన నీయ నొకని
కొల్ల నే జవ్వనంబు మొట్టో! యదెట్లు
[1]తగదు నీమాట నే వినుదానఁ గాను. 86

క. అనఁ గామసేన యంతటి
పని రారాదమ్మ! కుముదబాంధవధరుఁ డా
డిన మాటకుఁ దప్పటవే
యని సమ్మతిపఱిచి నిర్భరాహ్లాదమునన్. 87

క. త్యాగధ్వజ మెత్తించి స
మాగతయాచకుల కీశ్వరార్పణ మనుచున్
బోగముచెలి ధన మెల్లం
బ్రోగులుగా నొసఁగె సకలము న్వినుతింపన్. 88

సీ: పట్టెనామంబుఁ గీద్పఱిచి నూతనవిభూ
తిని ద్రిపుండ్రంబులు దీర్పవచ్చు
ద్వయము పోఁబెట్టి శైవపురాణపద్యపా
ఠకల వేమాఱుఁ బఠింపవచ్చు

1. తరుణి నీ మాట నే విన్నదానఁ గాను

వనమాలికలు పాఱవైచి రుద్రాక్షపూ
సల పేరు లఱుత నెక్కొల్పవచ్చు
విష్ణుసంకీర్తన విడిచి శంకర హర
శబ్దము లుచ్చరించంగవచ్చుఁ

గాని భుజములు కాయలు గాచి యున్న
తప్తముద్రలు మఱుపెట్టఁ దరమె? యనుచు
వైష్ణవు లభావ వైరాగ్యవైభవంబుఁ
బొంద నది శైవుల కొసంగె భూరిధనము. 89

వ. ఇవ్విధంబుగా నిజాంశుకావశిష్టంబుగా గృహప్రముఖంబులగు ధనంబులు సకలభూషణంబులును ద్యాగంబు గావించి యమ్మించుఁబోఁడి జననీయుతంబుగాఁ బ్రతీక్షించుచు నయ్యెందు వాసరంబు ప్రసన్నం బగుటయు. 90

చ. తిరుపతికొప్పు లందముగఁ దీర్చిన బూడిద బొట్లు మంచి వే
ర్పఱిచిన మించునట్టి రుదురక్కలపేరులుఁ గావికోకలున్
హరశివశబ్దము ల్దగ మృగాంకకళాధరుగేహసీమ కేఁ
గిరి గుడిమేళము ల్మొరలఁ గిన్నరకంఠియు దాని తల్లియున్. 91

క. చని భావజారి సేవిం
చి నిజంబగు భక్తి నొంది చెంత వసింపం
గనుఁగొన వచ్చిరి బహుయో
జనదూరమునందుఁ గల్గు జనసంఘంబుల్. 92

తే. ఇవ్విధంబున భూజనులెల్లఁ జూడఁ
బ్రొద్దు క్షేత్రాలు దాఁక నప్పొలఁతు లుండి
యేమొ సర్వేశ్వరుం డిట్లు తామసించె
ననుచుఁ జింతించుచున్న యయ్యవసరమున. 93

తే. గోపురముమీఁద ధూర్తచకోరకీర
మెక్కి ప్రజలార! మీకేల తిక్కపట్టె?

పీరి బగిసికి మఱి గారవించి హరుఁడు
కాయసిద్ధి యొసంగునే? కల్ల గాక. 94

క. అని వారు తన్నుఁ దునుమం
బనుచుటయును వారికొంప చెఱచుటకై దే
వుని వెనుకనుండి తా నా
డిన మాటకు వారలచ్చటికి వచ్చుటయున్. 95

క. వినిపించిన నింతేనా!
యని యందఱు నవ్వ లజ్జ నానతముఖులై
చని రవ్వేశ్యలు తచ్చుక
మునకుం గల నేర్పు నీకుఁ బొసఁగ న్వలయున్. 96

క. అనినఁ బ్రభావతి మది మిం
చిన వెఱుగున నిన్నువంటి చిలుకల నేర్పు
ల్గననగునె? యనుచు వేగుట
గనుఁగొని వెసఁ జనియెఁ గేళికాగృహమునకున్. 97

## ఇరువదియేడవ రాత్రి:

క, ఆనాఁటి రేయి బాళి
న్భూనాయకమౌళిఁ జేరఁ బోయెడు తఱి న
మ్మీనాయతాక్షిఁ జూచి ప్ర
సూనాంబకతురగ మతులసూక్తిస్ఫురణన్. 98

క. వేసారక మద్వచనసు
ధాసారము మెచ్చ నీకె తగుఁ గావున నీ
వీసారి యొక్క కథ విను
మా! స్సారిజయస్తనద్వయా! యని పలికెన్, 99

## పదునెనిమిదవ కథ

క. కల దభ్రంకషకేతన
చలదభ్రంబైన నైమిశంబను పురము
జ్జ్వలవిభ్రమపరిపూరిత
కలశుభ్రకరాననానికాయం బగుచున్. 100

క. రజకుఁ డొకఁ డప్పురంబునఁ
బ్రజ మెచ్చఁ దనర్చు వీరబంధుండనఁగా
నిజవంశోచితధర్మ
ధ్వజమై తగుపాటి వైభవం బలరంగన్. 101

మ. బహిరభ్యంచితరాసభోత్కరము భౌభౌరావభాక్కుర్కురం
బహరీశోదయకాలధౌతవసనాయాతాచ్యుతాశీర్వచో
బహుళం బాయతకుంభకంబు గిరికాబాధార్థమార్గాలమై
గృహ మొప్పు న్రజకాగ్రగణ్యునకు దూరీభూతదారిద్ర్యమై. 102

ఉ. వేకమె కోడికూఁత యగు వేళఁ జల్ది భుజించి, బండ్లు గం
గాళము కూడు నీరు చవుకారముఁ దే విడియంపుఁ జొక్కతో
మైలల మోపు వీఁపున నమర్చిన రేవుగుఱ్ఱాని నెక్కి వ
య్యాళిగ బోవు వాఁడు విమలాపతటాకసమీపభూమికిన్. 103

క. ఆవీరబంధువునకు
న్భావజభుజవిజయసాధనంబగు నిల్లా
లై వెలయు నొక్క కోమలి
లావణ్యవరేణ్యయై కళావతి యనఁగన్. 104

చ. మినమిన లీను మేను నెఱిమించుల కొంచెపుటంచుఁ గమ్మలుం
గొనఁబగు ముద్దుమోము సమకొన్న మెఱుంగుల కట్టుదండయు

గనుఁగవ గల్గు తేఁటి యొడికంబును సందికడెంబు మించ న
వ్వనిత యువాంతరంగమృగవాగురయై మెలఁగు న్గృహంబునన్. 105

తే. ఆకళావతి నిజనాయకాల్పరతుల
నీగి మారవికారంబు హద్భయ మన్య
పురుషసంభోగవాంఛతోఁ బొందఁ జేయఁ
దద్వశంవదయై నితాంతంబు మెలఁగు. 106

క. వెలవెట్టి వేఱ కైకొన
వలదే కద? యింటఁ బౌరవనితల చీర
ల్గలుగఁగ నందులలోపల
వలసిన యటువంటి వింతవన్నెలు చూపున్. 107

మ. పటసమ్మార్జనగీతరాసభచయ [1]ప్రహ్లాదశబ్దంబు లొ
క్కటి [2](నూర)న్వేదలం బరున్న సతి సింగారంబు వీక్షించి నీ
విటు నిద్రింపు మటంచు లేచి చని నయ్యబ్జాక్షి యవ్వేళ నూ
రటచేయు న్మదనాస్త్రకోటులకు జారక్రీడలం బ్రోదయై. 108

చ. తనసరి చాకెత ల్తనకు దాపుగ వారలకెల్లఁ దాను గుం
టెనలు వహించుకొంచు నెఱటెక్కులు నిండువిడెంపు చొక్కులు
న్మనసుఁ గరంచు నేర్పు వగమాటలు నేరని తప్పుపాటలుం
గనఁబడ నవ్వధూటి పతి కన్నులు మూసి చరించు నిచ్చలున్. 109

క. సొగసుఁ గని దాని పెనిమిటి
మగఁటిమి యెఱిఁగియును మాటిమాటికి నకటా!
సిగవోయినఁ బోనిమ్మని
తగులుదు రపనాథు లాసుధాకరవదనన్. 110

1. ప్రహ్లాన(పూ) 2. నోర(పూ)

సీ. మిహిరావలోకన మేటికి వీక్షణా
యాసదుర్దమదోష మడఁపకున్న?
మృత్తికాస్నాన మేమిటికిఁ దదీయదే
హస్పృష్టి కలుషాల నడఁపకున్నఁ?
బమి పంచగవ్య మేపనికిఁ దదీయాధ
రాస్వాదనైర్మల్య మడఁపకున్న?
వేలిమి యది యేల వింతగా దీనితో
భోగించు పాపంబు పోకయున్నఁ?
జటుల గాయత్రి యేల తత్సంగమాది
నాంతదుష్కృతదోషంబు నడఁపకున్న?
నిన్నియును నేటికని రజకేందువదన
వేదవిప్రులు తలఁతురు విదితముగను. 111

క. ఈ రీతి మెలఁగు దాని యొ
యారముఁ గని యొక్క శూద్రుఁ డధ్వగుఁడు మహో
దారుఁడు చారణుఁ డనియెడు
పేరునఁ దగువాఁడు మదనభీతాత్మకుఁడై. 112

క. చోరుని బుద్ధిది యైన
న్నారం బింటి కడఁ దెలియఁ జని చూచెదఁ గా
కీ రమణి దారి యని యా
చారణుఁ డరిగెం దదీయసదనంబునకున్. 113

మ. చని కాంచెం గుసుమాక్షతంబు సదనాంచత్పానపాత్రంబు భా
సినిజాసన్నసమున్నతాసనతదాసీనైకవృద్ధాక మ
ర్థినరాహ్లాదకరాతిసౌరభము మద్యైకకుండవిన్యస్త మ
గ్రనిచోదత్పరిమాణభాజనము నౌ కాదంబరీకుంభమున్. 114

వ. కనుఁగొని నితాంతోదకంబును నిస్తుములంబు నగుట శాక్తేయ మతంబు
వారును బెద్దల మఱుఁగున మెలంగు కురంగనయన లరుగుదేఱం దగిన
మదిరామందిరం బని డెందంబునం దలంచి నిజమనోవంచనాచుంచుచంచల
లోచనాగమనంబుఁ గోరుచు నతఁ డందుఁ బ్రచ్ఛన్నవేషంబున నుండె. 115

క. సివసత్తులును దలారులు
బవనీలు న్మఱియు నాటపాటలవారుం
జవులు నుతించుచు మదిరా
సవముం గొని యొక్కఁ డొకఁడె జరగిన పిదపన్. 116

సీ. ఇంటివా రెవ్వరో యెందుఁ గాన మటంచు
నదిగో కూర్చున్న దాయమ్మ యనుచు
నమ్మిక తాను గానక వచ్చితి నటంచు
నిది యెవ్వరుండెడి యిల్లటంచు
నంగడి కరుగుచో నరుదెంచితి నటంచు
వచ్చి జామయ్యెఁ బోవలయు నంచు
నరిది బిడ్డలకు మందడుగ వచ్చితి నంచు
నే నందులకు వచ్చినా నటంచుఁ
జేరి రవ్వేళఁ దమ మునిచెఱఁగులందుఁ
గాసు దుడ్డును బంగారుపూస వెండి
తునక మొదలింటి చిఱువాఁడు గొనిన దెల్లఁ
గొనుచు మగనాండ్రు తమకెల్ల గుట్టు మెఱయ. 117

తే. అట్టు లరుదెంచి తక్కువ యనుట గాని
దోసమాడుదురా యని యాసవంబు
మంచిదని యల్ల వృద్ధ వర్ణించి [1] (రేక
లొసఁగఁ) గ్రోలిరి మైరేయ మోపినట్లు. 118

1. రేఖలొసఁగి (పూ)

చ. కనుఁగవ దోరగల్లుల వికారపుఁ జూపుల కోపు లానుతో
దనె దళమెక్క నాలుక తడంబడు మాటల పచ్చితేఱ మో
మునఁ బనిలేని నవ్వుల సముజ్జ్వలచంద్రిక లామతింప న
వ్వనరుహలోచన ల్సివము వచ్చిన యందముఁ జూపి రందఱున్. 119

తే. ఒకతె వృద్ధకు మధుమూల్య మొసఁగు టరయ
లేక కొమ్మని మఱియొక్క రూక యొసఁగె
నొకతె గ్రోలియు మైరేయ మొల్ల లెక్క
మరల నిమ్మని దావి వేమరును గనలె. 120

సీ. కసినిక్రోఁతలు గోసి కాఁతురని బూతు
తెలియఁగా వదినెలఁ దిట్టువారుఁ
బుకిఁ బాసి వేఱు కాఁపురము సేయుద మన్న
వినఁడని పతి దూఱి వనరువారుఁ
గడుపార మగనికే గంజిపోయ దటంచు
నత్త దుర్గుణ మెంచి యలరువారుఁ
దా నెవ్వతెయొ నన్నుఁ దఱిమి యాద్వ నటంచుఁ
దోడికోడలిఁ జెడనాడు వారుఁ
గేరి యొక కొంద ఱాత్మల మీఱినట్టి
మాటలెల్లను మధుమదోన్మాదగరిమ
నలుక మెఱయంగ లక్ష్యసంప్రాప్తపీక్ష
ణాజ్ఞముల హాసవిన్యాస మమర మఱియు. 121

సీ. మగని నిద్దురపుచ్చి మఱి వచ్చెద విచార
మదఁచి యింటికి నేఁగు మనియె నొకతె
నినుఁ జూడఁగా నిఁకే నిలువలే నొకసారి
యటు చేరి నిల్వరా యనియె నొకతె
యమ్మనేఁ జెల్లి సయ్యాట మెందాఁక నే
నరిగెద విడువరా యనియె నొకతె

బలిమాలి నేనె పైఁబడు టింతియే కాని
యాలిపై దయచూడ వనియె నొకతె
యత్తవాకట్టు మంత్రంబు లడిగె నొకతె
విభుని జోకొట్టు మందులు వేఁడె నొకతె
మధువు చొక్కునఁ దేలి యా మగువలందు
జారసాన్నిధ్య మపుడు సాక్షాత్కరింప. 122

క. ఈలాగున నాలాగున
లీలారోలలగు నచటి లేమలతోఁ ద
త్కేళిం దగిలిన రజకవి
శాలేక్షణ వగలు గాంచి చారణుఁ డాత్మన్. 123

క. ఇది దాట్లమారి యగునని
పదపడి మఱునాఁడె యొంటిపాటున మేకో
లొదవింపఁ దాపి యింటం
దుద గానని ప్రేమ దానితో రమియించెన్. 124

క. వింతలగు లాలనమ్ముల
సంతస మొసఁగించి మించు చారణరజనీ
కాంతుని సన్నిధి నపు డ
క్కాంతామణి మనసు చంద్రకాంతం బయ్యెన్. 125

తే. అంత నయ్యింతి తప్పక యతనిఁ జూచి
యెంత నెఱజాణయో కాన నిట్టివాని
వీనిఁ బోనీయ రాదని మేను మేను
నెనయఁ గూర్చుండి వానితో నిట్టు లనియె. 126

క. 1(మగవారి) నమ్మవచ్చునె
యగపడి 2(తమ)కార్యమైన యందాఁక విరా

1 మగవాని(పూ) 2 తన(పూ)

శి గదింతు రంత నెక్కడి
జగజోలి యటంచు నెరసి చనఁ జూతురుగా. 127

క. అఁటది వలచుట యరు దే
నాఁట న్మఱి వలచెనేని నాథుని బెనుపో
రాట మొనర్చినఁ గోసిన
గాటంబగుఁ గాని యెదయఁగా లేదు చుమీ. 128

ఉ. అంత యెఱుంగ నేర్చిన విటాగ్రణివౌ దటు గాక యున్న నా
యంతటిదానిఁ బూని వెలయాలి వలెన్ బతిమాలఁ [1](జేయుదే)
యింతటిలోనె మీ పురికి నేఁగక యిచ్చటఁ గొన్నినాళ్ళు నా
చెంతనె యుండి నీ వలపు చెల్లుఁబడిం గడతేర్పరా యిఁకన్. 129

క. వెచ్చమునకు లేకుండిన
నిచ్చెద దిన మొక్క మాడ [2](యిచ్చట) మఱి నా
ముచ్చట లీ వీడేర్చినఁ
దచ్చన గాదేల మూలధనముం గరమున్. 130

తే. అనుచు మేకోలు గావించి యపుడె పోయి
తన గృహంబున గూటిలోఁ దలుపు మూలఁ
బిడతలో నాయకుఁడు దాఁచిపెట్టినట్టి
మాడ లర్పించి వానితోఁ గూడి మెలఁగె. 131

క. ఆ వీరబంధుఁ డంతట
భూవరు వెనువెంట దండు పోవుటయు నిజే
చ్ఛావిధిఁ జారుఁ గూడి క
ళావతి బహుభోగలీలలం దేలంగన్. 132

1 జేయదే(పూ) 2 యిచ్చటి (పూ)

క. త్రోవ నిటు వచ్చి వచ్చియు
నీ వెలఁది వ్రతులయందు నెకసిసవాఁడం
బోవలయు నూరి కనుచుఁ గ
బాపతితోఁ జారణుం దలంఘ్య ప్రేమన్. 133

తే. వచ్చి బహుకాలమయ్యె మావారిఁ జూడ
నూరు సేరంగ వలయు నీ యొద్ద వాసి
పోవఁ గాళ్ళాడ విఁక నేమి బుద్ధి యాన
తీయవే యన్న బెగడి యయ్యిందువదన. 134

చ. ఏమంటి? వూరి కేఁగెద
వా? మంచిది పోక నిలువవచ్చునె? పొమ్మా!
నా మాటకు నౌననఁ గా
దీ మిక్కిలి మాట లేల తెలిపెద వదియున్. 135

తే. కాక నామీఁది తమి నీకుఁ గలిగెనేని
నీదు వెంటనె పెట్టుకపోదు గరిత
నాత్మఁ గొంకుదువేని నీ వరుగు మూరు
నెనసి నీవు సుఖంబుండు మింతె చాలు. 136

చ. అనుడు నతండు మోదమున కాఁడెద వింతియ కాక నీవె వ
చ్చినఁ గననన్న నీ పలుకు సేయుచు నుందు జనంబు మెచ్చఁగా
నిను నఱచేత నుంచుకొని నేఁ బదిమాళ్ళకుఁ గొన్న తొత్తు మ
ద్వనిత కలంచెనేని పెడవాడనె వైవనె యింత యేటికిన్. 137

తే. అనిన నంగీకరించి యయ్యంబుజాక్షి
యపుడె పైనంబు సంజోక లమరఁజేసి
చారణుని వెంట నింటి విచార ముడిగి
చనియెఁ దొలికోడికూఁత ప్రొద్దుననె లేచి. 138

వ. ఇవ్విధంబున నవ్వధూమణి యుపకథాధీనయై యరుగునెడఁ దృతీయ దినప్రయాణంబున. 139

సీ. పరికరోత్తరయుక్తపాథేయమును సజం
బీరమై యొకనాఁటి బియ్యమున్న
యసిమిలోఁ జలువ మాయక యుండ మడఁత వె
ట్టిన చల్లదము దుప్పటీ రుమాలు
నౌరవుగాఁ బొలుపొందు నురగవల్లిదళంబు
పూగపూరతమైన పౌరలతిత్తి
ప్రేలఁ బ్రతిక్షణార్ద్రీకృతశంఖచూ
ర్ణంబైన లోహకరండకంబుఁ
గాళ్ళ బిడివాళ్ళు నికటమార్గప్రపాన్న
రసమున్మేషజనితమౌ రాగ మమర
నృపతిచే నంపకము గాంచి యిల్లు సేర
వచ్చె నా దారిఁ దన్మనోవల్లభుండు. 140

క. అపుడా రజకాంగన యే
నెపమున బొంకంగవలయు నీ మదిలోన
న్నుపమ గని చూచి తెలియఁగఁ
జెపుమా చూచెదము నీదు శేముషిబలమున్. 141

క. అనినఁ బ్రభావతి శుకపతిఁ
గనుఁగొని యప్పు డెట్లు బొంకఁగావలె నంచు
న్నను నడిగితి వింతే కద
వినిపింపుము తెలియ నట్టి విధమని పలికెన్. 142

క. ఈకథ తెలియ నెఱుంగుదు
నాకొక పెద్దతిక మిచ్చినం గాదనరా
దేకద యైనను వినుమని
యా కీరం బనియె ననియతాదరగరిమన్. 143

శా. ఆరీతిం బతి చేరవచ్చుటయు నయ్యబ్జాక్షి వీక్షించి చిం
తారూఢం బగు భీతి దోఁచి వృథధైర్యస్థైర్యయై వానికి
న్నోరాడింప నశక్యమౌ కరణిఁ గందోయిన్ జలం బుబ్బి ము
న్నీరై పాఱఁగ నేడ్చెఁ గ్రమకలకంఠీనాదభేదంబుగన్. 144

తే. ఏద్వె నింతటి యపకార్య మేమి యనుచు
దిగులుపడి నిల్చు మగని నెమ్మొగముఁ జూచి
లెస్స వచ్చితి నినుఁ బాయలేను వేగ
వచ్చెద నటంచుఁ బల్కినవాఁడ వయ్య! 145

క. మఱచితివె సుమ్ము శీఘ్రము
పఱతెంచెద ననుట యడుగు వాసినచో న
క్కఱ వాయు నపట నిజమని
యెఱుఁగరుగా పతుల నమ్మ నిందునిభాస్యల్. 146

చ. పతి పరభూమి కేఁగిన నపారమనోవ్యథఁ గుంది ధైర్యవి
చ్యుతి దివసంబు లెన్నుకొనుచున్ సతులుందు రెఱుంగలేఁడె కా
యతఁ డొక వన్నెలాఁడి మొగమంటి కనుంగొనుచు న్విరాళిచే
సతమని నమ్మియుందు రిది సాజమెకా మగవారి కారయన్. 147

తే. మన్న పురుషుని జెడనాడు మగువ మీఁదఁ
బోయి పులుఁగాసి పురువయి పుట్టు ననుచు
బాఁపనమ్మలు చెప్పిన పాట మేలె
యనుచు నే నుందు నిను దూఱుకొనఁగ వెఱచి. 148

తే. యివ్విధంబున నుండి యింకేమి యందు!
కాని కలఁగంటి నటు మొన్నఁ గన్నయపుడె

యుగము [1]గ్రుంకినయట్లైన నొల్లఁ బోయి
నిలువఁ గూడక యెన్ని యెన్నికలొ పొదమె. 149

ఉ. ఆయన యొంటిగాఁడు వెలయాండ్ర తగు ల్గలవాఁడు వాఁడిమిం
బోయిన చోట మాట పొఱపొచ్చెము సైఁపని రోసగాఁడుగా
యీయెడ నేమి పుట్టునొ సహింపఁగ రాదు విచార మంచు నా
థా యిఁక నేమి యేనగరి యైనను బోయెదనంచు గ్రక్కునన్. 150

శా. చూపట్టం గలదాన నొంటిమెయి నిచ్చోఁ బోవరాదంచు నే
నీ పుణ్యాత్ముని తోడమర్చుకొని యిట్లేతేరఁగాఁ ద్రోవనే
నా పాలం గల దేవుఁ డీకరణిఁ జెంత న్నిల్చెఁగా నిన్నుఁ జే
ర్చె పెక్కేండ్లు సుఖంబున న్మనుము నా చిత్తంబు రంజిల్లఁగన్. 151

తే. ప్రాణనాయక మదిఁ దోఁపఁ బాపమునకు
మగడ వింతియ కాక నా మదికిఁ జూడఁ
దండ్రివైనను నీవీవ తమ్ముఁడయిన
నింక నెన్నఁటికిని నిన్ను నెడయ వెఱతు. 152

మ. అను నిల్లాలిని గౌఁగిటం బొదివి నెయ్యంబార నూరార్చి య
వ్వనితం దోడ్కొని వచ్చి యందఱి నెగు ల్వారించితంచుం బ్రియం
బున నా చారణు వీడుకొల్పి తన గీముం జేరె నాతండు కా
మినియుం దానును నిట్టి నేర్పు వలెఁ జుమ్మీ నీకుఁ గోకస్తనీ! 153

తే. అనుచుఁ గీరంబు వల్కె వైశ్యాంబుజాత
గంధి నివ్వెఱపడి యది గాక యంత
యని ప్రమోదించి యరుణోదయంబుఁ గాంచి
యరిగె శశికాంతబద్ధశుద్ధాంతమునకు. 154

1. గ్రుంగిన (పూ)

ఇరువదిఎనిమిదవ రాత్రి :

క. ఆమాపు వలపుత్రోపున
భామాపుష్పాస్త్రి భూమిపతిఁ జేరుట కా
రామ యరుదేర శుకము సు
ధామయమధురోక్తి నద్భుతంబుగఁ బలికెన్. 155

పందొమ్మిదవ కథ

క. కనకాంబరి కనకాంబరి
యనఁగా నొక పురము గలదు హర్మ్యాగ్రవినూ
తనహరిమణిఘృణితిమిరో
జ్జనితరహఃకేళిసౌధజాలంబగుచున్. 156

తే. అపురం బేలు నీలవాహనుఁ డనంగ
రిపుతమోహేళి యగు నొక్క నృపతిమౌళి
యతని చెంగట ధీరుఁ డనంగ బిరుదు
నిందు మాస్టీఁడు నెగడు మన్నీలు వొగడ. 157

సీ. తలపాగ పొర మీఁదఁ జెలఁగెడు నాయుధా
ర్చన సల్పినట్టి దాసనపుఁ బూవు
నెడమచే గొలుసును దొడుపుఁ గత్తియుఁ బూల
బిరు దొందు కుడికేలఁ బెద్ద కత్తి
దట్టితోఁ జెక్కు నిద్దావంకి కుసుమపూ
వన్నియ దుప్పటి వల్లెవాటు
భుజములు విరులచేఁ బూజించు బోడిక
ల్మురువైన ముందటి బిరుదుడవిణ

తే. దండ హంవీర తలగుండు గండ యనుచుఁ
బద్యము పఠించు జీతంబు [1]బంట్లుఁ జూడ
మూఁగికొను పౌరజనుల గుంపులుఁ జెలంగ
నతఁడు దొర కొల్వు చేసి గేహమున కరుగు. 158

క. ఇల్లిల నడచు నాతని
యిల్లాలు దనర్చు నొకతె హేమాంగి యన
న్వల్లభునికన్న దీనికిఁ
జిల్లరవిద్యలకు బిరుదు చెల్లు ననంగన్. 159

తే. పరభయంకరబిరుదవిస్ఫురితుఁడైన
కాంతు నయ్యిందుముఖి తన కాలి క్రింది
కసవుగా నెంచు వెడమాయ గప్పి జార
ధవుల మాటలు వడఁకి యొదల ధరించు 160

చ. పతి యతిశౌర్య మెంచి యుపభర్తరతాప్తికిఁ జేరకున్న న
చ్యుతమగు ధైర్య మిచ్చుచు నయో మగవాఁడ వటంచు నెట్లు పు
ట్టితి విఁక నేమి తద్భుజపటిష్ఠత లోన లొటార మింతె నీ
వతనికిఁ గొంక నేలని భయస్థితి మాన్చి రమించుఁ దద్రతిన్. 161

క ధవునకు నుపభర్తకు బాం
ధవము ఘటియించు జారు దండనె యాత్మీ
యవివేకవర్తనంబులు
చెవి కింపులు గాఁగ మగనిచేఁ బొగడించున్. 162

తే. ఇవ్విధంబున తన పోక లెఱుఁగ నీక
మగని జోకొట్టి నెరి వచ్చి సొగసు జెట్టి
వాడలోఁ గూడు జారుల వల్లెత్రాఁడు
చెలువున మెలంగు నక్కొమ్మ సొంపు గమ్మ. 163

1. భట్టు

క. అంతటఁ బెఱ రాణువ హను
మంతుం డను పేరఁ బరఁగు మాస్టీని మదా
క్రాంతుని గెలిచెద నని నిజ
కాంతుఁడు చనఁ దొడఁగు మాలెఁ గద యిపు డనుచున్. 164

తే. అలరి హేమాంగి పతి వచ్చునంతలోన
వలచి వలపింప నేర్చు జవ్వనపు వన్నె
కానితోఁ గూడి కడలేని కాంక్ష దీర్చి
కొనియెద నటంచు మది నెంచుకొనుచు నుండ. 165

ఉ. ఆపురి నొక్క జెట్టి గలఁ డన్యవధూమధురాధరామృతే
చ్ఛాపరతంత్రుఁ డొక్క దివసంబున వీథిఁ జరించు వేళ వాఁ
డా పువుఁబోఁడిఁ జూచి విరహాతుకుఁడై తన సర్వశక్తులుం
జూపియు దాని గర్వపు గుబుక్కులు గాంచి రిరంస మించఁగన్. 166

తే. అర్కవాసరమందు నయ్యంబుజాక్షి
నడచు తఱి వామపదముంచు పుడమి మీఁది
యిసుము గైకొని తనయింటి కేఁగి ప్రొద్దు
గ్రుంకునందాఁక వేగి నెక్కొన్న బాళి. 167

క. తన పడుకటిల్లు గోమయ
మున నించుక యలికి మీఁద మును దాఁ గొని తె
చ్చిన యిసుము నించి పయి న
వ్వనితామణి రూప మొనర వ్రాసినవాఁడై. 168

తే. చుట్టు యంత్రంబు లిఖియించి శుద్ధహృదయ
పద్ముఁడు దిగంబరుండు దిగ్బంధనిపుణుఁ
డగుచు నర్చించి ధూపదీపాదు లొసఁగి
కోడిబలి యిచ్చి కూర్చుండి గురుని దలఁచి. 169

క. మన మేకాగ్రముగా మో
హనమంత్ర జపం బొనర్చి యర్ఘ్యము లొసఁగన్
గనఁబడియె నప్పుడే మో
హిని నవ్యప్రథమరసవిజృంభణవృత్తిన్. 170

చ. కనఁబడి కొప్పు వీడ వలిగబ్బిచనుంగవ పైట జాఱఁ బూ
సిన నెఱతావి గందవొడి చిందఁగ నందెలు మ్రోయ దీర్ఘలో
చనరుచితోడ వీరమణి జగ్గన వేఁడుచు ముద్దువెట్టుకోఁ
జనుటయు నిర్వికారమతిఁ జాగిలి మ్రొక్కి యతండు నిల్చినన్. 171

క. మెచ్చితి నీకోరిన సతిఁ
దెచ్చెదఁ దంత్రంబు కడమ దీర్చుము వెస నీ
విచ్చట నని మోహిని చన
హెచ్చిన మోహమున మల్లుఁ డింపు జనింపన్. 172

క. మకరాంక! పంకజాతాం
బక! యని యంత్రంబుఁ దుడిచి భక్తి మెయిం ద
త్సికతోత్కరంబు నవఘట
శకలంబున నునిచి లేచు సమయమునందున్. 173

మ. ఎనసెం దాప మిదేమొ యంచుఁ బొగులన్ హేమాంగిపై నంత మో
హిని యావేశ మొనర్చి తెచ్చి నిలుపన్ హేరాళమౌ బాళి న
వ్వనితం జూచి యతండు తద్రతి ననిర్వాచ్యైకసౌఖ్యంబుఁ జెం
దిన యా పిమ్మట నమ్మిటారి మది నెంతేఁ దెల్వి సంధిల్లగన్. 174

ఉ. ఎన్నఁడు వీని పొందెఱుఁగ నేగతి వచ్చితి? వచ్చుమాత్రమా!
క్రొన్ననవింటివాని యెలగోలు దురం బొనరించి డస్సిన
ట్లున్నది మే నిదేమి కతమో? యెటులైన నిఁకేమి వీనిఁ బై
కొన్న మనంబుఁ ద్రిప్ప నొనఁగూడునె? యున్నది చాలు నిత్తఱిన్. 175

క. తను ముంచినది సముద్రం
బన వినమే రూపవంతుఁడైనం గాకుం
డిన నామది [1](గరఁచ)న్నే
ర్చిన యప్పుడె యితఁడు నాకుఁ జిత్తజుఁ డరయన్. 176

తే. అని ప్రమోదించి తన హృదయంబుఁ దెలిపి
వాని డెందంబుఁ దెలిసి యవ్వనిత తలఁపు
లేమి సేకురుటకు బాస లిచ్చి వాని
మొగము వీక్షించి పలుకు నమ్ముగ్ధ గుమ్మ. 177

క. ఇచ్చటి కే రారా దీ
పచ్చటి కెపుడైనఁగాని యరుదెంచెదు లే
వచ్చు నపవాద మంతటఁ
బొచ్చెము లేనట్టి మోహమున కెవ గలుగున్. 178

తే. కాన సిగ నొక్క చిఱుగంటఁ గట్టికొన్న
వాఁడ వగుచును వాఁకిట వచ్చి నిలిచి
గంట మొరయింపు విని యేను గదియ వచ్చి
తలుపుఁ దెఱచెద నిమ్మాటఁ దప్పవలదు. 179

చ. అని సమయం బొనర్చి వికచాంబుజలోచన యింటికేఁగ నా
యన దినముం దదీయవచనాదృతి నాగతిఁ జేరి తద్రతిం
దనరుచు నుండు నంత నొకనాఁ డినబింబము పశ్చిమాంబుధిన్
మునిఁగినఁ జీఁకటుల్ నిజసముద్ధతిఁ జూపెడు వేళ వేడుకన్. 180

క. ఆ హేమాంగి నిజాలయ
దేహళి నిలుచున్నచో నతిక్షుద్బాధా
మోహితుఁ డొక తెలువరి దృఢ
బాహుం డను వాఁడు భుక్తిపరతంత్రుండై. 181

1 గరఁచె (పూ)

తే. మాడ యిచ్చెద నన్నచోఁ గూడు వెట్ట
రింత పచనస్థలంబైన నీయ రిట్టి
మాలకొంపకు వచ్చితి మాఱులేక
గంజివోయుదురే యిందుఁ గలుగువారు. 182

క. ఇలు నెత్తిఁ గట్టుకొని పోఁ
గలుగుదురే దివికిఁ? దాము గడపటఁ బొరుగూ
రుల వెంటఁ జనరె? యపుడీ
యలమట వాటిల్లదే? దయాస్థితి వలదే? 183

క. మగవారు కఠినహృదయులు
మగువలు నాఁకొన్నవారి మాటలకు మనం
బు గరంగు నందు రిచ్చటి
జగజంతలు మగలకన్నఁ జట్టాళ్ళు సుమీ. 184

తే. మంచి దధికారి నగుచు నమ్మనుజవిభునిఁ
గొలిచియైనను గొంపలు గూల్చుకున్న
సద్ద సేయుదురే? యంచుఁ జనెడువానిఁ
గాంచి హేమాంగి ప్రొద్దుపోకలకుఁ బిలిచి. 185

క. ఏమోయి? యేల దూఱెద
వీమాడ్కిం బురమువారి నెల్లను నీపే
రే? మెచ్చట నుండుదు? వీ
గ్రామంబున కరుగుదేఁ గారణమేమో! 186

వ. అన నప్పలుకులకుఁ జంద్రికాసక్తచకోరకంబునుం బోలెఁ[1] దిరిగి తత్సమీపంబున కరిగి యో పుణ్యాత్మురాల! నీవైన నాదరించి మంచిమాటాడితివి గదా! యిదియె నాకుం బరమలాభంబు. మధురాపురంబు నా కాణయాచి కాఁపురంబు. తామరతంపర మదీయగృహంబు. శ్రీధాన్యకటకంబు మదన్వయంబున

1. వెనుదిరిగి

కాకరంబు. క ుధరపాదాంబురుహంబు వేదలతాలవాలంబునగు శేష శైలంబున కరిగి క్రమ్మఱి వచ్చువాఁడఁ బ్రొద్దుగాని ప్రొద్దున నీ యూరిం జేరి నెప్పెఱుంగమిం జేసి యన్నవిక్రయపరాయణాయతనంబులుం గానక యాఁకట గటకటంబడి గ్రాసంబు వేఁడినఁ జెడుపురువునుం బోలె విదళింపువారలే గాని యాయాసం బెఱింగి రమ్మనువారు లేరు. మాద లుండినంతఁ గూడు గాదు గదా! వలసిన పదార్థంబుఁ దెచ్చి యిచ్చెదఁ బాకం బొనర్చి పెట్టిన నీ కులకోట్లకుఁ బుణ్యం బయ్యెడు నని నుడివి యెడనెడ నప్పుడంతి యల్పస్వరంబున నిజవయఃప్రమాణాదు లడుగుట వలనను, మందమందంబుగా భాషించు మనుటవలనను గొంతకొంత సందియంబు వొడమిన నడంచికొని తదానీతుండై గృహంబుఁ బ్రవేశించి దీపప్రభా ధగద్ధగాయమానం బగు తదీయశరీరంబును ననన్యసంచారంబునుం గని దానియందు నిజభార్యానిర్విశేషంబు దోఁపఁ జూచుచున్న నక్కురంగనయన డెందంబు గరంగిన దాని తెఱంగున మిడిసిపడు కోడెబేడిసల పసం గులుకు బెళుకుచూపులు కొన్ని వాని నెమ్మేనం గ్రుమ్మరించి కల్పిత[1](పీడాభరంబు) లీడుజోడాద నతని కిట్లనియె. 187

తే. ఏమి యమరింతు? వన్ని నా యింట నిండి
యున్న విప్పుడ యమరింతు నోప నరక
వండి పెట్టెదఁ బొమ్మన్న వాఁడు వట్టి
వేడుక జనింపఁగాఁ బణ్యపీఠి కరిగి. 188

ఉ. కూరలు సన్నబియ్యమును గ్రుడ్డులకోళ్ళును జింతపండు సం
బారము లుప్పు నెయ్యి లఱపుఁ బప్పు మొదల్గాని తెచ్చి యన్నియు
న్వేఱుగ నింటిలో నులుప నించిన కైవడి నుంచె లేఁత న
వ్వారఁగ నవ్వధూమణి రయంబునఁ బాక మొనర్చి యంతటన్. 189

క. మామా! యిన్నియుఁ దెచ్చితి
తేమాన మిడేల? వేగు దీపము వలదా?

1. క్రీడాభరంబు (పూ)

యాముదము దెమ్ము పొమ్మన
నా మందవిచారుఁ దప్పు డంగడి కరిగెన్. 190

తే. అరుగ హేమాంగి యిది పీని కారగింపు
సేయఁగా నేమి గలదు? మా జెట్టి కిడుట
కార్యమని యెంచి బోనంపుఁ గడవ [1] నించి
యంతలో వచ్చు దృఢబాహు చెంత కరిగి. 191

మ. అకటా! యీయెడ నీకు వండి యిడఁ బుణ్యస్త్రీలు లేరై రె? యే
టికి నా యింటికిఁ దెచ్చి తన్నియుఁ జెనంటిన్ దోషి నే నంచు నిం
చుక శంకింపక హస్తము ల్పిసికికొంచుం గించిదానమ్రమ
స్తకయై నిస్తులకైతవంబు పచరింప న్వాఁడు నిర్విణ్ణుఁడై. 192

క. ఇది యేమి బెదద వచ్చెనొ
గద! యని పలుమాఱు వేఁడఁగాఁ గొదుకుచు న
మ్మదవతి యే నేమని చె
ప్పుదు నింతకుమున్ను పొరుగు పొలఁతుక నాతోన్. 193

క. తన మగనికిఁ దనకును నడ
చిన జగడముఁ జెప్పఁగా విచిత్రంబని యే
వినుచుంటి నంత వేఁపుల
తినియె స్నిమాఱు వండి డించిన దెల్లన్. 194

తే. అనుడు నాతండు తత్సంగమాశఁ జేసి
యెంతలే దింతె కద దీని కేల వగవ
నని యవాగుజలంబుల నధికజాఠ
రాగ్ని వారించి తరల కట్టాడుటయును. 195

1. ధించి

చ. కనుఁగొని వీఁడు నిల్చె నిది గాదని యెంచి యసహ్యరోషక
ల్పన మొనరించి యవ్వికచపంకజలోచన పాంథ! యిందు ర
మ్మనుటయు నిల్లు సేకొనెద వద్దిక మత్పతి వచ్చువేళ నీ
కినుకలు సాగ విచ్చట జగేయన నాతఁడు భీతచిత్తుఁడై. 196

తే. లెస్స తెఱువాటు గొట్టితి లెమ్మటంచు
గ్రుడ్లు కొలఁదిగఁ గన్నీరుఁ గ్రుక్కుకొనుచుఁ
దగిన మాటకు నోరేది దాని యిల్లు
వెడలె రఘురాము తమ్ముని బిలిచికొనుచు. 197

వ. అట్లు వెడలి యేతండు. 198

సీ. కంబళాక్రామితక్ష్మాభాగసవిధంబుఁ
జేరువారలతోడఁ బోరువారు
నిజదేహబహువర్ణనీయవిచిత్రము
ల్చెవులొగ్గువారితోఁ జెప్పువారు
నాగామిదివసగమ్యపురాధ్వపరిమాణ
మదనెఱింగినవారి నడుగువారు
క్షీరవిక్రయపరాభీరనారీకోటి
తోడ నవ్వులబేరమాడువారు

తే. నగ్గి గొని తెచ్చి రథ్యాతృణాళి వైచి
[1](శీత) తిమిరోద్ధతికిఁ బ్రతిష్ఠించువారు
నైన నానావనీసమాయాతపథికు
లమరఁ గనుపట్టు రచ్చకొట్టమున కరిగె. 199

తే. ఏఁగి [2](తత్తత్పథికులు) నదెవ్వరనుచుఁ
దెలిసికొన నేనయా! పరదేశి ననుచు

1. శీమ (పూ) 2. తత్తత్పథికుల (పూ)

నచట శయనించి తన మోస మాత్మ నెంచి
యుసురుసు రటంచుఁ బొరలాడుచుండె నంత. 200

తే. తత్సమీపంబుననె ఘోరదారుయంత్ర
సక్తపదుఁ డొక్కఁ డారసి "జార ! యెన్ని
కాఁపురంబులు గూల్చితో కద !" యటంచుఁ
బలుక నావంటివాఁ డిందుఁ గలిగె ననుచు. 201

ఉ. ఆదృఢబాహుఁ డొయ్యనఁ దదగ్రగతుండయి పిన్నవాఁడ ! నీ
కీ[1](దశ)యేలవచ్చెఁ బురి నెవ్వరివాఁడవు ? తెల్పు మంచు న
త్యాదృతి పీడె మిచ్చిన నతం డిదె చెంగటి శూద్రవీథిలో
నైదువ యంట యొక్క కులటాంగన యున్నది పాపమూర్తియై. 202

తే. దానితో నొక్క జగజెట్టి తగిలి యుండు
వాని కుడిగంపువాఁడనై యేను గొలిచి
యుందు నది సైఁపలేక నేఁ డొక్క మ్రుచ్చుఁ
దనము నామీఁద మోపినంతనె తలార్లు. 203

క. [2](విని) వచ్చి దొంగగా యని
యొనరఁగ నిట బొందకొయ్య నుంచిరి కన్వే
గిన వెనుకఁ దెలిసికొని య
చ్చని ననుఁ బొమ్మందు రింతె యది యట్లుండెన్. 204

తే. అయ్యా! మీరెవ్వ రన నాతఁ డాత్మవృత్త
మంతయును దెల్పెఁ జేఁజేత నప్పళించి
నవ్వె యా పిల్లబంటు నానలినవదన
సుమ్ము నన్నింత చేసె నసూయ చేత. 205

1. దెస(పూ) 2. విన (పూ)

క. నీవేల తగిలి తయ్యో
బావా? యిఁక నేమి యొక యుపాయము వినుమా!
నీవాంఛదీరుభోజన
మావనరుహగంధి రతియు నబ్బెడు నీకున్. 206

చ. ఇది సిగ నంటఁ గట్టుకొని యేఁగి తదీయగృహంబు మ్రోల నీ
వెద భయ మింత లేక మొరయింపుము జెట్టియు నిట్లు సేయుఁ ద
త్సుదతి యొనర్చు నిచ్చకముఁ జూడుమటం చొకగంట యిచ్చినం
బొదలి తదుక్తరీతి నట వోయి వెసన్ దృఢబాహుఁ డయ్యెడన్. 207

తే. గంట మొరయింప నవ్వాలు గంటి తలుపు
దెఱచి తోకొనిపోయి మందిరములోన
నునిచి నీకిడఁ గోరి నేఁడొక్క పథికు
మన్నిగొంటి నటంచుఁ బ్రేమంబు నిగుడ. 208

క. అనఁటాకున నన్నము శా
కనికాయం బునుపఁ బాపి[1](కట్టిఁడి)కానా!
యనుచు భుజియించి దీపం
బునుపమిఁ దన తెఱఁగు తెలియకుండఁగ నంతన్. 209

క. రమణీయశయ్యపైఁ ద
త్కమలేక్షణఁ గూడి మదనకదనక్రీడా
త్యమితానందముఁ జెందెం
దమి దీఱఁగ బంటువాని ధర్మం బనుచున్. 210

ఉ. అంతట మల్లవర్యుఁడు లతాంతకృపాణనితాంతమర్దిత
స్వాంతత వచ్చి నిల్చి తలవాఁకిట ఘంటిక మ్రోయఁ జేయ న

---

1. కట్టడి (పూ)

య్యెంతి యిదేమొ యంచు నొకయించుక చింత వహించి తద్విధం
బంతయుఁ గాంచి నిన్నెఱుఁగనా యనుచున్ దృఢబాహుతో ననున్. 211

తే. మంచి దెవ్వని చేతనో మర్మమెఱిఁగి
వచ్చి తందులకేమి నీ వాంఛ దీఱె
జెట్టి యరుదెంచె వాని జోకొట్టి నిన్నుఁ
బనుతు నందాఁక నట్టుకపై వసించు. 212

క. కదలకు మచ్చట పాము
న్నది యందు రటంచు వాని నట్లుంచి రయం
బొదవ న్వాఁకిలి దెఱచిన
మది యలరన్ జెట్టి కేళిమందిర మెనసెన్. 213

తే. అంతలో నేమి చెప్పుదు నట్టియపుడె
[1](వీర)హనుమంతగర్వదుర్వారశౌర్యుఁ
డైన రణధీరుఁ డేతెంచి యధికహర్ష
మెనయ వాఁకిలి దెఱవ నవ్వనితఁ బిలువ. 214

క. గుండె [2]పటుక్కున వచ్చె వి
భుండిఁక నెట్లనుచు మల్లపుంగవుఁ బథికుం
డుండెడు నట్టుకపై వా
రొండొరులం గానకుండ నునిచి విసీతిన్. 215

తే. గడియ సడలించి కన్నీటఁ గాళ్ళు [3](గడుగఁ)
గొమ్మఁ గౌఁగిటఁ గదియించి కుస్తరించి
పడుకయింటికి నరిగి దీపంబుఁ బెట్టు
మని నిజోదంత మాద్యంతమును వచించి. 216

1. వచ్చె (పూ) 2 లొట్టుక్కున 3. కడిగి (పూ)

చ. తన భుజశక్తి మెచ్చి సముదారత నచ్చటి భూమిభర్త యి
చ్చిన ధనమెల్లఁ జూపి యిది చేసుట చూడఁగ దీని వంకఁ జు
మ్మని వివరించి తెల్పుటకు నయ్యెఱ డుస్సి కృపాణిఁ గేలఁ గై
కొని ఝళిపించినం గడు దిగుల్పడి యాతనివంకఁ జూచుచున్. 217

క. అట్టుకపైఁ దగు తెలివరి
జెట్టియుఁ దముఁ జూచెనేమొ చేతం గరవా
ల్పట్టెనని తలఁచి తత్తఱ
ముట్టిపడన్ డిగ్గ నుఱికి యురువడిఁ బఱవన్. 218

తే. అపుడు నందియ మంది రోషార్తుఁడైన
పురుషుతో నది[1]యేలీల బొంకవలయుఁ
బలుకు మనినఁ బ్రభావతిపంకజాక్షి
తేటపడ నీవ యిదియును దెలుపు మనిన. 219

తే. చిలుక యిట్లను నవ్వు డచ్చెలువ మోస
కారి పెనిమిటి [2](నోవన్నెకారి)మగఁడు
యేల చూపితి విప్పుడ యీ ధనంబు
ధనపిశాచంబు లవి యథార్థమ్ము సుమ్ము. 220

క. ధనము పిశాచులు ఘంటా
ధ్వనితోఁ గాచుకొని యుండు ధనమున వినమే
కనుఁగొంటిమి గద గంటలు
చనునే బలివెట్ట కర్థచయ మిలు చేర్పన్. 221

తే. ఇంకనైనన బలి దెచ్చి యీయకున్నఁ
బొసఁగదని వల్క నతఁడు కాఁబోలు ననుచుఁ
గాళ్ళు నొచ్చియుఁ జూడక కాఁపుటింటఁ
గోడిఁ గొని తెచ్చి బలిపెట్టె కోర్కెఁ జెందె. 222

1. యేరీతి. 2. యోవన్నెకారి (పూ)

## ఇరువదితొమ్మిదవ రాత్రి:

చ. అని తెలుపం బ్రభావతి యయారె కథాస్థితి యంచు మెచ్చి య
య్యినుఁడు సురేంద్రదిక్కుధర మెక్కుట కేళినిశాంతసీమకుం
జని తమి నాఁటి రేయి నృపచంద్రుని జేరఁగఁ గోరి యేఁగుదెం
చినఁ గని దానితోఁ బలుకుఁ జిల్క మరందరసంబు చిల్కఁగన్. 223

వ. ప్రభావతీ! నిజవదనవక్తవ్యవార్తావిశేషంబు పరులచేతం బలికించి తనయందు నీషద్దోషంబు లేకుండం జేసిన బాలసరస్వతీనామధేయయగు నమాత్య నందనకుం గల యనివార్యప్రభావంబు నీకుం గలిగినం గాని యొప్పని యిప్ప నికింబోవుట ముప్పవుఁ గదా యనిన నప్పడంతి తప్పక కనుంగొన నప్పత్రి గోత్రారి యిట్లని చెప్పం దొడంగె. 224

### ఇరువదియవ కథ

ఉ. ఉజ్జయినీపురంబు మెఱయు న్మణిహర్మ్యశిఖావిహారియో
షిజ్జన మొక్కచో జలము చేఁదికొనం దలవాంచఁ దన్ముఖో
ద్యజ్జలజాళియాతికి భయంపడి దేవనదీరథాంగముల్
పజ్జ ముడుంగఁ బాఱుఁ బృథుపద్మకుడుంగము లందడంగఁగన్. 225

ఉ. ఆపురమేలు పూర్ణకరుణాభరణుండగు విక్రమార్కుఁడు
ద్దీపితమంత్రిశక్తి గడిదేఱిన భట్టి యుపాయ మాత్మబా
హాపరిపాలితం [1](బగు) సమగ్రశుభప్రతిపాదిగా బుధ
స్థాపకదానలక్ష్మి యను దాది యశోరుచికన్యఁ బ్రోవఁగన్. 226

ఉ. ఆతని కొక్క మంత్రి గలఁ డద్భుతశీలుఁడు పుష్పహాసవి
ఖ్యాతుఁ డతండు నవ్విన లతాంతపువాన యెసంగు నిస్తులా
స్తోతకరాద్భుతక్రియలు చూచినయప్పుడు మానసైకశో
కాతిశయంబు బల్మిని దదాస్యము హాస్యము గాన దెన్నఁడున్. 227

---

1. బటు (పూ)

తే. అంత నొకనాఁడు విక్రమార్కావనీంద్రుఁ
డంతిపురమునఁ గదళిక యనెడు పేరఁ
దనరు మోహపు రాణియుఁ దానుఁ గూడి
పొత్తుల భుజింపఁగా నొక్క బోనకత్తె. 228

తే. ఒఱపు దనరారఁ జేఁపల యూర్పుఁ గూర
యిడినఁ గదళిక చే యెగనెత్తి యాస్య
మవలగాఁ ద్రిప్పి యిదిమేమి యారగింప
వనెడు పతిఁ జూచి రాని జంకెనలు నిగుడ. 229

ఉ. ఎన్నఁడు నిన్నె గాని[1](పరు నేను గనుంగొన) గండుమీల ని
ట్లెన్నిక లేక యంటి భుజియింపఁగ వచ్చెఁ బతివ్రతాత్వసం
పన్నిధి నైన నాకనుచుఁ బల్కినఁ బళ్ళెరమందుఁ ద్రుళ్ళి య
క్కన్నుల కల్కి మాటకుఁ బకాపక నవ్వె విపక్వమీనముల్. 230

క. నవ్వినఁ గనుఁగొని పొదివిన
నివ్వెరఁ జేతులను వార్చి నృపవరుఁ డంతన్
నివ్వటిలు సందియంబున
జవ్వాడు మనంబుతో హజారముఁ జేరెన్. 231

తే. చేరి మంత్రుల రావించి చిన్నఁబోవు
మొగము తోడుత నద్భుతంబును [2](వచించి
యేల) నవ్వెనొ యుడికిన మీలు? తెల్పుఁ
డనుచు గద్దించి యడుగ నయ్యలఘుమతులు. 232

క. ఇది యేమొ యిప్పుడు తెలియదు
గద! తగ వివరించి చూడఁగాఁ దోఁచినచోఁ
బదపడి చనుదెంచియు విని
చెద మన వారలకు నృపతి సెల విచ్చుటయున్. 233

1. పరు నెన్నడుఁ గన్గొన(పూ)  2. వచింప నేల (పూ)

క. పనిచినఁ జనువారలలో
ఘనబుద్ధి యనంగఁ బేరు గల మంత్రి గృహం
బున కరిగి హాస్యహేతువుఁ
గన నేరక వగలఁ బొగులఁగా నట్టి యెడన్. 234

క. బాలసరస్వతి యతిమతి
శాలిని యగు మంత్రితనయ చనుదెంచి యిదే
మాలోచన యని యడిగి త
దాలాపము లెల్ల విని మహాద్భుతమతియై. 235

వ. తన్మత్స్యహాసంబునకుం బూర్వంబునం బ్రవర్తిలిన కదళికావిక్రమార్కుల వాక్యంబు లామ్రేడితంబుగా విని యంజనముఖంబున నిక్షేపంబునుంబోలె మనీషాబలంబునం దత్కారణం బెఱింగి, "యయ్యా! యీ యాశ్చర్యంబు వధూశాఁబరీవిడంబనంబునం బొడమినయది. పాము జాడ పామునకుం గాని పరులకుం దెలియఁ బడని తెఱంగున నంగనలకుం గాని యితరులెఱుంగఁ గనుంగొన మీకుఁ గొలఁదిగా దీ గుట్టు బట్టబయలు గావించిన బాపంబు ప్రాపించుఁ గావున విజనాంతరంబున నుపాయంబున భూనాయకున కేఁ దెలిపెద" నని యజ్జనకున్ వెంట వసనాచ్ఛాదితాందోళికారోహణంబునం దెర మఱుంగునం గూర్చుండి యక్కురంగనయన యనుప్రసంగంబు దగిచి రాజపుంగవునితో నిట్లనియె. 236

తే. విక్రమార్కేంద్ర! సర్వజ్ఞచక్రవర్తి
వయ్యు నిక్కార్య మన్యుల నడుగఁ దగునె?
యడిగితేని నిజోదంత మవల నాడిని
యదలు పద్మినిఁ బోల్పఁ బట్టగుదు వీవు. 237

## ముప్పదియవ రాత్రి :

వ. అనుచుం బల్కెఁ దదనంతరంబు ప్రభావతీరమణీమణి యరుణోదయంబుఁ గాంచి కేళీనిశాంతంబున కరిగి యానాఁటి రేయి భూనాయకు పొందు డెందంబునం దలంచి యానందంబునఁ గందర్పశాంబరీమ త్తవేదండంబు

చందంబున మందమందగమనంబునం జనుదేర మన్మథతురంగంబు గనుంగొని యంతరంగం బుప్పొంగ నమ్మృగనామణి కిట్లను నట్లా బాలసరస్వతియు నావైసారిణహాస్యంబు నాకారరేఖాపరాభూతకుసుమశరాసనుండగు నా రాజన్యమూర్ధన్యుతో నుపమానంబుగా యవనికాభ్యంతరంబుననుండి చెప్పం దొడంగె నీవు నాకథ వినుము మతి పోదువు గాక యని యప్పతంగపుంగవం బిట్లని చెప్పం దొడంగె. 238

## మొదటి యుపకథ

క. ఆకథ యేలాగనినఁ బ
రాకు! విశాలం బనా పురం బొకటి తగుం
గాకోదరయువసౌధా
నీకాయతకమలఖేయనిరుపమ మగుచున్. 239

క. అందొక శూద్రుఁడు సుమతి య
నందగుఁ బన్మని యనం దనర్చిన పరిపూ
ర్ణేందువదన యిల్లాలుగఁ
బెందెవులుం బోని లేమి పెటపెటఁ బేల్పన్. 240

సీ. చేయప్పు లనుచు నిచ్చినవారు కటువుగా
నడుగ నుంకించి నోరాడ కరుగ
నెనరైన చుట్టాలమనుచు వచ్చినవారు
బడలిక చేతఁ జెప్పకయె చనఁగ
నాయవారంబున కనుచుఁ జేరినవారు
పరిహసింపకమున్నె తిరిగి పోవ
నెక్కలె జోగంచు నేతెంచువారు మా
టాడి చూడక వేగ మవలి కేఁగ
శిశువులెల్లను గలవారి చిన్నవాండ్రు
తినెడి చిఱుతిండి గని యది తెమ్మటంచు

గీజు పోరుట కెదఁ బెల్లగిల్లఁ బొగిలి
పొలఁతి యూఁ దార్ప నతఁడు కాఁపురము సేయు. 241

తే. కొఱుకునకు లేక మూషికకోటి చేర
కునికి మార్జాలజాల మాతని నికాయ
సీమ [1](వీక్షింపకే) మరుభూమి యయ్యెఁ
నౌర ! దారిద్ర్యమహిమ యేమనఁగ వచ్చు. 242

క. ఈజాడ లేమిచేఁ గడుఁ
దేజము చెడి వంట చెఱకుఁ దెచ్చుచుఁ బరనా
రీజనుల కమ్మి యాతఁడు
గాజు గడపినట్లు దినము గడపుచు నుండెన్. 243

వ. ఇట్టుండి యతం డొక్కనాఁడు. 244

చ. వలనగు పుట్టగోచి బిగువాఱ్చుచు సుంకపుకాసులు న్విభా
సిలు కరసాన గొడ్డలియుఁ జిక్కమున న్నొరకాయ బుఱ్ఱలోఁ
జలిదియు నుంచి బంధుజనసంతతి దర్శనభీతి లోఁగుచుం
గెళవులఁ జూచికొంచు నరిగె న్గహనంబునకై రయంబునన్. 245

మ. అపు డొక్కించుక మబ్బు గానఁబడి యింతై యంతయై మించి వి
ష్ణుపదం బంతయు నాక్రమించి జనసందోహక్షణాంధత్వకృ
చ్చపలంబై కడు గర్జితప్రబలమై సంజాతఝంఝామరు
ద్విపులంబై యొక వాన వట్టె వసుధావిర్భూతపంకంబుగన్. 246

తే. అప్పు డాశూద్రుఁ డిదె వర్ష మరుగుదెంచె
నింక నెట్టని భీతితో నేఁగి యొక్క
దారుకల్పితహేరంబధామసీమఁ
గాంచి యందుండె బ్రతికితిఁగా యటంచు. 247

1. వీక్షింపఁగా (పూ)

క. దళమయ్యె వర్ష మంబుధిఁ
దలక్రిందుగఁ బట్టినట్లు ధారాశ్రేణీ
ఝళఝళలు న్మెఱుపుల బ
ల్ధళధళలున్ స్తనితఫెళఫెళ ల్వెలసిల్లన్. 248

*సీ. పక్షపుటాంతరప్రాపితముఖపాళి
శాఖాగ్రవసదండజవ్రజంబు
బర్హివిభ్రమజాతభయపూర్ణబిలముఖో
ద్గమనాసమర్థాహిసముదయంబుఁ
గేదారకృతతటాకోదారప్రతిరతా
బ్జాలోలసంచరద్ధలికనికర
మర్దముహూర్తసాప్యాయితసికతావ
శిష్టాంబురాశి యాశీచయంబు
గిరిదరీసు ప్రగర్జితోత్కరహతాత్రి
బుద్ధసంక్రుద్ధశార్దూలభూరినఖశి
ఖోరునిహతసమీపగండోపలంబు
వర్ణన మొనర్పఁ దగియె నవ్వర్షమపుడు. 249

ఉ. అంతట నాత్మలో సుమతి యంబుజబాంధవుఁ డస్తమింపఁగా
నంతలు నింతలుం గల మదాత్మజు లాఁకట నేమియైరొ మ
త్కాంత విభుండు తెచ్చుఁగద గ్రాసమటంచుఁ దలంచుచుండఁగా
వంత యొనర్చఁ జల్లనగు వానలు నెండలు జిత్త యిత్తటిన్. 250

క. దినదినము ననక యే వన
మున నేఁగక యున్న నింటఁ బోయి రాఁజదుగా
పెనువాన యింతట న్వెలి
సిన నేఁగతిఁ బోదు జిత్తచేతులతోడన్. 251

---

*ఈపద్యము మద్రాసు వ్రాఁత ప్రతిలో లేదు.

క. నేఁటి కొకపూఁట కేనియుఁ
గూటికి లేకున్న జేపు గొడ్డలి యెత్తం
బాటిల్లదు బలిమి నిరా
ఘాటత్వర నడవి కరుగఁగాఁ దరమగునే? 252

క. అని తలఁచి నాల్గు దిక్కులు
గనుఁగొని సముదారదారుకల్పితగణనా
ఘనిఁ జూచి దొరకెఁ గదరా
యనుచు న్వేసఁ జేరి యాతఁ డతికుతుకమునన్. 253

తే. చేరి యీచేవమ్రాని పిళ్ళారి నతికి
చెక్కలొనరించి యంగడిఁ జేర్చి యమ్మ
యింటి కేఁగుట కార్య మిఁకేటి దేవుఁ
డేను గూటికి వగవఁగా నేమి కలదు. 254

తే. ఊరివారెల్ల నేఁటేఁట నొప్పగింపఁ
గడుపు విరియంగఁ దిని పండ్లు గుడుము లెల్ల
వారి కొంపలలోఁ దప్పిదారి యున్న
వెల్లఁ దినుమని తన తేజి కిచ్చు సెలవు. 255

క. కావున మఱి వీఁడెక్కడి
దేవుండొకొ దేవుఁడైన దృఢతరకరుణా
శ్రీ వెలయ సిరు లొసంగఁడె
యీవేళం దన కటంచుఁ గృతనిశ్చయుఁడై. 256

తే. పొదవుగా నెత్తి గొడ్డలి పూని పట్టి
నఱకఁ బోయిన నవ్విఘ్ననాయకుండు
నిలువు నిలువు మింత యేటికి నేఁటినుండి
దినము నూతేసి మాడలు దెచ్చి యిత్తు. 257

వ. అని పలికి యాశ్చర్యమగ్నుండగు నతని చేతికి నిజమాయాప్రభావ సంపన్నంబగు మాదల ముడుపు తుండాగ్రంబున నొసంగి ప్రతిదినంబు నంబురుహబంధుబింబోదయంబుననరుగుదె మ్మెవ్వరితో నేనియు నివ్విధంబునుం జెప్పిన నీకు నాకుం బని లేదని యనుచున్నంతలో నొట్టు పెట్టిన గతి వాన దొట్టున వెలిసిన నదియును లంబోదరమహోదరంబుగా నెంచి యింటికిం జని తన వాలుగంటికిం ధనం బొసంగిన నొయ్యన వలయు వస్తువు లస్తోకంబుగాఁ దెచ్చికొని కృతకృత్య యయ్యె నది మొదలుగా నతండునుం బూర్వోక్తసువర్ణ ప్రదాయకుండగు వినాయకువలనన్ దినదినప్రవర్ధమాన మహావైభవుండై యుండె నంత. 258

క. పొరుగింటి యువతి మందో
దరి యనునది పద్మినీసుధాకరవదనా
గురువిభవముఁ జూచి నిరం
తరతాప మసూయ కతనఁ దను నలయింపన్. 259

మ. ఒకనాఁ డాయమ యింటి కేఁగి కపటోద్యోగంబున న్లేని మ
చ్చికతో ముచ్చట లాడి నీకు సరి యే సీమంతిను ల్లేరు సు
మ్మొకసక్కెంబులు గావు లేమి పడుచో నీకై వడి న్వైభవా
ధికవై యుండెడువేళ నేకగుణసందీప్తస్థితిం గాంచుటన్. 260

క. ఒకమాటఁ దెలిసికొన వే
డుకయై యుండు మఱి యెన్నఁడు న్నేరాఁ గూ
డక యుండు పనులఁబడి నీ
వకుటిలహృదయాబ్జవగుట నడిగెదఁ జెపుమా ? 261

క. ఏ నెఱిఁగిన బ్రతుకే గద ?
యీ నడువడి యెట్లు కలిగె నింతటిలోఁ ? గాం
తా ! నిక్షేపముఁ గంటివొ ?
పోనీ యెట్లైన గూఢముగ వర్ధిలుమా, 262

చ. అని విని పద్మినీసతి ముఖాబ్జమునం జిఱునవ్వు దోఁప నా
కును మది సందియంబె యెసఁగున్ ధన మేగతిఁ జేరునంచు నే
వినినది లేదు మద్విభుని వేఁడెదఁ దెల్పెడివారె కారు చె
ప్పిన నది యెల్ల నీకు వినిపించెద నీ యెడ దాఁచ నేర్తునే. 263

తే. అనిన మందోదరీమందయాన పల్కు
లెన్ని నేర్చితి వమ్మ! నీ వెఱుఁగకుండ
నడచుకొన్నాఁడె నీ మనోనాథుఁ డకట!
యిదియె నిజమైన నీ మను వేటి మనువు. 264

మ. అకటా! నీ విటు చేటుపాటులకు లోనై యున్న యిల్లాల విం
తె కదా పుట్టిన యిల్లుఁ జేర్చు వగ లేదే సౌమ్య నీ తోడఁ దె
ల్పక యెవ్వారికిఁ దెల్పు నా స్త మది దాఁపం బల్కఁగాఁ బోలునే
లిక యెన్నేనియు నేల చాలు పలుకు ల్విన్నంతనే తోఁచెడిన్. 265

+క. నామగని వంటివాఁ డీ
భూమిన్ లేఁడమ్మ యేనె పోరాడుదుఁ గా
కేమాట యైన నాతోఁ
దా మునుపే తెలుపు నవ్విధం బట్లుండెన్. 266

తే. ఇది యెఱుంగక యున్న నాకేమి కొదవ
నీకుఁ దెలియక యుండుట నీతి గాదు
చేరి వరు వేఁడు మిమ్మాటఁ జెప్పుకున్నఁ
జత్తు [1](సరిపోల దనుము) నిస్సంశయముగ. 267

మ. అని మందోదరి యింటి కేఁగుటయు నయ్యబ్జాక్షి యారేయిఁ జ
ల్లని పూఁ బాన్పున పీడె మిచ్చి పతి కుల్లాసంబుఁ గల్పించి యా

+ ఈ పద్యము మద్రాసు వ్రాఁతప్రతిలో లేదు. 1. సరిపోదు ననుము (పూ)

యనతో మిమ్మిఁక నమ్మరాదు గద నాథా ! యీ సిరు ల్గల్గు చె
ల్లను నాకు న్వివరింపరైతిరని లీలాకోపముం జూపినన్. 268

క. సుమతి రతికేళి మీఁదం
దమకము గలవాఁడు గాన దాని నసంబా
ధమహానునయోక్తుల వ
క్షమునం గదియించి కూర్మి గడలుకొనంగన్. 269

క. ఇది [1](తెలిపిన యపుడే) సం
పద వోవుం గాన నెఱుక పఱపక యుంటిం
గొదవా యిది నావలనన్
ముదితా ! మది తాపమేల మోపియ్యెఁ గదే ! 270

తే. అని యతఁడు వెండియును వేఁడ నవ్వధూటి
యింతలోఁ బోవు సంపద యెన్నినాళ్ళు
నిలుచు నౌలెండ నాతోడఁ దెలుపఁ దగదె
చాలు విడు మంచుఁ దరితీపు చలము నెఱప. 271

క. ఆసుమతి యపుడు కుసుమశ
రాసోన్మాదమున నాగణాధిపుకరుణా
శ్రీసముపలబ్ధిఁ గంటి మ
హాసంపద లంచుఁ దెలిపె నాద్యంతంబున్. 272

క. అంతట నది యప్పుడె చని
మంతనమున గోదఁ జేరి మందోదరితో
నంతయును దెలిపి క్రమ్మఱి
కాంతునికడ నుండె గుట్టు గలయది వోలెన్. 273

1. తెలిపిననపుడే (పూ)

శా. ఆ మందోదరి చిట్టిబుస్సను చసూయాక్రాంతయై పోయి యే
మేమో వేఁడెదు బిడ్డలం గనిసి యే నింకెచ్చటం దెత్తు న
య్యా ! మీ తండ్రి గడింప లేదు గద వెయ్యార్లెన్నఁడుం జాలు మీ
మోము ల్దిందురు గాకయుం కనుచు వీఁపు ల్చిట్లిపోఁ గొట్టుచున్. 274

తే. చట్టితోఁ జట్టి పగులంగఁ గొట్టి తనదు
పదరులకు నింటి బలుకుక్క లదరి కూయ
నదరు భయమున గుక్కుమిక్కనక వెనుక
వెనుక కొదిగెను తన ప్రాణవిభునిఁ జేరి. 275

*క. మగవాఁడ ననుచు నున్నా
వగునగునే కడుపు గట్టి యప్పులు మిగులన్
దెగిచి యిటు వండిపెట్టినఁ
బొగులవు కుంభంపుమీఁది పొట్టేలు క్రియన్. 276

క. కిగ్గాడికాండ్రె యెపుడుం
దగ్గని సంపదలఁ [1](బొదల నామది) యకటా
బిగ్గన మండెదు నీకును
సిగ్గించుక లేదు డొక్క జేనేఁడు గాదే! 277

క. పొరుగింటి పద్మినీసతి
గిరుకుచు మట్టియలు గిలుకుగిలుకని నడువన్
మెరమెరలు పుట్టవే కాఁ
పుర మేటికి మగఁడు పొట్ట పోయక యున్నన్. 278

క. అని శాంతి దెచ్చుకొని ప
ద్మిని చెప్పిన మాటలెల్లఁ దెలిపిన నతఁ డే
నును జని పిళ్ళారిని నఱ
కిన నతఁడే యిచ్చు సిరులు గెలిచితి ననుచున్. 279

* ఈ పద్యము మద్రాసు వ్రాఁతప్రతిలో లేదు. 1. భోదలఁ ధామది (పూ)

తే. అంత వేగిన గణనాయకాలయమున
కరిగె నాతండు సుమతియు నపుడె చనియె
వారి నిద్దఱిఁ జూచి యవ్వారబాస్యఁ
డధికకోపానుతాపదురాపుఁ డగుచు. 280

తే ఒరుల కేటికిఁ దెలిపితి వోరి ! యనుచు
సుమతిఁ గొట్టించెఁ బ్రమథయూథముల చేత
నేర ! నీవేల వచ్చితి వోరి ! యనుచు
నట్లు సేయించె నాఁడేఁగినట్టివాని. 281

తే. ఆసుమతి యట్లు నొగిలి గేహంబుఁ జేరి
యంతయును దెల్పఁ బద్మిని యడరు వగలఁ
దూలి మందోదరీకాంత తోడ నేల
దెలిపితి నటంచు మిగులఁ జింతిలఁ దొడంగె. 282

ఉ. కావున విక్రమార్క ! వెనుక న్మదిలో నిటువంటి కార్య మే
లా వినిపింపు మంటి నని లాఘవవృత్తికి లోనుగాక నీ
వే విశదంబుగా నరయు మీదన మెల్లను దోఁపకున్న నే
నీ విధమంచు ఱేపు వచియించెద నేఁడటు పోయి వచ్చెదన్. 283

క. అని బాలసరస్వతి య
జ్ఞనపతికిని దెలిపె నని రసస్థితి మిగుల
న్వనిత కలశుకము దెలుపన్
దినకరుఁ డుదయాద్రి కరుగుదేఁ దఱి యయ్యెన్. 284

## ముప్పదియొకటవ రాత్రి :

క. అంతఁ బ్రభావతి కేళిని
శాంతమునకు నేఁగి నాఁటి సంధ్యావేళన్
గంతునిభుఁడైన ధరణీ
కాంతుని కథ కడుగుచో శుకం బిట్లనియెన్. 285

తే. అమ్మ యమ్మంత్రిసుత ప్రభావమ్ము వినుము
విక్రమార్క వసుంధరావిభుఁ డొకింత
తెలిసికొనలేక మఱువాఁడు పిలువఁ బనుపఁ
జనియె నమ్మినయన యాస్థానమునకు. 286

వ. చని యవనికాంతరసమాసీనయగుటయు నమ్మానవేశ్వరుం డితరప్రసంగంబున కవకాశం బొసంగక యంబుచరహాసంబునకుఁ గారణంబుఁ దెలుపుమనిన నచ్చెలువ కలకల నవ్వి పరుల నడుగం దగని కార్యం బడిగెద విట్లయిన ననాచరణీయంబగు ప్రయోజనం బొనర్చి యా పిమ్మట వనటకుం బాలైన పాలిక యను బాలికతోడి పోలిక గలవాఁడ వగుదు వది యెట్లనిన నవధానంబుతో వినుమని యిట్లనియె. 287

## రెండవ యుపకథ

క. ధరపై రత్నావళి యను
పుర మొక్కటి గలదు గగనపూరితమణిగో
పురమై పరమైశ్వర్యా
కరమై సరమైకలసదగారోత్కరమై. 288

క. ఆవీట రత్నవిదుఁ డనఁ
గా వైశ్యాగ్రణి యొకండు కలఁ డాతనికిన్
దేవేరి యొకతె మన్మథ
దైవతమై పాలికాభిధాన తనర్చున్. 289

క. ఆపాలిక శశిరేఖా
రూపాలిక జారజనశిరోమణి సురత
వ్యాపారమునం దన్న
వ్యాపార ప్రేమఁ జెందు టరయఁ గుటిల కతనన్. 290

*సీ. ఓవరిపైన నీ కునికిఁ గావించిరే
        బజగెడి! యని దూఱు బావగారు
పొరుగింటి గోడచాప్పునఁ గట్టివైచిరే
        యవునె! నిన్నని దూఱు నత్తగారు
వాఁకిటి చెంతఁ గావలియుంచిరే నిన్ను
        గామిడి! యని దూఱు మామగారు
పెరటిలోపలఁ బాతిపెట్టిరేమే నిన్ను
        పగలాఁడి! యని దూఱు వదినెగారు
తోడికోడలు పగచాటి పీదనాఁడు
నాగడ మొనర్తు రెపుడు వియ్యములవారు
నేరముల నెంచఁ దొడఁగు బానిసెలగుంపు
పతి పృథక్తల్పశయనుఁడై భయముఁ జూపు. 291

క. ఈరీతి నింటివారలు
కారియ యొనరించుకతనఁ గార్కొనియుండన్
నీరజలోచన నెమ్మది
జారజనాయోగవాయుసఖు కున్ముఖయై. 292

తే. అంత నయ్యింతి యారుదూరైనదాన
నైతినే కద తగువాని హత్తుకొన్న
నింతకన్నను నన్ను వీరేమి సేయ
నేర్తురని నెమ్మనంబున నిశ్చయించి. 293

తే. తనకు ననుకూలయగు నొక్క దాసితోడ
మాలిమి యొనర్చుకొని యుంచి మంచి వెట్టి
దానితో నొక్కనాఁడు మంతనమునందు
నింటివారల కసినికో లెల్ల నుడివి. 294

* "కడకుపై నిన్నంటు కాఁపురం బుంచిరే" అని పాఠాంతరము.

చ. పరపురుషాభిలాష మదిఁ బాటిలు టంతయుఁ దెల్పి తత్పురీ
పరిసరభూమి నున్న చలిపందిఁ నొక్కనిఁ దెచ్చి కూర్చినం
గరివరగామినీ! సురతకాలమునందు నినుం దలంతు దు
ష్కరమని చూడ కింత యుపకార మొనర్పు మటంచు మ్రొక్కనన్. 295

తే. అది దిగుల్పడి నీవెట్టు లరుగుదెంతు
వెన్నికౌ నటు మీఁద నీకేమి కాక
ముక్కఱయుఁ గమ్మలును దాల్చి మరియు నన్నుఁ
జూడఁ జాలక యిమ్మాటలాడె దేమొ? 296

క. అని వీడవాద దాని
న్మనమున జడు పుడుపు తేటమాటలచే న
వ్వనిత పొసఁగించి పనుపం
జని క్రమ్మఱ వచ్చి యది నిశాముఖవేళన్. 297

తే. అమ్మ! నీ మాట [1]మీఱరా దనుచు నడిగొ
నిలిపి వచ్చితి నొక నిందు నీటుకానిఁ
బురబహిర్నిర్గమప్రపాభూమి నచటి
కెట్లు పోయెదు పొమ్మని యేఁగుటయును. 298

తే. అందఱును నిద్రవోయెడు నంత తడవుఁ
జింత చేసియు సంకేతసీమఁ జేర
వెరవు గానక పాలికాతరళనయన
యాత్మలోననె యొక యుపాయంబు నెంచి. 299

క. ఇది సేయరా దటంచు
న్మది నెఱిఁగియుఁ దహతహన్ రమాతనయవశం
వద యగుటం బానుపు డిగి
పదయుగళము సద్దఱంచి భయవిరహితయై. 300

1. దాఁటరా

తే. చని యధిశ్రయణిని వహ్ని సంగ్రహించి
యింటి నడికొప్పు తగిలించి యెఱుఁగనట్లు
ముంగిటికిఁ బోయి రొద గాఁగ మొఱలు వెట్ట
నదిరి పడి లేచి గృహదాహ మనుచు [1]బెదరి. 301

వ శిశురక్షణంబునకుం బశుమోక్షణంబునకుం గృహోపకరణసంగ్రహంబునకుం దస్కరనిగ్రహంబునకుం బాల్పడి గురుజనంబు లేమఱిన సందడిం బడి యప్పడంతి బుడిబుడినడలతో నగరరక్షకాధిక్షేపదక్షంబగు సాహసంబు సహాయంబుగా సమయస్థలసరణిం గైకొని చన నంతఁ బావకుండునుం బవమాన ప్రవర్ధమానుండై నిలయాధారవేణువిదళనజనితచిటచిటధ్వానంబు లాపోశనమంత్రోచ్చారణంబుగాఁ దైలఘృతాదికంబు లెదనెదం బానీయంబులుగా నయ్యగారం బాహారంబుగాఁ గొనియుం దనివి సనక పూర్వకృత ఖాండవదాహం బుదాహరించు తెఱంగునం బ్రతివిశాఖాప్రతాపంబుఁ జూపుటవలన ధనంజయాభిధానంబునుం బుష్కరోజ్జృంభణవిధానంబువలనం బృహద్భానునామంబును గృతార్థత్వంబుగా విహరింపఁ దొడంగె నంతకమున్న పౌరజనకోలాహలంబులతో జంటయై మింటి కెగయు నెఱమంటలం గనుంగొని దూతికావచనంబునం బానీయశాలాగతుండైన జారుండును నిజమందిరాగనపరుండై క్రమ్మరియె నంత. 302

ఉ. పొలిక నిర్జనాదిభయభావము దూరము చేసి వాసియౌ
బాళి జనింప నేఁగి చలిపందిటి ముందట నన్యభీతిచే
నాలుగు దిక్కు లారసి ఘనంబగు చీఁకటి కందరంబునుం
బోలు తదంతరాళతలము న్వడిఁ జేరి మహారిరంసయై. 303

క. అచ్చట జారుని గానక
యచ్చెలి యంచ్చలితమానసాంభోరుహయై
చిచ్చవడి తెచ్చుకోలగు
హెచ్చరిక న్మఱియు వాని నెల్లెడ నెమకన్. 304

1. దెలిసి

తే. వెదకి కానక వాఁడు నాహృదయ మెఱుఁగ
వేఁడి దాఁగెనొ యని బహిర్వేదిఁ జూచి
యిచట లేఁ డెందొ యరిగినాఁ డేమొ యనుచు
నరిగి పందిటిలో నెల్ల నరసి పొగిలి. 305

శా. ఏరా మారునిబారికారియను నన్నిట్లేతురా తాళఁగా
లేరా నేరము లేటి దూఱక దయాలీలం గటాక్షింపరా
మేరా గారవ మారఁగా రతిసమున్మేషంబు లీకుండుటల్
రారా కూరిమి మీఱఁ జేరి కయికోరా జారవీరాగ్రణీ ! 306

తే. ఇప్పుడా యిందు వచ్చు టిదేమి యనుచుఁ
గోపమున దాఁగి తేమొ మద్గురుజనంబు
కనుమొఱంగుట కొక నేర్పుఁ గాంచఁ గోరి
యుంటి నేరంబు సైరించు టుచిత మిపుడు. 307

క. అని బతిమాలియు జారుం
గనుఁగొనఁగా లేక దూతికం దిట్టుచు న
వ్వనిత నిరాశంబగు నె
మ్మనము రతికిఁ దఱుమఁగా నమందవ్యథయై. 308

చ. వెలువడి చక్కఁజూడ కవివేకము గాంచితినేమొ యంచుఁ బం
దిలికయి పోయి యందరసి నిక్కముగా నతఁ డిందు వచ్చుదే
కలుగ దటంచు నిర్ణయముగాఁ దలపోయుచు నింక నేఁటితోఁ
బొలిసితి జారవాంఛ నని పోయె నిజాలయసీమ డాయఁగన్. 309

క. చని యగ్నిభయముఁ జెందిన
తనవారిం గదిసి బహువిధంబులఁ దాను
న్వనరుచు నుండెను వింటివె
జనవర ! యేతత్కథా [1](ప్రచారం బెల్లన్.) 310

1. ప్రపంచం బెల్లన్ (పూ)

తే. అవ్వధూమణి యిది యకార్యం బటంచు
నెంచ కి ల్లగ్నికై యప్పగించి జారుఁ
గలయ కదలిన యట్లగుఁ దెలిసి చూడ
నడుగరానిది నీవు నన్నడుగు టెల్ల. 311

తే. కాన నేఁడెల్లఁ దెలియఁగాఁ గానకున్న
నెల్లి తెలిపెద నీ కిది యెల్ల ననుచు
నరిగె బాలసరస్వతి యనుచుఁ జిలుక
పలుక నంతటిలోనఁ బ్రభాతమైన. 312

## ముప్పదిరెండవ రాత్రి :

తే. ఆప్రభావతి యంతఃపురాంతరమున
కరిగి యారేయి మేదినీవరునిఁ జేరఁ
బోవుచోఁ గీర మనియె నంభోజవదన !
వినుము బాలసరస్వతీవిమలమహిమ. 313

క. అంత మఱునాఁడు ధరణీ
కాంతుఁడు పిలిపింప నజ్జగన్మోహిని య
త్యంతవిభాసితమణిఖచి
తాంతరపల్యంకికాసమారోహణయై. 314

సీ. నేల జీరక యుండఁ గేలఁ గుచ్చెలఁ బూను
కొని యూడిగపుఁ జెలు ల్గునిసి నడువ
మడిమెత్తు పరువుతో మంత్రాక్షతము లీయఁ
బాల్పడి భూసురభామ లెదుర
నొక్క కే లొఱగుపై నుంచి యేకాంతంబు
దెలుపుచుఁ గూర్మి నెచ్చెలులు సనఁగ
నెదురుగాఁ బఱతెంచి నృపమౌళి సమయంబు
హెగ్గడికత్తియ లెచ్చరింపఁ

గోరి పురి వారిజాక్షులు గుంపు గూడి
యమ్మ ! యిది గాక యైశ్వర్య మౌర యనుచుఁ
బలుకఁ గోయిల పరిభాష లలఁతి నగవు
మీఱ నన్నారి యరిగె హజారమునకు. 315

క. అరిగి నవప్రతిసీరాం
తరమునఁ గూర్చుండి యద్భుతము గా పాథ
శ్చరహాస మని ప్రసంగాం
కుర మెత్తిన విక్రమార్కకువలయపతితోన్. 316

తే. అవ్వరారోహ పలుకు నన్నడుగ వలవ
దన్న నడిగెద విడ్లేని యధిప మున్ను
పలుకవలదన్నఁ బలికి యాపై విచార
మందు నలదండశూక మట్లగుదు వీవు. 317

వ. తత్పురావృత్తాంతం బవధానాయత్తంబగు చిత్తంబుతో నవధరింపుము. 318

## మూఁడవ యుపకథ

సీ. సహ్యాశైలానీత జపతపస్సంజాత
యఖిలజగత్పూతయైన మాత
జలధినాయకు నేలుఁబడి గన్న యిల్లాలు
నిఖిలపుణ్యపుఁ జాలు నిలుచు ప్రోలు
అభ్రఘట్టనఖేలనాభీలకల్లోల
యఘతూలికాజాం మడఁచు కీల
ఫణిలోకవిజ్ఞానపాటవాంతర్మీన
వినుతసస్యవితానమునకు వాన

యధిపతిసమాగమార్థప్రయాణసమయ
సముచితాంబుజనాళభక్షణవిలోల
ఘనగరుద్ధ్వానపటుపటాత్కారచారు
భూరిసితపక్షభేరి కావేరి వెలయు. 319

సీ. జలమానవులు చిమ్ము జముదాళి చాలునా
మిసిమి వాలుగమీలు మిట్టిపడఁగ
వరుణుండు వైచు మవ్వపు బిల్లగోల నాఁ
దరగ తూరుపుగట్టుదాఁక నిగుడ
వళుల పరంగుల [1](యెలగోలు) గుంపునా
వనజంబు లలఁతి గాడ్పునఁ జలింప
సలిలాబ్జపాణి యచ్చపు మేలుముసుఁగు నా
ఫేనపంక్తులు దరి నాని యెసఁగ
నలరు మాతృమనీషాసమాగతేందు
కేళిదృఢబింబపాళికాకృతికదంబ
ఖేలనాలోలమదమిళచ్చోళబాలి
కాముఖస్తోమ యయ్యాపగాంలాము. 320

ఉ. ఇవ్వలి రేవులం దుమికి యీఁది తటాలున నీటి వాలుగా
నవ్వలి గట్టుఁజేరు ద్రవిడాంగన లంబురుహోత్పలంబులన్
దవ్వగఁ ద్రోచు జాడ తగుఁ దన్నది జందెపు వాటు గాఁగ మై
మవ్వపు నీలపువ్వరు లమర్చిన టెక్కున నక్కడక్కడన్. 321

క. అసమలసమానబిసరుహ
విసరలసద్ధూళికలితవిభ్రమదావ
ర్త సముదయం బానదిలోఁ
బొసఁగుం జలనరుల గొడుగుబొమ్మరము లనన్. 322

వ. వెండియు నఖండతరతీరాగ్రహారయాయజూక నిరంతరప్రతిష్ఠితసవనపవనసఖ ధూమస్తోమంబు లంబుధిభ్రమావలమానజలపానవిలోలవలాహకంబుల యందంబుఁ బొందుపఱుప, నిరుపమానతపస్స్థైర్యస్థాపితశాకాతిప్రకాశ

1. వారిగోలు (పూ)

కుసుమంబులు పుణ్యనదీశ్రేష్ఠతాప్రతిపాదనబిరుదచామరంబుల సింగారంబులం బొంగింప, సముత్తుంగచటచ్చటారావగౌరవాతిభీతనిజపక్షజనసమాశ్వాసవచనముఖరపథికతరుణీనికరంబు లుల్లసితవల్లభచర్యాసకాశాత్మచర్యాత్తిదృతద్వీపకలాపంబుల విధంబునం జెలంగ, నభంగబాహాప్లవనపరాయణజనోత్తమాంగవలయితధవళవసనంబులు విహారసమాయాతస్రోతవ్యాళకంచుకసముంచితకుండలీకృతభోగంబుల సోయగంబునం గనుపట్ట, నీరుగట్టున నెట్టుకొను తియ్యమామిడిచెట్టులం దొరంగు ఫలరసంబునం బదనైన తావునం బొదలి పాలు పచేళిమఖదేళిమేక్షురసంబునకుఁ దోడు చూపు వేరుపనసపంటిరసంబుల కాలువలకు వింతలు గల్పించు నానాప్రసూనరసంబుల నిర్ఝరంబు లుభయపార్శ్వంబులం బొలుచు నితరనదీకదంబంబుల చక్కఁదనంబు నెక్కొలుప, నిక్కువం బిక్కటిల్లు తమ నిబ్బరపు గుబ్బలకు సురాళింపఁ బూను కరణిం దాల్చు కనకకుంభంబులతో రంభాస్తంభంబుల నడుమ వెడలి పోఁకమ్రాఁకుల నొరసికొని యాకుదోఁటలకుం గేడించి లకుచవనాంతరంబు నుందఱం గనం జెలువు మీఱ, సప్తసముద్రంబు లేకీభవించిన తెఱంగున నంబుతత్త్వంబు సాక్షాత్కరించిన విధంబునఁ బ్రవాహవిజృంభణంబు చూచుచుండ నొక్కనాఁడు. 323

క. మణిధరనామకుఁ డగు నొక
ఫణివరుఁ డవగడము కతనఁ బడి యన్నదిలో
గణనాతీతభయంబునఁ
దృణముం బలె ఝురము వెంటఁ దేలుచు వచ్చెన్. 324

ఆ. వచ్చు నతనిఁ జూచి వఱదవెంబడి నట్లు
భీతి నరుగు నొక్క భేకవిభుఁడు
కాష్ఠబుద్ధి మణివికాసితతత్ఫణా
గ్రంబు నెక్కి బ్రదుకఁగంటి ననుచు. 325

క. ఘనతరతరంగఘట్టన
జనితవ్యథ నిజఫణాగ్రసక్తుండగు నా
తని నెఱుఁగఁ డురగవరుఁడుం
జనియెన్ దరిఁ జేరలేక ఝురవేగమునన్. 326

క. చను వేళఁ దద్విధంబుం
గనుఁగొని తత్తీరశాఖిఁ గాలూఁదిన ఖం
జనవరుఁ డొకఁడిది యౌరా
యని నవ్వుచు మఱియు నమ్మహాహికి ననియెన్. 327

తే. అకట ఫణిరాజ నీకు నాహారమైన
కప్ప తలమీఁద నుండుట గానవేమొ
తెలియ కేమయ్యెఁ దరిఁజేర సలఁత దీఱి
దీనిఁ గబళింతునని యుంటివేని వినుము. 328

*క. ఇది మంచిబుద్ధి యింకం
బదటముచే నించు కేని భాషింపకు ప
ల్కెదవేని నోరు నిలువక
వదరిన భూసురుని పగిది వగతువు సుమ్మీ. 329

క. అనుచున్ బాలసర్వతి
జనవర ఖంజనము నపుడు సర్పముతోడన్
వినిపించిన యాకథ నే
వినిపించెద నేఁటి ప్రొద్దు వేగం జనియెన్. 330

తే. కాన నేఁడెల్ల మదిలోన గార్యసరణిఁ
జూచి యూహించి తలపోసి చూచికొనుము
ఎల్లి తెలియంగ లేకున్న నేనె వచ్చి
తెలిపెద నటంచుఁ బలికి యక్కలికి యపుడు. 331

*329 నుండి 336 వఱకున్న పద్యములు మద్రాసు వ్రాఁతప్రతిలో లేవు.

క. జననాథుఁ డంప నేఁగెను
దనయింటి కటంచుఁ [1](జిలుక) తద్దయుఁ బ్రేమం
బునఁ బల్కె వైశ్యభామిని
విని వేగుట గాంచి మదనవేదనమతతోన్. ౩౩౨

## ముప్పదిమూఁడవ రాత్రి:

తే. అంతిపురమున కేఁగి యయ్యబ్జనయన
[2](నాఁటి రాతిరిఁ బ్రేమ భూనాథు నరయ
నెంచి దూతికతోడ నేతెంచె నట్టి)
సెట్టిసానిఁ గనుంగొని చిలుక పలికె. ౩౩౩

తే. సకలశుభమస్తు తే వైశ్యసారసాక్షి!
[3](యెక్కడకుఁ దెల్పి నిల్పితి నేను కథను?)
మదిఁ దలఁపు వచ్చె నటుల నమ్మంత్రితనయ
వేగ మఱునాఁడె భూమీశు వెఱ్ఱిబుద్ధి
మాన్ప మదిలోఁ దలంచి సంభ్రమము తోడ. ౩౩౪

వ. నవరత్నఖచితచతురంతయానాధిరూఢయై యవ్వారారోహ హజారంబుఁ జేరం
జని యవనికాభ్యంతరంబునఁ గూర్చుండి మీనహాసకారణాధీనాజ్ఞానపరుండై
యున్న యన్నరేంద్రచంద్రుం గని తత్కథాప్రసంగంబు వినుమని యిట్లను
నట్లు మహాప్రవాహముఖంబునం బడి తెప్పతిల శక్తి చాలక మండూకధృత
మస్తకంబై పోవు నమ్మహాభుజంగంబుతో నా ఖంజనం బిట్లనియె. ౩౩౫

1. బలికి (పూ) 2. నాటి రాతిరి భూనాథు నరయఁ దలఁచి, దూతికాయుక్త
యగుచు నేతెంచినట్టి (పూ—యతిభంగములు) 3. యక్కడికి దెల్పి నిల్పితినమ్మ
కథయు (పూ)

క. ఆకథ వినుమని తద్గా
థాకథనకుతూహలంబు దఱుముఁగ వెంటన్
నాకపథంబునఁ బోవుచు
నా కుండలివిభుసితోడ నతఁ డిట్లనియెన్. 336

## నాలుగవ యుపకథ

(ఉపకథలో నుపకథ)

సీ. తామ్రపర్ణీతీరధరణిపై నొక యగ్ర
హారంబు కోశాంబి యనఁగఁ బరఁగు
నచ్చోట విష్ణుశర్మాఖ్యుఁడై యొక్క
భూసురుం డలరు నద్భుతచరిత్రుఁ
డాతండు సుకుమారి యను భార్యతోఁ గూడి
యఖిలసౌఖ్యంబుల ననుభవించు
నంతట నయ్యింతి యాత్మజాతులఁ గాంచి
కడియంపుఁ జే మీఁదుగాఁగ దివము

సేరుటయు వార్ధకమ్మున ఘోరతరవి
చారగరిమను నతఁ డర్థసంగ్రహమున
కిచ్చగింపని యాతసి వృత్తి మెఱిఁగి
తల్లియు సహోదరీజను లెల్లఁ గదిసి. 337

తే. భార్య యుండిన వనమైనఁ బట్టణంబు
పత్ని లేకున్న గృహమైన బహుళగహన
మగుచుఁ గాన్పించు నరులకు నంతయేల
[1](యాలు) లేకున్న విధినైన నధముఁ డండ్రు. 338

క. యాగముల కయోగ్యుండగు
భోగములకు బాహ్యుఁడౌ సుపుత్రోదయలీ

1. నాలు (పూ)

లాగణ్యయైన భార్యా
యోగము లేకుంట నరుల కుచితమె చెపుమా ? 339

ఆ. ఎంత దుఃఖమైన నింటికి వచ్చి యి
ల్లాలి మొగముఁ జూచినపుడె తలఁగు
నిది యెఱింగి కాదె ఋషులు వసిష్ఠాదు
లును సభార్యు లగుచు వినుతిఁ గనిరి. 340

క. ఒడలంటఁ గాళ్ళు పిసుకం
గడివెఁడు వేన్నీళ్ళ నీయఁ గంచము వెట్టన్
బడక యమర్పఁగఁ జేతికి
విడె మీయఁగ భార్య కాక వేఱొక తగునే. 341

తే. తిథులయందైన మఱి యపత్నీకుఁ డనుచు
బ్రాహ్మణార్థంబుఁ జెప్ప రేపాటివారు
నొకతె రూపసి గాకున్న నోసి! యన్న
నో! యనెడు మాత్రమునకైన నుండవలయు. 342

క. కావునఁ బునర్వివాహము
గావలయు నటంచుఁ దెలుపఁగా నాతఁడు మే
ధావిని యను భూసురసుతఁ
బావనతరవంశజాతఁ బరిణయ మయ్యెన్. 343

క. ఇలు నించికొనుట మొదలుగఁ
జలమున మెండొడ్డి మిగులఁ జండించుచుఁ ద
త్కులకంఠి గురుజనంబుల
కులధర్మం బెంచ కేలుకొంచుం దిరుగున్. 344

సీ. తండులమాషముద్గముల గాదెల నించి
మీఁద బీళ్ళ లమర్చి మెత్తు వెట్టుఁ

బక్వశాకం బెల్లఁ బతికంచమున నుంచి
యొడికంబుగాఁ బట్టి యూర్చివైచు
నాజ్యతైలఘటంబు లన్నియు వాసెన
ల్గట్టి యందనిచోట నుట్టి నుంచు
దధిపయోముఖరసద్రవ్యంబు లెల్ల దొం
తుల సందు మూలమూలల నడంచుఁ

జిక్కఁ జిలువాన మొక యింటఁ జేర్చి తలుపు
చిలుకు ముద్రించి బిగముచేయి రొండిఁ
జెక్కికొనుఁ గ్రొత్తవలపు నఁ జిమ్మ రేఁగి
వల్లభుం డెల్ల యెడఁ దన్నుఁ జెల్లి విడువ. 345

తే ఇంట నెవ్వారయిన భిక్ష మిడిన ముష్టి
వెట్టినఁ గరాళితేజి యొప్పిదము దోఁప
నెగరిపడి యింపులకు మీర లెవ్వరనుచుఁ
బెద్దపులిఁ బోలె రొప్పు నా బిసరుహాక్షి. 346

క. నా యిల్లిది నా కాఁపుర
మీయెడ నా సొమ్ము దినుట కెవ్వరు మీ రా
రా! యంచు నత్త వదినెల
వాయోడక కసరుఁ బోరు వారలతోడన్. 347

తే. ఇవ్విధంబున మెలఁగు నయ్యింతి యొంటి
తిండి కతమున నినుమడి కండ పట్టి
నీరు పోసిన మేనితో నిలుపరాని
మనసుచే జారభోగ మేమఱక తిరిగె. 348

సీ. కలికి మాటలు కిలకిలనవ్వు లోరచూ
పులు మోవి విఱుపులుఁ గులుకు నడలుఁ
పైఁట జార్పులును సోబానపాటలు కొప్పు
సవరించు నీటు చేసన్న వగలు

గోటిచిమ్ములు తెచ్చికోలు నెవ్వగ లేని
వెఱపులు నెచ్చెలి వెన్ను చఱపు
మోము ద్రిప్పులు బొమముడి ఱొమ్ముతాటింపు
రాని జంకెన కావరంపుఁ బొగరు
మొలకసిగ్గులు నట్టికొంకులును దలుపు
చాటు నిలుకడ లలఁతి వేసటలు చూపు
గడియలో వింత వగకానిఁ గాంచె నేని
కొమ్మ మారుని జంత్రంపు బొమ్మ కరణి 349

తే. ఇవ్విధంబునఁ జలి దీఱ యింటి పనులు
నూఱు నటు వెట్టి వల్లభు నోరుఁ గొట్టి
యెల్ల సొమ్ములు జారుల కెదురు వెట్ట
సాగె నిచ్చావిహారనిశ్చలత మీఱ. 350

సీ. పొంకంబుగా నూనె పంకించి సవరంబు
కుప్పె గన్పడ గొప్పకొప్పు వెట్టు
నీటి కాఁగులలోన నీడ చూచి రువార
మిట్టార యనఁ జాదుబొట్టమర్చుఁ
జనుదోయి జిగి మించుకొనఁగఁ బూసిన మాడ్కి
రహి మించు గుత్తంపు ఱవికఁ దొడుగు
సురటి విచ్చినరీతి దొరయు కుచ్చెల నేల
జీరాడఁగాఁ జల్వచీరఁ గట్టు
జాఱుపైఁట చెఱంగు బంగారు పూల
గాజుల బెడంగు జారశృంగారములకుఁ
జొక్కు చూపు మెఱుంగు తళుక్కు మనఁగ
వీథి నేవేళ మెలఁగు నవ్విప్రవనిత. 351

క. అంతట మగనికి నన్నుం
బింత యిదక వండినట్టి దెల్లను జారో
పాంతములఁ జేర్చ నాతఁడ
నంతవ్యథఁ గూటిబీదయై నెవ్వగలన్. 352

క. నీ నడకలు గంటిఁ గదే
కానీవే నగరఁ జెప్పి కారించెద ని
న్నేనంచుఁ గుంటి సుంకరి
పూనిక బెదరించుఁ బొలఁతి బొమముడి వెట్టన్. 353

తే. అంత నయ్యింతి యొక్కింత యళికి యాడి
ప్రేగు లోపలి తీఁట నీ బీదముసలి
కన్ను లుఁడఁగఁ గద నన్ను గదుమ సాగె
ననుచుఁ జింతించి యొక యుపాయంబుఁ గాంచి. 354

తే గ్రామదేవత యగు నమ్మగారి గుడికి
దినదినంబును జని మహాదేవి ! మగని
గ్రుడ్డి గావింపు మేఁటేఁటఁ గోడి బలియుఁ
బొంగలి ఘటింతు నని మ్రొక్కి పోవు మగిడి. 355

ఉ. అంతట విష్ణుశర్మ జఠరానలతాపము పర్వ నెంతయుం
జింత వహించి యించుకయు శిక్ష యొనర్ప నదత్తుఁ డౌట నీ
యింతి సిజేచ్ఛమై మెలఁగని మ్మిఁక నన్నముఁ బెట్టెనేని నా
కంతియె చాలు దీనికి నుపాయముఁ జూచెద నంచు నెంచుచున్. 356

తే. ఊరి వెలుపలఁ దగు నమ్మవారి గుడికి
దినదినము భార్య చనియెడు తెఱఁగుఁ దెలిసి
యచటి కొకనాఁడు మున్నుగా నరిగి శక్తి
వెనుకఁ గూర్చుండునంత నవ్వనిత వచ్చి. 357

క. అమ్మా ! ప్రతిదినమును నే
నిమ్మాడ్కి న్వేఁడుకొనఁగ నెన్నఁటి కిఁక నీ
వమ్మగని గ్రుడ్డి చేసెదు
నమ్మిన నా కోర్కి నీ కొనర్పుట గాదే ! 358

క. అని మ్రొక్కిన నప్పలుకు
ల్విని ధరదేవీవుఁ డెలుఁగు వేఱొక భంగిం
దనరఁగ నద్దేవత ప
ల్కిన గతి నిట్లనియె నుమ్మలిక మెల్లఁ జనన్. 359

క. నీ మగని నంధుఁ జేసెద
నా మాట ల్విను మతండు నలుగుడు పడరా
దో మగువ! యతని కన్నము
ప్రేమంబునఁ గంచ మరసి పెట్టుము దినమున్. 360

మ. అన మేదావిని శాంకరీవచనమే యంచు న్వితర్కించి యం
త నిశాంతంబున కేఁగి వల్లభునకు న్వడ్డింప నన్నంబు శా
కనికాయంబును సంఘటించిన నిజాగారంబుఁ జేరంగ వ
చ్చినవాఁడై యతఁ డూరకుండక మదశ్రీ నిట్లను న్భార్యతోన్. 361

క. తరుణి యేమో తెలియదు
తెరగట్టినయట్టు లున్నదే కన్నులకుం
దెరు వడుగుచు వచ్చితి మం
దిరమున కిఁక నేమి యనుచుఁ దెలుపుదు నీకున్. 362

క. ఇన్నాళ్ళ కరణి నేరము
లెన్నక నీ యిచ్చఁ దిరుగు మిదియు మొదలుగా
నన్నము వస్త్రం బిడుచున్
నన్నుం బోషింపు మింక నలినదళాక్షీ! 363

వ. అను నప్పలుకుల కప్పడంతి యతనిం దప్పక కనుంగొని యతండు నిజాగమనసమయంబున నింటిలోనలేఁడనియు నింతలోన నిప్పాపి కంధత్వంబు ప్రాప్తించెనే యనియును, మదీయభ్రమావిభ్రమం బింతియె కాక లోకంబులో నుపలంబులు పలుకం జాలునే? యనియును, జల్పపరాయణుండై యితం డద్దేవి మఱుఁగునఁ గూర్చుండి పలికెం గావలయునని సిద్ధాంతీకరించి

వంచనాపరుండగు నితనిం బోషించిన మంచిదాన నగుదునే!యని యెంచి కావించిన సమంచితాన్నశాకానీకంబులు జారలోకంబున కర్పించిన నవ్విష్ణుశర్మయనె తైలుంగక ని త్తెలుంగున మాటలాడి నోటికూటికిఁజేటు దెచ్చుకొంటిఁ గదా। యని దెందంబునం గుంది వినిందితరసనుండై కృశించెం గావున మౌనంబున నుండుమని ఖంజరీటంబు తెల్పిన [1](రసానుభవంబున) మేను మఱచి యయ్యురగవరుం దేతత్కథావిశేషం బింత యొప్పునే యని యుచ్చైస్స్వనంబునం బలికిన నులికిపడి యవ్వలికిం జనిన మండూకమండలేశ్వరుం గనుంగొని యిప్పాట నోటికడి పోఁగొట్టుకొంటివే యని ఖంజరీటం బరిగెఁ గావున. 364

ఆ. పరుల నడుగరాని పరమరహస్యంబు
లడుగఁదగునె విక్రమార్కభూప?
నీవె తెలిసికొనుము నేఁడెల్ల లేకున్న
తేపు తెలియ నేర్పఱింతు నీకు. 365

తే. అని యమాత్యతనూజ యయ్యధిపుచేత
నంపకము గాంచి యింటికి నరిగె ననుచుఁ
జిలుక వచియింప నంతలో జలజబంధుఁ
డుదయగిరి సౌధవీథిపైఁ బొదలుటయును. 366

## ముప్పదినాలుగవ రాత్రి

చ. కనుఁగొని యా ప్రభావతి జగజ్జనరంజనరాజభాషణం
బెనయక చిల్కపల్కులకు నేమఱియెన్ హృదయం బటంచు మో
హనగృహసీమఁ జేరి మఱి యంబుజము ల్మకుళించువేళఁ బూ
నిన పని కేఁగుచోఁ గలువనేజపురాయని తేజ యింపునన్. 367

తే. కప్పురపు బొట్టు చెమటచేఁ గరఁగి జాఱెఁ
జక్క దిద్దుము పూర్ణిమాచంద్రవదన!
యింతలోఁ [2](దక్కు)కథ వినిపింతు ననుచుఁ
బలుకఁ దొడఁగెను బులకఁద మొలుకుచుండ. 368

1. సానుభవంబున (పూ) 2. నొక్క (పూ)

క. మఱునాఁడు విక్రమార్కుం
దరసియుఁ దెలిసికొనలేక యమ్మంత్రిసుతం
బరిచారకయువతి పరం
పరచేఁ బిలిపించికొని సమాదరణమునన్. 369

తే. తెరమఱుంగున నిలుప నత్తెఱవ పరుల
నడుగఁ గూడని యిక్కార్య మడిగి నపుడె
ప్రబలతరమైన జాతిస్వరంబుఁ జూపి
యడలు తురగంబుతోడ జోడగుదు నీవు. 370

## అయిదవ యుపకథ

ఉ. ఆకథఁ జిత్తగింపుము ధరాధిప! సాధువనం బనంగ న
స్తోకతరప్రసిద్ధిఁ బొలుచుం బుర మొక్కటి యందు మందరా
ఖ్యాకలితుండు శూద్రుఁడు నయాన్వితుఁడై తగు నాతఁ డిందిరా
లోకన మేమి లేమి నతిలోకదరిద్రతఁ జెంది కుందుచున్. 371

సీ. కొలుచువారల నోరుగొట్టి లెక్కలు వ్రాసి
హరువు మీఱఁగ మణియములు చేసి
భ్రమసి యాసాసల రసవాదము లొనర్చి
ప్రకటించి రాజపట్టికలు దీర్చి
ప్రతివాసరంబు లేర్పడఁగఁ జేరువ గట్టి
వాటంబుగాఁ దెరువాటు గొట్టి
వేళ్ళమందు లమర్చి విషవైద్యత వహించి
తఱుఁగు బేరముల నెంతయును మించి
ముచ్చువగయును గని చూచి మూట మోసి
సుంకరులతోడ నొనఁగూడి జూదమాడి
యిట్లు వర్తించియును నాతఁ డేమి యందుఁ
గళవళముఁ జెందెఁ గూడుఁ గోకయ్యును లేక. 372

తే. అంత నమ్మందరుం డమందా ర్తి నుదర
పోషణంబునకై యూరిపొంత దోస
తోఁటఁ గావించెఁ గావడి పాటు పడుచు
నదియు నధ్వన్యదృక్ప్రరంబై [1]ఫలించె 373

ఉ. అంతట నొక్క నక్కదొర యంబుజబాంధవుఁ డస్తపర్వతో
పాంతముఁ జేరుదాఁక బొరియన్ జఠరానలకీల నెంతయుం
జింతిలుచుండి రేలు తన జీతపు బంటులుఁ దాను భీతి యొ
క్కింతయు లేకయే మెసవి యేఁగుఁ దదీయఫలంబు లన్నియున్. 374

తే. అసృగాలాగ్రణికి ఘటకాఖ్య వెలయు
నాగఁ డీరీతిఁ గర్కారికాతిపక్వ
ఫలపరంపర నుదరసంభరణవృత్తి
నడుపుచుండఁగ మందరుం డలుక వొడమి. 375

ఉ. అక్కట! దోసతోఁట యుడియెనఁ దదీయఫలంబు లమ్మి యీ
డొక్కను సాఁకఁ గోరితిఁ గడు న్నడురేలున వచ్చి యెవ్వరో
మక్కువ లేక నా కడుపు మంటయుఁ బుచ్చికొనంగఁ బూని యీ
చక్కెరవంటి పండ్లు తినసాగి రటంచుఁ గృశించు నెంతయున్. 376

చ. ఒక మృగధూర్తరాజవరుఁ డుజ్జ్వలనీతివిదుండు ధీరనా
మకుఁ డతిఁహరఘోరవనమధ్యవిహారుఁడు విద్విషద్విదా
రకుఁ డొకఁడు వేడుక సరాశముగా భటకోటితోడ నో
దక యరుదెంచె నచ్చటి కట త్తటిదీక్షణవీక్షితాస్యుఁడై. 377

తే. వచ్చి బడలిక దీర్చు దుర్వారకర్క
రీఫలామోదధౌరంధరీవరిష్ఠ
పవనములచేత నాహారభాగ్య మిచట
నబ్బునని యెంచి కెలని బిట్టడవి విడిసె. 378

1. తనర్చె (పూ)

క. తన మంత్రివరులతో మం
తనమున నీ దోసతోఁట తనరెడు చోటన్
మన జాతివార లుండరె
యని యాలోచన మొనర్చు నాసమయమునన్. 379

మ. ఘటకుం డంతట వేగువారు నుడువంగా ధీరుఁ డారీతి వ
చ్చుట లెల్ల న్విని మంత్రులం బిలిచి యిచ్చోఁ బోయి సంధించి యు
త్కటమద్వైభవ మెల్లఁ జూపు టనువో కాదో విచారింపుఁ డే
మిటికన్న న్మన కొక్క వేళ కగుఁ దన్మిత్రత్వమం చెన్నెదన్. 380

చ. అది యటులుండె నంతటి మహామహుఁ డిచ్చటి కేఁగుదెంచినం
దుపమొద తే నెఱింగియు నెదుర్కొని పూజ యొనర్ప కున్కి యొ
ప్పుడు మన మట్లొనర్చినను బ్రాభవహానియె గౌరవంబు సొం
పు దనర మున్ను మ్రొక్కి గద మ్రొక్కు గొన న్వలయున్ జగంబునన్.

క. అనిన విని సచివు లందఱు
ననఘా ! మఱి యాతఁ డింత యధికుండైనం
గొనివచ్చి పూజ లిచ్చిన
మనకుం దప్పేమి యది సమంచిత మనినన్. 382

తే. బుద్ధిసారాఖ్యసచివుఁడు పూని పల్కు
దొరను మంత్రులఁ జూచి సంతోష మయ్యె
మొదల నెందైనఁ జన నాకు ముదల యిచ్చి
ధీరజంబుకవరుని సంధింపఁ జనుఁడు. 383

వ. అనినం దదీయసంధానసముత్సాహభంగకారణంబగు నతని ప్రతికార వచనంబులకుఁ జిడిముడి పడి యితం డేమి యెఱుంగు విచ్చేయుం డనుచు సంధానపరకృత్యులైన యమాత్యులం గూర్చుండ నియమించి యా మృగధూర్తచక్రవర్తి యిట్లనియె. 384

క. ఒకనికిఁ దెలియు న్వేఱొక
నికిఁ దెలియక యుండుఁ గార్యనిర్ణయ మితఁ డే
టికి నడ్డగాఁడు వై చెనొ
యకటా! యది యెల్లఁ దెలియ నడుగ న్వలయున్. 385

క. అని బుద్ధిసారు నెమ్మొగ
మునఁ జూపులు నిలుపఁ గేలు మొగిచి యతం డో
యనఘాత్మ! వీరికన్నన్
ఘనుఁడం గా నైన నొక్క కార్యము వినుమా! 386

చ. మును వినియుందు ధీరుని సమున్నతగర్వవిహారుఁ డంచు నా
తని మదికి న్భవద్బలవితానము చీమల చాలుఁ బోలె నై
కనఁబడు నీవు పల్కు నుడికారపు మాటలకెల్ల నాతఁ డా
డును విరసంపుఁ బల్కులు గడు న్మఱి మోసము వచ్చు నత్తఱిన్. 387

క. మోసము వచ్చుట యరుదే
యీసునఁ దద్గర్వభాష లిచటి సృగాలా
గ్రేసరులు సైతురే విను
మా సమయము సుమ్ము దొరల కవగడ మరయన్. 388

ఆ. అతఁడు గర్వయుక్తుఁ డౌటయుఁ గాకున్న
నొక నిదర్శనము మహోగ్రశౌర్య!
ప్రభుగుణంబు విడిచి పరభూమి కింత దూ
రంబు వచ్చునే సరాళ మనుచు. 389

క. కావున గర్వాతురుఁడై
కావలెఁ గాటేని యిచటి కర్పూరికాళిం
దా విని తఁగాశ వచ్చెం
గావల నెట్లైన మనకుఁ గావలెఁ జుమ్మీ. 390

మ. మన కీ కర్కరికాఫలాళి గద సామ్రాజ్యంబు గల్పింపఁ జా
లిన యాహారము దానికై యితఁడు దోర్లీలాసముల్లాసతం
జనుదేర న్మన మేఁగి విందులగతి న్సంధించు టేకార్య మి
ప్పని నాకు న్సరిపోదు మీకు రుచియింపంబోలు నిప్పట్టునన్. 391

వ. అకార్యమాత్సర్యైకకృతానురాగులగు నీ నియోగుల మాటలకుం గోపాటోపంబు
నా మదిం బాటిల్లదు దుష్టనిరసనశుభానయనిష్ఠాగరిష్ఠులు కాక కాలోచిత
ప్రభంజనమాత్రకృత్యులగువార లమాత్యులే ? యది యట్లుండె నతనిం గని
తోడితెచ్చితేనియుం దదీయశ్రమాపనోదారంబగు నాహారం బిడవలయుం గదా
యీ కర్కరీవనంబు కొంచెం బగుటం బరాక్రమంబుఁ జూపకుండునే
యంటివేని దానికిం బ్రతికార్యం బీయుపాయంబునఁ బన్ని వచ్చెద నని
కర్ణోపాంతంబునం గొన్ని మాటలు నొడివి నిజాధినాథు దెస దరహాసంబగు
నంగీకారంబు గైకొని బుద్ధిసారుండు తదాస్థానంబు వెలువడి. 392

క. తటచలితచలదళవ్యత
తాటతాటరవశాలిఫలమిథోరణకేళీ
పటుతరజలచరనికరో
త్కటమై తనరారు చెఱువుకాలువఁ జేరెన్. 393

తే. చేరి పని పూని యిటకు వచ్చితి మదుక్తి
కొదవ పడకుండ నెట్లొనఁగూడు నొక్క
కార్య మని నాల్గు దిక్కులు గనుచు నుండ
దైవవశమున నత్యద్భుతంబు గాఁగ. 394

సీ. క్రవ్యాగతోగ్రకాకవిధూతమక్షికా
పుంజమై తగు వెన్నుపుంటితోడ
బాలకక్రీడావిపాటితరోమజా
లంబైన యట్టి వాలంబుతోడ

నగ్రిమపాదబంధాతికృథాసముం
దనములొ వెడవెడ దాఁట్లతోడఁ
గఠినవిజస్వామికరకాష్ఠనిహతజా
తంబునై తొరఁగు రక్తంబుతోడఁ
గర్ణకంఠోదరాధారకంబు లగుచు
నమరు ముయ్యారు పిడుఁదుతండములతోడ
నచ్చటికి వచ్చె నొక యశ్వ మల్పహేష
జాతి దెల్పఁగ జలపానసంభ్రమమున. 395

ఉ. వచ్చి జలంబు గ్రోల నిలువంబడఁ గన్గొని బుద్ధిసారుఁ డు
ద్యచ్చతురత్వ మొప్ప వినయంబునఁ జేరి నమస్కరించి యే
నిచ్చట నిన్నుఁ జూచి చనియెన్ బహుకాలము నేఁడు గంటి నా
ముచ్చట లెల్లఁ దీఱ మన మున్నటి నెయ్యము రెంచుకొందువే. 396

చ. అది యటులుండె నీ తను వనంతబలాఢ్యము బక్క చిక్కి యు
న్నది యిది మాఱురూపు వడి యద్దిర యిద్దురవస్థ యేక్రియం
గదిసెనొ నన్నువంటి చెలికాఁ డొకఁ డుండఁగ నిమ్మనోవ్యథా
భ్యుదయము వొంద నేటికి నయో! నను వింతగఁ జూడఁ బాడియే. 397

క. అనిన విని యత్తురంగం
బనఘా! నిను మఱవనేర్తునా బహుకాలం
బునకైన బుద్ధిసారుం
డను సుకృతివి గావె నెయ్య మలఁతియె మనకున్. 398

క. మామా [1](యల్లుర మని) మన
మామాడ్కిన్ వావి యొకటి యమరించి నయ
శ్రీ మించఁ బ్రవర్తిల్లుట
యేమైన నమ్మఱచువాఁడనే గుణహారా! 399

1. యల్లుఁడ వని (పూ)

చ. ప్రకటవిషాదవేదన పరస్పరవృత్తి నిచుం గనంగఁ దా
పకవిహితప్రవృత్తికి నవజ్ఞత యెంచక పల్కరించి నీ
వకుటిలవృత్తివైతి వినయాభరణా! మదిఁ గోరియుందు మా
మకహృదయవ్యథాకథ సమస్తము నీ కెఱిఁగింప నెప్పుడున్. 400

ఉ. ఈ పురి నొక్కరెడ్డి వెల యిచ్చి నను౦ గొనితెచ్చి పోషణ
శ్రీపరివర్ధమానునిఁగఁ జేయుట నీవు నెఱుంగుదే కదా
యాపయి నాతఁ డొక్కయెడ రైన నను న్నొలకిచ్చె నవ్యవి
త్తాపహృతిప్రణీతమతిహారికి వేటొక బేరివానికిన్. 401

గ. అతఁ డింకనేమి సెప్పుదు
సతతము నూరూర సంతసంతల కత్యు
ద్ధతిఁ బెటికలెత్తి తఱుము
న్మతి నరయం డింతయైన మత్తనుబాధన్. 402

తే. పెటికయే చాలు నా నడ్డి పిఱుఁగఁ జేయ
దానిపైఁ దాను నెక్కు నింతయును గాక
యకట వయ్యాళి గాఁగఁ బొమ్మనుచుఁ గొట్టు
నతని చేతులలోఁ జెంగలమ్మ గొట్ట. 403

మ. పొరుగూళ్ళుం దిరునాళ్ళు సాగిన భరంపున్మానిసి న్మోయ ని
ష్ఠురవృత్తిన్ననుఁ జూపి సుంకము లటంచుం గూలియంచు న్వరా
లు రయంబారఁగ మోచి నన్నుఁ దఱుము న్లోభాప్తిమైఁ దా నిరా
దరుఁడై మేఁపఁడు కాళ్ళు గట్టి విడుచుం దత్తత్ప్రదేశంబులన్. 404

తే. గొఱపమా లేదు నీరార్చు గొడవ యెఱుఁగ
గడ్డి వేయఁడు కవణంబు గాని వావి
జంబుకాధీశ! చూడు మీచాయ నేను
గుబ్బమై పుట్టి యీగోడు గుడువ వలసె. 405

క. త్రిమ్మరి మాపటికై తన
యిమ్మున కేతేర దుక్కి యెనుపోఁతులు రెం
డిమ్ములఁ గొమ్ములఁ జిమ్మం
గ్రమ్మిన నిర్దయతఁ బసులగాడిం గట్టన్. 406

ఉ. అక్కఠినాత్మకుండు కస వారసి తెమ్మని కూఁతు చేతికిం
జెక్కుడుఁబాఱ యీయ వడిఁ జెట్టది వెల్వడి చేనిమంచెపై
నెక్కిన జారుఁ గూడి రమియించి దినాంతము నందు వచ్చి బ
ల్త్రొక్కులు నామొగంబున విదుర్చును గొన్ని తృణాగ్రఖండముల్. 407

జ. తొంటిజని వాని యుప్పటు
తింటిఁ జుమా యింత పాటుఁ దెచ్చుకొనుటకై
కంటికిఁ గూరుకు రా దాఁ
కంటికిఁ దుది లేదు చిక్కకయె యెట్లుందున్. 408

క. ఇటువలె నున్నది నా కథ
ఘటకసృగాలేంద్రుఁ గొలిచి కద యుండుదు ప
ప్పటుమతికి సేమమే యి
చ్చటి కేటికి వచ్చి తసిన జంబుక మనియెన్. 409

తే. అకట! నీయట్టి సుగుణరత్నాకరునకు
నిట్టి దురవస్థ వచ్చెనే యింక మీఁద
నంతయును జక్కనయ్యెడు నస్మదాగ
మనము వినిపింతు [1](విను మసమానమాన.) 410

క. ఘటకున కహిభయ మొదవె
న్నటుగతి నీకుఁ గల పక్షపాత మతనిపై
నటియింపఁ జేసి మెలఁగుము
దిట మలరం దార్క్ష్యనామధేయుఁడ వగుటన్. 411

1. వినుమా సమానమాన (పూ)

వ. అని ధీరాగమనంబు సవిస్తరంబుగాఁ దెలిపి వెండియు 412

తే. నీవు మాకెల్ల దొరవోలె నేఁడు మొదలు
కొన్నినాళ్ళుండు భవదీయఘోరమూర్తిఁ
గాంచి ధీరుం డపూర్వమృగం బటంచుఁ
దలఁగు నది మాకు శుభము గంధర్వరాజ! 413

క. ఈ రేయి దోసపండ్ల
వ్వారిగఁ దిను మర్కుఁ డపరవసుధాధరముం
జేరెన పిమ్మట నిలు మీ
చేరువ నే నపుడు వచ్చి చేర్చెదఁ దోఁటన్. 414

క. అని పల్కి బుద్ధిసారుఁడు
చని యంతయు దెలిపె ఘటకజంబుకకులనా
థున కంతటఁ జారులు దె
ల్పిన సవి విని ధీరుఁ డొక్కఁ డేనగ వలరన్. 415

క. తనమంత్రి సుముఖనామకుఁ
గనుఁగొనుటయు నతఁడు లేచి కార్యము మీఁద
న్ననుఁ జిత్తగింపు మనుచుం
జనియెం దత్తురగమున్న చక్కటి కెలమిన్. 416

చ. చని కరము ల్మొగిడ్చి బుధసన్నుత! జంబుకజాతివాఁడ స
త్యనఘుఁడ నే నతీతము ననాగతము న్మఱి వర్తమానముం
గని వివరింతు నిప్పుడొక కాఱియచే వెతఁ జెందినాఁడ వి
ద్దినమున నీకుఁ గల్గు వడదేఱఁగఁ గర్కరికాఫలావళుల్. 417

చ. ఇది నిజమైన జేపు వచియించెదఁ దక్కినకార్య మంతయుం
దుది నొక విన్నపంబు దయతో విను మాఁకటఁ గుందినాఁడ నేఁ
డదనున దోసపండ్లు తిను నత్తఱి నన్నొకసారి పిల్వు నేఁ
జెదరని ప్రీతి నివ్వెలుఁగు చెంగట నివ్వలఁ బొంచి యుండెదన్. 418

*క. అని పూన్చి ధీరుతో న
త్యనుపమగతి సుముఖనాముఁ డవగడ మగున
ట్లొనరించి వేగ వచ్చితి
నని తెలిపె న్రవియుఁ బశ్చిమాంబుధిఁ గ్రుంకెన్. 419

వ. అంత. 420

మ. రవి రాక న్మదిఁ గోరు పద్మినులు చక్రస్త్రీలు మోము ల్ముడుం
ప వియోగవ్యథఁ గుందఁ బాల్పడియె మాకూడిక్క న్మముం గోరు కై
రవిణీశోకము చెంగలించె నది చంద్రప్రేమ మస్మద్విలో
కవిస్పష్టంబని జార లాడ నలరెన్ గాఢాంధకారచ్ఛటల్. 421

శా. ఆవేళ న్నిజకామినీకరగృహీతాభీలదండావనీ
జావాలీకృతబాహుమూలుఁడుఁ మహీయఃకంబళాచ్ఛాదితుం
డావిర్భూతకఠోరరోషుఁడయి యాత్మాకల్పితోర్వ్యారువ
న్యావీరుజ్జనితోత్పలావనపరుం డమ్మందరుం డుండఁగాన్. 422

చ. ఘటకుఁడు పంపఁగా నరిగి కంపవెలుంగు తలంగఁ ద్రోచి యు
ద్భటగతి బుద్ధిసారుఁ డటు తారునఁ గర్కరికాఫలాళిఁ జూ
పుటయుఁ దురంగము న్మెసవెఁ బో లతిక తెగిపోవఁ బత్రముల్
త్రుటితములై పడం బృథులతండము భూస్థలి సోఁకునట్లుగన్. 423

తే. అంత సుముఖుని దలఁచి యయ్యశ్వరత్న
మలఘుహేషారవంబునఁ బిలుచుటయును

*తే. అనిన విస్మయ మంది యయ్యశ్వరత్న, మెంత తార్కాణగాఁ జెప్పె నితఁ డటంచు, నెంచి యాహారవేళఁ దలంచువాఁడ, ననుచు నమ్మిక లిచ్చిన నా క్షణంబ,

క. చని సుముఖుం డధిపతితో, ననఘా యీ యశ్వమునకు నవగడ మగున ట్లొనరించి వేగ వచ్చితి, నని తెలిపె న్రవియుఁ గ్రుంకె నా సమయమునన్.

నిదియె పండ్లెల్లఁ దినిపోయె నేమొ యనుచు
మందరుఁడు కోలచేఁ బరిమార్చె దాని. 424

క. ఇటువలె నొగిలి తురంగం
బటు నిటు వడి పాఱిపోయి యస్మద్ధ్వని యే
మిటికిం జూపి తకట యని
చటులవ్యథఁ గుందె మహీభుజా! వింటి కదా! 425

క. కావున నేఁడెల్లను నీ
భావంబున నరయు మెఱుకపడకుండినచో
నీవిధ మని జలచరహా
సావిర్భూతికిని హేతు [1](వపుడ) వచింతున్. 426

తే. అని నియోగితనూజ యయ్యధిపుఁ దనుప
నిలయమున కేఁగె నని చిల్క పలుకఁ గమ్మ
తమ్మి నెత్తావి తెమ్మెర ల్గ్రిమ్ముటయును
నల ప్రభావతి కేళీగృహంబుఁ [2](జేరె) 427

ఉ. అంతఁ గ్రమక్రమంబున సహస్కరబింబము పూర్వశైలసౌ
ధాంతహిరణ్యకుంభము విహాయసమండలనామఖేటకా
భ్యంతరధాతురాగ మపరాద్రివిమానవితానితాతిదు
ర్దాంతవిభావిభావ్యముకురంబునునై జలరాశిఁ గ్రుంకినన్. 428

## ముప్పదియైదవ రాత్రి:

సీ. అద్దంబులోఁ దోఁచు నబ్జరేఖ యనంగ
మోముపైఁ దెలివాఱి నామ మమరఁ
దలిరాకుపై గ్రమ్ము నలరు మొగ్గ యనంగ
మోవిపై ముక్కఱముత్తె మమర

1. వఘుర (పూ) 2. శేరు (పూ)

వలమురిపై నంటు జలధిపంక మనంగ
గళముపైఁ గస్తురి కప్పు మెఱయఁ
గాలాహిపై మించు కంచుకంబో యనంగ
జడ మీఁద ముడి పూవు సరము లొరయ
లతనుదోహదధూమము ల్గప్పు కరణి
నంగయష్టిక నీలసంవ్యాన మెసఁగఁ
గదలి యేతెంచె రాజసంగమసుఖైక
పరతఁ జెంది ప్రభావతీపద్మగంధి. 429

ఉ. వచ్చినఁ జూచి కీర మనివారితచాతురి మీఱ నారి ! నీ
యిచ్చ గణాధినాథు గణియింపు తదాదృతి లేకయున్న నీ
వచ్చటి కేఁగు కార్యము రయంబునఁ గూడదు చిత్తగింపుమా
తచ్చరితం బటంచు నుచితంబుగ నెచ్చెలి నిల్పి యిట్లనున్. 430

తే. అంత మఱునాఁడు విక్రమార్కావనీశుఁ
డల యమాత్యతనూజాతఁ బిలువఁ బనిచి
చనవరులు చెంతఁ గొలువ నాస్థానసీమఁ
జేరి సింగపుగద్దె నాసీనుఁ డగుచు. 431

తే. తెర మఱుంగునఁ గూర్చుండి తేనె వాన
ప్రబలఁ గథఁ జెప్ప నేర్చిన బాఁపనమ్మ !
యిప్పుడైనను దెల్పుమా యేల నవ్వెఁ
బక్వమీనము లనుఁడు నప్పడఁతి పలికె. 432

క. అడుగం గూడని కార్యం
బడిగెద వట్లేని మును గజాస్యునితో వా
దుడుగక యొనర్చి పిమ్మట
ఘడఁలిన వట్టమునకు నుద్ధి యగుదువు సుమ్మా. 433

## ఆఱవ యుపకథ

చ. అది యెటు లంటివేని విను మాహురిశాహురి నుండి పన్నగాం
గదుని నివాసమై యలరు కాశికిఁ బోయెడు త్రోవ నీడ పు
ట్టదు గద నాఁగ మించిన యెడ న్నొకచో నొక శేఁతమఱ్ఱి య
భ్యుదయము నొందఁ దా గెఁ దటి నొందిన వానలచేత నంతటన్. 484

తే. అధ్వగులు కోడిగములకై యాకు లెల్లఁ
ద్రెంచి శాఖావితానము ల్దుంచినైవ
మోడుపడియుండె నది నిల్వనీడ పట్టు
గొమ్మయును లేమి తనయందుఁ గుదురుకొనఁగ. 435

తే. అంత నొక శైవుఁ డా త్రోవ నరుగువాఁడు
కెలని కొలనున నాహ్నికక్రియలు దీర్చి
చెంతఁ బడియున్న ఱాయి యా చెట్టు మొదటఁ
జేర్చి విఘ్నేశుఁ డనుచుఁ బూజించి చనిన. 436

క. అది మొదలుగఁ దెరువరు లిం
పు దలిర్పఁగఁ దెచ్చితెచ్చి పుడిసెఁడు నీళ్ళుం
బది యైదు గఱిక పోచలు
గదియించి చనంగ నచట గణపతి నిలిచెన్. 437

సీ. పాల్పొంగి వఱదలై పాఱఁ జెంగటి యూళ్ళ
కాఁపు గుబ్బెతలు పొంగళ్ళు వెట్ట
నీళ్ళు వెల్లువ గట్ట నికటాగ్రహారధ
రాసురు ల్నారికేరములు గొట్ట
యుండిగ ల్నిండఁ బొన్నూళ్ళ కేఁగెడు బేరు
లకలంకభక్తిఁ గానుకలు వైవఁ
గుప్పగాఁ దెరువాట్లు గొట్టెడు పెనుదొంగ
బంటు లాధాయ్యంబు పంచి యొసఁగ

నీడ పందిరి చెంత గన్నేరు తోఁట
నమ్మి పూజింపఁ గ్రొత్త కానాచి నంబి
పొంత నిన్చిన దారువిభూతిపాత్ర
మమరఁ గనుపట్టె నచట విఘ్నాధినేత. 438

సీ. తనుఁ దలంచినవేళ ధరణీధరకుమారి
పాలిండ్ల బోరునఁ బాలు గురియఁ
బొడఁ గనవచ్చు వేల్పులతేనికరిఁ జూచి
దాక్షాయణీభర్త తన్ను దలఁప
మనసు నిల్పుమి నెమ్మిమావుపై వయ్యాళి
మన్నీఁడు తనుఁజూచి మరలిపోవ
మముఁ బిల్వఁ బంపుకొమ్మా యని ప్రమథసం
ఘమ్ములు తనపేరఁ గమ్మ లనుప
నతులకై లాసలీలాగృహాంతరాళ
కేళికాపాళికలును గపోల మరిచ
కాయమానమహచ్ఛాయజాయమాన
మేదురామోదుఁడయ్యె లంబోదరుండు. (?) 439

క. ఆతనికి వెలిచి పథిక
వ్రాతము తనుఁ జెనకకునికి వటభూరుహ మ
త్యాతతశాఖాగ్రవస
ద్యోతటినీహంసికాసముత్కర మయ్యెన్. 440

వ. ఆసమయంబున. 441

సీ పాటలావనిజాతపటలదోహదము కా
సారార్థజలకుంభజన్మమూర్తి
సహకారశుకభారసాధారకరణి వ
న్యాంగనగళూళిఫాలాక్షవీక్ష

శాల్మలీఫలదండసంఘట్టనంబు ద
క్షిణమరున్మదహస్తిసింహరుతము
పథికప్రపాంగణప్రాపణాంకణము మ
రీచికానిమ్నగాస్వఘటపటిమ
మహితశైత్యవధూస్తనమార్గదర్శి
చటులజంఘాలవాత్యాళిజననవేళ
తాలవృంతాదిమూల్యప్రదాయకంబు
దనరు సంతప్తజనము నిదాఘదినము. 442

మ. తురగాస్యోత్క్రమకృద్దవోద్గతమహాధూమాంబువాహంబు వే
చరమాశాగతమైన గాలి కెదురై సారోజ్జ్వలస్యందనం
బు రహిం గ్రాలఁ గుమారు గాలిపటముం బోలెన్ దివి న్మెల్లనే
తిరుగంగా నిటులయ్యె నాఁగ దినము ల్దీర్ఘంబు లయ్యెం గడున్. 443

చ. పదమటి గాలివెట్ట నొకపారియుఁ గ్రోలమి నీరసంబులై
జడిసిన చిల్వగుంపు నొకసారియు మ్రింగమి సొమ్మసిల్లి మ్రా
న్పడిన గుజాని నొల్లని ఫణాయునికిం దన వాహనంబులం
బడిబడి యంపెనో యమరభర్త యనం దగె దావధూమముల్. 444

మ. జలజాప్త్యోగ్రమయూఖపుం జెకుముకి న్సప్తాశ్వకాంతోపల
మ్ముల సోఁకించి తదుద్గతాగ్నిలవమున్ బోధించి వాత్యాననా
నిలవేగంబునఁ గాలుకొల్పి పతగానీకంబు పాకంబుగా
నలరించె న్సమయాఖ్యపాచకుఁడు భూతాహారసంప్రాప్తికిన్ 445

మ. జల మింక న్నయనంబు లాతపభయక్రాంతంబులై మధ్యసం
ధ్యలనుం దోఁచని యంబుకేళికయి ప్రాతర్వాసరాపోదయం
బులఁ గాన్పించె ననంగఁ దీరనగరాంభోజాతనీరాకరం
బులు నీరార్పుటకైన బల్చెలమల న్పొల్పొందె నవ్వేసవిన్. 446

తే. దారుణారుణకిరణసంతాపదిశల
నను భవింపంగఁ జాలక యంబుదములు
మెఱుపు టుఱుములు దొరఁగి భూమిపనికాయ్య
దేశముల నిల్చె ధూమంపుఁ దిత్తులగుచు. 447

క. ఆవేసవి నిష్కాసితుఁ
డై వసుధాదేవుఁ డొక్కఁ డాత్మపురీయా
త్రావేశితకుతుకంబున
నా వట మున్నట్టి త్రోవ నరుదెంచె వెసన్. 448

సీ. గమనవేగంబునఁ గావిడి వెదురు వె
క్కసపు మ్రోఁతలఁ గిఱ్ఱుకఱ్ఱు మనఁగ
సగళకరోటిపై బిగియఁ జుట్టిన పటాం
చల మింత గాలిచే సంచలింప
సరకు లుంచిన మాత్రసంచిలో నంటఁ గ
ట్టినయట్టి నేతిలడ్డిగ దనర్పఁ
గొనలెత్తి కదియఁ జెక్కిన కావిదోవతి
పైఁ గట్టుకొన్న కంబళి యెసంగ
నాతపగ్లానిచే నీడ లరయఁ బాటి
గాఢవీక్ష నిరాశచేఁ గ్రమ్మఱంగ
వచ్చివచ్చి యతండు దుర్వారపుణ్య
వత్కృతప్రపయైన యవ్వటముఁ జేరె. 449

వ. చేరి తద్విశాలపానీయశాలాంతరంబునం బరికీర్ణోశీరతాశీతలంబగు భూతలంబున విశ్వనాథేతివచనముఖరుండగుచు విపథం డించిన విధంబునం గంబడి పఱచి సుఖాసీనుండై యచ్చెంగటం గూడిన యధ్వనీనుల వలన యాచితోపలబ్ధంబగు తాంబూలంబునం బరితుష్టుండై యందు నందంబగు పందిటం దోరణంబుగా హత్తించిన పసుపుటాకుల గుత్తుల కత్తమిల్లు నెత్తావుల మొత్తంబులు తాల వృంతంబులై దిశాభిత్తికల నొత్తుకొనుటకుం బ్రమోదాయత్తచిత్తుండగుచు

దట్టంబుగా నుట్టులం బెట్టిన సారంబులగు ఘృతక్షీరపూరంబుల నుగ్గు లిడి యగ్గలపు నిగ్గులు గల పాలబుగ్గలు ముద్దాడి నిద్దంబులై ప్రేలు వైణవడోలికల బాలకుల నునిచి జోలలు వాడుచు నిజమందిరాంగణంబునంబోలె మెలంగు పథికాంగనలఁ గనుంగొని యాశ్చర్యధుర్యుండగుచుఁ జెంగటం జెలంగు నికుంజపుంజంబులం బరిచారికలు సూపాన్నశాకంబులు పాకంబులు సేయు నంతకు నిద్రాముద్రితులై సమయం బగుటయుఁ గెలంకునం బొంకంబగు కొలంకున నకలంకంబులగు జలంబులం దోఁగి సుస్నాతులై వచ్చి యచ్చటి కాయమానంబుల నాలంబమానంబులగు గోపీచందనశ్వేతమృత్తికాదులు మతానుసారంబుగాఁ దాల్చి చను నధ్వన్యమాన్యుల నాహారంబు లడుగు తెరువరుల దీనాలాపంబులకుదుర్వారనిర్వేదంబు నొందుచు నపారపిపాసాయాసులై చేరి తదీయాధికారిదత్తామలకపూర్వకంబుగా శీతలోష్ణోదకంబుల యథాభిలాషంబుగఁ గొని ప్రసంగవశజనితంబులగు రాజకార్యంబులం బక్షాపరపక్షంబులు వహించి పోరాడు గ్రామీణుల నిరర్థప్రయాసంబునకుం దరహాసంబు సేయుచు దధిత్రకవిక్రయంబు లుపదేశమాత్రంబులుగా జారాన్వేషణంబులు ప్రధానకార్యంబులుగా సమీపజనపదంబులనుండి వచ్చియున్న యాభీరభీరువుల పరిభాషల భావం బెఱింగి యంతరంగంబుం గరంగి మార్గశ్రమంబును దినావసానప్రపాస్థలదూరంబులును విచారింపక తదానీతులై సంకేతలతాగృహంబుల కరుగు కుమారపాంథుల వయోమదాంధత్వంబుఁ దిలకించి యించువిలుకాని యకాలశౌర్యనిర్వాహణంబునకు మెచ్చుచు నత్తైర్థికుండు పూర్వరాత్రంబునఁ బ్రయోజనవశంబున జాగరూకుండై యుండుటంజేసి శయనించి నిద్రాముద్రితనేత్రుండై యుండునంత. 450

తే. తత్ప్రపాంతరజనుల సంతాపదశల
పొలుపఱుపని తన ప్రతాపంబు రోసి
కొంచెపఱిచెనొ రవి నాఁగఁ గోష్ణమయ్యె
నతులయామశయానంతరాతపములు. 451

తే. అప్పు డచ్చటఁ గూడిన యధ్వగాళి
ధనియె నిర్దిష్టనగరవిశ్రాంతి నొందఁ

ప్రొద్దు గ్రుంకినఁ బిశ్శారి పూజసేయు
బ్రాహ్మణుండును జెంగటి పల్లె కరిగె. 452

ఉ. అంతట మేలుకాంచి వసుధామరవర్యుఁ డనార్యనిర్గత
ధ్వాంతము నధ్వనీనరహితత్వముఁ జూచి దిగు ల్జనింప లో
నెంతయుఁ జింత నొంది తెరు వెక్కడనో కనఁ గూడ దీడ నే
కాంతము గాఁగ నిల్వఁగ భయం బగుచున్న దటంచు ఖిన్నుఁడై. 453

క. అంత విచారించియు ఘన
సంతమసము కతన వెడలి చనరామి నతం
డంతిక తటాకమున సా
యంతన విధిఁ దీర్చి వచ్చి యతిభయ మెనయన్. 454

శా. గంగే! ఢుంఠి గణేశ! భైరవ! మహాగౌరీపతే! పాహి! యం
చుం గాశీపురి వేల్పులం దలఁచికొంచుం బవ్వళించెం దటీ
తుంగాత్యాతతశాఖి క్రిందఁ దనకుం దోడేమియు న్లేమి నా
నంగాఁ జోరభయంబు చీమ చిటుకన్నం గావడిం జూచుచున్. 455

తే. ఇట్లు శయసించి నిద్దుర యెనయకునికి
నమ్మహీజమ్ముఁ జూచి వృక్షాగ్రగణ్య!
యల గయావటమైన నీయంత గలదె?
నిన్ను మాఁబోంటివారు వర్ణింపఁ గలరె? 456

తే. సద్ద్విజాశ్రయములు భవచ్ఛాఖ లెల్ల
నిబిడవర్ణాత్మకంబులు నీదు జడలు
హరిగతిప్రతిపాది నీ యగ్ర మరయ
నీ మహాగమవిఖ్యాతి నెఱయ మెఱసె. 457

క. నీ నీడఁ జేరు కతన న
హీనతరఖ్యాతిఁ జెంది యీ సుమపూజల్

బోనములు నడపఁగా నీ
యేనుఁగు మొగమయ్యె వెలసె నిచ్చట ననినన్. 458

చ. అలరి మహీరుహాగ్రణి నిజాగ్రపతత్త్రిభయంకరంబుగాఁ
గలకల నవ్వి యో బుధశిఖామణి నీ భణితంబు విన్నవే
చెలఁగితి నీదు నీడ వెలసెన్ గణనాయకుఁ డన్న మాటకున్
భళిభళి నిశ్చితార్థమతిభంగికి మెచ్చమి దోషమొందదే! 459

క. అనుమాటకు శైలసుతా
తనయుఁడు కోపించి మంచి తగవౌ నే నిం
దునికి న్నీ విటు ప్రబలితి
నినుఁ జేరుట వెలసినాఁడనే మహీరుహమా! 460

క. మునుపున్న యునికిఁ దలఁపక
ననుఁ జేరుట కతన వెలసినాఁ డీగణరా
జని పలుక న్నోరెటులా
డెను సిగ్గు జనింపదేమొ డెందములోనన్. 461

తే. అనినఁ జలపాదియై పాదపాగ్రగణ్యుఁ
డిట్లనియెఁ దైర్థికుం డౌర యిట్టివేళ
వీరి కలహంబు కతమున వెఱపు లేక
యుండఁ గల్గెఁగదా యని యూకొనంగ. 462

మ. జలరాశిం బవళించు శౌరి నుదరాంచల్లోకచాతుర్దశీ
కలితు న్మన్గకయుండఁ బత్త్రమున విఖ్యాతంబుగాఁ దాల్చి మ్రాఁ
కులలో నగ్రగణేయతం దనరు నాకు న్నీవు ప్రాపన్న సి
గ్గుల చే టింత యెఱుంగ కాడితివి నీకుం బ్రాపునై యుండఁగన్. 463

క. నా నీడ నిలుచు పథికులు
కానుకగాఁ గొన్ని యొసఁగఁ గాదే మఱి నీ
కీ నడవడి గలిగె న్మదిఁ
[1](గానవు) మత్కృతమహోపకారము [2](కుమతీ!) 464

1. గాపున (పూ - ప్రాసభంగము) 2. సుమతీ (పూ)

మ. అని లంబోదరుతో వటం బతికుతర్కాలంబమై యున్నచో
నిసబింబం బుదయంబుఁ గాంచు తఱి నా పృథ్వీసుపర్వార్యుఁ డా
త్మనగర్యాదరధుర్యుఁడై యరిగె నంతం దద్దుమాఖర్వగ
ర్వనిరాసంబున కంబికాసుతుఁడు దుర్వారప్రభావమ్మునన్. 465

మ. హితపూజాపరుఁడైన భూసురునితో నే నిచ్చటన్నిల్వ నేఁ
డతిసమ్మోదముతో స్థలాంతరసపర్యాలోలతం బోయెదన్
మతిఁ జింతింపకు మంచుఁ బల్కి తలఁగెం బానీయశాలం బడెం
బ్రతివేళాగతపాంథవేధ వటముం బ్రాగ్రూప మొందె న్వేసన్. 466

క. ఆవెనుక నేల తొడరితి
దేవునితో ననుచు వట మతివ్యథఁ జెందెన్
భూవల్లభ ! వింటివి కద
యావగ యగు దీవు నన్ను నడిగితివేనిన్. 467

క. అటు గనుక నీవె తెలియుము
పటుగతి నేఁడెల్లఁ గానఁబడకుండిన ని
చ్చటి కెల్లి వచ్చి తెలిపెద
ఘటియింపు మనుజ్ఞ మన్నికాయంబునకున్. 468

తే. అని ప్రధాన తనూజ గేహమున కరిగె
ననుచుఁ గీరంబు వల్క సుధాంశుకాంత
నికరముల పరు జాఱక నిలువఁ జూచి
యా ప్రభాతి క్రీడాగృహంబుఁ జేరె. 469

## ముప్పదియాఱవ రాత్రి

క. క్రమమున భాస్కరుఁ డంతటఁ
గమలాసీనుఁడయి కమలకరుఁడై కమలా
రమణీయుఁ డగుచుఁ గ్రుంకినఁ
బ్రమదాంబుధిఁ దేలి యా ప్రభావతి బాలిన్. 470

తే. రాజవిరహ ప్రభావతిరస్కృతంబు
కృతసఖీ ప్రార్థనాశతాంగీకృతంబు
నైన భూషణచయము [1](నేమ్మెన దనరఁ)
జేరఁ జనుదేరఁ జూచి యక్కీరవరుఁడు. 471

తే. అమ్మ నినుఁ జూచినపుడెల్ల నయ్యమాత్య
తనయ తలఁపునఁ బాటెడు దాని నైపు
ణీవిశేషంబు వినుమంచు నిలువఁ బట్టి
గట్టిచల ముట్టిపడ సెట్టిపట్టి కనియె. 472

క. తను మదిఁ గనఁజాలక య
త్యనుపమ మగు చింత విక్రమార్కుఁడు పిలువం
బనిచిన నమ్మఱునాఁడుం
జనియె న్ఘనబుద్ధితనయ సవినయగరిమన్. 473

వ. చని యథాపూర్వంబుగా నాసీనయై మీనహాసకారణాజ్ఞానాధీనుండైన యమ్మానవాధీశ్వరుఁ గుఱించి యాస్థానంబునం గల జనంబులు నిజమధుర వచనసుధాసారంబునకుఁ గర్ణాంజలిపుటంబు లొగ్గ నక్కంజనయన యిట్లనియె. 474

తే. పరులు దెలియంగ రాని యీ పరమగోప్య
మైన కార్యంబు నీవు నన్నడిగితేని
స్వపతి జారుల కెడసిన చపల యనెడి
కాంతతో జంట యగుదు వాగాథ వినుము. 475

## ఏడవ యుపకథ

క. సౌరాష్ట్రభూమిలో గుణ
గౌరవుఁ డను నృపతి యేలఁగాఁ దగు విభవా
ధారం బను పురిఁ గథకా
ఖ్యారాముం డొక్క భూసురాగ్రణి వెలయున్. 476

1. నేమైన దనిన (పూ)

సీ. అలికి ముగ్గులు వెట్టినట్టి తిన్నెలు, కంచు
బోరు తల్పులు, పాలువోసి చాల
యూర్చవచ్చు ననంగ నొనరు చావడి, తాళు
వారంబు, చిన్ని [1](గవాక్షములును)
వంటకొట్టము, చిలువాన [2](ముంచిన) మిద్దె,
పట్టెమంచముతోడి పడుకయిల్లు,
పడసాల ముంగిలి పందిరి పసిగాడి,
కాయధాన్యములున్న కణజములును
పెరటిలో నారికేళ జంబీరముఖ్య
నిఖిలఫలవృక్షములు, మంచినీళ్ళ బావి
[3](యమర)నయ్యింట నిత్యకల్యాణములును
బచ్చతోరణములు మించఁ బరఁగు నతఁడు. 477

తే. అతని ప్రియపుత్రియగు చపలాఖ్య యొకతె
పేర్మిఁ బోషింప నానాఁటఁ బెండ్లి కెదిగె
మరుఁడు మఱచిన సాము వేమఱును జేయఁ
దలఁచి సాదనగరిడిలో దట్టి గట్టె. 478

క. అంతట నక్కన్నియ నొక
యంతర్వాణికి నొసంగి యక్కథకుఁడు గే
[4](హాంతరమున నిల్పక) యు
న్నంతట మోదము జనింప నా దంపతులున్. 479

క. ఆరీతి నుండునంతట
నా రమణీమణికి యౌవనాగమ మొదవం

1. గవాక్ష లమరు (పూ) 2. మించిన (పూ) 3. నమర (పూ)
4. హాంతమున నిలిపికొని (పూ)

గూరిచిరి వరునితో ముద
మూరఁగఁ దలిదండ్రు లొక ముహూర్తము నందున్. 480

క. ఆరేయి చపల మగనిం
జేరుటయే కాని యేమి చెప్పదుః లోకా
చార మెఱుంగని యాతని
గారా మొక్కింతయైనఁ గానక చనియెన్. 481

క. దినదినము నిట్టు లూరక
చనిచని యామీఁద సిగ్గు చాలించి ముదం
బెనయం బైకొని చూచియుఁ
గనదయ్యె న్వాని సురతకాంక్షాగుణమున్. 482

సీ. తలుపు చెంగటఁ గొంత నిలిచి, యాకర్షణ
శ్రీలేమిఁ దనుదాన చేర నరిగి;
క్రముకఖండము లీయఁగాఁ బోయి, సంగ్రహో
న్మేష లేమిని శయ్యమీఁద నునిచి;
కదిసి పాదము లొత్తఁగాఁ బూని, యంగీకృ
తిస్ఫూర్తిఁ గనమి భీతిల్లి లేచి;
ప్రేమ గన్పడఁ బల్కరించి, ప్రత్యుత్తర
స్థితి గానఁబడకున్నఁ జిన్నఁబోయి
శాస్త్రపాఠక్రమానంతజాడ్యుఁడైన
ధవుని గని యుస్సురంచును దలుపు మూసి
గుబ్బకవమీఁది పయ్యెదకొంగు పఱచి
నేలఁ బవళించు మగువ కన్నీరు దొరఁగ. 483

సీ. కవగూడి యెడఁబాయఁగా లేని మిథునంబు
కాంక్ష వీక్షించి యేకారఁ దొడఁగు
నన్యోన్యమైత్రి సయ్యాట లాడెడు వధూ
వరుల వేడుకకు భావమున నుడుకు

భాగ్యంబు గల సతీపతుల నిర్భయరహః
క్రీడల కెల్ల గ్రుక్కిళ్ళు మ్రింగు
మదనకేళీపరిమ్లానాంగులగు దంప
తుల యందమునకుఁ గొందలముఁ జెందు

నుర్వి నిర్వక్రతరుణవయోమదాంధ
గంధసింధురగమన లఖండసౌఖ్య
మెంత గల్గియు సంభోగహీనమైన
నెట్లు భరియింపఁగలరు మహీమహేంద్ర ! 484

క. పగలెల్ల నింటిపనులకు
నగపడ నొకరీతి మఱచియైనను నుండున్
మగువ నిశాముఖమైన
న్దిగులుపడు న్మగని వగ గణించుచు మదిలోన్. 485

సీ. పట్టి కాఁపుర మింత రట్టాయెఁగా యంచుఁ
దల్లి పెల్లగు వంతఁ దల్లడిల్లు
జాయాబహుజ్ఞ ప్రజామాతృజాడ్యుఁడై
తండ్రి యందంద డెందమునఁ గుందుఁ
గ్రోధ మొందినవానిఁ గొడుకు దుర్గుణ మెంచి
యత్త మాడెత్తు మాటాడ వెఱచుఁ
దాఁ జెప్పు చదువు లింతకుఁ దెచ్చెఁగా యంచు
మామ యేమనలేక మోము వాంచు

మర్మ మెఱుఁగనివార లిమ్మగువ కేమి
యొచ్చె మున్నదొకో మగఁ డొల్లఁడనుచు
నాడుకొనఁజొత్తు రక్కటా ! యాఁడుఁ బుట్టు
పుట్టరాదు సుమా లోకమున నరేంద్ర ! 486

తే. ఇట్లు వర్తింప నొక్కనాఁ డిరులు గవియు
వేళఁ గార్యాంతరాపేక్ష వెంటఁ బడఁగ

నింటివారికిఁ జెప్పక యేఁగెఁ జపల
మగఁడు పొరుగూరికై బుద్ధిమంతుఁ డగుట. 487

క. ఆరేయి వాని చెలికాఁ
డారాధ్యుఁ డనంగఁ బరఁగు నాతండు తదా
గారమునఁ బడుకయింట ను
దారతదాగమనకాంక్షియై పవళించెన్. 488

తే. అంతఁ జపలావధూటి నేఁడైన మంచి
బుద్ధి పుట్టదె మగని కాపూర్ణదైవ
కరుణ నని కేళిగేహంబు గదిసి యచట
వాని నిజనాథుఁ డని మదిలోన నెంచి. 489

శా. చేరంగాఁ జని యక్కటా యధిప ! మీ చిత్తంబు రాతున్న సీ
వీరీతిం బద సేవ సేయుమని మీరే నన్ను శిక్షించి యే
నేరంబైన సహింప భాగ్యము గదా నిష్కారణం బిట్లు నా
పేరన్న న్మదిఁ గంటగించెదరు పెంపే మీకు నన్నేఁచుటల్. 490

క. అని దైన్యముతోఁ బలికిన
విని యాతఁడు మదనవిశిఖవివశుం డగుచున్
మును దాని తెఱఁ గెఱుంగుట
నెనసిన తమి సురతకేళి నింపు ఘటింపన్. 491

క. ఆవెనుక మగఁడు గాఁడని
భావంబునఁ దెలిసి సిగ్గుపడి యంతటిలో
దైవాధీనం బిది యని
భావించుచుఁ జపల మృదులభాషల ననియెన్. 492

తే. ఇంత మోసంబుఁ జేసి నా యీలు వెల్ల
నపహరించితి వికనేమి ? యైన కార్య

మయ్యోనేకద ! యీరీతి ననుదినంబు
నన్ను మన్నింపకున్నఁ బ్రాణములు విడుతు. 493

క. అని పలికె నదియు మొదలుగ
వెనుదీయక యజ్ఞయైన వేళల నెల్లం
జనుదెంచువాని రతి న
వ్వనితామణి తనివి లేక వర్తిలఁ దొడఁగెన్. 494

సీ. భర్తకుఁ బ్రాతరౌపాసనాగ్ని యొసంగి
దుడుకుగా ముంగిటఁ దొంగి చూచు
నాయకునకు మజ్జనజలంబు ఘటియించి
తాపి యింటికి నేఁగి తడవు చూచు
ధవుని చెంగట నిష్టదైవపూజ కమర్చి
తలవాఁకిటికిఁ బోయి నిలిచి చూచుఁ
బతికంచమున శాకవితతులు వడ్డించి
నిలువఁ గూడక గోడ నిక్కి చూచు

నెంత జాళియొ కాక యయ్యింధుముఖికిఁ
గూర్మి నారాధ్యు రాకలు గోరు టొకటె
కాని ప్రాణేశు పరిచర్య కానివావి
యయ్యొ నేమందునయ్య యయ్యతను మహిమ. 495

సీ. కీవితో నేటినీటికిఁ బోవుచో వెంట
వెంట వచ్చితిఁ జుమా విద్రుమోష్ఠి !
పొరుగింటి చెలిఁగూడి సరసము ల్పలుకుచోఁ
జెంత నిల్చితిఁ జుమా దంతిగమన !
ముంగిట జననితో ముచ్చట లాడంగ
నిక్కి చూచితిఁ జుమా టెక్కులాఁడి !
పడుకటింటికిఁ జెలు ల్ప్రార్థించి యనపుచోఁ
దలుపు మీటితిఁ జుమా తతనితంబ !

యనుచు నారాధ్యుఁ డొంటిపాటైన వేళ
నవ్వధూమణితోడ మోహంబుఁ దెలుప
నప్పుడంతియు నవి నీవు చెప్పనేల
వినర! నాకన్ను లెందున్న వనుచుఁ బలుకు. 496

క• ఈరీతి నుండునంతట
వారల యందములు సవసవలుగా విని య
య్యూరెల్ల గుజగుజలఁ బో
జారునితోఁ జపల తెలుపుఁ జాంచల్యముగాన్. 497

క. వచ్చెఁ గద బెడఁద మన కిఁక
నిచ్చట నడయాడఁ గూడ దెట కేనియు నే
వచ్చెద ర మ్మటులైన
న్విచ్చలవిడి నడువవచ్చు వెఱవకు మదిలోన్. 498

తే. అనిన భయమంది యాతఁ డోయబల! యింత
సాహసక్రియ చేయంగఁ జనునె మనకు
ననుచు వారింప విన కది యతనిఁగూడి
యరిగెఁ దెగియించి నిర్భరసురతవాంఛ. 499

శా. ఆరీతిన్ బహుదేశము ల్గడచిపో నారాధ్యుఁ డాత్మాంగనన్
గారాము ల్దలపోసి యొక్కయెడ నిక్కట్టైనచో దాని నా
నారత్నోజ్జ్వలభూష లూడ్చికొని యానందంబుతోడం బురిం
జేరెం దచ్చపలాక్షియు న్వగవఁ జొచ్చెం గార్య మిట్లౌటకున్. 500

తే. వింటివా విక్రమార్క! యవ్వెలఁది సేయఁ
దగని కార్యం బొనర్చి దుర్దశఁ గ్రశించెఁ
గాన నన్యుల నడుగఁగా రాని మీన
హాస హేతువు మఱి నీవె యరసికొనుము. 501

## ముప్పదియేడవ రాత్రి:

చ. తెలియఁగఁ జాలకున్న [1](మఱి తెల్పెద)జేపని యింటి కేఁగె న
చ్చెలువ యటంచుఁ దేనియలు చిల్కఁగఁ జిల్క వచింప నంతలో
బలబల వేగ వచ్చినఁ బ్రభావతి కేళిగృహంబుఁ జేరి చం
చలమతి నాఁటిరేయి నృపచంద్రుని పొందికఁ గోరి చేరినన్. 502

తే. చిలుక వీక్షించి కలదు విచిత్రగాథ
యది యగాధసరోజరాగాధరోష్ఠి
యనుచు వచియింపఁ దొడఁగె భాష్యార్థమాన
మాధురీమాధురీణత సాధురీతి. 503

ఆ. చేరి యెన్నికథలు చెప్పినఁ గనలేక
విక్రమార్కధరణివిభుఁడు పిలువఁ
బనుప నేఁగి మంత్రితనుజాత తత్సభా
ప్రాంగణమునఁ దెరమఱుంగుఁ జెంది. 504

తే. తనదు కథలకుఁ దరళికాతరళనయన
యాదిగాఁ గల్గు నంతఃపురాబ్జముఖులు
పుష్పహాసప్రముఖమంత్రిపుంగవులును
వచ్చియుండుటఁ దెలిసి యవ్వామనయన. 505

మ. సభవా రెల్లను సద్దు మాని వినుఁడీ సర్వంసహామండల
ప్రభుతోఁ దెల్పెద విక్రమార్కనృపచంద్రా! సావధానంబుగా
శుభదం బీకథఁ జిత్తగింపవలె నంచుం దెల్పఁ జొచ్చె న్స్వర
ర్షభ కేళీవనికామరందరసవాచాప్రాచురీచాతురిన్. 506

### ఎనిమిదవ యుపకథ

క. గంధవతీనామకము వ
సుంధర నాకపురము కరము శోభిలు భాస్వ

1. వచియించెద (పూ - యతిభంగము)

త్రైసంధవచయాళిపత్రిత
బంధురమణిసౌధకేతుపటపటలంబై. 507

క. ఆనగరరత్నమేలు
న్మానధనుం డనఁగఁ బరగు మానవపతి త
త్సూనుం డభిమానధనా
ఖ్యానవనీయుండు వెలయు నధికప్రజ్ఞన్. 508

తే. అతఁడు జనకుని వెనుక పట్టాభిషేక
మవధరించి నిజామాత్యు లాప్తకోటి
యనుదినంబును విన్నవించిన వివాహ
మొల్ల నని నిస్పృహాండయి యుండె నంత. 509

క. చనవరు లందఱు నొకనాఁ
డనఘా! కల్యాణ మొల్లనను కారణ మే
మని యడిగిన వారలదెసఁ
గనుఁగొని యభిమానధనుఁ డకల్మషఫణితిన్. 510

క. ఇట్టిది యడుగనె తగ దీ
పట్టున మీ కెఱుక లేక పలుమాఱు మొఱల్
వెట్టెదరు గాన తెలిపెద
గట్టిగఁ గామినుల నమ్మఁగారాదు మదిన్. 511

క. పురుషజనవంచనార్థము
సరసిజసంభవుఁడు [1]తనదు సామర్థ్యముచే
నిరుపమముగ నిర్మించెను
దరుణుల మాయోపజీవితాచణగతులన్. 512

తే. జవ్వనము రాక మునుపె విశ్వప్రపంచ
మంతయును హృద్గత మొనర్చి యదఁచికొందు

1. సకల

రేమి యెఱుఁగని కరణి నహీనబాల్య
చేష్టఁ బ్రకటింతు రవని రాజీవముఖులు. 513

సీ. చిన్నారి చన్నులకన్న మున్నుగఁ దోఁచు
లోకప్రమోషణలోలచింత
కలికిచూపుల వాఁడికన్న మున్నుగ మించు
గురుజనోజ్జ్వలతృణీకరణపటిమ
కటితటీచక్రకంబుకన్న మున్నుగఁ దీఱు
ననృతవాక్యస్థాపనాత్మశక్తి
చెన్నారు మైమిన్నకన్న మున్నుగఁ బొల్చు
జనవిస్మయప్రదసాహసంబు
గాఢచాతుర్యధుర్యతకన్న మున్న
పొడము గంభీరజారసంభోగవాంఛ
కమలముఖులకు యౌవనాగమముకన్న
మున్నుగాఁ గల్గు పాపసమూహ మెల్ల. 514

క. [1]చెక్కులు గలవాఁడైనం
జక్కనివాఁడైన రతులఁ జతురుండైనం
దక్కరు మగనికి నిక్కం
బక్కట జారునికి దక్కినటువలె యువతుల్. 515

క. మగువలు గరగరనై తగు
మగవానిం జూచి వీఁడు మగఁడైనఁ గదా
తెగు దుఃఖం బనుకొంచుం
దిగఁ గాఱుదు రెపుడు నెమ్మది న్వగ మిగులన్. 516

సీ. గజకర్ణముల కింత గల్గినఁ గల్గనీ
కలికి నెమ్మదికి నిల్కడలు లేవు

1. పెక్కులు

కమల చూపున కింత గల్గినఁ గల్గనీ
కాంత నెమ్మదికి నిల్కడలు లేవు
చలదళంబుల కింత గలిగినఁ గల్గనీ
లలన నెమ్మదికి నిల్కడలు లేవు
కారుమించున కింత గల్గినఁ గల్గనీ
పడఁతి నెమ్మదికి నిల్కడలు లేవు
జలదముల కింత గలిగినఁ గలుగ నిమ్ము
కమలనేత్రల మదికి నిల్కడలు లేవు
కావున వధూటి కల యిచ్చకంబు లెల్ల
విశ్వసించిన మగవాఁడు వెఱ్ఱివాఁడు. 517

క. బిసరుహనయనలు మాయా
ప్రసరల్ మఱి వారి పొందు గారాదె కదా!
యసమానమనీషాఢ్యులు
వసియింతురె యాఁడు ప్రతిమ వ్రాసిన యింటన్. 518

క. కావున వివాహవిచ్యుతి
గావించితి ననుచుఁ బలుకఁగా వార లయో
దేవా! సర్వజ్ఞుఁడ విటు
లీవాక్యము లాడవచ్చునే యివ్వేళన్. 519

తే. ఎంచి చూచిన నూట వెయ్యింట నొకతె
గాక సతులెల్ల జారసంగమసుఖైక
పరతఁ జెందిన వాన లేకరణిఁ గురియుఁ
బంట లే చందమునఁ బండుఁ బార్థివేంద్ర! 520

క. ఇలువరుసయు మానుషముం
గల రాజుల యిండ్లఁ గన్యకలు పుట్టునెడం
దెలిసిన వరించి మఱి వా
రల నగరికిఁ దెచ్చి పెనుపరాదా భ్రాలన్ 521

వ. అని నిర్బంధించిన నయ్యభిమానధనుం డియ్యకొని సమాన్వయమాన్యులగు రాజన్యుల కన్యాజనంబులం బ్రతీక్షించుచుం బుట్టిన యప్పుడ సూతికా గృహంబులు సొచ్చి బాలికాచతుష్టయంబుం బరిగ్రహించి నిజగేహంబునకుం దెచ్చి వియచ్చరపథావరోధిసాలనికరంబగు నంతఃపురంబున వేఱువేఱ గృహంబుల నునిచి క్రమక్రమంబున మదనసేనయు మంజువాణియు మణి మంజరియుమకరందయు నను నామంబు లిడి పోషింప నొక్క దాదిం గట్టడ సేసి కొండొక కాలంబునకు జవ్వనంబు నివ్వటిల్లిన నవ్వేలందులకు వరుస క్రమంబున ననుదినంబునుం గామోపభోగంబులం బ్రమోదం బావహిలం జేయుచు నప్రమత్తుండై యుండె నంత. 522

క. [1]ఆకామిను లఖపతిరతి
[2]నేకట దీఱమి మనోభవేషువితానం
బేకత నొందఁగఁ బరసుర
తాకాంక్షాయత్తచిత్తలై నెవ్వగలన్. 523

సీ. మగవారిఁ జేయక మము నాఁడువారిఁగా
సిరీతిఁ బుట్టింప నేల యనుచుఁ
బుట్టించెఁ బో సాధుపురుషుతోఁడుతఁ గూర్ప
కిక్రూరుతోఁ గూర్ప నేల యనుచుఁ
గూర్చెఁ బో పరిపాటి కొంపలోఁ గూల్పక
యీ దుర్గమునఁ ద్రోయ నేల యనుచుఁ
ద్రోచెఁ బో దయఁజూచి ఖేచరత్వ మొసంగ
కీమానుషం బీయనేల యనుచు
వారు రేలుఁ బవళ్ళు దుర్వారఘోర
కోపమునఁ బల్కెడు దురాపశాపములఁ బ
యోరుహాసనుఁ డేమి గాకునికి పలుకు
టువిద తాటంకకరణముహూర్తమహిమ. 524

1. ఆకన్నియ లొండొకరికి 2. నేకారుచ్చు ఘనమనోభవేషు

తే. వార లీరీతి నుండ దుర్వారచోర
గతులఁ బ్రతి [1](లేని)వాఁ డొక్కఁ డన్నగాఁడు
కార్యసాధకుఁ డను పేరు గలుగువాఁడు
వాఁడు తత్పురి కాళికావసతిఁ జేరి. 525

క. ఈ రాజు నగరి కలిమి కు
బేరుని బొక్కసము కన్నపెట్టిన ధన మ
వ్వారిగ దొరకు న్మద్గృహ
దారిద్ర్యం బపుడు గాని తలఁగ దటంచున్. 526

క. రే లెవ్వరు గనకుండఁగఁ
గాళీదేవిం బెకల్చి కద నుంచి తదా
భీలస్థానము మొదలుగఁ
దాలిమితో నేల మాలెఁ ద్రవ్వఁగఁ దొడఁగెన్. 527

క. పగలెల్లఁ గాళిక న్మె
చ్చుగ బిలముఖమున నమర్చు న్వాఁ డొకనా
లుగు దినములతో నరపతి
నగ రంటఁగఁ ద్రవ్వెఁ దెగువ నాటుకొనంగన్. 528

తే. ఇదియె ధనమున్న గృహమని యెంచి యచట
నిర్గమద్వార మెదలించి నెమ్మి వెడలి
దైవవశమున మదనసేనావధూటి
పడుక యిల్లొట నిలిచి విభ్రాంతుఁ డగుచు. 529

ఉ. పానుపు మీఁదఁ గెందలిరుబాకువజీరుని బాహువైభవ
శ్రీనిధియైన యమ్మదనసేనఁ గనుంగొని పొంగి నాకుఁ జే
కానుక చేసె నీ నృపతికామిని నాదగు భాగ్య మెంత సా
మ్మైన నదేల దీని బిగువారెడు కౌఁగిటఁ జేరఁ గల్గినన్. 530

1. గన్న (పూ)

చ. అని తలపోయ వాని పొలు పద్దిరపాటునఁ జూచి విస్మయం
బనుపమలీల దొట్టిన భయంబును జిల్లరసేయ వాని నె
ల్లను గదఁ ద్రోచి యీపురుషలాభము దైవము గూర్చె నంచు మిం
చిన తమి యాన నమ్మదనసేన మనోభవదూయమానయై. 531

ఉ. గ్రక్కునఁ గౌఁగిలించి తలఁకన్వల దెవ్వఁడవైన నేమి నా
చిక్కని గబ్బిగుబ్బలకుఁ జిక్కితి వెక్కడఁ బోవ వచ్చు నా
యక్కఱ దీర్పవచ్చిన లతాంతకృపాణివి నీవె నీకు నే
దక్కితి నంచుఁ బ్రేమ నిగుడం బువుపాన్పునఁ జేర్చి యచ్చటన్. 532

క. అనిరోధచుంబితాధర
మనివార్యోపర్యధఃక్రియానిష్కరణం
బనితరపూర్ణానందం
బనఁదగు రతి నవ్వధూటి యతనిం గలిసెన్. 533

తే. కలసి యిట్టు లలభ్యయోగంబు దొరకె
ననుచు వెఱగంది యిటకెట్లు లరుగుదెంచి ?
తెవ్వఁడవు నీవు ? నీకుఁ బేరేమి ? యనుచు
నడిగి యంతయుఁ దెలిసి నెయ్యమున మఱియు. 534

క. తను రాజు చెట్టఁబట్టిన
యనువుం జిరకాలకాంక్షితాన్యజనాలిం
గనతయును దెలిపి యది నేఁ
డొనఁగూడె న్నిన్నువంటి యొఱపఱి కతనన్. 535

తే. రాజకులవర్యుఁ డాత్మభార్యాచతుష్క
నిలయముల వర్సవెంబడి నిద్ర సలుపు
నాతఁ డిటు రాని దినములయందు వచ్చి
యిచట సంభోగ మొసఁగి న న్నేలుకొనుము. 536

మ. అని ప్రార్థించినఁ గార్యసాధకుఁ డమందానందముం జెంది చం
దనగంధీ ! యనుబంధి నైతిఁగద నీ తారుణ్యవిస్ఫూర్తి కై
న నగమ్యం బిది యిందు రా వెఱతు నుండన్వచ్చుఁ గాళీనికే
తనసీమన్ దిన మీవు మత్కృతబిలద్వారంబున న్వచ్చినన్. 537

చ. అన విని పొంగి యామృదుతరాంగి తరంగితసంభ్రమాప్తి నా
యన వెనువెంటఁ దత్కృతబిలాధ్వగతిన్ ఘనసాధ్వసప్రదం
బనఁ జను కాళికాగృహగుహాంతరభాగముఁ జేరి చీఁకటుల్
పెనఁగొనఁ దూర్పుమూల రతిలీలల [1]చోరుని గూడి వేడుకన్. 538

క. బిలమార్గంబునఁ గ్రమ్మఱ
నిలయము సేరంగఁ జని ఘనీకృతమోహా
కుల మొరు లెఱుఁగని కైవడి
నల చోరుని విడక యా లతాంగి మెలంగెన్. 539

క. అని యాబాలసరస్వతి
జనపతికిం దెలిపె నని రసస్థితి మిగులం
గనఁబడఁ గీరము నొడువఁగ
దినకరునిరథంబు తూర్పుదిక్తటిఁ దోఁచెన్. 540

## ముప్పదియెనిమిదవ రాత్రి

క. అంతఁ బ్రభావతి తన య
భ్యంతరమందిరముఁ జెంది యారేయి ధరా
కాంతుని జేరుట కాత్మో
పాంతమునం గులుకఁ జిలుక యల్లనఁ బలుకున్. 541

క. వినవమ్మ ! విక్రమార్కుం
డనుపమవిస్మయముఁ జెంది యవ్వలికథ యే

1. జారుని (పూ)

యనువున నడచెనొ చెపుమా
యన సచివుని తనయ సవినయంబుగఁ బలికెన్. 542

తే. మహిప ! యంతట నయ్యభిమానధనుని
రెండవ సుపాణి మరుని కూరిమిపటాణి
మంజువాణి మనోవ్యథ మగక అవునఁ
బడిన గతి నుండఁ దత్పుర ప్రాంతసీమ. 543

తే. ఏటిదరి నొక్క సన్న్యాసి యింపు నింపు
మఠము గావించుకొని శాస్త్రమంత్రతంత్ర
వేదవేదాంతవిద్బ్రహ్మవేతృగరిమ
నితని కెనలే దనఁగ వార్త కెక్కి వెలయు. 544

తే. త్రిషవణస్నానములు నిష్ఠదేవపూజ
గ్రంథపారాయణముఁ బరబ్రహ్మచింత
భైక్షభుక్తి హరీతకీభక్షణంబు
నళినశయనంబుఁ గల్గి యయ్యతి వొసంగు. 545

క. ఆసమయంబున భృగుఁ దను
భూసురుఁ డొకఁ డొక్క కార్యమునకై తమితో
నా సన్న్యాసికి నంతే
వాసిత్వము [1]మెఱయఁగా ధ్రువంబున మెలఁగున్. 546

సీ. ముదముతో యతికన్న మున్న మేల్కాని గోమ
యంబున మఠమెల్ల నలికివైచుఁ
దపసి యేటికిఁ బోవు తఱి నంటి వెంటనె
నడచు నాతని కమండలువుఁ దాల్చి
సన్న్యాసి దేవపూజకుఁ బూనుచో నుప
కరణము ల్దొలిచి శీఘ్రమున నొసఁగు

1. దోఁపఁగా

సంయమీశ్వరుఁడు బిక్షకుఁ బోవునెడ గోచి
యును నార్ద్రపటఖండ మొనరఁ దాల్చఁ
బారికాంక్షికి నజినంబుఁ బఱచి రాత్రి
పరమశుద్ధాంతరంగుఁడై పదము లొత్తు
[1]నెలమి నమ్మౌని కలలోనఁ బిలిచెనేని
స్వామి! పని యేమి? యనుచు హస్తములు మొగుచు. 547

క. ఈరీతి నుండ నాతని
మేరకు నొకనాఁడు మిగుల మెచ్చి యతీంద్రుం
డోరీ! యలరితి నిచ్చెద
గారవమున నడుగు మేమి కావలె ననినన్. 548

తే. అతఁడు ప్రణమిల్లి పల్కె సంయమి వరేణ్య!
విన్నప మొనర్ప వెఱతు నా వెఱ్ఱితనము
ముద్దుగాఁ జూచు కరుణాసముద్రమూర్తి
వగుటఁ దెల్పెద నా కోర్కె యాదరింపు. 549

ఉ. మా పొరుగింటి శూద్రుని కుమారిక పిన్నటనాఁటనుండియు
న్నాపయిఁ బ్రేమఁ గన్నది యనంతర మొక్కఁడు పెండ్లియాడి వాఁ
డీ పురిలోన నిల్వెడలనీక పరుం డటు సేరకుండ సం
జ్ఞాపరుఁడౌచు దాని ననిశంబును నేలెడు సంయమీశ్వరా! 550

సీ. ఉదుటుతో నారాక కెదురు చూచుచు ముద్దు
గాఱఁగా నది నిల్చు కడపఁ జూచి
ననుఁ జూడఁ గోరి క్రొన్ననతీవ నడయాడు
విధమున నది కుల్కు వీథిఁ జూచి
నీటికై వచ్చుట నెపముగ నాతోడఁ
బలుకుచు నది చెందు [2]బావిఁ జూచి

1. చక్క సాఁగిలి మ్రొక్కి విశ్వాస మలర 2. బావి

తమవారి మొఱఁగి తత్తరము హత్తఁగ వచ్చి
యది నన్నుఁ గలయు పూఁ బొదలఁ జూచి
యేను భరియింప లేక మీకృప సమాశ్ర
యించి యున్నాఁడ నన్ను నీదేర్పవయ్య
యార్తరక్షణ [1]మధికపుణ్యము గదయ్య
కూర్మి నెటులైన నను దానిఁ గూర్పవయ్య. 551

తే. అనినఁ జిఱునవ్వు నవ్వి యయ్యతికులేంద్రుఁ
డౌర మన్మథు నిజమాయ కడ్డ మెవ్వ
రంబుజాసనముఖులలో ననుచు నతనిఁ
జేరువకుఁ బిల్చి యొక వేరు చేతి కిచ్చి. 552

క. ఇది త్రొక్కినఁ జనవచ్చు
న్మదిఁ దలఁచినచోటి కభ్రమార్గంబున న
మ్మదవతిఁ గలసెదు పోపొ
మ్మెద సందియ మెడలి రాత్రి కేఁగు మటన్నన్. 553

మ. భృగుఁ డారేయిఁ దదౌషధాప్తిమహితాంఘ్రిద్వంద్వుఁడై పోయి య
భ్రగతిం దద్గృహసీమ డిగ్గి మరుబాబాఁ బోలు నాబాలతో
నగణేయాదృతిఁ గూడి క్రమ్మఱ యతం డాకైవడి న్నేలు త
న్మృగనేత్రామణి పొందుఁ బాయక యతిప్రీతాంతరంగంబునన్. 554

క. అమ్మూలికపై దాని వి
ధ మ్మది వ్రాసిన పసిండి తగడు పొదివి ప్రా
ణమ్ము వలె దాఁచికొని మఱి
యెమ్మెయిఁ గర్జముల దాని నేమఱకుండెన్. 555

---

1. మఖల

క. అంత నొకనాఁ డతండు పు
రాంతికనదిఁ జేరనరిగి యమ్మూలికఁ ద
త్ప్రాంతమున నుంచి దైవా
క్రాంతమతిం డిగ్గి యొడలు కడిగికొనంగన్. 556

తే. రాజశుద్ధాంతపుషితమరాళ మొకటి
యరుణపద్మదళభ్రాంతి నచట నున్న
మూలిక గ్రహించి యవరోధమునకుఁ జనియె
భృగుఁడు తదభావమునకు నెవ్వగలఁ బొగిలె. 557

ఉ. అంతట నమ్మరాళము విహారమహారతి మంజువాణి గే
హాంతరసీమ వైచినఁ దదౌషధముం గొని యవ్వధూటి వి
భ్రాంతతఁ జెంది దానిపయి బంగరు జేకున [1]వ్రాసియున్న య
త్యంతపరిస్ఫుటాక్షరచయంబుఁ బఠించి ప్రమోదమగ్నయై. 558

క. ఇది ద్రొక్కినఁ జనవచ్చు
న్మదిఁ దలఁచినచోటి కభ్రమార్గంబున నం
చొదవిన యాలిపి యున్నది
గద దేవుని కరుణ మెచ్చఁగావలె ననుచున్. 559

వ. తలంచి బహుకాలభిలాషితంబగు పరపురుషసంగమం బనుభూతంబైన భంగిం బొంగి మనోరథపరంపరాక్రమితడినావసానయై నిశాసమయంబున రాజకుంజరుండు మణిమంజరీమందిరగతుండగుట యెఱింగి యక్కురంగనయన ([2]తల)ముంగిట నిల్చి పదాంగుష్ఠంబుల నయ్యౌషధమూలా బవలంబించి కాళికాగృహంబున కరుగవలయునని [3]తలంచి నిరాధారంబగు గగనాంగణంబున కెగిరి దైవవశంబునం గాళినికేతనద్వారంబున మొగులు తగులు దిగనాడి యరుగుదెంచిన మెఱుంగు తెఱంగున వ్రాలి కేళికాగతుల మెలంగు నవసరంబున. 560

1. వ్రాసినట్టి 2. తన (పూ) 3. తలంచిన తత్క్షణంబ

క. పరనగరరాజసుతుఁ డొ
క్కరుఁ డప్పురమునకు నాత్మకార్యంబునకై
యరుదెంచి యునికి నిజతా
మరసేక్షణఁ దలఁచి యతఁడు మన్మథవశుఁడై. 561

తే. నిదుర గానక యొకచోట నిలువలేక
వీథిఁ గ్రుమ్మరుచుండి యవ్వేళ నటకు
వచ్చి మరులచ్చి వంటి యమ్మచ్చెకంటి
మెచ్చి మరులెచ్చి యంటిన మెలఁత తోడ. 562

తే. పలుకరించి తదాకారభాషణాది
కముల శుద్ధాంతకామిని గాఁగఁ దెలిసి
యలికి తలఁకిన నాతని తలఁ పెఱింగి
యానృపాంగన వేగ డాయంగ నరిగి. 563

ఉ. ప్రేమ గనంబడం బలుకరించినవాఁడవు పోదువా? యయో!
నామగవాఁడ! లెస్స నిను నమ్మితి రమ్మని పిల్చి కాళికా
ధామమునం బ్రతీచి కడఁ దాను నతండుఁ బ్రసూనబాణసం
గ్రామవినోదకేళి సరిగాఁగఁ బెనంగి యనంతరంబునన్. 564

తే. తన చరిత్రంబు నుడివి యాతని విధంబుఁ
దెలిసి యిఁక మీఁద రాత్రులు దినదినంబు
నిచ్చటికి రమ్ము తఱియైన నేను వత్తు
ననుచు నొడఁబాటు చేసి యవ్వనిత సనియె. 565

క. చని నాఁడు మొదలుగాఁ బ
ర్విన తమితో నజ్జయైన వేళల నృపనం
దను పొందు నడుపుచుండెన్
ఘనతరమునిదత్త మూలికామహిమమునన్. 566

## ముప్పదితొమ్మిదవ రాత్రి:

చ. అని సచివేంద్రనందన ధరాధిపుతో వినిపించె నంచుఁ జెం
దిన నెఱనేర్పుతోఁ జిలుక తెల్పఁ బ్రభాతముగాఁ బ్రభావతీ
వనరుహగంధి యంతట నివాసముఁ జేరి దినావసానసం
జనితకుతూహలాప్తి నృపచంద్రుని దూతిక వెంటవచ్చినన్. 567

క. శుక మిట్లను వినవమ్మా
సకియా! యల విక్రమార్కజనవరుఁడు దద
గ్రకథావిధ మడుగ న్మం
త్రికుమారి మనంబు గొలుపఁ దెలుపం దొడఁగెన్. 568

తే. దేవ! యభిమానధనుని తృతీయభార్య
యైన మణిమంజరీహంసయాన తనదు
ప్రాయమెల్లను గోర్కుల పాలుచేసి
యుపపతిక్రీడ కేకారుచున్న యంత. 569

క. ధరపై[1] నిగమావతి యను
పురమునఁ గ్రూరుఁడను నామమున నొకశూద్రుం
డరివరనికరభయంకర
కరకరవాలాంకుఁడై జగన్నుతిఁ గాంచున్. 570

క. ఆతనికిఁ జపల యనఁగాఁ
గాతరమృగనయన యొకతె గలదది మదిలో
నీతి గణింపక జార
వ్రాతములకు హృదయమిచ్చి వర్తిల్లుటయున్. 571

తే. అతఁ డది యెఱింగి కామినీహత్య కళికి
యాలిఁ దోడ్కొని పరభూమి కరుగు బుద్ధి
గంధవతి[2]చెంత కరుదేరఁ గతిపయప్ర
యాణముల నంత నచ్చపలాక్షినయన. 572

1. కమలావతి యను 2. చెంత కరుదెంచెఁ

ఉ. వీఁడిఁక నెన్నిదేశముల వెంబడిఁ ద్రిప్పునొ యేమి చేయను
న్నాఁడొకొ కాదటంచు జతనంబునఁ గన్ను మొఱంగిపోయిన
న్వాఁడిమి వెంటనే వెదక వచ్చుఁగదా యెటులైన నీతనిం
బోఁడిమి మాన్చికాని మఱి పోఁ దగదంచు విచారఖిన్నయై. 573

క. పెదవులు తడుపుచుఁ బదములు
గుదిగొనఁగా నొక్కచోటఁ గూర్చుండి యయో
హృదయేశ! యెచటి కేఁగెదొ
కద నాకున్ దప్పి వశము గాదని పలుకన్. 574

తే. అతఁడు చోరభయంబున నవ్వధూటి
మేని సొమ్ములు తన యొడిలోన డాఁచి
నీరపాత్రంబుఁ గైకొని నెమకఁ జనియె
హ్రదనదీకూపముఖ్యంబు లంతలోన. 575

మ. ఒకశూద్రుం డభిరామనాముఁ డొక యుద్యోగంబుపై వచ్చి య
మ్ముకురాస్యం గని యొంటి నున్న దిది యేమో యంచు మాటాడ నిం
చుక శంకించినఁ జేరఁ బిల్చి తన యస్తోకవ్యథం దెల్పి య
వ్వికచాంభోరుహగంధి వాని మది యుర్వీశ్వరఁగాఁ జేయుచున్. 576

తే. నీకు నామీఁదఁ గోర్కి జనించెనేని
కాఁపురమునకు నుండెదఁ గాని యిటకు
వచ్చు జలములు గొనుచు నా వరుఁడు హాని
మొఱఁగి పోయిన వెదకుచు నరుగుదెంచు. 577

తే. [1](కూలి కిల్లరికం బుండు) గొంటుహానిఁ
జెనకి నిర్జించి పోప సి చేతఁ గూడ
దట్టు గావున నిట్లు సేయంగవలయు
నని యుపాయంబుఁ జెప్పిన యంతలోన. 578

1, కూలికీలారి కంభందు—(పూ)

ఉ. క్రూరుఁడు నీళ్ళు గొంచు నటకుం జనుదెంచినఁ దత్ప్రఫుల్లనీ
రేరుహనేత్ర దప్పి యొకరీతి నడంచినయట్లు చేసి యీ
యూరికిఁ బోయి నేఁ డిచట నుండుదమా యన మువ్వురు న్నయో
దారత నేఁగి గంధవతిఁ దద్దయు మెచ్చుచు వచ్చుచున్నెడన్. 579

క. ఆరమణియు నభిరాముఁడు
గ్రూరుని నిరువంకఁ [1]బట్టుకొని యయ్యో యీ
యూరికి దొర లేఁడా? యీ
చోరుని దండింప ననుచు సుక్కక కూయన్. 580

క. ఆమాట విని తలారు ల
దేమని గద్దింప నామృగేక్షణ రౌదగా
నా మగఁ డితఁడని యయ్యభి
రాముని [2](దెసఁ) జూపి నిబ్బరంబునఁ బలికెన్. 581

తే. [3](ఆలుమగలము) నియ్యూరి యటుత నిలిచి
చలిది భుజియింప నా సొమ్ము సంగ్రహించె
గొట్టు సేయక వీనిఁ జూపట్టు కొనుచు
[4]నిచ్చటికిఁ దెచ్చితిమి పట్టుఁ డిప్పు డితని. 582

వ. అనిన విని యన్నగరరక్షకు లాక్షేపపూర్వకంబుగా నతనిం బట్టుకొని బాధించి శోధించి యొడిలోని యాభరణములం గనుంగొని దొంగ యగునని నిశ్చయించి యభిమానధనున కెఱింగించి మూఁడు తరువులు గైకొని నిజ కామినీ [5]( కుహనాసంజనితవిస్మయావృతాప్రత్యుత్తరుండగు ) నతని వధియించి యమ్మందనంబు లిచ్చినం జపలాభిరాములు సంపూర్ణకాములై యథేచ్ఛ నరిగి రాక్రూరుఁడును నన్యాయహతుండయ్యెం గావునం బిశాచంబై యాచారవంతులం గని తలంగం బాఱుచు మాంత్రికులం గని గడగడ వడంకుచు నాయుధహస్తులం జూచి యేచిన [6]భయంబునుం బొందుచు భైరవాజ్ఞా

1. బెట్టుకొని (పూ) 2. వెస (పూ) 3. ఆలుమగఁడును (పూ) 4. నిచటి కేతెంచితిమి 5. కుహన సంజనిత విస్మయాద్భుత ప్రత్యుత్తరుండగు (పూ) 6. భయంబున్నం గుందుచు

వశుండై యాహారంబుఁ గొనం గానక [1](యుద్దండతర జఠరానలంబు లగ్గలంబుగా భగ్ననం దరికొన రాత్రి కాననంబుల వెలచినవారి వెంటఁబడి తదీయజనప్రకల్పితశృంగాటకంబులఁ గాఁపుగఁరితలు) బలి యర్పించు పొంగళ్ళ వలనం గొంతకొంత సంతసించుచు నిడుమలకుం గడ గానక యప్పట్టణంబున నెట్టుకొని యున్నవాఁ డగుటం జేసి యతం డొక్కనాఁడు.

క. నరపతికిం గానుకగా
విరిపొట్లము గొనుచు నొకఁడు వీథిం జనుచో
గురుతరమగు సురుచిరత
త్పరిమళముల వెంట నంటి పాయక చనియెన్. 584

ఉ. భూపతి యంత నవ్విరులపొట్లముఁ గైకొని కొల్వు దీఱి క్రీ
డాపరమైన బాళి నిగుడ న్వెస నంతిపురంబుఁ జేరి కొ
మ్మా పువుఁబోఁణి యంచు మణిమంజరి కిచ్చి తదీయ మన్మథో
ద్దీపితకేళిఁ దేలి పొడతెంచు రవిం గని లేచిపోయినన్. 585

క. ఆకమలనయన పరసుర
తాకాంక్షల్ నిగుడ నెవ్వఁడైనను మగవాఁ
డీకడకు వచ్చి కోరిక
నా కొనగూర్చునని నెమ్మనంబునఁ దలఁపన్. 586

క. క్రూరుం డప్పుడు తనయా
కారముతో నిలిచి యళుకు గాంచిన దానిం
జేరంగ నరిగి వెలవకు
మోరమణీ! వినుము మన్మహోదంతంబున్. 587

వ. అని నిజభార్య చేసిన యపాయమునం దన కట్లు సంభవిం
చిన యశరీరితాస్థితులు చెప్పి యిఁకన్ జఠరానలంబుచే
తను వెరియం దొడఁగె వనితా యిపు డన్నము వెట్టితేని నీ
పనిచిన పంపుఁ జేసెద శుభంబగు నీకని మ్రొక్కి వేఁడినన్. 588

1. వెలచినవారి వెంటంబడి తదీయజన ప్రకల్పితరాత్రికాననంబుల నుద్దండతర జఠరానలంబున శృంగాటకంబులఁ గాఁపు గరిత లగ్గలంబుగా భగ్ననం దరికొన(పూ)

క. అమ్మగువ చపలఁ గూరిచి
యమ్మా! భువి నాఁటదాన [1](వనిత నీవే)
యమ్మహితసాహసము నా
కిమ్మా నాకోర్కు లెల్ల నీడేఱుటకున్. 589

క. అని మెచ్చి క్రూరుసిం గనుఁ
గొని వాహన మగుచు నన్నుఁ గొని చనఁగలవా
మనమునఁ దలఁచిన చోటికి?
దినదినము నీకు మంచితిండి ఘటింతున్. 590

తే. అనిన నిను మోచికొనుట భాగ్యంబు గాదె
బ్రతికితి నటంచు వాఁ డొడఁబడినఁ జూచి
[2](యవల)బోనంబు వాని కాహార మిచ్చి
తోయజానన యర్ధమరేయి వేళ. 591

క. పతి మకరందాగృహసం
గతిఁ గాంచుట దెలిసి గగనగమనక్రూరో
ద్ధతవాహనయై విజన
క్షితిఁ దలఁచుటఁ జనియెఁ గాళిగేహముఁ జేరన్. 592

క. చని వాహనంబు డిగి య
వ్వనితామణి పథికుఁడైన వైశ్యుని నొకనిం
గని తన వర్తన మంతయు
వినిపించి తదీయకథలు విని మోదమునన్. 593

తే. అతఁడు దానును గాళిగేహంబులోన
దక్షిణపు మూల రతికేళి దనివి నొంది
యనుదినము నాతఁ డటు వచ్చునట్లు చేసి
పోయి యాలీల మెలఁగె నప్పొలఁతి మఱియు. 594

1. నైవ నీచే (పూ) 2. యబల (పూ)

## నలుబదియవ రాత్రి:

మ. అని రాజన్యున కయ్యమాత్యసుత నిత్యప్రౌఢవాగ్రూఢిఁ దె
ల్పెనటంచున్ శుకరాజు పల్కనెడ నాళీకాప్తభానుప్రభల్
దనర న్వైశ్యవధూటి యంతరనిశాంతం బొంది యారాత్రి య
మ్మనుజేంద్రాత్మజు పొందుఁ జెందఁ జను ప్రేమ న్మంగల న్నిల్పినన్. 595

క. కని చిలుక నేఁట మాత్రమె
విను మమ్మంత్రిసుత భూమివిభుతో మును జె
ప్పిన కథ[1]జేపటి కథలన్
వినిపించిన నరఁటిపండ్ల వేయుము చెలియా! 596

వ. అని నవ్వించి యాజవ్వనితో నవ్విహంగమపుంగవం బిట్లనియె. 597

క. అంత నలవిక్రమార్కుఁ డ
నంతరకథ యడుగ మంత్రినందన నవవా
సంతసమయప్రమోదా
క్రాంతవికస్వరపికస్వరంబునఁ బలికెన్. 598

తే. మానవాధీశ ! యయ్యభిమానధనుని
నాలుగవ కొమ్మ కమ్మకుందనపు బొమ్మ
యైన మకరంద యిచ్ఛావిహార మంద
సందు గాన కమందచంచలతఁ జెంది. 599

సీ. నిలసీని వంటవార్పుల నత్తమామల
పోరును లేని కాఁపురము గలిగె
నెచట నుండిన నింట నేమనువారు లే
కింపుసొంపు ఘటిల్లు నిల్లు గలిగె

1. జేపటికిఁ గథల్ (పూ)

రేలుఁబగ ల్పట్టి పాలార్పు కౌకవేళ
    తగవెంచి చనుదెంచు మగఁడు గలిగె
వలసినయట్టు లవ్వారిగా సారక
    స్తూరికాముఖ్యవస్తువులు గలిగె
నెన్ని గలిగిన నేమి? నా యిచ్చలోని
యాస గడతేఱ జారవిహారసుఖము
సంభవించ దటంచుఁ గాంక్షావిశేష
పరవశస్వాంత యగుచుఁ దాపంబుఁ జెంద. 600

మ. ఒకనాఁ డాత్మనిశాంతసౌధలసమానోద్యానవీక్షాసము
త్సుకయై పోయి తదంతరంబున మణిస్తోమాతిధామాతిరం
జకమై యుప్పర మంటు చప్పరమున న్స్వర్ణడోలావిలో
లకుఁడై నిల్చిన యొక్క సిద్ధుఁ గని చాల న్విస్మయంబందుచున్. 601

క. జారవిహారంబున కే
కారెడు నా కోర్కిఁ దీర్పఁగా వచ్చిన య
మ్మారుఁడె యితఁడని యచ్చెలి
చేరం జని చూపు వలపుచేఁతలఁ దెలుపన్. 602

క. నిలిచిన నతఁ డాసతికిం
గల కోర్కి యెఱింగి మమ్ముఁ గామింపకుమీ
ములు చూడఁగ వచ్చిన సి
ద్ధుల మతనుని తూపు మనసుఁ దూఱదు మాకున్. 603

ఉ. ఇందు మనోహరంబయిన యివ్వనవాటిక చూచినప్పుడే
డెందము మమ్ము నిల్పె నిట డిగ్గితి మిప్పుడ పోవలెం జిదా
నందవిభూతి గల్గ లలనాజనసంగమసౌఖ్య మేల? ర
మ్మిందు నిభాస్య! నీ మది యభీష్టము చేకురునట్లు చేసెదన్. 604

క. అని చేరఁ బిలిచి కర్ణం
బున నొక మంత్రంబు నుడివి పూఁబోఁడి! మనం

బున నిది జపింపు మింక గ
గనగమనము గల్గు నీదు కాంక్షలు తీరున్. 605

చ. అని కరుణించి సిద్ధుఁడు వియత్పథజాంఘికుఁడైన మెచ్చి య
వ్వనిత విభాకరుం దపరవార్ధిఁ బడ న్మణిమంజరీగృహం
బునకు నిశేశ్వరుం దరుగు పూఁట యటంచును నిశ్చయించి య
మ్మనువు జపించి విష్ణుపదమార్గమునం జనియె న్రయంబునన్. 606

క. చని తత్కాళీగేహం
బున నొక మగనాలి కూటమునకై కకుగూ
ర్కని యొక్క జారుతో నిం
పునఁ బొదలుచు నుత్తరంపు మూల రమించెన్. 607

తే. అనుదినము వేళయైనప్పు డవ్వధూటి
యటకుఁ దా[1](వచ్చునట్టులె యతఁడు వచ్చు)
నట్లుగాఁ జేసి [2]యట్టుల నతని పొందు
విడువఁ జాలక మెలఁగె బూవిలుతునాజ్ఞ. 608

చ. మనుజకులేంద్ర ! యంత నభిమానధనుం డొకనాఁటి రేయిఁ గాం
చనరుచివారము ల్గల హజారమునం గొలువున్కిఁ జేసి య
వ్వనితలు నల్వురు న్మనుపు వచ్చు క్రమంబున వచ్చి కాళికా
ఘనగృహసీమఁ జేరి రతిఁ గాంచుచు నుండిరి నాల్గుమూలలన్. 609

క. అంతట నభిమానధనుం
డాంతరమునఁ గాళికాపదాంబుజసేవా
నంతరతి వొడమ నుడిగపు
టింతులతోఁ గొలువు దీరి యేతెంచుటయున్. 610

క. వచ్చిన దివ్వటి వెలుఁగున
నచ్చెలువలు నాథుఁ జూచి రాతఁడు [3](గూడన్)

---

1. వచ్చునట్లుగా నతఁడు (పూ) 2. చని యట్టులతని పొందు
3. గనియెం (పూ)

దచ్చపలాక్షులఁ గనుఁగొని
యిచ్చ మహాశ్చర్యసమభివృతముగ నిలువన్. 611

క. తరుణులు నలువురు నపు డొం
డొరుల చరిత్రంబు లెఱిఁగి యొదవిన భయము
న్నిరసించి యొక యుపాయము
దొరకొన విభుఁ జేరి ధైర్యధుర్యాత్మకలై. 612

వ. కట్టెదుట నిలువంబడి కాళికాపదాంబుజంబులు భజియింప నింపునం జనుదెంచిన యక్షకమలాక్షుల మిన్నలకపురము మదీయ నాయకులు నేమును ననుదినంబు నిశాసమయంబున నిచ్చటికి వచ్చి పోవుదుము. మాకు నతీతానాగత వర్తమానంబులు తెలియుట కడుఁగం బనిలే దింత యేల నీ యంతరంగంబున భవదీయభార్యాసౌందర్యవిశేషభాషణాదులు మాయందుఁ దోఁచుటం జేసి సందియంబు కందళించినది కావున నింతయుం దెలుప వలసె నచ్చెలువలు మా యంశంబున జనియించినవారలు కావున మా పోలికలు వారికిం గలిగి యుండు నయ్యండజయానలకు శుభంబుఁ గోరి కదా యేతన్మహాశాంకరీ పదపంకజారాధనకు ననురాత్రంబు నరుగుదెంతు మిందు రమ్మని యిందుధర సుందరీసమీపంబునకుఁ దోడ్కొని పోయి నిర్మాల్యప్రసాదంబుగా విభూతి యొసంగి నీ యంగనల సద్ధర్మంబుగా నేలి మా మనంబులు చల్లఁ జేయుమని యనిపిన నజ్జననాథుండును నేమియుం బలుక వెఱచి యూరక వెడలె నప్పుడు. 613

క. అచ్చపలాక్షు లతిత్వర
వచ్చి నివాసముల నిలువ వసుధేశ్వరుఁడున్
ఱిచ్చపడు మనముతో వెస
నచ్చటికి న్వచ్చి వారి నందఱఁ జూచెన్. 614

తే. చూచి మనమున మిక్కిలి చోద్యమంది
వార లొనరించు నతులోపచారసరణిఁ
దేలి [1](తజ్జార)సంసక్తిఁ దెలియలేక
యధికతరమైన ప్రేమతో నాదరించె 615

1. తజ్జాల – (పూ)

ఉ. మానవనాథ! [1](యట్టి)యభిమానధనుం దెఱుఁగంగఁ జాలనే
యానలినాయతాక్షుల దురాచరణం? బది యట్టులే సుమా!
యేనరుఁడైన నిట్టివెత లించుకయైన నెఱుంగఁ డింతటన్
మానసవీథిఁ జూచుకొనుమా యిఁకఁ దెల్పఁగ నేర[2](నేమియున్). 616

తే. అనుచు బాలసరస్వతీవనిత విక్ర
మార్కుతోఁ దెల్పె ననుచు శుకాగ్రగణ్యుఁ
డల ప్రభావతి కెఱిఁగించు నంతలో శ
కుంతములు మేఁతలకుఁ దమ గూళ్ళు వెడలె. 617

## నలువదియొకటవ రాత్రి:

*తే. అంతటఁ బ్రభావతీకమలాయతాక్షి
యాత్మకేళీగృహంబున కరిగి నాఁటి
రేయి నృపు పొందుఁ గోరి చేరిన మనోజు
తేజి యిట్లనుఁ దియ్యని తేనె లొలుక. 618

క. నేఁటి కథ చిత్రతరమో
బోఁటీ వినవమ్మ మంత్రిపుంగవసుత య
ప్పాటిం దెలిపిన నాదొర
నాటిన చింతాభరంబున న్మన మగలన్. 619

తే. కొంత తడవుండి యందు నొక్కింత యేని
దెలియనే! యెక్కడి పరాకు పలుకు మనుచుఁ

---

1. యట్ట(పూ) 2 మేమియున్(పూ)
*618 నుండి 635 వఱకుఁ గల పద్యములు మద్రాసు వ్రాఁతప్రతిలో లేవు.

గదశికాకాంతపైఁ జేతికమ్మవిరుల
చెండు వైచిన [1](నాసరసిజనయన). 620

తే. సౌమ్యసిలినట్లు వ్రాలినఁ జూచి విక్ర
మార్కభూపాలవరుఁడు హాహానినాదుఁ
డగుచు విలపింపఁ జని వయస్యాజనంబు
శీతల క్రియ లొనరింప సేదఁ దేఱె. 621

చ. అది గని పుష్పహాసుఁ డహహా యని నవ్వఁ బ్రసూనవర్ష మ
భ్యుదయము గాఁగ నంతట విభుండు గనుంగొని తీవ్రకోపుఁడై
యదయుఁడ వింతె కాక యొక యప్పుడు నవ్వనివాఁడ విప్పుడీ
మదవతి పుష్పపాతమున మ్రాన్పడిన న్వడి నవ్వ నేటికిన్. 622

చ. అన విని యయ్యమాత్యుఁడు ధరాధిప! మున్నొక యద్భుతంబు నేఁ
గనుఁగొనఁ గంటిఁ గాన బహుకాలము తద్వ్యథఁ గుంది యున్కి నే
పనులకు నవ్వకుండితి సభాస్థలి నేఁడొక యద్భుతంబుఁ జూ
చిన కతన న్మనంబు వికసించిన నవ్వితిఁ జిత్తగింపుమా! 623

తే. అధిప! యీ యమ్మవారు మర్యాద పోవ
విడిచి, నగరెట్లు వెడలెనో వెడలి వచ్చి
తేరు క్రిందటి మరుగుజ్జుఁ జేరి వానిఁ
గలసి యేతెంచు నిది మీకుఁ గానఁ బడదు. 624

ఉ. దేవర కొల్వుదేఱిన మదీయగృహంబున కేఁగువాఁడనై
యే వెసఁ బోవుచోఁ గురిసె వృద్ధవరాహకఘోరఘర్ఘరా
రావమహాశనిధ్వనిపరంపరతో నొక వాన మొన్నరే
యావిలమానసాంబుజుఁడనై యొక మండపసీమఁ జేరితిన్. 625

1. తత్సతిసరసిజాక్షి (పూ—యతిభంగము)

తే. అచ్చటికి వచ్చె నిమ్మందయాన; వచ్చి,
తేరు [1](క్రింద) బ్రతీక్షణాధీనుఁడైనఁ
గుజ్జుఁ జేరిన వాఁ డతిక్రుద్ధుఁ డగుచు
నింత తడవేల రావైతివే యటంచు. 626

తే. గుండియలు గుళ్ళఁ దన్నిన గ్రుక్కుమిక్కు
రనక యాతని కినుక చల్లాఱ నిచ్చి
విక్రమార్కుండు నిద్ర గావించుదనుక
వెడలి రారా దటంచును వేఁడుకొనియె. 627

తే. అతని పదఘాతముల కోర్చినట్టిదాని
కివ్విరుల బంతి వ్రేటున కింత మూర్ఛ
వచ్చెనే యంచు నవ్వితి వసుమతీశ!
చనవరి యటంచు నాతప్పు సైఁపవలయు. 628

క. అన విక్రమార్కభూపతి
విని వెఱఁగున ముక్కు మీఁద వ్రేలిడి చింతన్
మునుఁగుచు బాలసరస్వతిఁ
గని తెలిసె స్మినహాసకారణ మౌలే! 629

లే. కాక యుండినఁ దైలపక్వంబులైన
మత్స్యములు నవ్వునే యంచు మందబుద్ధి
నక్కటా కాననైతి నీ హంతలాఁడి
వగలు నమ్మితిఁ గద పతివ్రత యటంచు. 630

క. అని మఱియుఁ బదియుఁ బదియును
గనుఁగొని కదళికకు నాజ్ఞఁ గల్పించె న్నా

1. క్రింది (పూ)

ప్రనిరూపితపద్ధతి న
జ్జననాథుఁడు వింటివా నిశాకరవదనా! 631

## నలువదిరెండవ రాత్రి:

క. అని చిలుక పలుకఁ బూర్వా
వనిధరశృంగాగ్రమున దివాకరుఁ డెసఁగం
గనుఁగొని ప్రభావతీసతి
చని గృహమున నుండి తన్నిశాముఖవేళన్. 632

క. పుడమిదొరఁ జేరు వేడుక
పొడమఁగఁ జనుదెంచి కీరపుంగవుతో నీ
కడుపెల్లఁ గథలు గదఁ ని
న్నడుగం బనియేమిః పోదునాః యని పలుకన్. 633

తే. పోయి రమ్మిందువదన! యపూర్వమగుచు
నలరు నొక కథ విను విక్రమార్క నృపతి
యవ్విధంబున నిజసతి కాఁజ వెట్టి
పుష్పహాసుని జూచి యింపులు జనింప. 634

శా. ఈ యాశ్చర్యము కంటిమే కద పురాదృష్టాద్భుతం బేమియో
యా యాఖ్యానముఁ దెల్పు మన్న నతఁ డుద్యత్ప్రేమతో నిట్లనున్
సాయంకాలనటన్మహానటజటాఝూటాటవీద్యోధునీ
స్ఫాయదభంగఘుమంఘుమోపమితవాచాచాతురీధుర్యుఁడై. 635

శా. వస్వద్రిప్రతిమానధైర్య ! విబుధధ్వంసిప్రభూద్భూతభీ
నిస్వస్థక్షితిభృద్విరోధిమునిదిఙ్నేత్రాబ్జజన్మేణభృ
ద్వస్వాదిత్యముఖాత్రబర్హిచయదీవ్యద్వారివాహోదయా !
భాస్వద్వంశపయోధిశుభకర! శుంభత్కుంభకర్ణాంతకా! 636

క. ఖరకరకులశరనిధిశశ
ధర! ఖరసురవిమతశమన! ధనదసఖధను
ర్ధ్హారణభయదభుజ! భవహర!
సురవరమునినికరభజితశుభకర[1](చరణా!) 637

స్రగ్విణి--మానితాబ్జేక్షణా! మౌనిసంరక్షణా!
భానుసూనుప్రియంభావుకప్రాభవా!
దానసంతుష్టగోత్రా సుధాంధస్తుతా!
జానకీస్వచ్ఛభూసారసేందిందిరా! 638

గద్య.

ఇది శ్రీమత్త్వాదిరీనృసింహకరుణాకటాక్షవీక్షణ సమాగత కవితాధార పాలవేకరి
కులకలశాంభోనిధిసుధాకర తాడిగోళ్ళ కరియ మాణిక్యనృపహర్యక్షపౌత్ర
పవిత్రచరిత్రకదురధరామండలాఖండలపుత్ర విద్వత్కవి
రక్షణానుసంధాయక కదిరీపతినాయక ప్రణీతంబైన
శుకసప్తతి యను మహాప్రబంధంబునందు
తృతీయాశ్వాసము.

1. శరణా (పూ)

శ్రీరస్తు

# శుకసప్తతి

## చతుర్థాశ్వాసము

శ్రీ... ... ... ... ...
... ... ... ... ...
... ... .... ... ...
... ... ... ... ... 1

తే. అవధరింపుము సకలరాజాధిరాజ
నతపదాంభోజుఁ డగు ధర్మనందనునకు
సరసవైదికలౌకికాచారవిహిత
హితకథారమ్యుఁ డగు ధౌమ్యుఁ డిట్టు లనియె. 2

తే. అవధరింపుము విక్రమార్కావనీంద్ర !
చిన్ననాఁ డేను మున్ను కాశీపురస్థ
లావలోకనకాంక్షచే నరిగి యరిగి
జంబుకేశ్వరమను పట్టణంబుఁ జేరి. 3

### తొమ్మిదవ యుపకథ

తే. కంటిఁ బాంథజనాహ్వానకారిమృదుల
వాతపోతచలత్పటకేతనాంక

మై మదీయ శ్రమచ్ఛిదాహారి యగుచు
నలరు నొక వంటకూలి యొయ్యారి యిల్లు. 4

*సీ. హాళి పుట్టించె సద్యఃకల్పితానల్ప
రసపూర్ణగాథాదురంతపటిమ
రక్తి గల్పించె ధారాళవాచాసుధా
[1](పాతమాధుర్య) సంగీతరీతి
తెలియఁ జేసె ననేకదేశసభాంతరా
రాళికాంతరనికరప్రపంచ (?)
మద్భుతం బొసఁగె శబ్దార్థవైచిత్రిని
బంధనోజ్జ్వలగద్యపద్యసమితి
తద్గృహుల కన్నకల్పిత తారకాయ
మానసోమసమానీతులైన పథిక
కథకగాయక చారుసత్కవుల యుదర
పూర్త్యగంతరసల్లాపములు నరేంద్ర ! (?) 5

*వ. చిటిలిన నాభిరామ మొకచేఁ దెలనాకులు చాయతోడి పు
క్కిటి విడెముం బెడంగుగ బిగించిన పైఁటచెఱంగులోనఁ బి
క్కటిలు కుచంబులుం బసిఁడి [2](కమ్మలఁ దళ్కను) చెక్కుదోయి చొ
క్కటముగ ముద్దు గుల్కు నొక కల్కి వెసం జనుదెంచి యచ్చటన్. 6

సీ. మఱి వండిపెట్టు కొమ్మలు లేరె? మావెంటఁ
బడుదు రటంచును బాయఁ బలికి
పోవఁ జూచినఁ దిష్టిపోదు రిదేల? వా
దాడఁ జాల మటంచు నాస గొలిపి
యటువంటి వారమా? యాఁకలి దీర్పు మి
క్కిలి పుణ్యమన్న నంగీకరించి

1. మాధురీధుర్య (పూ — యతిభంగము) 2. కమ్మతళుక్కను (పూ)
*మద్రాసు వ్రాఁత ప్రతులలో లేవు.

కమ్మలు గదలఁ గన్బొమ్మలు నిక్కఁద
నారజమ్మునఁ గూలిబేర మాడి
వచ్చు తెరువరు లందఱు వంట పనికి
నన్ను మెత్తురటంచు నందములు సూపి
బాళి పుట్టించు దాని కప్పథికు తెల్లి
నొడఁబడితె మీఁదనే [1]మిన్కుఁ లొసఁగి రపుడు. 7

తే. వారితో నేను భుజియించి వనజబంధుఁ
డస్తగిరిఁ జేరు తఱి యైన నపుడు నదికిఁ
బోవువారలఁ జూచి నేఁ బోక నిలిచి
సందె వార్చితి జలము లాసతి యొసంగ. 8

క. ఆసమయంబునఁ జీఁకటి
మాసిన తన ముదుక చీర మైకల నిగ్గు
ల్వాసులకుఁ బెనఁగఁగా నొక
దాసి యరుగుదెంచి [2]యా సుధాకరముఖితోన్ 9

క. ఏమో గుసగుసలాడిన
నా మగువ మఱేమి సేతు ననువగు మగవాఁ
డీమాటకు నొడఁబడఁ ద
క్కామిని యెడ మాట నిల్పఁగా లేనైతిన్. 10

క. అనుమాటలు సవసవగా
విని నేనేమో ప్రమోషవిధమని చేరం
జని యది యేమని యడుగం
గనుఁగొని యమ్మగువ ముఖవికాస మెసంగన్. 11

తే. హత్తుకోవచ్చు నీవంటి యందగాని
కున్న దొక చోట నొక మంచి యొఱపులాఁడి

1. దోపు 2. యొక (పూ)

దాని కిలికించితంబునఁ దవిలినట్టి
వాఁడు దేవేంద్రునకుఁ జీటి వ్రాయఁ గలఁడు 12

*మ. అను నమ్మాటలతోడనే రతిపతి జ్యావల్లికాటింకృతుల్
విని [1](నే మంచిది పోదునా యనఁగ) నన్వీక్షించి యయ్యంబుజా
నన సేబాసు ! బలార ! జాణవవు దన్నా యింత తెంపొందకుం
డిన వాఁడే మగవాఁడు? నీ తపము పండె న్నిండె సౌఖ్యస్థితుల్. 13

*తే. పట్టణనియోగియౌ గుణభద్రుఁడనెడు
భూసురుం డొక్కఁ డియ్యూర వాసిగనియె
వాని బంటునకున్న యైశ్వర్యగరిమఁ
బడసినఁ గుబేరుఁడై నను బ్రదికిపోవు. 14

మ. అలరుం దూపుల మన్నెవాని మగవాఁ డన్పించు దత్కాంత య
య్యలివేణీమణి జారసంగమసుఖైకాకాంక్షచే దీని ని
చ్చలు నా యింటికిఁ బంపు నొక్కని మహాచాతుర్యధైర్యాప్తి మె
చ్చు లొసంగం దగువానిఁగాఁ బనుపు మంచున్ దైన్యపూర్వంబుగన్. 15

*క. ఏనును మాలిమి గల మగ
వానికి నిది యెఱుక సేయ వడవడ వడఁకుం
గాని చనవెఱచు వాఁడ
మ్మానినితోఁ బ్రొద్దు కొంచెమా యొనఁగూడున్ (?) 16

తే. అట్టిచో నెట్లు పోవుదు నంటివేని
తద్గృహము చెంత నొక వటతరువు గలదు
దానిపై నెక్కి [2](చీఁకటిఁ గాననపుడె)
యూడ వెంటనె దిగు మొనఁగూడు పనులు. 17

1. నా మంచిది పోదునా యనుచు (పూ) 2. చీఁకటి గాన నిపుడె (పూ)
* మద్రాసు వ్రాఁతప్రతిలో లేవు.

తే. కాంతిమతి దానిపేరు తత్కాంతుఁ డధిపుఁ
దనుపఁగా దూరభూమికి నరిగినాఁడు
నడచి యిచ్చటి కతఁడు రాఁ దడవు పట్టు
వేగఁ జను మిందులకుఁగాను వెఱవవలదు. 18

క. అని నన్నుఁ బలికి దానిం
గనుఁగొని యమ్మగువ కింత కార్యం బోజ
వ్వని! వే తెల్పుము పొమ్మని
యనుపఁగ నది వెడలి చనియె నంతట నేనున్. 19

మ. తరలంబైన మనోంబుజంబు ఘనసంత్రాసంబుతోఁ బోరి శం
బరవిధ్వంసిమహాప్రతాపము జయింపం గాంతిమత్యాలయాం
తరముం జేరఁగ [1](నిశ్చయించి) వట ముద్యత్ప్రౌఢిమ ల్మీఱ నె
క్కి రహిన్శాఖల వెంటనే యరిగి తద్గేహంబునన్ డిగ్గితిన్. 20

ఉ. అంతకు మున్నె యచ్చటి కొయారయు మీఱఁగ వచ్చియున్న త
త్కాంతిమతీవధూటి ననుఁ గన్గొని మో మరవాంచి నిల్చినం
జెంతకుఁ జేరి దాసి యిది సిగ్గుపడ న్సమయంబటే గృహా
భ్యంతరసీమఁ జేర్పుడ మటంచు ననుం గొనిపోయి రిద్దఱున్. 21

చ. బటువులు తాపితాపఱుపు పట్టుతలాడయు మీఁదఁ జల్వదు
ప్పటిపయిఁ జప్పరంపు జిగి బంగరుప్రాఁతకురాళముం గురం
గటఁ బడిగంబుఁ గంచు దివెగంబము గల్గిన పట్టెమంచ ము
త్కటరుచి నించ మించు రతిధామముఁ జేరితి నిర్భయంబునన్. 22

తే. అంతట [2](భుజిష్య) నను వినయంబు దోఁప
మంచమున నున్చి యక్కాంతిమతిని జూచి
యెనసెఁగదవమ్మ నీ మనోభీష్ట మితని
యలరుఁ బ్రాయంబు కొల్లాడు మనుచుఁ బలికె. 23

1. నిశ్చయింప (పూ) 2. భుజించి (పూ)

శా. నన్వీక్షించి సమస్తదేశతరుణీనానారహఃక్రీడలం
గన్నా వంధపు జాణ విక్రౄలికి బొంకన్లేదు సుమ్మా! మెయిం
జిన్నెల్మించకుమా! బయల్పడిన నాచేఁ గాదు సుమ్మా ప్రజం
గన్నుల్మూయఁగ, నీకుఁ దెల్పవలెనా కార్యం బకర్తవ్యమున్. 24

క. అని తలుపు మూసికొంచుం
జనియెం దద్దాసి గడియ చక్కఁగఁ బొంకిం
చి నెలంత యంత తల్పం
బున కొయ్యన వచ్చె నగవు మొగమునఁ దోఁపన్. 25

తే. ప్రథమసంగమకేళి యప్పటికి నంత
ముగ్ధ యనపించి పిదప నమ్మోహనాంగి
జాతి వారాంబుజేక్షణల్ సైఁత మింత
నేర రనిపించెఁ గలయిక యారజముల. 26

మ. సభలోన న్వివరింపరాదె గద తచ్చాతుర్య మెంతంచు నే
నభివర్ణించెద నంశుమత్కరదురాపాంతఃపురావాస యా
యిభయానామణి యెందు నేర్చినది హా! యీ కౌశలంబంచు నే
సభయాశ్చర్యతఁ జెందితి [1](న్మహిప!) నాసాతర్జనీయోగమున్. 27

ఉ. ఎంతకు నేర రంత తెగియుంచినవా రది యున్నదే కదా
యంతటఁ దెల్లవాఱిన లతాంగి ననుం బడుకింటి మిద్దెపై
దంతపు మేలుమంచము సుధాకరకాంతగృహాంతరంబులో
నెంతయుఁ జింత లేక వసియింపఁగఁ జేసెను సాహసంబునన్. 28

తే. రాత్రు లెల్లను గేళ్యగారమున నుంచుఁ
బగలు మేల్మచ్చుపై నుంచుఁ బ్రతిదినంబుఁ
బేర్మి రెట్టింప షడ్రసోపేతములుగఁ
బ్రొద్దు ప్రొద్దున భోజనస్ఫురణ లొసఁగు. 29

1. మహిమ (పూ)

తే. దాని నడకల వగ లెన్నియైనఁ గలవు
చెప్పఁ జిత్రంబు లటమీఁదఁ జిత్తగింపు
మంత నయ్యింతి గర్భచిహ్నములు దాల్చె
వేడుకలు ద్రోచి నామది వెఱపు వొడమ. 30

తే. అంత నొకనాఁటి రేయి యేకాంత సదన
సీమ నన్నుంచికొని మున్ను చేర్చి యున్న
గంట మాకులు గొని దివ్వెగంబ మింత
యెనయఁ గూర్చుండి యాపూర్ణిమేందు వదన. 31

సీ. శ్రీమన్మహాగుణస్థిరగుణభద్రపా
దములకు దేవర దాసియైన
కాంతిమతీదేవి ఘనభక్తి నతులు గా
వించి చేయంగల విన్నపములు
మిమ్ము నాపాలి స్వామినిఁగాఁ దలంపుదు
మీ మహిమంబులు మీకె తెలియుఁ
గలలోన మీరు సాక్షాత్కరించుటఁ జేసి
గర్భంబు నిలిచె నిక్కంబు గాఁగ
నింటి వారెల్ల నామీఁదఁ గంటగించు
టెపుడు నెఱుఁగుదురే కద యింక మీఁద
నేమి కల్పింపఁ జూతురో యెఱుఁగరాదు
కరుణ నిల్పు మటం చొక కమ్మ వ్రాసి. 32

క. తన దాసిఁ బనుప నదియున్
ఘనజవమున నేఁగి చేరి కమ్మ యొసంగం
గనుఁగొని గుణభద్రుఁడు చది
వినవాఁడై విస్మయం బవేలము గాఁగన్. 33

క. చింతాక్రాంతుండై యిసు
మంతయు మాటాడ కున్న నాతని కుపిత

స్వాంతత్వ మెఱిఁగి దాసి య
నంతత్వర మరలి వచ్చి యంతయుఁ దెలిపెన్. 34

సీ. ఆఁడుది యైనచో నడుగఁ గులస్థాన
పౌరుషములతోడఁ బ్రబలు వాడ
కొడుకైనఁ గలదులే గుణభద్రునకు మున్న
మున్నగానె పితృణమోచనంబు
జత గూడ మన పురోహితుని రప్పింపరే
పాటించి లగ్నమేర్పఱచుఁ గాని
బొడ్డు గోయరె యేమి పురుటింటిలోఁ జొచ్చి
మన పతివ్రత బిడ్డఁ గనియె నిప్పు
డనుచుఁ గేరడముల నింటి యమ్మలక్క
లాడికొనఁ జేటికానీతయైన వస్తు
కోటిచే నింత[1](యేనియుఁ) గొదవ లేక
కాంతిమతి యంత మగవానిఁ గనియె నధిప! 35

క. కని పెంచెం దదనంతర
మున భూనాథుండు పనుపఁ బోయిన కార్యం
బొనగూడు కతనఁ గ్రమ్మఱ
చనుదెంచెం దద్విభుండు సదనంబునకున్. 36

తే. నిజసమాగమసంభ్రమోన్నిద్రులగుచు
నింటివార లెదుర్కొన నేఁగుదెంచి
యాత్మభార్యాచరిత్రంబు [2](లడిగి పొక్కి)
ఖిన్నుఁడై యున్నవాని వీక్షించి యపుడు. 37

సీ. బెడఁగుఁ జూపెడు నూనెముడి లోనుగా నంటఁ
గట్టిన వా సెనకట్టుతోడఁ

1. ఘేమియుఁ (పూ) 2. లడుగఁ బొక్క (పూ)

గస్తూరిపసుపు చొక్కటపుఁ జల్లనితావి
వెదజల్లు పుక్కిటి విడెముతోడ
నిసువుపై పసుపునూని యు జిడ్డు లంటిన
చిటికమ్మి కుఱుమాపు చీరతోడ
నొసట నందంబుఁ జెందు విభూతిరేఖపైఁ
బొంకంబుఁ గను చుక్కబొట్టు తోడఁ
గాన్పు సంతసమందు మొగంబు తోడ
నదరు మురిపంబు గులుకు నెన్నడల తోడఁ
గాంతిమతి వీఁడె నీముద్దుగాఱు తనయుఁ
డనుచుఁ జేతికి నీయఁగా నవ్విభుండు. 38

ఆ. కన్నులెఱ్ఱగా నెగాడఁగఁ గన్గొని
యోడు గఱచి దీని నాఁటదానిఁ
జంపరాదుగా విసర్జించితి నటంచుఁ
బార్శ్వచరులఁ జూచి పలుకుటయును. 39

చ. కలకల నవ్వి యౌనె కద కాదన వచ్చునె నన్నువంటి తొ
య్యలి విడనాడ నీయెడ నయారె సెబాసురె యింటివారి మం
దుల మహిమంబు గాక నిను దూఱఁగఁ బల్కఁ బనేమి బాపురే
కలియుగమా యటంచు నని కాంతిమతీలలితాంగి వెండియున్. 40

మ. కల నిక్కంబగునే యటన్న నిఁక నౌఁగాదంచు మారాడఁగాఁ
గలనా యింతకు వచ్చినప్పుడును బల్కన్నేర నాకాన్పు ర
చ్చల కెక్కెం గద యింక మానుదురె యీసాధ్వు ల్ననుం దూఱఁగా
వెలయన్ దైవమెఱుంగుఁ గల్లనిజముల్ వీరాడఁగా నేమగున్. 41

సీ. నలుగు రుండినచోట నిలువఁగా బెట్టి మా
టాడఁగాఁ గంటిరా యమ్మలార
ననువంటి యాఁడుబిడ్డను గన్నవారింతె
ఫలుకర్తే యేమియుఁ దెలియలేని

సఖ్యంబు లీరు మీ చాటుమాటలు గదా
నానాథు మేలిగుణంబుఁ జెఱచె
దయ యింత లేక యెంతకు నెత్తుకొంటి ర
క్కటా మిమ్ముఁ గన్నది గాక తల్లి
సూర్యుఁడా చూచుచున్నావె చోద్యపడక
యందఱును జేయు పాపపుణ్యంబు లెవరి
నడిగితివి ధర్మదేవతా యమ్మచెల్లి!
వింత నా వంటిదానికా యింత మాట. 42

తే. అని గయాళించుకొనుచు హస్తాంబుజముల
నలరు పాపని దురదుర నరిగి తొట్ల
లోనఁ బడవైచి మొగమునఁ బూను గండు
తోడ బొమముడి సిగుడ నత్తోయజాక్షి. 43

క. మును రాముని మాటలకై
యనలమువెసఁ జొచ్చి వెడలి యలరిన సీతాం
గన కంటె నేను దక్కువె?
చని కాశిక చెంత బాస సలిపి గెలిచెదన్. 44

మ. అనుచుం గ్రక్కున గేహము న్వెడల దాయాదు ల్మహాసాధ్వి వి
ట్లు నినుం బేర్కొన మింక నీ సడియె చాలుంజాలు రమ్మంచు వెం
టనె రాఁగా నిది యేమొకో యనుచు నానామానవు ల్గుంపులై
కనుఁగొంచుం జనుదేఱఁగా నడిచెఁ దత్కాశీమహాస్థానికిన్. 45

సీ. తనవారు పిలువఁగా వినక బాస యొనర్పఁ
జను చేటికో యని యనెడువారు
నాఁడుఁబుట్టువు చెడ్డదవుఁ గదా యిటువంటి
యపకీర్తి వచ్చెనే యనెడువారు
నపకీర్తి వచ్చిన నడఁపక యింటివా
ర్గడు ఛేయుట ధోస మనెడు వారు

నగడేమి చేసి రియ్యతివ తానే వారి
కారడి గల్పించె ననెడువారుఁ
జూడవచ్చిన నచ్చుముచ్చో యెటుంగ
కాడరా దేల యీపాప మనెడువారు
బయలుదేఱిన యపుడె యీ పడఁతి జంత
యగుఁ జుమా యనువారు నై రపుడు జనులు. 46

వ. వెండియుం దండోపతండంబులుగా మెండుకొని యాలోకించు పురజనంబుల కోలాహలంబు విచారించి సంభ్రమాశ్చర్యంబుగా నరిగి యూడిగింపు బడఁతులు విన్నవించిన నన్నగరాధినాథుండగు నరపాలుండు విస్మయంబున నగరు వెడలి తత్కాలసన్నిహితులగు పరిచారకులు గొలువం జనుదెంచి. 47

క. తలతలమని కొండఱు ప్ర
ద్దలవా రెడఁ గలుగ జడియ ధరణీధవుఁ డ
క్కలకంఠిఁ జేరి యనునయ
ముల మరలమి సమ్మతించి ముందుగ నడిచెన్. 48

తే. అంతఁ దొలునాఁటి రాత్రి రహస్యభంగిఁ
గాంతిమతి తీర్చి నను బందుకట్టి యునికి
నేను నొకజోగి వాల్కంబు బూని భద్ర
కాళి సన్నిధి నుంటిఁ గింకరుని రీతి. 49

తే. అచ్చటికి వల్లభుండు ధరాధినాథుఁ
డాదిగా మూఁక వెంటరా నరుగుదెంచి
కాంతిమతి చేరి తత్కాళికాపదాబ్జ
ములకు వెస మ్రొక్కి లేచి నిశ్చలత నిలిచి. 50

తే. కదిసి ప్రజలార ! కంటిమి కాన మనక
చూడుఁడని పల్కి ధైర్యవిస్ఫురణ మెఱయ
జనవరునిఁ జూచి రాజ ! నా సత్యమిపుడు
విశదమగ్గును పరాకని విన్నవించి. 51

క. నిను నంటి భద్రకాళీ!
యనయము విభు నంటి యీమహాయోగివరే
ణ్యుని నంటినఁ గాక మఱి
వ్వని నంటిన శాస్తి చేయవలయు న్నాకున్. 52

మ. అని యక్కాంతిమతీవధూటి పలుకం బ్రావిర్భవద్విస్మయం
బున సారెం దల యూఁపసాగె గిరిశాంభోజాక్షి తన్మూర్ధకం
పనము న్మెచ్చి యొనర్చె నంచు నెదల న్భావించి పశ్యత్పురీ
జను లౌరౌర పతివ్రతా!యనుచు మెచ్చ న్నింగి ముట్టె న్రొదల్. 53

ఉ. అంత నృపాలుఁ డాలలన యంఘ్రులకుం బ్రణమిల్లి యామినీ
కాంతముఖీ! యరుంధతివి కానక నీపయిఁ గానిపోని యీ
వింత ఘటించినట్టి యలివేణుల నోరికి శాస్తి సేసి య
త్యంతయశంబు నిల్పితి కదా యిఁక నింటికి నేఁగఁగాఁ దగున్. 54

చ. అన విని రాని సిగ్గునఁ బటాంచల మించుక వంచినట్టి మో
మునకు మఱుంగుఁ జేయు కరము న్మృదుపాదపయోరుహద్వయం
బున నెలకొన్న చూపు లొక పొంకము చూపఁగఁ గొంకుమాట ల
త్యనుపమముగ్ధతాగతి వెలార్ప నడంకువ చంద మేర్పడన్. 55

మ. అపవాదంబు పరిత్యజించుటకునై ప్రాణంబు లే నిల్పితిన్
నృప! యీభూప్రజకెల్లఁ దండ్రివి గదా నీముందఱన్ బాస చే
సి పరఖ్యాతి వహింపఁ గంటిఁ గద నీచిత్తంబు వచ్చెంగదా
యిపు డీపోఁడిమి చాలుఁ గాఁపురము పొందేలా విసర్జిచెందన్. 56

క. అని వెండియుఁ బలుతెఱఁగు
ల్గనఁబడఁగాఁ బల్కి ధరణికాంతుని వచనం
బున కలికి మీఱఁ జాలని
యనువున మేకొనియె నది గృహంబున కరుగన్. 57

మ. అపు డత్యుజ్జ్వలభూషణాంబరవిశేషాదుల్సమగ్రించి యా
తపనీయాంగిని బల్లకి న్నిలిపి యుద్యత్పంచవాద్యధ్వనుల్
విపులాభ్రాంతర మెల్ల నిండ వినయావిర్భూతిం దోడ్తెచ్చి యా
నృపలోకేశ్వరుం డింట నిల్పి చనియెం బ్రీతాంతరంగంబుతోన్. 58

క. అంతటం గాంతిమతీసతి
యింతం తనరాని ప్రేమ నిటు సనంగా దే
శాంతరనానామనుజుల్
సంతసమున నెంచ మిగుల సన్నుతికెక్కెన్. 59

క. అని యిట్లు పుష్పహాసుఁడు
ననుపమవైఖరుల విక్రమార్కున కెఱింగిం
చె నటంచుం జిలుక పలుక
న్వనజాప్తుం డెక్కెం బూర్వవసుధాధరమున్. 60

## నలువదిమూఁడవ రాత్రి:

వ. అప్పుడు ప్రభావతి మనోజరథవిఫలీకృతమనోరథయై యవరోధంబున కరిగి నిశాసమయంబు బగుటయు నవ్వసుంధరాపురందర సంగమానందంబు డెందంబునం గల్పించుకొని యనుభవించుచుం జనుదెంచు నచ్చంచలాక్షితో ననంతరకథావిధానంబు వినుమని శుకాగ్రగణ్యుం డిట్లనియె. 61

క. అల విక్రమార్క భూవరుం
డలఘుతరాద్భుతయుతాంతరంగుండై యు
వ్వలి కథ యడుగంగం గుతూ
హలమున నాతనికిం బుష్పహాసుం డనియెన్. 62

తే. ఇందులకు నింత విస్మయం బేల విక్ర
మార్క! యింక మీఁదం గల కథ యవధరింపు
మేను బూర్వక్రమంబున దాని యిల్లుం
జేరి నిల్చితి భద్రదతిస్థితులం జెలంగి. 63

తే. బలి యొసంగినఁ బూజలు సలిపి వేఁడు
కొనినఁ దత్కాంతిమతి మాయ మనసునందు
హత్తుకొని యున్కిచే మానదయ్యె నధిప!
కాళికాదేవి నిజశిరఃకంపనంబు. 64

చ. అది గని పౌరులెల్లను భయంబునఁ దత్పురనాథుఁ జేరి యా
యదన మహాపతివ్రతగుణాంచిత కాంతిమతీలతాంగి నే
ర్పొదవఁగ నిల్పిన న్నిలుపనోపు మఱెవ్వరిచేతఁ గాని య
భ్యుదితశివాశిరశ్చలన మోన్నృప! యంచును విన్నవించినన్. 65

మ. ఇది యౌనంచు నరేంద్రుఁ డందఱును దో నేతేరఁగా సర్వసౌ
ఖ్యదమౌ కాంతిమతీగృహంబు దరియంగా వచ్చి ఫాలంబుఁ ద
త్పదము ల్సోఁకఁగ మ్రొక్కి యెట్లయిన నంబామూర్ధకంపంబు మా
న్పి దయం బ్రోవు మటంచు దైన్యగతి గాన్పింపంగఁ బ్రార్థించినన్. 66

ఉ. ఆలలితాంగి కేళినిలయంబు కవాటము మాటుఁ జెంది భూ
పాలక! యిఁటివా రిడిన బాముల రచ్చల కెక్కినంతయే
చాలదె యింక మీఁదను నిజంబుగ రట్టున కోర్చునంతకుం
దాళునె యీశరీరము వితావిత యెక్కడి జోలి యక్కటా! 67

తే. అరయఁ దోఁబుట్టుపైఁ గల్గు కరుణ నిందు
వచ్చి యీరీతి దేవరవారె యింత
ప్రార్థన మొనర్చు పట్లఁ గాదనఁగఁ దగునె?
యైన నొక చిన్న విన్నప మవధరింపు. 68

క. భామాజనసామాన్యము
గా మది నన్నెంచు జనులు గన నేఁడు మొదల్
గా మహిలోపలఁ గానని
నా మహిమ మెఱుంగవలయు నరనాథమణీ! 69

తే. ఇలఁ బతివ్రత లగువారు గలిగిరేని
కాళి యొనరించు నిజశిరఃకంపనంబు
మాన్పు మని చాటఁ బనుపుము మానవేంద్ర!
యప్పు డందఱి వగ దెలియంగ వచ్చు. 70

క. అని యవ్వధూటి పలుక
న్మనుజకులేంద్రుండు మాఱు మాటాడఁగఁ గొం
కినవాఁడై భువిఁ జాటం
బనిచెం దద్వచనరీతిఁ [1]బ్రకటము గాఁగన్. 71

తే. అంత రాజాజ్ఞ మీఱరాదంచు ధరణిఁ
గలుగు సతులెల్ల వచ్చి నిక్కమగు భక్తి
నెంత మ్రొక్కిన నంతంత కెచ్చసాగె
ధూర్జటివెలంది మూర్ధవిధూననంబు 72

తే. కాంతిమతి దక్క మనుజలోకమున నిఁకఁ బ
తివ్రతలు లేరటంచు నుదీర్ణవచన
ముఖరులై జను లాడ నమ్ముదిత లెల్ల
సిగ్గుపడి యేఁగి రప్పు డచ్చెరువుఁ జెంది. 73

ఉ. అంతట రాజమౌళి పునరాగతుఁడై ధరణి న్వధూటికా
సంతతిలోనఁ జూడ నొక సాధ్వియు లేదని యాత్మలోన సి
ద్ధాంత మొనర్చితి న్మముఁ గృతార్థులఁ జేయు మటంచు మ్రొక్కిన
క్కాంతిమతీవధూటి యవుఁ గాకని కాళిగృహప్రవేశయై. 74

తే. రాజు మొదలైన వారి దూరమున నునిచి
గర్భగృహమున కరిగి వేగమ కవాట
బంధన మొనర్చి గ్రక్కున భద్రకాళి
డాసి నిలుచుండి ధీరతాడంబరమున. 75

1. బ్రబలము

క. నా మనసు వచ్చు కై వడి
నే మెలఁగినఁ జూడలేక యెవ్వతెవేఁ యీ
బూమెలు పన్నఁగవల దిఁక
నీ మేర న్నిలువకున్న నిట్టటుఁ జేతున్. 76

తే. అనినఁదత్కాళి యెంతకై నను దెగించి
నట్టి దీజంత యేమి సేయంగఁ బూను
నో యనెడు భీతిఁ దలయూఁచు టుడిగి నిలువఁ
దరుణి వాఁకిలి తెఱచి యందఱిని బిలిచె. 77

క. పిలిచిన నరపతి మొదలుగఁ
గలవారలు వచ్చి భద్రకాళీదేవిం
దిలకించి శిరఃకంపము
నిలుచుటకు న్విస్మయాదినిబిడాశయులై. 87

తే. కాంతిమతి భూతలమున సాక్షాత్కరించి
నట్టి యయ్యాదిలక్ష్మిగా కరసి చూడ
మనుజకామిని గాదు సుమ్మనియు మఱియు
మఱియు మ్రొక్కిరి వినయసంభ్రమము లెసయ. 79

ఉ. ఆసమయంబున న్నరవరాగ్రణి భృత్యులు తెచ్చినట్టి సిం
హాసనమందు నవ్వికసితాంబుజలోచన నుంచి వైభవ
శ్రీసముదీర్ణవృత్తి నభిషేకము చేసి విశేషభూషణో
ద్భాసితచిత్రచేలము లపారముగాఁ గయికాన్క చేసి నా
నాసతు లెల్ల మ్రొక్కఁగ నొనర్చి యనేకకృతప్రణాముఁడై. 80

తే. నతు లొనర్చి మహాపతివ్రతయటంచుఁ
బేరు పెట్టి యలంకృతవారణంబు

పై సమాసీనఁ గావించి పటహముఖ్య
భద్రవాద్యరవంబు లంబరము నింద. 81

వ. [1](ఆ కాంతిమతి) నూరేగించి నిజగృహబహిర్భాగంబున గజావరోహణంబు గావించిన యక్కాంతిమతిచేత సాష్టాంగప్రణామపూర్వకంబుగా ననుజ్ఞాతుండై యానృపాలపురుహూతుం డరుగం దక్కిన వారలను బాదపరాగంబు ప్రసాదించి వీడ్కొలుపుచు నమ్మందగమన మందిరాంతరంబునకుం బోయి. 82

తే. వరము లిచ్చు మహాపతివ్రత యటంచు
సేతుకాశీపురాంతరక్షితిజనంబు
లచ్చమగు భక్తిఁ గానుక లెచ్చి చూడ
వేళ గానక యుండఁగా వెంసె నధిప ! 83

క. అంతయుఁ గనుగొని యిక నీ
జంత న్నమ్ముదురె? యెపుడు చంపునొ యనుచుం
జింతించి యాశుకుఁ బాయక
యంతం ద్వర వెడలి కాశి కరిగితి నధిపా ! 84

శా. గంగాభంగముల న్మునింగి నిగమగ్రామేశ్వరు న్విశ్వనా
థుం గీర్తించుచు మ్రొక్కి డుంఠిగజవక్త్రుం గొల్చి యంతం ద్రివే
ణిం గాయంబు దొలంచి పూర్వకృతనిర్నిద్రాఘము ల్బాసి నీ
రంగత్పూర్వకృపారసంబునకుఁ బాత్రంబైతి ధాత్రీశ్వరా ! 85

క. ఆయద్భుతంబు మదిలో
[2](బాయమి నగ)లేక యుండిఁ బదపడి సభలో
నీ యాశ్చర్యముఁ గని భూ
నాయక ! తద్విగుణమగుట నవ్వొదయించెన్. 86

1. ఇవ్విధంబున నక్కాంతిమతి (పూ) 2బాయ మనఁగ (పూ)

క. అని తెలుప విక్రమార్కుం
డనుపమవిస్మయతఁ బుష్పహాసుని మన్నిం
చి నితాంతవిభవసౌఖ్యం
బున నుండె న్వింటె వైశ్యభుజగద్వేణీ ! 87

క. అని యిట్లు చిలుక పలుకన్
విని మిక్కిలి వెఱఁగు చెంది వెస నంతటిలోఁ
దనచేతి గరలు కనఁబడఁ
జనియెఁ బ్రభావతి రహస్యసదనంబునకున్. 88

## నలువదినాలుగవ రాత్రి;

తే. కోమటి మెఱుంగు సిబ్బెపు గుబ్బలాఁడి
యంతిపురమున కరిగి సాయంసమయము
గాంచి శైచేసికొని మహీకాంతసంగ
మాభిలాషంబుతోఁ జేర నరుగుదేర. 89

క. కనుఁగొని గుణసాగరుఁ డో
వనితా చనియెదవె ధరణివల్లభు కడకుం
జను మిఁక నొక కథ విను మని
యనుచుం బలుకం దొడంగె నతివేడుకతోన్. 90

### ఇరువదియొకటవ కథ

ఉ. అంగవసుంధరాభరణమై యొక పట్టణ మందమొందు మా
తంగతురంగసద్భటకదంబశతాంగతతు ల్సెలంగఁగా
మాంగళికాభిధాన మసమానముగా [1](వహించు నప్పురం)
బంగదనామధేయవసుధాధిపుఁ డేలు నవేలసంపదన్. 91

1. వహించి యప్పురం (పూ)

ఉ. ఆనరపాలమౌళి కపరాంగము క్రైవడి నొక్క మంత్రి మే
ధానిధినాముఁడై తగు నతండు నిజాంగన జాయమానశో
భానుతశాంత శాంత యను బాలికఁ గాంచి దివంబు కేఁగ సం
తానముఁ గోరి లోలయను తన్వి వరించి రమించె నంతటన్. 92

ఉ. ఆలలితాంగి కంటికిఁ బ్రియంబగు సౌఖ్యము ధరించి సేవక
[1](శ్రీల వరించి)జిహ్వకు రుచించు పదార్థము లాహరించి యే
వేళఁ బ్రసూనతల్పముల వేడుకమైఁ బవళింపఁ గల్గుటం
జాల మదించి జారజనసంగతికై తివురు న్మనంబునన్. 93

తే. ఇవ్విధంబున నప్పూర్ణిమేందువదన
యన్యసంభోగసుఖలేశ మబ్బనేని
యాకసంబైన భేదించి యవలఁ బోవు
నంతకుఁ దెగించి యున్న యయ్యవసరమున. 94

క. వారింట దేవపూజా
కారిత్వముఁ బూని వేదఖనియై వినుతా
[2](చారుండై) సద్గుణనిధి
చారణుఁ దన నొక్క బ్రహ్మచారి చెలంగున్. 95

క. ఈరీతి నుండువానిం
జారిణి లోఁబఱిచి యొక నిశావేళఁ దమః
పూరితమగు నొక యింటం
జేరిచికొని యిష్టకామ్యసిద్ధిం గనియెన్. 96

క. కని యది మొదలుగఁ దద్రతి
ననుపమసౌఖ్యాబ్ధి నోలలాడుచు మరునిం
దిన బంటు గాఁగఁ దలఁపుచు
ఘనతరగర్వమునఁ గన్ను గానక మెలఁగెన్. 97

1. శ్రీలమరించి (పూ) 2. చారణుఁడై (పూ)

క. అంతఁ దన సవతి సుతయగు
శాంతం బోషింప మఱచి చారణనిష్ఠ
స్వాంతత్వముఁ జెందిన త
త్కాంతామణి నడక తెల్లఁ గాంచినయదియై. 98

తే. శాంత శాంతల యయ్యును జతుర యగుట
దీనికి భయంబు చూపినఁ గాని తనకుఁ
బోషణము లేదనుచు డెందమునఁ దలంచి
యోర్చికొని యుండి యంతట నొక్కనాఁడు. 99

చ. జనకునిఁ జేరి యూరనికి సంతస మయ్యెడు మాటలాడి సొం
పెనయఁగ నీవు గాక మఱి యింకొక తండ్రి గలండు నాకుఁ బొ
మ్మని పలుకన్ వినిశ్చలతరాద్భుతుఁడై మదిఁ జెందు సందియం
బునఁ దలపోసి యా సచివపుంగవుఁ డెంతయు నాదరంబునన్. 100

తే. ఇంక నొక తండ్రి గలఁ డంటి వింధు దన!
యతనిఁ జూపెదవే యన్న నవ్వధూటి
మంచిదని రేయి చూపెద నంచుఁ బలికి
యవలి కరిగిన నమ్మాట లాలకించి. 101

క. ఆలోలాంగన [1](తన) దు
శ్శీలం బిది యెఱిఁగి పతికిఁ జెప్పఁగ బూనం
బోలు నని తలఁచి మిక్కిలి
జాలిం బడి శాంతఁ బిలిచి సప్రియరీతిన్. 102

తే. అనునయించిన నబ్బాల యొసనేమి
నన్నుఁ బోషించెదేని యెంతయును గప్ప
దాలునని పల్కె నింక నత్తరుణి జనక
భావసంశయ మెట్లు పాపంగవలయు? 103

1. తగ (పూ)

క. అని పలికి యూరకుండినఁ
గనుఁగొని యూరుజసరోజగంధి విచారం
బొనరించి తెలియఁ జాలక
వినిపింపు మటన్నఁ గీరవిభుఁ డిట్లనియెన్. 104

వ. అంత నిశాసమయం బగుటయు నమ్మేధానిధి విభావధీరితతమఃపుంజంబగు కేళిమందిరంబున లోలాసమేతుండై యుండి యబ్బాలికం బిలిచి ద్వితీయజనకుం జూపు మనిన శాంత యత్యంతమౌగ్ధ్యంబు దాల్చి తదీయచ్ఛాయం జూపిన నతండు నవ్వి లోలం జూచి యేతద్బాలికాలాపంబులకు నీ యందు సందియంబుఁ జెందితి నని తద్వృత్తాంతం బంతయుఁ దెలిపి పతివ్రతాశిరోమణి వగు నీకిట్టి గుణంబులు పుట్టునే యని పలుకరించెం గావున నయ్యమాత్య కుమారికకుంగల నైపుణ్యంబు గలిగినంగాక ధరణీభుజంగపుంగవుని సంగతికిం జనఁ గూడునే యను నంతలోన నరుణోదయంబైనం బ్రభావతీలలితాంగి శుద్ధాంతంబున కరిగి క్రమంబున దినావసానం బగుటయు. 105

## నలువదియైదవ రాత్రి

శా. పన్నీటం జలకంబులాడి తొగలబాబాపాదుషా కాయపుం
జిన్నెల్వ్రాసిన చీరె గట్టి యపరంజిం జిమ్ము నెమ్మనిపై
మిన్నల్గ్రమ్మెడు సొమ్ము దాల్చి మహిభృన్మీనాంకజన్యక్రియా
సన్నద్ధత్వముఁ [1](జెంది) యందము రహించం జేర నేతెంచినన్. 106

క. అమ్మ ప్రభావతి! రాజగృ
హమ్మున కరిగెదవెః మంచి దరుగుదువు వినో
దమ్మగు కథ వినియెదె యని
కమ్మని చక్కెఁలు గెరలఁగా నిట్లనియెన్. 107

### ఇరువదిరెండవ కథ

మ. అవనీమండలమండనం బయిన యార్యావర్తదేశంబునం
దు విరాటుండను రాజు ప్రోవఁ జెలువందున్ భద్రకాఖ్యం బుర

1. జెంద (పూ)

ప్రవరం బొక్కఁడి యంచు విప్రకులపారావారహాలాహలం
బవు నీతండన దేవలాంకుఁ డొకఁ డర్థాపేక్షమై వర్తిలున్. 108

*సీ. అపరకర్మాగతంబైన వస్త్రమె గాని
క్రయలబ్ధవసనంబు కాని వావి
పూటపూట పరాన్న భోజనంబే కాని
[1](ప్రియభామినీభుక్తి) పెట్టు మందు
దానలబ్ధంబైన తాంబూలమే కాని
చేనున్న పీడెంబు చెడ్డ యొట్టు
వితరణులైన భూవిభుల వాఁకిలె కాని
యింక నిజాలయం బెదురు చుక్క
గాఁగ నూహించు నప్పాపకర్ముఁ డెంత
యర్థకాంక్షయొ కాని ధనాఢ్యుఁ డయ్యు
జన్మఫలమైన యట్టి సంసారసౌఖ్య
మనుభవింపంగఁ జాలఁ డో యంబుజాక్షి. 109

*మ. పితృకార్యంబున నొక్క నింటఁ గడు తృప్తింజెంది తత్పూజనా
గతపుష్పాదులు దోచి యార్ద్రరసనాంగక్రాంతి దైన్యస్థితుల్
జతగూడంగ నతండు గేహముల 'భిక్షాం దేహి' యంచున్ దరి
ద్రత గల్పించుచు తెచ్చి భైక్షము తుదిం [2](గయ్యంబు)సేయున్బరిన్ 110

*క. తొడిబడ నొకయింటి తిథిన్
దడవుగ నాపోశనంబు ధరియించి కడున్
గడు పెద్ద దక్షిణిండని
యొదఁబడినం గాని భుక్తి కొగ్గఁడు పడఁతీ! 111

*సీ. గార్హస్థ్యపరులు దక్షిణ యొంచు దుడ్డుకా
సులు నిచ్చువానిపై సొరిది వైచు

1. ప్రియభామ నిజభుక్తి (పూ) 2. గయ్యంబు (పూ)
*మద్రాసు వ్రాఁత ప్రతిలో లేవు

నడిగి తెచ్చిన పోఁకలాకులు మాపటి
వేడుకకాండ్రకు వెలకొసంగు
దినమును ముష్టి యెత్తిన ధాన్యములు దెచ్చి
మాఱుబేరంబు కోమటుల కమ్ము
నలయక కూర్చి భైక్షాన్నంబు పరదేశ
వివిధమానవులకు విక్రయించు
నాదవినంతయు టాకుసేయుట యకార్య
మనఁగ వచ్చునె లోకుల కైననేమి
యతఁడు దలమీఁద వచ్చిన యపుడునైన
రూక మార్పఁడు [1](కమలవిరోధివదన.) 112

*సీ. మనసు [2](కోరికదీరి తను పునీతుఁడు) గాఁగఁ
దలఁచును యదె పిండదాన మన్న
ఘననిదానము గన్న గతి [3](నుబ్బి) చంకలు
దాటించు కార్పాసదాన మన్న
నరచేతి ముడువఁగా నది యెంచి [4](యెంతైన)
దవ్వేఁగు మహిషప్రదాన మన్న
చెలరేఁగి కుప్పిగంతులు వైచి చెంగున
దాఁటు నాలింగనదాన మన్న
కాలపురుషాదిదానసంగ్రహణములకు
నెలమి వచ్చినవారితోఁ గలహమాడి
యదను దప్పిన మటి పాళ్ళకైన బెనఁగు
నాశఁ బాల్పడి యవ్విప్ర [5](పాశవికుఁడు). 113

*చ. సమయము వేచి యాద్విజుఁడు సంక్రమణగ్రహణాదిపుణ్యకా
లము లరుదేర దర్భలు తిలల్ ధరియించిన వాని మజ్జన

1. కమలవిరోధినయన. (పూ) 2. కోరికదీర తమపు నీతని (పూ)
3. మచ్చి (పూ) 4. యెందైన (పూ) 5. పాశవరుఁడు (పూ)
* మద్రాసు వ్రాఁతప్రతిలో లేవు.

ప్రమదజనంబు లొల్లమని పల్కిన మంత్రము లుగ్గడించి పీ
సము కడ గాఁగఁ గైకొను నసహ్యత రొక్కము లెన్నఁ డెన్నఁడున్. 114

*తే. వ్రతము లందున చిననాఁటి వడుగటంచు
దేవతోత్సవ మని తండ్రి తిథి యటంచు
వాత బేగులు మాన్పి యెవ్వారిఁ గన్న
నేటు నాతఁడు ధనకాంక్ష పీటి బోవ. 115

*సీ. అన్నంబు వెట్టింపుఁ డాఁకలి గంటినో
యయ్యవార లటంచు నార్భటించు
పరిహరించినఁ బోక బహుసాహసస్ఫూర్తిఁ
బలిమి మీఱఁగఁ దల్పుఁ బడఁగఁ ద్రోయు
కూడకుండిన మదుర్ గోడ చెంగున దాఁటి
బంతిలోఁ గూర్చొని రంతు చేయు
మెడఁబట్టి త్రోఁచినఁ బడి చెయ్యి విఱిగెనో
కూయంచు మొఱవెట్టుఁ గోపు నెఱపు
నెట్టు లయినను భుజియింప కెడసిపోవఁ
డాతఁడు పరాన్నభక్షణాయత్తుఁ డగుచు
బ్రాహ్మణోత్తమజనసమారాధనంబు
శిష్టనుతముగ గృహపతుల్ సేయునపుడు. 116

సీ. సంతలోఁ బ్రత్తి బిచ్చములెత్తి నూఱాలు
వగల జన్నిదములు వడికివడికి
నికటకాననభూములకు నేఁగి మట్టియా
కులు దెచ్చి విస్తరుల్ గూర్చికూర్చి
శాకపుబీజముల్ చల్లి బావుల నీరు
చేఁది పోయుచుఁ బైరు చేసిచేసి
వేకువ నంగళ్ళ విక్రయవేళల
జాటిన మిరియాలు లేటియేటి

*మద్రాసు ప్రాచ్యప్రతిలో లేవు

యన్నియును విక్రయించి బార్యాకుమార
ముఖ్యు లాఁకట [1](క్రగ్గిన) మొగముఁ జూడఁ
దాసపడి యేమి కోరిన నాఁగహించు
జందెములు ద్రెంచుకొని తద్ద్విజన్మఖలుఁడు. 117

తే ఇట్లు గడియించి ధనమెల్ల నీఁట నునిచి
యతఁడు పరలోక మెనయఁ దదాత్మజుండు
గర్గుఁ డనువాఁడు కౌమారకలితుఁ డగుచుఁ
దరుణగాణిక్యవిహరణాదరణుఁ డగుచు. 118

సీ. కన్నెటికంపు బింకముఁ బోని నేయాలు
వెలఁబెట్టి పలుకు సుద్దులకు లొంగి
రతులకు జాణబేరము ఽంచుఁ జెలులచేఁ
[2](బలికించు)వన్నెచిన్నెలకు మఱఁగి
వలచితి రోరి! యీవుల కేమి యెడఁబాయ
వలదను తక్కుట్రముక్కులకుఁ జిక్కి
సాకటి[3] పండుగల్) జాతరల్ మొదలుగాఁ
దలపెట్టి గొఱుగు వింతలకుఁ దగిలి
పోటు గడియించి రోసంబుఁ బొదముఁ జేసి
కలుపుగోలు వహించి పోకలకు నలరి
గర్గుఁ డడ్డంబు లేక భోగంపుఁ జెలుల
కైవసము చేసెఁ దనయింటఁ గల ధనంబు. 119

సీ. జోగిజంగంబు లెచ్చుగఁ బల్కులకు వాఁడు
చెలరేఁగి లంజ మందులకుఁ జల్లి
తముకు వేసినవెన్కఁ దాఁ జరించినఁ బట్టి
యునుపకుండఁ దలార్ల కొసఁగి యొసఁగి
కొండెము ల్చెప్పకయుండ విరాటభూ
వరుని వాఁకిటి చనవరుల కిచ్చి

1. క్రొగ్గిన (పూ) 2, బరికించు (పూ) 3, బిండుగల్ (పూ)

'దర్పకాకార! దాతలరాయ!' యని వెంట
బడు బట్టువారికిఁ బాఱవైచి
తగులుగా నిచ్చు పీఠమర్దవిటచేట
కులకును విదూషకులకు మేకోలు నడపి
తండ్రి గడియించినట్టి విత్తంబు వోవ
[1]గుల్లగాఁ దయ్యె నవ్విప్రవల్లభుండు 120

తే. ఇవ్విధంబున లేమి వహించి గర్గుఁ
దప్పురము రోసి పరభూమి కరుగుచోటఁ
బ్రబలమగు నొక్క యగ్రహారమున నిలిచి
యతిపిపాసాబుభుక్షాతురాత్ముఁ డగుచు. 121

చ. సకలపురాణము ల్నిగమచర్చ లెఱింగిన వైదికాఖ్యుఁడౌ
యొక గృహమేధి పిల్వఁగఁ దదుజ్జ్వలమందిరసీమఁ జేరి యిం
చుక తల వంచుచున్ బెఱుకు చూపులతో వెసఁ బాద్య మిచ్చు త
న్ముకురకపోలఁ గన్గొని కనుంగవకుం బ్రమదంబు వొందఁగన్. 122

*సీ. జాఱు పెన్నెఱి కొప్పు శాతమన్యవశిలల్
నించు చేపట్టు గావించు నేర్పు
గిలుకు మెట్టెలు మ్రోయ కేకినీయానంబుఁ
దెలుపుచు శాకంబు దెచ్చు నొఱపు
పైఁటకొం గరపీడ బాహామూలద్యుతుల్
మించఁగాఁ గదిసి వడ్డించు ఠీవి
కమ్మతో దసియాడఁ గలితకోకిల[2] (రుతుల్
రాజిల్లి నిగుడ) మారడుగు నేర్పు
పతికిఁ జాటుగ నిల్చి తప్పక మెఱుంగు
సొలపుఁ జూపుల బెళికి పోఁ జూచు దారిఁ

1. లొల్లగాఁడయ్యె 2. రుచుల్ రాజిల్ల బెగడ (పూ)
* మద్రాసు ప్రాఁతప్రతిలో లేదు.

దియ్యవిలుకాని( దెచ్చి ప్రతిష్ఠసేయ
గర్గు( డిష్టాన్నభుక్తి సౌఖ్యాంతు( డయ్యె. 123

*వ. అయ్యవసరంబున. 124

సీ. మానసజాతశ్రమంబు నీచెత్తిరో(
గాంక్షించి నాపైని గాలి విసరె
నటవీచరత్కేకిహర్షావహిత్థంబు
మర్చికో( జాటంత మబ్బు దో(చె
పథికయోధములు ప్రాప్యగ్రామములు చేర
నభ్రమంబరమెల్ల నల్లికొనియె(
గాంక్ష( గన్గొను సైరికవితానముల చూపు
మిఱుమిట్లు గొన తీ(గె మెఱుపు మెఱసె
తరుణు లధిపులమై వ్రాల నుఱుము లుఱిమె
చెల(గి చాతకి నోరొగ్గ( జినుకు రాలె
నవని నేకార్ణవంబైన యట్లు జలము
వెల్లువలు గా(గ నొక మహావృష్టి గురిసె 125

తే. అపుడు వైదికు( డాగర్గు నాదరించి
వాన తఱి యయ్యె రవి గ్రుంకవచ్చె నింక
నెందు( జనలేవు శయనింపు మిందె యనుచు(
దాను నాత(డు సమయకృత్యములు దీర్చి. 126

ఆ. పవ్వళించి రంత( బని దీర్చి దీపంబు
మల(పి యద్దగోడ మఱు(గు గా(గ
వైదికుని సుధాంశువదనయు శయనించె
పచ్చవింటిరాయ( డెచ్చరింప. 127

మ. గొనబుం బ్రాయము రూపసంపదయు( బేరో(పె( గల్గుటల్ మాఱికిం
దను వీక్షించుట గర్గభూసురుని మీ(దం గోరుకు ల్మల్లడు.

* మద్రాసు వ్రాత ప్రతిలో లేదు.

ల్గొనఁగా నేఁడొకనాఁటి మాత్రమున కీ లోలత్వమేలంచుఁ జెం
దిన ధైర్యంబునఁ గొంతసేపునకు నిద్రించె న్వరాకాంక్షియై. 128

ఉ. గర్గుడు దాని మేని యధికవ్యతిరూపములు న్విలాసనై
రర్గళము ల్విలోకనపరంపరలం దలపోసి చిత్తభూ
మార్గణభూమి నొంప ససమంబగు [1]తామస మంకురింపఁగా
నిర్గతభీతి వైదికుఁడు నిద్రవహించుట చూచి గ్రక్కునన్. 129

క. చని దాని వీఁపుపైఁ గర
మునుప న్మెల్లాంచి యాతలోదరి నాథుం
డని మొగ్గ నతఁడు తద్రతిఁ
దనిసి వెస న్శయనభూమి దండకు నరిగెన్. 130

క. అంతట నిశిసమయమునకు
నంతము గలుగుటయు గర్గుఁ డరుగం గని య
క్కాంత నిజాధిపుఁ గనుఁగొని
సంతసమున సిగ్గు సాధ్వసం బొనగూడన్. 131

చ. పదరితి రేమి రాత్రి నగుబాటని యెంచక వచ్చి యంత సే
యుదురె గృహంబులో నితరుఁ డున్కి యెఱుంగరె [2]సిగ్గు దాఁకదో
మది మగవార లైనను సమస్త మెఱింగినయట్టివారికే
తుది నొకవేళ నేమియును దోఁచదువో గద యెంచి చూచినన్. 132

క. అనిన విని నేను నిశి మే
ల్కనినే లేదనుచు దాని కాంతుం డిది గ
ర్గుని కృత్యమె కావలె నని
ఘనమైన జుగుప్స వొడమఁగాఁ గుత్సించెన్. 123

తే. అప్పు డన్నాతి యేరీతి నాత్మమాన
భంగ మాచ్ఛాదితంబు చేయంగవలయు

1. సాహస 2. సిగ్గు గాదొకో

ననఁ బ్రభావతి నన్నేమి యడిగె దవలి
కథ యెఱింగింపు మనిన శుకంబు వలికె. 134

మ. అపు డమ్మానిని యధ్వనీనకృతధౌర్త్యప్రక్రియల్గాఁ దలం
చి పతిస్వాంత మెఱింగి మోసము జనించెం జూచితే యింక మ
న్నిపుణత్వంబునఁ గాని యీ విభుని సందేహంబు వోదంచు దెం
దపుఁ దమ్మిం దలపోసి యమృతరసానందంబుఁ గల్పించుచున్. 135

ఉ. కంటిరె యెంత వింత కల గన్నపు డెల్లను మీరు వచ్చి న
న్నంటిన యట్టు లుండు నదియొఁ గద రాతిరి మిమ్ము బాసి నే
నొంటిగఁ బవ్వళించుటకు నోపక చింత వహింప నంతలోఁ
గంటికి నిద్ర వచ్చెఁ గల గంటి భవద్రతి గల్గినట్లుగాన్. 136

తే. వామహస్తము నురముపై వైచి నిదురఁ
జెందు తఱిఁ గానికల గందు రందు రెందు
నవ్విధంబునఁ బవళించి యైనకలయ
కంటి భవదీయకారుణ్యగరిమ వలన. 137

క. అని వలుక దాని మాటలు
విని నిశ్చయమని తలంచె విభుఁ డో పద్మా
ననః యంత నేర్పు గలిగినఁ
జనవచ్చు నటంచుఁ గీరచంద్రుఁడు పలికెన్. 138

**నలువదియాఱవ రాత్రి :**

తే. ఆప్రభావతి బాగాయె నంచుఁ బలికి
ప్రాగ్దిశాపాండిమము గాంచి పడకయింటి
కరిగి పగలెల్లఁ ద్రోఁచి దినాంతవేళ
యధిపసంగమకుతుక మాస్యమునఁ దొలుక. 139

సీ. కలికి చేర్చుక్కయౌఁ గాదుగా కచభృంగ
భంగపాళిక కోరపంక్తి గాని (?)
కస్తూరి తిలకమౌఁ గాదుగా ముఖపద్మ
సక్తశైవాలలేశంబు గాని
రంగులంజవికె నారాదుగా కులశైల
గ్రసితనాగేంద్రదత్త్వక్చయము గాని
గతి వన్నె చీరెయౌఁ గాదుగా తనువిద్యు
[1](దాద్యాది)వారివాహంబు గాని
కనక మేఖలయౌఁ గాదుగా నితంబ
నవ్యకటిదేశకృతతోరణంబు గాని
యనుచు వర్ణింపఁ గై సేసికొని యొయార
మమర వచ్చెఁ బ్రభావతీహంసయాన. 140

మ. అవు డాచక్కెఁ బనిండిపక్కిదొర యక్కా! నేఁటి కిమ్మేని చొ
క్కపు శృంగారము వక్ష్యమాణకథ జోకన్ వింతయయ్యెన్ సుమీ
కృప దళ్కొత్తఁగఁ జిత్తగింపు మని యంగీకారముం గాంచి నే
రుపు మీఱం దెలుపం దొడంగెఁ బలుమాఱుం దేనియల్ చిందఁగన్. 141

## ఇరువదిమూఁడవ కథ

క. సుజనాకరమగు నొక పుర
ము జగజ్జేగీయమాన మొదవఁగ ముదితా
గజరథమరుదురురయహయ
భుజవిజయసనాథసుభటభూయిష్ఠంబై. 142

క. ఆరాజధాని నేలు గ
భీరుం డను నృపతి యతని ప్రియమంత్రి జర
త్కారుఁ డన వెలయు నతని కు
మారుఁడు గుణశాలి యనఁగ మాన్యతఁ గాంచెన్. 143

1. తాభాది (పూ)

తే. అతఁ డొకనాఁడు హరిశర్మ యనఁగఁ బరఁగు
నొక్క త్రైర్థికుం దేతేర నాదవు భక్తి
నతని కిష్టాన్నసంతుష్టి యాచరించి
యర్ఘ్యసంభాషణంబుల నలరఁ జేసి. 144

క. అన్నియుఁ దొలఁగిన యట్టి ప్ర
సన్నాత్మా [1](కలియుగమున) జటులాఘత దు
శ్ఛిన్నులగు జనుల కే క్రియ
నెన్నఁగ సద్గతులు గలుగు నెఱిఁగింపఁ గదే! 145

వ. అనిన విని యమ్మహీసురుం డిట్లనియె. 146

సీ. అన్నదానంబు దురంతపాపాటవీ
జాలంబునకు దావకీల గాదె?
సురపితృభజనంబు దురితమేదురధరా
ధరకోటులకు వజ్రధార గాదె?
కూపకల్పన మహాఘోరదుష్కృతతమః
కాండంబునకు భానుకరము గాదె?
తరుకోటి నిల్పు టుత్కటకల్మషాబ్ధిక
లమునకు జంఝూనిలంబు గాదె?
ధరణి మఱియును భూసురస్థాపనంబు
మొదలుగా నెన్నఁగల పుణ్యములు సెలంగు
నవియ చాలవె వృజినాగ్ని నవల నార్ప
సద్గతులు గూర్పఁగ నమాత్యచంద్రతనయ! 147

వ. అనిన విని యమందసందేహకందళితహృదయారవిందుఁడై యమ్మంత్రి నందనుండు. 148

---

1. కలియుగంబు (పూ)

తే. ముక్తి దొరకదు విజ్ఞానముననె గాని
కర్మమునఁ గాని విజ్ఞానగరిమ లేదు
జ్ఞానసత్కర్మహీనులౌ జనుల కల్ప
మతుల కేరీతిఁ గల్గు సద్గతులు చెపుమ. 149

క. అనఘాత్మ ! యనాయాసం
బున కర్మఫలంబు జ్ఞానమున జెంది రయం
బున లింగశరీరము [1](వీ
డ్కొని) సద్గతి గాంచు వెఱవు గోరెద చెపుమా. 150

చ. అన విని యమ్మహీసురకులాగ్రణి యించుక సేపు కొంత చిం
తన మొనరించి యంతటఁ బితామహుమాట దలంచి మంత్రి నం
దనుఁ గనువిచ్చి చూచి చిఱునవ్వు తెలంకుల చిన్నవెన్నెలల్
చినుకఁగ నిట్లనున్ ప్రమదసింధునిమగ్నమనోంబుజాతుఁడై. 151

తే. బంధురక్షక! యిది మంచి ప్రశ్న కలియు
గమునఁ బాపాత్మజనులకు గతులు గలుగు
వెరవు [2](దెలుపఁగ) నన్నిట్లు వేఁడ భూత
కరుణ గలవాఁడవగు టెఱుఁగంగ నయ్యె. 152

క. మును బ్రహ్మ దెలిపె భూతల
మునఁ గాశీక్షేత్రరాజమును శ్రీముష్ణం
బు ననాయాసంబునఁ గలి
జనులకు సత్పుణ్యగతు లొసంగు నటంచున్. 153

క. కావేర్యుత్తరభువి సం
జీవనదికిఁ బడమటను [3](నృశేవధి కృష్ణా

1. వీడ్కొన (పూ) 2. దెలిపెద(పూ) 3. నృశేవధికకృషాంశైవనికి దక్షిణం
బగు (పూ)

శైవలినికిఁ దక్షిణమగు)
తావున శ్రీముష్ణవిష్ణుధామము వెలయున్ 154

సీ. శ్రీవరాహస్వామి చిత్తాపకల్పితా
మోదసాగరము శ్రీముష్ణపురము
ప్రతివారసేవకాగతశతక్రతుశాలి
ముఖ[1](సురోత్కరము) శ్రీముష్ణపురము
ముక్తివధూటిముముక్షుకోటివిధూత
మోహనాకరము శ్రీముష్ణపురము
[2](నటదప్సరోమణి)ఘటితనూపురరావ
ముఖరితాంబరము శ్రీముష్ణపురము

స్మరణమాత్రవినిర్గతసకలపాప
మూలసంతతివరము శ్రీముష్ణపురము
దర్శనాలోలహృదయకందళితలసద
మోఘసుజ్ఞానదరము శ్రీముష్ణపురము. 155

క. శ్రీముష్ణము శ్రీముష్ణము
శ్రీముష్ణం బనుచుఁ దలఁప జీవుఁడు కర్మ
గ్రామము దహించి గర్భ
స్తోమప్రాప్తులను నడుచుత్రోవలు మఱచున్. 156

సీ. పొందు గోరదు నిజభుక్తికాలాగతా
గాధబాధాకరవ్యాధిచయము
[3](చేరఁబోదు) దురంతచింతాతిసంతాప
[4](కృతమహోన్నిద్ర) దరిద్రరవము

1. సరోత్కరము (పూ) 2. నటతపురోమణి (పూ) 3 చెలులుపోదు (పూ)
4. కృతమహిన్నిద్ర (పూ)

తొంగిచూడదు మనోభంగపారంపరీ
విత్రాసజనకతాపత్రయంబు
తడవఁ బోవదు మహోద్దామకామక్రోధ
మాత్సర్య [1](మోహాది)మదకులంబు
మించి శ్రీముష్ణమంచుఁ దలంచువాని
మాటలేటికి వాని కర్మములు వ్రాయు
చిత్రగుప్తులు తమ లెక్క చెడియె ననుచుఁ
గవిలె పడవేయుదురు ధర్మకార్యధుర్య ! 157

సీ. శ్రీముష్ణమని తలంచినఁ జాలుఁ బ్రాకర్మ
కలితపాపౌఘంబు [2](వలసఁ)బోవు
శ్రీముష్ణయాత్ర చేసినఁ జాలు నన్యూన
విజ్ఞాన మది కాళ్ళవ్రేళ్ళఁ బెనఁగు
శ్రీముష్ణపురముఁ జూచినఁ జాలు భోక్తవ్య
కర్మకాండంబు లెక్కడనొ యడఁగు
శ్రీముష్ణనగరు డాసినఁ జాలుఁ గైవల్య
పథమెల్లఁ గిల్లాకు పంపుసేయుఁ
దగులుచే నైన శ్రీముష్ణధామసీమఁ
గాఁపురంబున్న వాని భాగ్యంబుఁ బొగడ
నలవియే బహ్మకైన బల్ చిలువకైనఁ
దలఁచినంతనె మై గరుపొలిచెఁ జూడు. 158

తే. ఇతరపుణ్యస్థలంబుల నెందుఁ జూడఁ
దార మును దెల్పి కరుణించువారు లేరు
[3](కాని) శ్రీముష్ణమున రమాకాంతు నాజ్ఞ
హరుఁడు గరుడుండు నుపవిష్టు లగుదురయ్య ! 159

1. ద్రోహాది (పూ) 2. వలనఁ (పూ) 3. కాశి (పూ)

సీ. జనకశైలరతవిరజానదీజలజాత
కులసౌరభము గుబుల్కొనఁ గడంగి
పుడుకబెట్టుల తేనెఁ దడిసిన నునుఱెక్క
సురటి జల్లిన గొట్టు సోఁక విసరి
హరిపదంబులు దార్ప నర్హమౌ కంటికి
దంబుపై నుత్తమాంగంబుఁ జేర్చి (?)
వైకుంఠపురసురావళి బరాబరి సేయు
మృదులహస్తమున నెమ్మేను నిమిరి
ఖగకులేంద్రుండు దక్షిణకర్ణమునను
తారకబ్రహ్మపరమమంత్రంబు నొడువుఁ
గడఁగి కడపటి పయనంబుఁ గాంచువాని
కోమహామహ శ్రీముష్ణగ్రామసీమ. 160

సీ. ఎందుండి వచ్చునో యినకోటినిభచక్ర
మరుదెంచు దక్షిణహస్తమునకు
సమయమౌ బెఱుఁగునో ఘుమఘుమధ్వనిశంఖ
మప్పు[1](డొందు) వామకరాగ్రసీమ
యెవ్వరు పనుతురో యల హేమచేలంబు
జగనీటుఁ గనుఁ గటిచక్రసీమ
తటివేచియుండునో తతమణికోటీర
మవతీర్ణమగు నుత్తమాంగమునకుఁ
బతగరాజోక్తతారకబ్రహ్మమంత్ర
[2](వర్ణములు) కొన్ని వీనులవల నటింపఁ
దనువుతోఁ బొందు సడలించు ధన్యమతికి
భూసురోత్తమః శ్రీముష్ణపురమునందు. 161

శా. శ్రీముష్ణంబు సమస్తవైష్ణవమహాక్షేత్రాళికిన్ రాజసే
వాళి[3](మంత్రంబనఁ) బాపలోపకరణవ్యాపారపారీణమై

1. డొద్దు (పూ) 2. మంత్రములు (పూ) 3. మంత్రంబునఁ (పూ)

యామోదం బొదవించు నిచ్చు బల[1](దీర్ఘాయుష్కళా) వైభవం
బేమో యంచు మదిం దలంచెదవు సుమ్మీ మంత్రిరాణ్ణందనా! 162

వ. విశేషించియుఁ బంచమహాపాతకంబుల సైన్యంబుఁ బటాపంచంబు గావించు సమయం బొక్కటి గలదు. అది పరమరహస్యం బిత్తఱిం పశ్చాత్తాపమునఁ జీకాకుపడు నీకుఁ దెలుపందగు నిందెవ్వరు లేరు గదా! దగ్గఱకు రమ్ము కృతాఖిలజనోల్లాసంబగు మాఘమాసంబున నక్షీణపుణ్యలక్ష్మీవిధానపక్షంబగు శుక్లపక్షంబున దుర్దమదురితమర్దన[2](చణంబగు)చతుర్దశీదినంబున శ్రీముష్ణంబున నిత్యకృత్యంబులు నిర్వర్తించి రథోత్సవోత్సాహుండగు వరాహదేవుని భజియించి యవభృథస్నానకుతూహలుండగు నద్దేవుని వెంటనె ప్రాగంబు నిధానంబున కరిగి వేఁగిన పున్నమనాఁడు ప్రాతఃకాలంబునఁ దదంబులఁగ్రుంకి మధ్యాహ్నంబునకు చకచకితగోపురమణిడంబరంబగు పురంబునకుఁ జని సంజనితకంజాతవిహరమాణరథాంగవధూవిభ్రమశ్రీకరంబగు నభ్ర సరోజాకరంబున మునుక లిడి తనుకలితకనకవసనరుచినిచయప్రకాశితదిశా బృందుండగు గోవిందదేవుని సందర్శించివిజ్ఞానసభాభాసమానుండగునీశానునకు నమస్కారంబు గావించి యేతెంచి [3](దినాంతంబున) సదావాసితగంగా నిర్ఝరిణి యగు నిత్యపుష్కరిణి నవగాహంబు గావించి నిశాముఖంబున వరాహ దేవుని సేవించి తత్ప్రసాదంబును భుజియించినవారికి దేశాంతర నివాసియైన దుష్కృతక్లేశలేశంబులు లేక యనేకాభీష్టంబులు చేకూరు; నావెనుకఁ గైవల్యంబునకుం గాంచికాంచ్లగు దైవయోగంబున నమ్మాఘమాసం బాసన్నమై యున్నయది. ఏనుఁ దద్వ్రతాచరణంబున కరుగుచున్నవాఁడ నచ్చటికి వచ్చెద వేని రమ్మని పలికిన యమ్మహీసురపుంగవునిం గనుంగొని యభంగుర సంతోషాంతరంగుండై గుణశాలి యిట్లనియె. 163

మ. మును [4](నే) తావకపాదపద్మవినుతిం బూతాత్మతం జెందినాఁ
డనొ నీ సత్కరుణాగుణంబుఁ గొనియాడ శక్యమే [5](నాయఘం
బునకు న్విస్మృతి దెల్పెదే)దయ వెసం బూర్ణంబుగాఁ దెల్పి తో
కొని పొ మ్మచ్చటి కేను వత్తు నిఁక నీకున్ శిష్యశిష్యుండనై. 164

1. దీర్ఘాయుగళా (పూ) 2. ఘనంబగు(పూ) 3. దినాంతరంబున (పూ)
4. నీ (పూ) 5. నాయఘంబునకు న్విస్మృతి దెల్పితే (పూ)

సీ. చక్కఁగాఁ బోనున్న సంయమనీపురం
బున కేఁగు త్రోవల ముండ్లు గొట్టి
చలపట్టి దురితావళులె వ్రాయు చిత్రగు
ప్తుల లెక్క హంసపాదులు ఘటించి
మున్నుగా నమరించియున్న దండన దాడి
యాతనసాధనం బవలఁ ద్రోఁచి
దండనోత్సుకవృత్తి దరిఁజేరియున్నట్టి
పాశకోశము పటాపంచఁ జేసి

నన్ను రక్షింప వచ్చి తెంతటి మహామ
హుండవో గాని యిదియేల యుర్విమీఁద
మిమ్మువంటి మహాత్ములు మెలఁగుటెల్లఁ
గూర్మి దీనుల రక్షించుకొఱకుఁ గాదె? 165

క. అని చిలుక పలుకుచుండఁగ
నినుఁడుం బూర్వాద్రిమీఁద నెక్కుట గనుచున్
జనియెఁ బ్రభావతి నిద్రా
ఘనపరవశమీలితాక్షి కైరవి యగుచున్. 166

## నలువదియేడవ రాత్రి;

తే. చారుకేళీనిశాంతంబుఁ జేరి నాఁటి
రేయి రాచిల్కరౌతు[1](గారించ) రాజు
వలపుతో వచ్చు నా ప్రభావతినిఁ జూచి
తే మనోభీష్టమస్తని తేనె లొలుకఁ
బలికెఁ దక్కటి కథ వినఁ జిలుక యపుడు. 167

వ. [2](అట్లు)గుణశాలి సన్నుతించి నీవెంట వత్తు నని. 168

---

1. గారించి (పూ) 2. అని యిట్లు (పూ)

చ. అనిన నతండు మేకొని కరాబ్జగృహీతతదీయపాణియై
జనభయకారిఘోరవనశైవలినీపురపట్టణంబు లె
ల్లను గనుపించికొంచు [1]నతులత్వర మించఁగఁ బోయిపోయి నూ
తనతరహర్షగద్గదవిధంబున నాతనిఁ జూచి యిట్లనెన్. 169

క. చెంగటఁ గంటివె దక్షిణ
గంగాద్వారము గిరీంద్రకన్యాసదయా
పాంగత్రిలోకము కాముక
[2](శృంగారాస్పదమయి తనరిన వింధ్యంబున్.) 170

మ. తనరన్ [3](గంటివె) వృద్ధశైల మిది గాదా! కంతువిద్వేషికే
తనమౌ దక్షిణకాశి ముష్ణపురభూదారేశవాత్సల్యసం
జనితానందత నిచ్చటన్ శివుఁడు లాస్యప్రౌఢి గన్పించు నీ
తని సేవించక యున్న తన్నగరి యాత్రాసిద్ధి లేదేరికిన్. 171

క. [4](మేరు) చతుశ్శృంగముల ప్ర
కారమున గయాప్రయాగకాశీగంగా
ద్వారము లచ్చట వాకొ్నక
వారణమున వచ్చి నిల్చె వరవినయనిధీ! 172

మ. అని విన్పించి యతండుఁ దాను వెస [5](వృద్ధాగస్థలిన్) జేరి తె
ల్ప నశక్యంబగు సంతసంబు వొదమన్ బాతాళగంగానదిం
దనువుల్ గ్రోచి తదగ్రగర్భగృహవాస్తవ్యున్ సురస్తవ్యు శ
ర్వుని సేవించి నుతించి వెల్వడి [6](మనోరుజ్ముక్తులై) పోవుచున్. 173

క. ధీనిధి హరిశర్మ మహా
జ్ఞానున్ గుణశాలిఁ జూచి సరసం గంటే

1. నచల (పూ) 2. శృంగారమధ్యమై బుధివింధ్యంబున్. (పూ)
3. గంటిరె (పూ) 4. మీరు (పూ) 5. వృద్ధాప్రస్థలిం (పూ. యతిభంగము)
6. మనోరమ్యోక్తులై (పూ. యతిభంగము)

యానందభవన మనియెడి
కానన మిది బరఁగు ఝల్లికావన మనఁగన్. 174

మ. సకలర్తుస్ఫుటమానసత్ఫలసమాజం బివ్వనః బర్కర
శ్మికిఁ జోటీయమి మధ్యపక్కణజనశ్రేణుల్ తటాకోత్కరా
బ్జకులంబుల్ ముకుళించుట న్విరియుటన్ [1](సాయం) ప్రభాతక్రియా
[2](నికరాదానపరాయణంబులగు) వింటే మంత్రిరాణ్ణందనా! 175

సీ. వనరాశి యని దాఁగ వచ్చిన మైనాక
ధరము కైవడి గజోత్కరము దనర
నతులసాలసమూహ మగుట నంతరచర
తురగాళియై మృగస్తోమ మలరఁ
బుండరీకాననంబు గదా యని వసించు
నంచల రీతి సింహములుఁ బొసఁగ
సత్ఫలత్వం [3](బుచ్చి) చలియించు కరిభ్రమబ్బు
తుటుముల గతి కిటిసటలు వెలయఁ
గదిసి చెలఁగె లతాడోలికావిహారి
[4](సైరి) బాలాంఘ్రినఖకాంతి [5](చంద్రికావి)
కసితకాసార[6](కల్హార) గంధకలిత
పవన[7](వనసీయ) మానందభవన[8](వనము). 176

క. ఆనందభవనవని కెన
యానందనవనము నెన్న నర్హంబగునే
కానం దలఁపఁగ రాదని
కానందగు సకలఫలనికాయాస్పదమై. 177

క. ఈవలఁ గృష్ణయు నావలఁ
గావేరియుఁ గొలువఁ బలువగలఁ జెలఁగెడు నా

1 జేయుం (పూ) 2. నికరాదాయపరాయణంబులను (పూ) 3. బిచ్చి (పూ)
4. సౌరి (పూ) 5. చంద్రికాలి (పూ) 6. గంభీర (పూ)
7. నవనేయ (పూ) 8. ఛయమ్ము (పూ)

శైవలినీవల్లభు క్రియ
నీవనతల్లజముఁ గంటివే విలసిల్లెన్. 178

క. అదె కంటివె శ్రీముష్ణము
నదెపో యత్యాక్రాంతి గోపురాగ్రనిరీక్షా
విదళితదూరాగతకో
విదజనసంసారఘోరపరిధతృష్ణంబున్. 179

సీ. ఈ వనంబుల[1](మెట్టి) యింద్రపట్టణసీమ
హావణించు నందనం బయ్యెనేమొ?
యీ మేడల ప్రమాణ మింతని పద్మజుం
దమరింప సురశైల మయ్యెనేమొ?
[2](యీయీరుజుల) వస్తు లేమైన గిలుబాడ
యక్షేశునకు నిధు లయ్యె నేమొ?
యీరసస్థితిఁ జూచి యెవ్వరో యీరీతి
నదరింప మానసం బయ్యెనేమొ?
యీపురముతోడ జోడుగా నెన్నిమాఱు
లైనఁ గావింప వైకుంఠమయ్యె నేమొ
నంత పయి లేక యిది సేర నబ్బుటెల్ల
మన మొనర్చిన భాగ్యంబు మంత్రితనయ! 180

క. ఏతన్మాత్రమె విభవస
మాతత మిది దక్షిణప్రయాగ యనఁగ వి
ఖ్యాతం బీశ్రీముష్ణం
బీతటి సేవింపఁ గలిగె నీశ్వరు కరుణన్. 181

మ. [3](కనుఁగొంటే) ఘనమార్గలంబితచణాగ్రస్వర్ణకుంభంబుతో
వనము న్నర్క విమాన మచ్చటఁ జూమీ వారాహదేహంబుఁ జెం

---

1. వెట్టి (పూ) 2. యీయంగజుల (పూ) 3. కనుఁగొంటిన్ (పూ)

దిన నాతండ్రి ముకుందుఁ డాఢ్యుఁడు రమాదేవీసహాయుండు స
జ్జనులన్ బ్రోచుచు నున్నవాఁడు కరుణాచాతుర్యధుర్యంబుగన్. 182

చ. కనఁబడు రంగుబంగరు తగళ్ళ ధగద్ధగితప్రభానిగుం
భనమున మించెఁ బావనసమాజముఁ జూచితె యచ్చటన్ వరా
హుని భజియింప సత్త్వదివిజోత్కరమున్ వసియింపఁ దన్నికే
తన మగు మేరుభూధరము తాన తదర్థము నిల్చెనో యనన్. 183

ఉ. అన్నియు నారయన్ బహుపురాగతతైర్థికసంకులంబులై
యున్నవి వీథు లేమికతమో? యిది మాఘము గాదె? తేపుగా
పున్నమ నేఁడు సుమ్ము మన పోతిరి శరీరునకున్ రథోత్సవం
బెన్నఁగ సిద్ధ పుష్కరిణి కేఁగుట యుక్తము గాదె యత్తఱిన్. 184

క. అని పలికి యతనిఁ దోడ్కొని
చని యాతాయాతవివిధజనసమ్మర్దం
బునకున్ లోఁగుచు మదిఁ బ
ర్వెన నివ్వెఱ నిత్యపుష్కరిణియుం గనియెన్. 185

సీ. దూరాగతాత్మబంధువులు దాసిన వంశ
జేతల వావులు సెప్పువారు
నడయాడుచును భయం బడర నొండొరు కరం
బులు గట్టిగాఁ బట్టి నిలుచువారు
చేపట్టు వదలుటఁ జెదరిన తమవారిఁ
బేర్కొని బెట్టుగాఁ బిలుచువారు
నితరజనాహ్వాన [1](రుతికిఁ) దన్నామకు
లగుట నేమేమని యనెడువారు
స్నానతటగతజనపటాంచలవిగళిత
నీరసంకేతనికటవనీతలమునఁ
గరఁగి మునివేళ్ళఁ బట్టూఁది నడచువారు
గలిగి తనరారు నిత్యపుష్కరిణిఁ గంటె. 186

1. శ్రుతికి (పూ)

సీ. పూర్వభాగమున నద్భుతలీల జాహ్నవీ
గోదావరీనదుల్ గొండ్లి సలుప
నగ్నికోణంబున యమునాసరస్వతీ
ధురిణులు నిండు కాఁపురము సేయ
దక్షిణంబున సముత్కంఠతో నర్మదా
సింధుస్రవంతులు సిరులు గాంచ
నిర్ ఋతిదిక్కు ననిందితతామ్రప
ర్ణికవేరనదులు వేర్వేఱఁ బొసఁగఁ
బశ్చిమంబునఁ దుంగయు భద్రయును స
మీరునెడఁ గృష్ణవేణి కుబేరదిశ మ
లాపహయు భీమరథియు హరాశ రసయు
నెలమి భవనాశనియు నిల్వ నిది సెలంగు. 187

చ. తటమహిజాతనూతనలతాగళితప్రసవాళితోడి యు
త్కటమకరందబృందములు దాల్చిన యర్ధవికస్వరాంబురు
ట్పుటలము పద్మతోయములు బర్వఁగఁ బుణ్యసరఃకదంబమే కదా
పట నరుదెంచి యిందు [1](మునుపన్) వలగొన్న విధంబుఁ దెల్పెదున్. 188

సీ. మునుఁగులతో వచ్చి మునిఁగెడు శుద్ధాంత
కాంతల కస్తూరి కమ్మవలపు
బలు బరాబరులు బోల్పద వచ్చి క్రుంకు భా
మినుల చొక్కపుఁ దట్టుపునుగు తావి
గములుగా వచ్చి తానములాడు కర్ణాట
సతుల పాటీరంపు సౌరభంబు
హితుల తోడుగ వచ్చి యీఁదెడి ద్రావిడీ
పంక్తి మంజలికాపు పరిమళంబు
తగులుకొని మించు కరుల గంధములచేతఁ
దైర్థికావళి బదలికల్ తలఁగఁ జేసి

1 మునుఁగన్ (పూ. యతిభంగము)

తన శ్రమాపహనామంబు ధన్యతమము
గా మిటారించె నిత్యపుష్కరిణి వింటె. 189

తే. కమలమకరందరసమధ్యకన్యకాప్ర
కారము వసించి నిత్యపుష్కరిణిజలము
నడుమ నందంబు నొందెఁ గుందనపు తగడు
లంటి దాపిన నవరత్నమంటపంబు. 190

సీ. ఎవ్వరినని తాల్తు నే నటంచు విహంగ
విభుఁడు చింతించి [1](తా) వెనుక కొదుగు
దొర యెవ్వఁడని బరాబరి సేయుదు నటంచు
సైన్యనాథుండు నిశ్చలత నొందు
నధిపుఁడౌనతఁడు రమ్మనినఁ జేరెద నంచు
బలవైరి దవ్వుదవ్వులనె వచ్చు
నాయకనిర్ధారణాశక్తి చాలమి
నెత్తమ్మిచూలి నోరెత్త వెఱచు
నెఱయు నీ నిత్యపుష్కరిణీ [2](జలముల)
మునిఁగి గ్రక్కున లేచిన [3](జనులు)శంఖ
చక్రపీతాంబరాది లక్షణ విరాజ
[4](మానులై విష్ణు) సామీప్యులైన కతన. 191

క. ఈ నిత్యపుష్కరిణికిఁ గృ
శానుదెసం గంటె దిగ్గజప్రవరాళా
ధీనత్వశరణచణశా
ఖానీకనిబద్ధమైన యశ్వత్థంబున్. 192

క. ఈ రావిఁ జూడు సాక్షా
న్నారాయణమూర్తి సేవనామాత్రశ్రీ

1. యా (పూ) 2. జలమ్ము (వూ) 3. జనుల (పూ) 4. మానవిష్ణు (పూ—
గణభంగము)

పారంపర్యప్రసిద్ధదంబు వి
చారింపఁగ దీనిఁ బొగడ శక్యమె మనకున్. 193

క. అని తెల్పిన తదనంతర
మున నయ్యిరువురును నిత్యపుష్కరిణిం గ్రుం
కినవారై కోవెలకుం
జని గరుడస్తంభనికటజగతి న్నేఁగన్. 194

క. సాష్టాంగనతులు సేసి ప్ర
హృష్టుల జయవిజయుల న్నిరీక్షించి నిజా
భీష్టము లొనగూడఁ జని
యష్టపురాగర్భగృహధరాంతరగతులై. 195

సీ. సపవిత్రనందత్ప్రి(?)పారితోహ్యంభోజు (?)
మహితపాదాబ్జు నమద్బిడౌజు
దంతైకఖండనోద్యద్భూరినిశ్వాసు
కమనీయరుచిరసత్కనకవాసు
శారదచంద్రికాచారుకాంతిశరీరు
నిగమాంతకేళి[1](వనీ)విహారు
విమలకటీతటీవిన్యస్తమృదుహస్తు
నతభక్తలోకావనప్రశస్తు
రుచిరవక్షోభిలక్ష్యసరోజగేహు
ధరణిసంభరణాసముద్ధరణదేహు
నవ్వరాహుని సేవించి యధికభక్తి
నతులవాచానిరూఢి సన్నుతు లొనర్చి. 196

శా. సుస్మేరంబగు [2](నీముఖాంబురుహముం జూడంగఁ గల్గె న్మనో
జస్మారంబులుఁ జెందనీయక పురాజన్మాప్తపాపౌఘముల్)

1 వన (పూ - గణ యతి భంగములు) 2. నీముఖాంబురుహమిట్లుం జూడ గల్గెన్ మనోభస్మారంబులు జెందనీయక పురాపర్యాప్తపాపౌఘముల్ (పూ—ప్రథమ పాదమున యతిభంగము)

భస్మంబై చనఁ జేసి భూరికరుణాపారీణతారూఢిమై
యస్మద్ఘోరభవంబుఁ బాపు మిఁక సర్వాంగీణపాండు[1](ద్యుతిన్). 197

క. అని వినుతించి రథోత్సవ
మును గన్గొని తద్వ్రతంబమోఘాదృతి చే
సినవారై తమదేశముఁ
జనుచో నిరువురు దినాంతసమయమునందున్. 198

గీ. అనుచుఁ గీరంబు దెల్పఁగా నంతలోనఁ
బ్రాగ్ధరాధరశృంగంబుపై సరోజ
బంధుబింబంబుఁ జూచి ప్రభావతీర
మణియుఁ గేళినికాంతంబుఁ దనరఁ జేరె. 199

నలువదియెనిమిదవ రాత్రి:

ఉ. చేరి ప్రభావతీసుదతి చెల్వుగ నాఁటి దినాంతవేళ సిం
గారము మీఱ చారుకనకద్యుతు లంగము నందుఁ గ్రల్గ నా
య్యారముతోడ [2](రాజవరు నారయఁ బోవగ) నాప్రభావతీ
సారసగంధిఁ జూచి రసచాతురి మీఱ శుకం బదిట్లనెన్. 200

గీ. కలికి! శేబాసు! యోవైశ్యపంకజాక్షి!
యింత వేగిర మొంద నీవేఁగుదెంచు
టే నెఱుఁగుదు తక్కటియైన కథయు
వినవలె నటంచు వచ్చితి వింతె వినుము. 201

వ. ఇవ్విధంబున నవ్విప్రవరులు మఱలి నిజపురంబున కరుగుదేర నంత
సంధ్యాసమయంబున. 202

---

1. ద్యుతుల్ (పూ) 2. రాజసము నారయఁ బోయెడు (పూ)

క. ఒక పల్లెఁ జేరఁ జని యం
తిక [1](నదిఁ) దత్కాలవిధులు దీరిచి యొక శూ
ద్రకు నదవన్ శయనించిరి
శకకృతపురగమనమార్గజనితశ్రములై. 203

తే. అప్పు డా యింట గేస్తురా లంగవిజిత
రంభ చతురిక యను పేరఁ బ్రబలు మగఁడు
తాను పొరుగూరి కరుగ [2](నితరుని) బిలిచి
కొని మనోజాతసంక్రీడఁ బెనఁగు చుండ. 204

ఉ. అత్తఱి వచ్చెఁ దత్పతి ధరామరు లిద్దఱు దీని కౌశలో
దాత్తతఁ జూత మంచు సభయంబుగ నుండిరి లెస్స వింటివా
బిత్తరి! యప్పుడా హిమగుబింబముఖీమణి బొంకుటెట్లు నీ
యుత్తమచాతురీగుణసమున్నతి నెంచెదఁ దెల్పుమా యనన్. 205

తే. [3](అల) ప్రభావతి శుకకులాధ్యక్షు యింత
గనఁగఁ గల్గిన నేర్పరి గాను నేను
చాలు నులుకుట్టు మాటల జోలి యేల
యవలికథ దెల్పు మనిన నిట్లనియెఁ జిలుక. 206

క. చతురిక పతి వచ్చుట గని
వెత గల్పించుకొని [4](జారు) వృశ్చికదష్ట
స్థితి మాన్పెదు మంత్రజ్ఞుని
గతి మంత్రింపుచు వసింపఁగాఁ జేసి వెసన్. 207

క. ఇలు దెఱచి వచ్చి నిలచిన
చెలువునిపై వ్రాలి యేమి చెప్పుదు సీము
ద్దులమోముఁ జూడఁ గానక
పొలుబాపుచు నుంటి తేలు బుడుకుటకతనన్. 208

1. నటి (పూ) 2. నితరు (పూ) 3. అన (పూ) 4. క్రూర (పూ)

క. నా యతిఘోరవేదన నినాదములన్ దయవుట్టి వీథిలోఁ
బోయెడు నట్టియీ పరమపుణ్యుఁడు గ్రక్కున మంత్రశక్తిచే
నాయువు నిల్పె నీతని మహాద్భుతసద్గుణ మెంచఁగాఁ దరం
బే యిఁకనేల బిడ్డఁ గని పేరిడఁగావలయు న్మనోహరా! 209

తే. [1](బయటఁ) దెరువరు లిద్దఱు బాఁపనయ్య
లదుగొ చావడిఁ బవళించి నిదురలేక
యన్నియునుఁ జూచుచున్నవా రడిగి చూడు
మెన్నిపాటులఁ బడితినో యిటకు మునుపు. 210

మ. అనినం దత్పతి జారునిం బొగడి నా ప్రాణంబు రక్షించి తం
చును బైపచ్చడ మిచ్చి వీడ్కొలిపె నచ్చోఁ దద్వధూచాతురీ
జనితాశ్చర్యులు భూసురుల్ నిజనివాసప్రాప్తులై రంచు మె
త్తని వాక్యంబులఁ జిల్క పల్కునెడఁ బ్రాతర్వేళ గావచ్చినన్. 211

## నలువదితొమ్మిదవ రాత్రి:

తే. కోమటి మెఱుంగు సిబ్బెపు గుబ్బలాఁడి
యంతిపురమున కరిగి సాయంతనాప్తి
గాచి కై సేసికొని మహీకాంతు సంగ
మాభిలాషంబుతోఁ జేర నరుగుదేర. 212

క. కనుఁగొని గుణసాగరుఁ డో
వనితా! చనియెదవె ధరణీవల్లభు కడకున్
జను మిఁక నొక కథగల దది
విను మనుచుం బలుకఁ దొడఁగె వేడుక బొదమన్. 213

1. పడక (పూ)

## ఇరువదినాలుగవ కథ

శా. కావేరీతటి ద్రావిడీనినదశంకాకాళికీకీచకీ
రావంబై యొక యగ్రహారము రువారంబందు నుద్యల్లస
ద్భావుల్ మిత్రుఁడు దేవదత్తుఁడును విద్యాశాలి యాద్యుం డనం
గా విఖ్యాతి వహించి భూదివిజలోకశ్రేష్ఠులై నల్గు ర
ర్థావేశస్పృహతం జరింతురు గరీయస్త్వంబు శూన్యంబుగాన్. 214

తే. తద్ద్రవిణమెల్ల గెలుబాడఁ దలఁచి ధూర్త
విప్రుఁ డొక్కండు వారల వెంటవెంటఁ
దిరిగి తన్మైత్రి వడసె విధేయనామ
ధేయుఁ డరివంచనాపరాత్మీయబుద్ధి. 215

ఉ. అంతటఁ బాండ్యమండలమునందు ధ్రువాఖ్య నెసంగు మేదినీ
కాంతుఁడు భూరిదాన మొసఁగన్ సమకట్టిన విన్నవారలై
సంతసమంది నల్గురు ద్విజన్ములు గూడి విధేయుతోడ న
త్యంతరయంబుమై నరిగి రాదారి యున్న పురంబుఁ జేరఁగన్. 216

వ. ఇవ్విధంబునఁ జేరి. 217

సీ. మంత్రీంద్రులకు వేదమంత్రపూర్వా[1](శీర్వ)
భాసురోక్తుల నిమ్మపండ్ల నొసఁగి
యధికారిచెంత వేదాంతభాష్యాదిమీ
మాంసాదిసంవాదమహిమఁ జూపి
హితపురోహితులున్న యిండ్లకుఁ బసపుపం
డ్లును గొనిపోయి బంధుతలు నెఱపి (?)
వాఁకిట గొల్లల కేకతంబున ధర్మ
తత్త్వమార్గమును బోధన మొనర్చి

1. శిర్ (పూ. గణభంగము)

యుడిగములవారి కెల్ల మే మున్నవార
మనుచు మంత్రాక్షతల నిచ్చి యనుసరించి
వారు సముఖంబు సేర్చ భూపరుని చేతఁ
గైకొనిరి నాల్గువేల రొక్కంబు వారు. 218

గీ. ఇట్లు గైకొని తమయూరి కేఁగఁ దలఁచి
త్రోవ సరి గొట్టి దొంగలు దోఁచికొనుట
[1](వింట) మఱి గొనిపోవ సువేళ గామి
హితుఁడనెడిపేర నొక ఇచ్చునింటి కరిగి. 219

క. ఈయెనిమిది జాతెల ధన
మీయెడ మీయింట నుండనిమ్ము పురంబున్
దాయఁగఁ జని [2](వేగమ కొని)
పోయెద మిటువచ్చి యనుచుఁ బొసఁగించి వెసన్. 220

తే. ఇపుడు వచ్చిన యేగురు నిందు వచ్చి
యడుగునప్పుడు గాని యీయర్థ మొసఁగ
వల దనుచు రొక్క మాఇచ్చువాని చేతి
కిచ్చి వానిల్లు వెలువడి [3](యివలి) కరిగి. 221

తే. తెలుపు బత్తెంబునకు లేక యరుగఁ దరమె
యనుచు మిత్రాదులగు నల్గు రాత్మఁ దలఁచి
యల విధేయుని బిలిచి నాల్గైదు మాడ
లడిగి [4](తెమ్మన నడుగఁగా) నతఁడు వోయి. 222

క. హితుఁ జేరి రొక్క మంతయు
నతిరయమునఁ దెమ్మటంచు ననిపిరి మావా

1. వింత (పూ) 2. వేగనుగొని (పూ)
3. యవలి (పూ. యతిభంగము) 4. తెమ్మని యడుగగా (పూ)

రతులితశూరసహాయులు
జతఁగూడిరి పయనమునకుఁ జనియెద మనినన్. 223

తే. అతఁడు గేహంబు వెడలి యయ్యవనిసురుల
నందఱిని జూచి యిత్తునా యనుచు నడిగి
వార లిమ్మని పలుక నివాసమునకు
నరిగి యాతని చేటికి నర్థ మొసఁగె 224

ఉ. ఇచ్చుటయున్ విధేయుఁడు మదీప్సితమెల్ల ఫలియించెనంచు లో
హెచ్చిన సంభ్రమం బురల నెప్పటి నల్గురిఁ గూడి కొంత దౌ
వచ్చెడు రీతి వెంటఁ జని యంతట వారల కన్మొఱంగి తా
నిచ్చకు వచ్చు తావునకు నేఁగె మహాజవ ముప్పతిల్లఁగన్. 225

ఉ. అంతట వానిఁ గానకపు డంపిన నాలుగువేల రొక్క మా
ద్యంతము దెచ్చెనో జరిగెనా యని మిత్రముఖుల్ దలంచి య
త్యంతరయంబునన్ మఱలి యా హితు నింటికిఁ బోయి మాధనం
బంతయు నిమ్మటన్న విని యాతఁడు వారలఁ జూచి నవ్వుచున్. 226

తే అపుడు మీరంపఁగా వచ్చినట్టి యతని
చేతికే మీర లిమ్మని సెల వొసంగ
ధన మొసంగుట యెఱుఁగని దారిఁ బలుకఁ
దగునె యీ సుద్దు లెల్ల వర్తకులతోడ. 227

ఆ. అనిన వారు రొక్క మంతయుఁ దెమ్మని
యనుపలే దనంగ నతఁడు మీర
లిమ్మనంగ విత్త మిచ్చితినో లేదొ
యనఁగఁ బెద్దమాట లయ్యె నపుడు. 228

వ. తదీయవాక్యోపవాక్యంబు లాకర్ణించి యందంద సందడిగా మూగిన యా
ధార్మికులు గొందఱు బుద్ధిమంతులు వారి వారించి మహీసురోత్తములు విత్తం

బంతయుఁ బోనాడుకొని పోదురె యనియును, హితుండు [1](ఘటికా మాత్రంబు) తనయింట నునిచికొనుట కాని లాభంబు గాననివాఁ డర్థం బంతయు నిచ్చునే యనియుం దలపోసి చెడిన సొమ్ము చెరసగంబుగా వగ దెంచి యా బచ్చువానిం బిలిచి వీరు నీ యధీనంబున బెట్టిన ధనంబునం దొక్క పాలిమ్మనిన సమ్మతించక యతండు నలువురిం దోడ్కొని పాండ్యమహీ మండలాఖండలు సముఖంబునకు నరిగె, నో ప్రభావతీ ! యవ్వసుమతీపతి యేగతిఁ దదీయవివాదం బుడుపవలయు? నిది యెఱుంగకున్న ననన్య సామాన్యుండగు రాజన్యమూర్ధన్యు పాలికిం బోవ నూహింతువే తెలుపు? మని పలికిన నంకురితమనస్సంకోచయగు నప్పంకజాక్షి న్నిరీక్షించి యప్పక్షి కులాధ్యక్షుం డిట్లనియె. 229

క. మగువా ! [2](తిర్యక్కులజుఁడ
నగుట న్మతి) లేక మించ నాడితి నేరం
బగు; సైరించుట భవదీ
యగుణంబు గదా ! శమించి యవ్వల వినుమా ! 230

క. ఆపాండ్యనృపతి విప్రా
లాపంబులు హితుని[3](మాటలన్ విని సరగన్).
ప్రాపితముఖుఁడై కరుణా
శ్రీపటిమన్ బచ్చువానిఁ జేరం బిలిచెన్. 231

క. పిలచి చెవిలోన నేమో
పలికిన నతఁ డలరుమొగము భాసిల్లఁగ రా
జులదేవ! యనుచు ధరణీ
తలనాయకుఁ బొగడి జనితదరహాసమునన్. 232

తే. బ్రాహ్మణులఁ బిల్చి నా యింటఁ బదిలపఱచి
యున్నయది విత్తమెల్ల నా యొద్ద[4](ననుచు

1. ఘంటికామంత్రంబు (పూ) 2. తిర్యక్కులజుం, డగుటన్నుతి (పూ)
3. మాటలున్ విని నరుగన్ (పూ. యతిభంగము)
4. ననుచు, నప్పుడు క్షీ చిన్న (పూ)

నపుడు మీరన్న) గతి నేగు రయగుదెంచి
యడుగు( డిచ్చెద మాఱు మాటాడవలదు. 283

క. అన వారు మొగమొగంబులు
కను(గొనుచు న్నిలువ ధరణికాంతు(డు కరుణా
[1](వననిధి) గావున వారల
ననిచెన్ బహుధన మొసంగి యంభోజముఖీ! 284

క. ఆరాజవరునకుం గల
నేరుపు నీ కబ్బెనేని నృపలోకమణిన్
జేరు మని చిలుక యనునెడ
వారిజహితు( [2](డెక్కె() బూర్వవసుధాధరమున్. 285

**ఏబదియవ రాత్రి:**

క. అపుడు ప్రభావతి తన యం
తిపురమునకు నరిగి తమ్మితెగ నెవ్వగలన్
దపియించు వేళ వచ్చిన
నపరిమితానందమానసాంభోరుహయై. 286

శా. పన్నీటన్ జలకంబులాడి [3](తొగలున్ బాలాబ్జరేఖావళుల్)
చిన్నెల్ వ్రాసిన చీరగట్టి యపరంజిం జిమ్ము నెమ్మేనిపై
మిన్నుల్ గ్రమ్మెడి సొమ్ము దాల్చి మహిభృన్నీనాంకజన్యక్రియా
సన్నద్ధత్వము నొంది యందము రిహించం జేర నేతెంచినన్. 287

చ. కను(గొని పచ్చతెక్కపస గల్గిన పుల్గులరాయ- డోకన
త్కనకఘటాఘటాచకచక త్తనువల్లిక, నే(డు దెల్పు నీ
యనుమతి మీ(ద( గాని కథ యంచు( దలంకుచు విన్నవింతునా
యని తదుదారకౌతుకకటాక్షనిరీక్షలు గాంచి యిట్లనున్. 288

---

1, వననిధిగా( (పూ) 2. డెక్కె (పూ) 3. తొగలుం బాలాభిరేఖావళి (పూ)

## ఇరువదియైదవ కథ

క. కలహవిజృంభణబాహా
బలనిర్జితశత్రురాజబలుఁ డతిలోకో
జ్జ్వల చిత్రసేనుఁ [1](దిప్పురిఁ)
జెలువొందఁగనేలుఁ జిత్రసేనుఁ డనంగన్. 239

తే. అతఁడు నాతని దేవేరి యతులదివ్య
లక్షణాకృతి నయ్యాదిలక్ష్మిఁ బోలి
వెలయు సుబలాంగనయు సముద్వేల లీల
నేకకంఠత నిద్ధాత్రి యేలుటయును. 240

వ. అప్పు డప్పార్థివపుణ్యదంపతులు పరస్పరపరమస్నేహంబున చంద్రచంద్రికా ప్రకారంబున కుసుమసుగంధన్యాయంబున రత్ననిర్యత్ప్రభావంబునం బ్రవర్తిల్లుచు నుండునంత నక్కాంతారత్నంబు వెండియు. 241

చ. అలుక ఘటించ దెంత పనియైన మనంబున, నొవ్వ జల్లుగాఁ
బలుకదు చేటికాంగనల పట్టునకైన, విభుండు గోరిన
ట్లలరఁ సేవ సేయు సమయం బెటువంటిదియైన రాజకాం
తలు తనతోడివా రిది గదా కులధర్మ మటంచు నెంచగన్. 242

వ. ఇంతియె కా దాకాంతాతిలకంబు నిరవధికసౌభాగ్యంబు దెలియ నొకనాఁడు నిజాంతఃపురవరారోహాసహస్రంబులు గొలువ నాళీజనంబులతో నిషాగోష్ఠి విహారంబులు సలుపుచున్న యెడ. 243

1. డప్పురి (వ్రా)

సీ. ఒకబాల చంద్రఖండకళాలయకపోల
        నీరుమోసిన పింతతీరుఁ జూచి
యొకచాన సంతతానికదానగజయాన (?)
        పురుఁడోముఁగ రహించు హరువుఁ జూచి
యొకకాంత కుందకోరకకాంత[1](రదయుక్త)
        బాలింతయైయున్న బాగుఁ జూచి
యొకభామ వికచచంపకదామతనుధామ
        బిడ్డ నర్మిలిఁ బ్రోచు బెడఁగుఁ జూచి
యతిశయానందకరము పుత్త్రాప్తికంటె
వేఱె యొక్కటి గలదె భావింప ననుచు
ననుఁగు నెచ్చెలిపిండుతో నవ్వధూటి
వేడు కరాలర ముచ్చట లాడియాడి. 244

చ. ఇల గల పుణ్యతీర్థముల కేఁగి వ్రతంబు లొనర్చుఁ దీర్ఘవా
సులకు సమస్తవస్తువులు చూఱలొసంగుఁ గుటుంబభోజనం
బులు ఫలదానముల్ నడపు భూసురకోటికిఁ బ్రాక్తనంబు[2](లౌ)
కొలలు హరింప నక్కుసుమకోమలి నాథు ననుజ్ఞ మున్నుగన్. 245

వ. ఇత్తెఱంగున సుపుత్త్రోదయ కారణంబులగు బహువిధవ్రతంబు లాచరింపుచున్న యెడ నొకనిశీథినీసమయంబున. 246

తే. పతియుఁ దానును సురతానుభవమువలన
నంగమున బుట్టు బడలిక లపనయింప
మృదులతరతల్పమున బొంది నిదురఁ జెంది
మేలుకల గాంచి యంతలో మేలుకాంచి. 247

---

1. తదుక్త (పూ) 2. తా (పూ)

క. తన ప్రాణవల్లభునకున్
గనకలతాతన్వి గనిన కల తన వాలుం
గనుఁగొనల సిగ్గు గుల్కుచు
వినుపించిన నవ్విభుండు విస్మయమతియై. 248

క. ఇక్కల నిక్కము యగుచున్
ఱెక్కలుగల జక్కి నెక్కు రేఖావంతున్
[1](జిక్కు పఱచు నవమోహను)
నొక్కరునిన్ గొమరుఁ గాంచెదో యెలనాఁగా! 249

తే. అనిన మో మరవాంచి బింబాధరమునఁ
గందళించిన చిఱునగ వందగించ
నేమమున [2](దాను) నోచిన నోము లెల్ల
పండె నేమో కదా యని యుండునంత. 250

తే. చిత్రసేన [3](క్షితీంద్ర! తోషితమునీంద్ర!)
శాపసంప్రాప్తుఁడైన వైశ్వానరుండు
జగతి నీక రాజవంశాబ్ధిచంద్రుఁడగు న
టంచు దైవజ్ఞు లెఱిఁగింప నా క్షణంబ. 251

క. ధీరులు దెలుపఁగ మది చెలు
వారం దగు సుబలతోడ నతులిత [4](సవన
ప్రారంభవేళ ననలున్)
గోరి ప్రసన్నునిగఁ జేసికొని వినయోక్తిన్. 252

క. తనయాభిలాష దెల్పుచు
మన మలరన్ వేఁడుకొనిన మాత్రనె యతఁ డే
నెనయ భవద్గర్భంబున
[5](జనియింతు) నటంచు వర మొసఁగి చనునంతన్. 253

1. జిక్క పఱచు నవమోహము (పూ) 2. గాను (పూ) 3. పక్షీంద్రుతోషితమునీంద్ర(పూ) 4. సదన ప్రారంభవేళ వకులున్ (పూ) 5. జనియిత్తు(పూ)

వ. అది కారణంబున 254

క. కలవాణీమణి సుబలకు
నెల మసలిన పిదప రెండు నెలలై మఱియున్
నెల యొండు గడచినంతన్
[1](చెలువగు) నెమ్మేన గర్భచిహ్నోదయమై. 255

చ. [2](వెలవెల నయ్యె) నెమ్మొగము వృత్తగురుస్తనకోరకాగ్రముల్
నలుపు వహించె నిమ్నతరనాభి బయల్పడియెన్ వళీతరంగరే
ఖలనగు ముత్యముల్ దొలఁగెఁ గొనొక యించుక గాఁగ నా [3](బయం
కలు) తఱచయ్యె నవ్వికచ[4](కంజ)దళాయతనేత్ర కెంతయున్. 256

క. ఈరీతి న్నవమాసము
లారామామణి ధరించి యతులితసుముహూ
ర్తారంభవేళఁ గనె సుకు
మారున్ సుకుమారతనురమాసుకుమారున్. 257

వ. అట్టి యెడ. 258

సీ. అనవద్యవాద్యముల నగర చేటిక
నగరసామంతు లనంగ నడిచె (?)
బ్రతికెదమని కోరి మతి నుల్లసిలు విప్ర
వరులకు బంగారు వాన గురిసె
పట్టణక్షోణి నాబాలవృద్ధాదులౌ
బ్రజలకుఁ జక్కెఱ పంట పండె

---

1. చెలువకు (పూ) 2. వెలవెలనైన (పూ) 3. భయాంకలు (పూ)
4. కంబు (పూ)

గడి దుర్గముల నుండి కడు చూడఁ జాలని
యరివీరులకు గుండె లావులించె

నెంచఁ దగియున్న వియ్యంపుటింటి రాచ
కులము మన్నీల కింతైన బలిమి గలిగె
కోపనారత్న మగు సుబలాపురంధ్రి
కడుపునను పుత్త్రతిలకంబు [1](వొడమినపుడు.) 259

తే. అంత నారాజవరుడు శుద్ధాత్ముఁడగుచు
వసుధ మెచ్చంగఁ బుత్త్రోత్సవం బొనర్చి
ప్రోడలగు భామినీమణుల్ పురుడు దీర్చ
జాతకర్మాదికృత్యముల్ సంఘటించె. 260

క. పేరొసఁగెఁ జిత్రభానుమ
హారాజన గురుననుజ్ఞ నల బాలునకున్
పేరుకల హంసగమన [2](ల
నారత)రతనాల తొట్ల [3](నలరించి)వెసన్. 261

ఉ. సొన్నపు సన్నపుం బనుల చొక్కటమౌ దగ తొట్ల యూఁచి నా
యన్నకు లాలి నన్ను గనినయ్యకు లాలి సిరు ల్దొలంకు వా
ల్గన్నుల బుచ్చి పాపనికి లాలి మరందము గ్రుమ్మరించు వి
ల్గన్నవజీరుఁ గన్న వగకానికి లాలి యటంచుఁ [4](బాడఁగన్). 262

తే. ముద మొదవ బాలుఁ డిట్టు లభ్యుదయలీలఁ
బెరిగె నానాఁట విడియ చందురుని బోలి
వినయగాంభీర్యధైర్యవివేకముఖ్య
సరసగుణములు నానాఁట బెరుగుచుండ. 263

1. బొడమెనపుడు (పూ) 2. లవారత (పూ. యతిభంగము) 3. నలరించె (పూ) 4. భామినుల్ (పూ)

సీ. అభ్యసించె చతుర్విధామ్నాయబహువిధ
కావ్యబాహాటాదిగ్రంథములను
సాధించె ఖుర్శికాస్థలిని ముప్పది రెండు
నాణెంబులైన విన్నాణములను
వాయించె వల్లకీవాదనాదసమస్త
సంగీతబహురహస్యక్రమములు
నేర్చె మదోద్ధతానేకపఋవతురం
గమరథారోహచంక్రమనిరూఢి
తెలిసె సామాద్యుపాయశక్తి[1](త్రయంబు)
కనియె రాజన్యనీతి ప్రకాశ [2](రీతి)
రాజమాత్రుండె [3](యమ్మహారాజు)తీవ్ర
భానుమద్ద్యుతి యాచిత్రభానున్నృపతి. 264

వ. ఇవ్విధంబున నవ్వసుంధరావరకుమారకంఠీరవుండు నిరవధికభోగభాగ్యోదయుండును నిరుపమానమహైశ్వర్యధుర్యుండును నిరవద్యసకలవిద్యాప్రవీణుండును నై యుండునంత. 265

క. కుందనమున నెత్తావియు
చందనమున సిరులు బొడము చందంబున నీ
యిందుముఖీకందర్పున
కందంబుగ యౌవనోదయ మ్మెదిరించెన్. 266

తే. అంతఁ దలిదండ్రు లత్యంతహర్ష మెసఁగ
మంచికల్యాణవేళ సన్మానలీల
పంచకళ్యాణ మొనరించి పట్టభద్రుఁ
జేయ జగతీసురేంద్రుఁడై చెలఁగుటయును. 267

---

1 త్రయములు (పూ) 2. నీతి (పూ) 3. యమ్మహారాజ (పూ)

క. మియ్యాఁడు ముద్దు గుమ్మలు
వెయ్యారులు గల రయారె వీరి నగరి నో
తొయ్యలి వీరందఱిలో
నెయ్యము మదిఁ దొంగలింప 1(నీపైఁ బ్రేమన్.) 268

తే. తొదరి నిను విన్న యదిమొదల్ కడువిరాళి
నితఁడు మకరాంకశరశతక్షతశరీరుఁ
డయ్యె నీ చేతిదింక 2(నే మంచుఁ బల్క)
సెలవుల నొకింత చిఱునవ్వు చెంగలింప. 269

క. తల వాంచి సమ్మతంబగు
తలఁపున నుండునెడ నుదయధరణీధరది
క్తలమున రవి యుదయించిన
మలమల దా నగరుజేరి మాపటివేళన్. 270

## ఏఁబదియొకటవ రాత్రి:

క. కనకోపమాంగి చిలుకన్
గనుఁగొని మన రాజమౌళికథ దెల్పితి వెం
తని నిన్ను మెత్తు నిఁక నా
పెనిమిటి జననంబు దెలియఁ బ్రియమగు ననుడున్. 271

## ఇరువదియాఱవ కథ

తే. చిలుక చిలుకలకొలికితోఁ జెప్పఁ దొడఁగె
3(లలన!) వినవమ్మ తారకాచలమునందు
నొక్కనాఁడు మహాదేవుఁ డుబుసుపోక
శ్రీకరోద్యానవనవాటిఁ జేరి యచట. 272

1. నీపై ప్రేమన్ (పూ) 2. నే యంచుఁ బల్కు (పూ)
3. అమ్మ (పూ—యతిభంగము)

సీ. ప్రమథు లిర్వంకల బలసి కొల్వఁగ రుద్ర
కన్యకామణు లూడిగం బొనర్ప
భృంగి హాస్యక్రియారీతి నృత్యము సల్ప
చండీశ్వరుఁడు గుణస్తవ మొనర్ప
విఘ్ననాథుఁడు పురోవీథి ముద్దులు చూప
శరసంభవుఁడు బరాబరి యొనర్ప
నందివాహనము చెన్నొంది మ్రోల నటింప
వీరభద్రుఁడు జయోద్వృత్తి దెలుప
[1](తనదు) లాస్యంబునకుఁ దరుల్ తగఁ జిగుర్ప
నట్లు గాంధర్వరసపూర్తి నలరు జాయ
యంబికాదేవితోడ నెయ్యమున నభవుఁ
డుచితసింహాసనస్థుఁడై యుండునపుడు. 273

క. అమరేశ్వరాది దిగధిపు
లమరవరుల్ జపతపోమహర్షులు దమకున్
సముఖంబు లేమి దృఢభ
క్తి మతిన్ దమ కడకుఁ జేరి ద్రిమ్మరువేళన్. 274

సీ. పసుపంటు జిలుగు దుప్పటి యంచు ముత్యముల్
వరుసఁ గన్పడు వల్లెవాటు దనర
చెంప నించుక జాఱు సిగనొప్పు సంపంగి
మడుపు దెత్తులతో రుమాలు మెఱయ
ఘర్మాంబుబిందుసంగతి నొకించుక కరంగు
బొట్టు కస్తురి తావి బుగులు కొనఁగ
వెలిదమ్మి తేకులు తెలివి గుల్కెడుదీర్ఘ
నేత్రాంతములఁ గొంత నిదుర దొలుక

1. తండు (పూ)

కరములను నిరు కలవొాట్టు కప్పురంపు (?)
విడెము పుక్కిట కడు చిక్కుపడిన హార
లత[1](గళంబున) బొసఁగ నుల్లాస మెసఁగ
వచ్చె నలకూబరుండు దుర్వారుఁడగుచు. 275

చ. అపు డల పార్వతీరమణుఁ డన్నలకూబరుఁ జూచి జాతి కొం
చపు వగ నేఁగుదెంచె నని చాల మనంబున నెంచి యోరి! నీ
వపరిమితప్రమత్తుఁడ వహంకృతిచిత్తుఁడ విట్టు లంతరం
గపు కొలువైన వేళ మముఁ గానఁగ నర్హుఁడవే గణింపఁగన్. 276

క. నీ వధమవర్తనుండవు
గావున మా సమ్ముఖమ్ము గదియం దగునే
భూవలయమ్మున మర్త్యుఁడ
వై వర్తిలు మనుచు శంభు వానతి యొసఁగెన్. 277

క. మనమునఁ గడు బెగడొందుచు
విని ధనదసుతుండు సభయవిహ్వలమతియై
యనియెం బ్రణమిల్లి జగ
జ్జనకా! యీ తప్పొకింత సైఁపు [2](మటంచున్) 278

లయగ్రాహి :-

శంకర! నిశాచరభయంకర! శివాహృదయ
పంకరుహభృంగ! [3](యకలంకరుచిమద్వి)
జాంకురశటస్థమకరాంక! [4](వృషభేశ్వర శు)
భాంక! మకుటస్ఫుటమృగాంకనవరేఖా
లంకరణ! భక్తజనపంకహరణా! భవవి
సంకటకళంకహర! కింకరు ననున్ షే

1. యుగంబున (పూ) 2. మటన్నన్ (పూ)
3. లకలంకఖుచిమద్వి (పూ) 4. వృషభేశ్వర సములు (పూ)

మంకరుఁడవై మనుపు మంకిలి యొనర్పక ని
రంకుశకృపారసవిశంకట ! నమస్తే. 279

క. పరమగురుద్రోహి ననుం
గరుణించఁ గదే యనన్య[1](గతికుఁడ ననిచన్)
గిరిజావల్లభుఁ డతనికిఁ
గరుణామతి నిట్టులనియెఁ గడు బ్రియ మెసఁగన్. 280

ఉ. మే మొక మాట దెల్పెదము మించి మదీయవచోవిశేషసం
ధామహిమం బొకింతయును దప్పదు తప్పకయున్న నేమి ల
క్ష్మీమహనీయవైభవసమృద్ధియు బుద్ధియు మోహనాంగరే
ఖామహిమంబు నీకుఁ గలుగం గృప సేసితి నమ్ము నెమ్మదిన్. 281

క. విమలమతుల్ మద్భక్తులు
సుమతీహరదత్తు లనఁగ క్షోణిం గల రా
రమణీరమణులకు మనః
ప్రమదముగ జనింపు మమితభాగ్యోన్నతివై. 282

తే. అన విని మహాప్రసాదం బటంచు వచ్చి
యిందుశేఖరు నానతి నిందుఁ [2](బొడమె)
మదను నాహ్వయమునను నోమగువ ! వైశ్య
తల్లజుండైన [3](నీ) ప్రాణవల్లభుండు. 283

క. వింటివా యన నల భామిని
గెంటక తల యూఁచి మెచ్చి కీరవరుని నీ
వంటి మహామహుఁ డుండఁగ
వింటి మనోభీష్ట మెల్ల వెలయఁగఁ గంటిన్. 284

---

1. గతిఖుండనినన్ (పూ) 2. భోగడి (పూ) 3. యా (పూ)

తే. ఎంత సుజ్ఞాననిధివి నీవెంత ఘనుఁడ
వెంత నిను మెత్తునని పల్కునంతలోనఁ
జుఱుకుచుఱుకున నరుణవిస్ఫురణ మెఱయ
కరకరని తోఁచెఁ దూర్పున ఖరకరుండు. 285

ఏఁబదిరెండవ రాత్రి:

ఉ. అల్ల ప్రభావతీరమణి యంత నిశాంతముఁ జేరి నాఁటిరే
యల్లన కుందనంపు జిగి యందపుమైఁ గయిసేసి నేఁటి కి
హల్లకభల్లతీవ్రవిశిఖాప్రహతాహతి కోర్వఁ జాల రం
జిల్లఁగ రాజశేఖరుని జేరి సుఖించెద నంచు నెంచుచున్. 286

తే. రామచిల్కకు మే లోగిరఁబు నాన
వాలు చక్కెఱ రసదాడి పాలచెఱుకు
లరఁటిపం డ్లిడి పసపార్చి యక్కు చేర్చి
సెల వొసఁగు మన్న నాముద్దుచిల్క యనియె. 287

## ఇరువదియేడవ కథ

క. రంభవు నీవు విలాసవి
జృంభణమున నిన్నుఁ గనినఁ జితజుఁడైనన్
శుంభద్రతితంత్రకళా
రంభమునకుఁ దానె కదిసి ప్రార్థించుఁ గదే ! 288

సీ. ఇంద్రాదిదిక్పతులైన నీ వడిపంచఁ
బడి యందలములలోఁ బరివసింపఁ
బోటుబంటులు నిజాద్భుతరణప్రాభవం
బులు గోరికొనుచు నీ కొలను గొల్వ

సోమయాజులు బహుస్తుతులు చేయుచుఁ బ్రేమ
వొదల నీ ముంగిట నొదిగి యుండ
సన్న్యాసు లతనుజర్జరితసర్వాంగులై
[1](యలరు) నీ పాదంబు లాశ్రయింప
నందఱికి నన్నిరూపంబు లగుచుఁ జెలఁగి
భువనమోహనశృంగారభవనమైన
నీ మహిమ నీ వెఱుంగక నేఁటి కిట్లు
లొక్క నృపమాత్రునకుఁ జిక్కి యుండఁ దగునె. 289

క. అని పల్క నద్భుతంబుగ
విని సురలోకమువనుండి వెస నే నిచటన్
జనియింప నేమి కారణ
మనుఁడు ప్రభావతికి నల శుకాగ్రణి యనియెన్. 290

క. నలకూబరుండు హాలా
హలకంధరు నాజ్ఞ [2](నిలకు నరిగెడు) నాఁడో
లలనా నీవు పితామహు
[3](కొలువునకు జతన మొనర్చికొని చని యచటన్.) 291

తే. అమ్మహాప్రభుఁ బొడ గాంచి "యబ్జభవ! పు
రాణపురుష! సరస్వతీప్రాణనాథ!
సకలజంతువినిర్మాణచతురహృదయ!"
యనుచుఁ గై వార మొనరించి యాత్మఁ బంట. 292

1. యలర (పూ) 2. నిచటి కరిగెడు (పూ) 3. కొలువునకుం జత యమర్చి
కొని తొడ వచటన్ (పూ)

సీ. కాసె ధరించి రంగస్థలంబున నిల్చి
చెలువ మాయజుఁడైనఁ దలఁపఁగలఁడె
సభ విస్మయమునొంద నభినయము ఘటించు
మెలఁకువ గురుఁడైన మెచ్చఁగలఁడె
కరలక్షణప్రయోగరమణచాతురి
నభినుతింపఁగ శేషుఁడైనఁ గలఁడె
కలికి కన్నుల కటాక్షంబు లంభోజాత
శరుఁడైన మఱలింప చాయఁ గలఁడె
యౌరః యని చూచువారెల్ల [1](నభినుతింప)
కలికివాల్జూపులను శిరఃకంపనముల
యొరపు చెలనవ్వు ముద్దు మైసిరి బెడంగు
మించ నటియించుటయు నవ్విగించి గాంచి. 293

తే. మెచ్చితి వరంబు వేఁడు మో మచ్చెకంటి!
యనుచు వచియించువేళ నీ యనుఁగుఁ జెలి యొ
కర్తె నలకూబరుఁడు ధాత్రిఁ గదియు వార్త
విన్నవించిన మదిలోనఁ జిన్నఁబోయి. 294

చ. కతు బెగడొంది సోగతెలిగన్నులఁ [2](దొల్కెడు)నీరు గ్రుక్కుచున్
జిడిముడిపాటుతో నల కుశేశయగర్భపదాంబుజ[3](ద్వయిం
బడి) కడతేర నీ విరహభారభరం బిఁక మద్భుజంగు నె
న్నఁడు గనుఁగొందు నొక్కొ కరుణామతి నానతి యిమ్ము నావుడున్. 295

ఉ. నీ నయమార్గవైఖరికి నే మది మెచ్చితి నీలవేణిరో
నీ నలకూబరుండు ధరణీస్థలికిన్ శివునాజ్ఞ నేఁగుటన్
బూని తదీయమోహపరిపూర్ణమతిన్ వెత నొంది యున్న ని
న్నా నవమోహనాంగు నెనయన్ సమకూర్చెద నమ్ము నెమ్మదిన్. 296

1. యభినయింప (పూ) 2. గుల్కెడు (పూ) 3. ద్వయం బడి (పూ)

తే. అల్ల హరునాజ్ఞ తప్పింప నలవి గాదు
కాక యుండిన నేమి భూలోకముననె
నీకు నలకూబరునితోడ నిర్జరేంద్ర
పురి ననుభవించు నట్టుగ నెఱి నమర్తు. 297

ఉ. కావున నీ మనంబునకుఁ గాఁక వహింపఁగ నేల పొమ్ము ధా
త్రీవలయమ్మునం దవతరింపు మటంచు వచించు నంత నాఁ
డీ వరవైశ్యవంశమున నేపు దలిర్ప జనించినావు రం
భావనజాక్షి నీ వమితభాగ్యశుభోన్నతి వో ప్రభావతీ! 298

క. అని పల్కి జగచ్ఛత్రుం
దను వీరనృసింహుఁ డుగ్రుఁడై తిమిరమహా
దనుజేంద్రు నే పడంచుటఁ
గని కాంత నిజాంతిపురముఁ గదిసె నరేంద్రా! 299

## ఏఁబదిమూడవ రాత్రి:

తే. అల ప్రభావతి మఱునాఁ దహఃపయోధి
నాన్నృపాలుని నవమోహనాంగసంగ
మైకవాంఛాపదమ్ము నొయ్యనఁ దరించి
మించి కుఱుమాపు నెఱసంజ మెఱయునంత. 300

చ. చిలుకల కొల్కి మేను గయిసేసి నృపాలుని చెంతఁ జేరఁగాఁ
దలఁచి శుకాధినాథు నఱుతన్ వెస నిల్చిన మాత్ర శూన్యది
క్తలమున గౌళి నిల్వఁ బలుకన్ విని సంశయమంది కుందుచోఁ
జిలికెడు ప్రేమ నిట్టులను చిల్క సుధారసధార లొల్కఁగన్. 301

తే. దుష్టశకునమ్ము విననయ్యెఁ దోడ నేమి
ఘనభవి భంగ వలయునో యని తలంచి

మిగుల దిగులొందనేటికో మీననయన!
యదియె మంచి దటంచు నీ మది గణింపు. 302

క. అది యెట్టు లనిన విను నె
మ్మది చెలఁగ న్నీవిభుండు మమతన్ మఱి దె
బ్బదినాళ్ళ నాఁటి కిలు సే
రుదునని వాక్రుచ్చి చను టెఱుఁగవె మగువా! 303

వ. కావున. 304

ఉ. నేఁడతఁ డిల్లుఁ జేరు రమణీ వెస డెబ్బది నాళ్ళు సెల్లె నీ
పోఁడిమి నీ వెదుర్కొని విభుం గని మ్రొక్కి రహస్యలీల నీ
వేడుక లుప్పతిల్లఁ దనువిందొనరించి ప్రియంబునన్ రతి
క్రీడలఁ దేలవమ్మ సుచరిత్రలు ని న్ననయంబు మెచ్చఁగన్. 305

వ. అని వచియించు చిలుకం గనుఁగొని ప్రభావతి యిట్లనియె. 306

తే. కంటి పదవేసికొంటి నో కథలకారి
ముద్దు రాచిల్క నిను నమ్మి మోసపోతి
నింక నేమనఁగలదాన నేమి సేతు
ననుచు దీనానులాపంబు లాడుటయును. 307

క. ప్రాణ మనిత్యము నిత్యము
మానంబని కావు ప్రాణమానంబులలో
మానమె కాయందగు నను
మానం బిఁక నేల నిలుపు మానం బనియెన్. 308

వ. ఆ సమయంబున. 309

సీ. బహువిధసంభారభారముల్ తోనున్న
ఫేరికిచెద్దుల గుంపు లొరసి కొనఁగ

స్ఫుటసుగంధజలప్రపూర్ణములై నట్టి
కంచి కావళ్ళ శృంగార మెసఁగ
భాస్కరపండితప్రముఖదేవబ్రాహ్మ
ణాళి యాశీర్వాదనాద మెసఁగ
భవ్యసాధ్వీహస్త[1](పద్మార్పితంబులై)
వితతవైఖరుల నారతులు పొసఁగ
బహువిధంబుల రాజవైభవము మెఱయ
బంధు లిరువంక నొరయ సౌభాగ్యలీల
తన నగరుఁ జేరె శుభముహూర్తమున వేడ్క
వెల్లి విరియంగ మలయజావల్లభుండు. 310

క. అంతటఁ దత్కాంతామణి
పొంతన తన [2](ప్రాణవిభుని పొడ గనియు) మహీ
కాంతుని రతి సమకూడని
చింతన్ వెసఁ గానరాని శృంగారమునన్. 311

ఆ. జారి మండికొనిన చందాన తన మేని
చెలువ మపుడు పతికి సెలవు చేసి
గంటు తోడ మిత్రగణ మెన్న సమధిక
శ్రీల కాంపురంబు [3](చేయుచుండె). 312

వ. తదనంతరంబ. 313

చ. తన తలిదండ్రులం గని యథావిధి భోజన మాచరించి పెం
చిన శుకసార్వభౌముని భజించి ప్రియం బొనరించి సార్వభౌ
మున కతిలోకవస్తువులు ముంగల కానుకగా నొనర్చి పే
ర్చిన ముద మొప్ప నమ్మదనసేనుఁడు నెమ్మది నుండు నంతటన్. 314

1. పాదార్పితంబులై (పూ) 2. ప్రాణవిభు పొడగనియు (పూ. గణభంగము)
3. చెలఁగుచుండె (పూ)

క. చిలుక తను మోసపుచ్చుట
యెలమిం దద్వ్యైశ్యవర్యుఁ డిలు సేరుటయున్
కలకంఠీమణి దూతియు
తెలుపన్ విని యన్నరేంద్రతిలకం బలుకన్. 315

ఉ. హల్లకపాణి పొందు మది నర్మిలి గోరుట చందమామ గ్రు
క్కెళ్లయినట్టులయ్యెఁ బవళింపఁగ నేఁడిక నేమి సేతు నీ
పల్లవి కార్యసంఘటనభావ మెఱుంగక యింత సేసె నా
యుల్లము తల్లడిల్లెడు నయో యని మోహవిషాదవేదనన్. 316

క. ఈరీతి నుండ నేమో
కారణమున కీర మయ్యెఁ గావలె దీనిన్
జేరి యిది తెలియఁ దగునని
యారూఢి వివేకశాలియై విభుఁ డెలమిన్. 317

తే. మదనసేనుని యెఱుక నమ్మదను తేజి
నంటిపురిలోన నపరంజి యరిది పనుల
వింత నొక మేడ నుండి యేకాంతవేళ
1(సమ్ముఖమునకు) రావించి సవినయముగ. 318

క. ఓరాజకీరశేఖర!
నీ రసికత మది గణించ నేర్తునె యని నీ
వే ఋషి యంశంబున నవ
తారము నొందితివా విబుధధర్మము వెలయన్. 319

చ. అనుటయు సంతసించి వసుధాధిపునిం గని చిల్క పల్కె నో
యనుపమ శౌర్య! నే శుకమహర్షివరేణ్యుఁడ నీ ప్రభావతీ

1. సమ్ముఖంబున (వ్రా)

వనరుహగంధి ప్రాక్తనభవంబున మమ్ము భజించి యుండె నా
[1](నెనరును సంధిలన్ గనుఁగొనెన్) జనుదెంచితి నీ శుకాకృతిన్. 320

ఉ. వచ్చి ప్రభావతీవికచవారిజలోచన మమ్ముఁ గొల్వ నే
నిచ్చ రహించువేళ జగతీశకులార్ణవపూర్ణచంద్ర! నీ
వచ్చిన ప్రేమ నన్నిలువనంపుట కెద్ది కతంబు తెల్పవే
మచ్చిక నన్న యా నృపకుమారకుఁ దత్యనురాగవైఖరిన్. 321

వ. అప్పు డయ్యప్రతిమప్రభావంబు గల లీలాశుకంబునకు వివిధోపచారంబుల సమంచితోపమకుటబహుమానంబుగా(?)నతని సాక్షాద్దైవమని మనంబున భావించి ప్రదక్షిణప్రణామసంభావనపూర్వకంబుగా మృదుమధురగంభీర భాషణంబుల నిట్లనియె. 322

ఉ. కామాకళా శుభాకరశుకప్రవరుం గనుఁగొంటి నేఁడు నా
బాములు వీడుకొంటి ననుఁ బ్రాజ్ఞ్ముఖుఁ జేయఁ దలంచికొంటి నా
స్వామియు నీవెకా మఱి కృతార్థుఁడ నీదు సుబుద్ధి వింటె నిం
కేమి యొనర్తుఁ దెల్పఁగదవే యనఁ గీరవరేణ్యుఁ డిట్లనున్. 323

క. వామాక్షీజనమోహన!
కామాంధుఁడైన యతని కథ విను మును సు
త్రామసుఖు లనుభవించిన
బాముల మదిఁ దెలియు మోనృపాలకతిలకా! 324

సీ. కాకుత్స్థకులుఁడవై కల నృపుల్ నినుఁ గొల్వ
మఖుఁడే జగద్ధితమహిమ నొందె (?)
పడరాని యిడుమలఁ బడియు బొంకు నెఱుంగ
కల హరిశ్చంద్రుఁడు నలసి యలసి

1. నెనరున సంధిలన్ గనుగొనన్ (పూ—యతిభంగము)

యల్ల విశ్వామిత్రుఁ డతి బన్నములు వెట్ట
రాజమార్తాండుఁడై క్రాలెఁ గాదె
సామ్రాజ్యపై భవశాశ్వతుఁ డయ్యును
జనకుఁ డత్యంతసుజ్ఞానదీప్తి
యతులితోత్సాహవిదితమై యలరు నట్టి
మహిమ వెలయు సద్భక్తసామంతశాలి
వగుచు వైరాజ్యవంతుఁడవై సమస్త
రాజ్య మేల గదయ్య యో రాజవర్య ! (?) 326

గద్య.

ఇది శ్రీమత్కాదిరీనృసింహకరుణాకటాక్షవీక్షణ సమాగత కవితాధార పాలవేకరి
కులకలశాంభోనిధిసుధాకర తాడిగోళ్ళ కరియ మాణిక్యనృపహర్యక్షపౌత్ర
పవిత్రచరిత్ర కదురధరామండలాఖండలపుత్ర విద్వత్కవి
రక్షణానుసంధాయక కదిరీపతినాయక ప్రణీతంబైన
శుకసప్తతి యను మహాప్రబంధంబునందు
చతుర్థాశ్వాసము సర్వము
సంపూర్ణము.

# సవరణలు

| పుట | పంక్తి | ఉన్నది | ఉండవలసినది |
|---|---|---|---|
| 1 | 9 | దాల్బి | దాల్చి |
| 2 | 4తరువాత | | బిసకాండవిసరమా యసమత్రిలోకవి<br>ద్రావణాసురమహోరాజబలము |
| 2 | 11 | స్ఫంద | స్పంద |
| 4 | 19 | శార్ఙ్గ | శార్ఙ్గ |
| | 22 | వాసింతంబు | వాసితంబు |
| 16 | 2 | దనస్ | దనన్ |
| 21 | 25 | మునీశ్వం | మునీశ్వర |
| 23 | 19 | పతి | ప్రతి |
| 43 | 8 | నొడివు | నొడువు |
| 53 | 4 | కే గినన్ | కేఁగినన్ |
| 66 | 1 | ఆనర | అనర |
| 81 | 12 | యౌవనముఁ దోఁచె | యౌవనము దోఁచె |
| 89 | 20 | ఠోపవన | రోపవన |
| 95 | 13 | ధూతిక | దూతిక |
| 105 | 6 | కని | గని |
| 117 | 16 | బ్థై | బ్ధై |

| | | | |
|---|---|---|---|
| 118 | 6 | వీఱ | వీక్షణ |
| 128 | 25 | 2 వౌ (పూ) | |
| 129 | 8 | హర్హాము | హర్షము |
| 139 | 8 | మీనుల్ | మీనుడాల్ |
| 148 | 13 | * | + |
| | 24 | + | * |
| | 26 | గర్చ | గర్భ |
| 149 | 18 | శీల | శీల |
| 157 | 7 | అతఁడు | అతఁడు |
| 158 | 9 | నదల్చు దూతిఁ | నదల్ప దూతి |
| 163 | 22 | నూరకుం | (మూరకుం) |
| 167 | 22 | ౖవజంబును, | ౖవజంబును |
| 169 | 23 | పచ్చెన్ | వచ్చెన్ |
| 171 | 23 | మానంబు | మానసంబు |
| 174 | 3 | మెల్ల నే | మెల్లనే |
| | 18 | యతని | యితని |
| 176 | 20 | తటిమెధ | తటిమెద |
| 178 | 7 | ఆనఁ | అనఁ |
| 207 | 14 | మహిసురు | మహీసురు |
| 213 | 22 | నీపు | నీవు |
| 208 | 5 | గీల్కొన్మ | గీల్కొన్న |
| 221 | 2 | సుమా | సుమ |
| | 23 | దొలగినం | దొలంగినఁ |
| 224 | 9 | యాశీర్వ | యాశీర్వ |
| 253 | 15 | ఆరీతిఁ | ఆరీతిఁ |

| | | | |
|---|---|---|---|
| 262 | 3 | జ్వాల | జ్వాల |
| | 23 | దండయు | దండయున్ |
| 264 | 1 | లోకన మేటికి వీక్షణా | (లోక మేమిటికిఁ దదీక్షణా) |
| | 6 | నైర్మల్య | (మాలిన్య) |
| | 9-10 | మాదినాంతదుష్కృత దోషంబు నడఁపకున్న | మాంతజనితదుష్కృత దోషంబు నణఁపకున్న |
| 266 | 8 | దావి వేమరును గనలె | దాని వేమరును (గసరె ) |
| 299 | 12 | దీ | దే |
| 271 | 21 | యివ్విధంబున | ఇవ్విధంబున |
| 279 | 1 | క బుధర | కంబుధర |
| | 8 | స్వరంబున | స్వరంబున |
| 285 | 20 | కర్ర | కర్థ |
| 287 | 7 | యిదిమేమి | యిది యేమి |
| 288 | 26 | వేధండంబు | వేదండంబు |
| 289 | 8 | ఆకథ | ఆకథ |
| | 21 | పరిహాసింపక | వరిహారింపక |
| 333 | 12 | కాశీపురి | గాశీపురి |
| 333 | 24 | హినతర | హీనతర |
| 334 | 27 | గాపున | గావున |
| 339 | 1 | నిర్భయ | (నిర్భర) |
| 354 | 17 | బహుకాలభిలాషితంబగు | బహుకాలాభిలాషితంబగు |
| 375 | 2 | వంధపు | వందపు |
| | 10 | యనపించి | యనుపించి |

| | | | |
|---|---|---|---|
| 381 | 13 | ఆన | అన |
| 382 | 16 | నచ్ఛంచలాక్షీ | నచ్ఛంచలాక్షి |
| 393 | 17 | బ్రాహ్మణో త్తమ | బ్రాహ్మణో త్తమ |
| 400 | 22 | ఆనిన | అనిన |
| 402 | 15 | శ్రీముష్ణము శ్రీముష్ణము | శ్రీముష్ణము శ్రీముష్ణము |
| 410 | 3 | రంగుబంగ | రంగుబంగరు |
| 420 | 5 | ప్యాండ | పాండ్య |
| 422 | 18 | నిషాగోష్ఠి | నిష్ఠాగోష్ఠి |
| 425 | 2 | కలవాణిమణి | కలవాణీమణి |
| 429 | 24 | నేతాంతములం | నేత్రాంతములు |